# శ్రీమదాంధ్ర భాగవతము

బమ్మెర పోతనామాత్య ప్రణీతము.

## తృతీయ స్కంధము




వాణీ నికేతనము

గాంధీనగరం :: బెజవాడ.

అక్టోబరు :: 1938.

# మహారాజ పోషకులు

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమంతు రాజా యార్లగడ్డ

శి వ రాం ప్ర సా ద్

బహద్దూరు యం. యల్. ఏ.

కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులు

మన్నెసుల్తాన్

చల్లపల్లి యెస్టేటు జమీందారు

చ ల్ల ప ల్లి

శ్రీ శ్రీ చిరువోలు పార్థసారథి గారు

ల్యాండ్‌లార్డు, ముప్పాళ్ల, కృష్ణాజిల్లా.

శ్రీ శ్రీ జనస్వామి ప్రసాద రావు గారు

ల్యాండ్ లార్డు, గుంటూరు.

శ్రీ శ్రీ పర్చ శేషగిరిరావు పంతులు గారు

మత్తేదారు, కారేపల్లి

శ్రీ శ్రీ పర్చ రామనాథం పంతులుగారు

మత్తేదారు, కారేపల్లి

## సహాయులు



బ్రహ్మశ్రీ గోటేటి వేణుగోపాల రావు పంతులుగారు

సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ పోలీసు, ఒంగోలు.

## రు 5-0-0 సభ్యులు:

1. శ్రీ అయ్యదేవర వేదాద్రి నరసింహారావుగారు, టీచరు, నందిగామ
2. ,, కొల్లి వేంకట కృష్ణయ్య చౌదరిగారు, మువ్వశివారు నర్సాయపాలెం.
3. ,, వాశిరెడ్డి లక్ష్మీపతి ఒమ్మూర్తుగారు, శెక్రిటరీ కృష్ణాజిల్లాబోర్డు బందరు.
4. ,, సూర్యదేవర సీతారామయ్య చౌదరిగారు, జక్కంపూడి.
5. ,, కొండపల్లి బుచ్చయ్యగారు ల్యాండ్‌లార్డు, బందరు.
6. ,, శివరాం ప్రసాద్‌గ్రంధాలయం. పెదసనగల్లు.
7. ,, సూరపనేని వేంకటరత్నంగారు, పెదసనగల్లు.
8. ,, డాక్టరు.- చిరుమామిళ్ళ శేషాద్రినాయుడుగారు, పెనుగంచిప్రోలు.
9. ,, వాశిరెడ్డి మహాదేవటూగూరుగారు, జయంతిపురం.
10. ,, రామకృష్ణారైస్, జిన్నింగ్ అండ్ గ్రౌండునట్ ఫ్యాక్టరీ పెనుగంచిప్రోలు
11. ,, వేంకటరమణారైసుమిల్, జగ్గయ్యపేట.
12. ,, పద్మనాభుని నరసింహదాసుగారు. జగ్గయ్యపేట.
13 ,, సి. హెచ్చి. నారాయణ ప్రసాద్‌గారు ల్యాండ్‌లార్డు, జగ్గయ్యపేట.
14. ,, చింతల అచ్చయ్యగారు, పరిటాల.
15. ,, ఉభయ భాషాప్రవీణ హిందీవిద్వాన్ అయినంపూడి గురునాధరావుగారు. పెదసనగల్లు
16. ,, వీసపాటి రాజయ్యగారు, పెదసనగల్లు.
17. ,, పొక్కునూరు గోపయ్యగారు, బందరు.
18. ,, డి. గోపాలకృష్ణయ్యగారు L. F. రిక్రియేషన్ క్లబ్, బందరు.
19. ,, మండవల్లి బుల్లిరామయ్యగారు, బూషనగుళ్ళ.
20. ,, బూరుగుల సుందరరామశాస్త్రిగారు తెలుగుపండితులు, ఉయ్యూరు.
21. ,, అమంచి హనుమంతరావు పంతులుగారు లేబరుఆఫీసరు, బందరు.
22. ,, యీనాల వేంకటప్పయ్యగారు హెడ్మాస్టరు, పునాదిపాడు.
23. ,, ముక్కామల రామకృష్ణయ్యగారు, పెనమలూరు.
24. ,, పోపూరు అంబన్నశాస్త్రిగారు ఇంపీరియల్ బ్యాంక్, బెజవాడ.
25. ,, ఈది రాజయ్యగారు కలపవర్తకులు, బెజవాడ
26. ,, యద్దనపూడి కాంతమూర్తిగారు, బెజవాడ,
27. ,, శివకోటి వెంకయ్యగారు, వర్తకులు, బెజవాడ.
28. ,, కె. రామకృష్ణారావునాయుడుగారు సబ్ఇనస్పెక్టరు, బెజవాడ.
29. ,, కొల్లు నరసింహారావునాయుడుగారు, జగ్గయ్యపేట.
30. ,, పచ్చవ పాపయ్య చౌదరిగారు కంట్రాక్టరు, బెజవాడ.
31. ,, బొలిశెట్టి లక్ష్మీవెంకట నరసింహారావుగారు, బెజవాడ.
32. ,, కొణికి ఆదిశేషయ్యగారు, బెజవాడ.

34. ,, సి. వి. నారాయణరావుగారు, సబ్ ఇనస్పెక్టరు, గన్నవరం.

35. ,, తెన్నేటి బుల్లెయ్యరావుగారు, గన్నవరం.

36. ,, పారేపల్లి బుచ్చయ్యగారు, ఆగిరిపల్లి.

37. ,, గుంటూరు గోపాలకృష్ణమూర్తిగారు, ఆగిరిపల్లి.

38. ,, యండూరి పుల్లయ్యగారు, ఆగిరిపల్లి.

39. ,, నూతక్కి బాలకోటయ్యగారు, గడ్డమణుగు.

40. ,, డాక్టరు గుంటూరి రాధాకృష్ణమూర్తిగారు, మైలవరం.

41. ,, కవులూరు వేంకటప్పారావుగారు, కర్నంఈలప్రోలు.

42. ,, మాకాని గోపాలస్వామి నాయుడుగారు బెస్టు అండ్ సింగరేణి కాలరీస్.

43. ,, అరజా లక్ష్మణస్వామినాయుడుగారు, కొత్తగూడెం.

44. ,, యస్. శీతారామయ్యగారు, కొత్తగూడెం.

45. ,, చిలుకూరి శాయన్నగారు, భద్రాచలం.

46. ,, కురిచేటి జనార్దనరావుగారు, భద్రాచలం.

47. ,, చింతపాటి దక్షిణామూర్తిగారు వకీలు, తెనాలి.

48. ,, యస్. సూర్యనారాయణరావుగారు, బి.ఏ.,బి.యి.డి., మార్కాపురం.

49. ,, ఊర వేంకటరత్నంగారు, చేబ్రోలు.

50. ,, రాజవైద్య నాగలింగం రాఘవశర్మగారు, అమృతలూరు.

51. ,, కాలారి పట్టాభిరామయ్యగారు. రాయపూడి.

52. ,, మంగెనపూడి వేంకటేశ్వరరావుగారు బి.ఏ., రాయపూడి.

53. ,, ప్రొప్రయిటర్సు సుధాఫార్మశీ, అమృతలూరు.

54. ,, బొబ్బా అంకినీడుగారు, యలవర్రు.

55. ,, భాగవతుల వేంకటేశ్వరశర్మగారు, యలవర్రు.

56. ,, కొండూరి రాఘవరావుగారు, యలవర్రు.

57. ,, యలవర్తి గురులింగముగారు, యలవర్రు.

58. ,, యడ్డపాటి అంజయ్య చౌదరిగారు, యలవర్రు.

59. ,, క. శ్రీరంగరాజఅయ్యంగారు, బి.ఏ.,యల్.టి., తురుమెళ్ళ.

60. ,, యలవర్తి శ్రీరాములుచౌదరిగారు, యలవర్రు.

61. ,, యడ్లపాటి భుజంగరాయుడుగారు, యలవర్రు.

62. ,, శ్రీనాథ గ్రంథాలయము, మోపర్రు.

63. ,, కొత్తపల్లి వెంకటసుబ్బయ్యగారు హిందీవిశారద అమృతలూరు

64. ,, పులిపాక తిరుమలరావుగారు కరణం అమృతలూరు.

# పీ ఠి క

"చవులంగూర్చెడి తెల్గుపల్కు బడులన్ సంధించి యాంధ్రావనీ
శ్రవణాలంకరణాభిరామకవితా సంపత్తితో నాంధ్రభా
గవతంబున్ రచియించి లోకహితముం గల్పించె నేధన్యుఁ డా
కవిచూడామణి సెంతుఁ బోతనకవిన్ గల్యాణవాగ్భారవిన్."

ఆంధ్రవాఙ్మయమునందుఁగల అత్యుత్తమ కావ్యశ్రేణిలో నొక టిగఁ బరిగణింపఁదగినది సహజపాండితీమండితుఁ డగు పోతనామాత్యుని ఆంధ్రభాగవతము. నన్నయ్య భట్టారకుఁడు తెలుఁగు బాసకుఁ బ్రాణ భిక్ష పెట్టి భారతమునఁ గొంచెము తక్కువగ మూఁడుపర్వములు రచించి వాగనుశాసన బిరుదము సార్థకము జేసికొనినాఁడు. తిక్కన యజ్వ మహోజ్జ్వలధారాశుద్ధితో నిరర్గళ పదకల్పనముతోఁ భారతమును బదునైదు పర్వములఁ గూర్చి "మహాకవిత్వ దీక్షావిధితో" మాతృభాష నలంకరించి కవిబ్రహ్మబిరుదము సార్థకము గావించుకొనినాఁడు. భారత భాగము "కవీంద్రశ్రవణ పుటపేయముగా ఎఱ్ఱాప్రగడపూర్తి చేసి ప్రబంధ పరమేశ్వరుఁ డైనాఁడు. భాస్కరాదులు రామాయణమును తెలింగించి భాషనలంకరించిరి. పాలకురికి సోమనాథుఁడు శైవమత గ్రంథ సారము మహాపురుష జీవితములో లగ్నము గావించి యసమాన వైదుష్యము సాటినాఁడు. నన్నెచోడుఁడు నాచనసోముఁడు కావ్యరచన మున కనుకూలములగు మనోజ్ఞభావములు క్రొత్తపోకడలు పలుకుం బొందికలు వెలయించిన ధన్యులు. ఆదికవులందఱి గుణములు తనలో జీర్ణించికొని వాఙ్మయమున కద్వితీయమగు సేవగావించిశ్రీనాథకవి సార్వ భౌముఁడు కవితాసౌష్ఠవమునకు మార్గదర్శకుఁడైనాఁడు. వీరిలో నెవ్వ రును భాగవతము తెలింగింపఁదొర కొనమి తననేధన్యుని గావించుటకని బమ్మెరపోతరాజు తలంచుచున్నాఁడు. చూడుఁడు.

"ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విన్ బురాణావళిం
దెనుగుల్ జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబుఁ దానెట్టిదో
తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి మ
జ్జననంబున్ సఫలంబుజేయుదుఁ బునర్జన్మంబు లేకుండఁగన్-

కాని సత్యము నాలోచించినచోఁ దనకుఁ బునర్జన్మము లేకుండు టయేగాదు సోదరాంధ్రులకుఁ బునర్జన్మము కలుగకుండుటకే పోతరాజు

భాగవతరచనమునకుఁ దొరకొనినాఁడు. పరమేశ్వరార్పణముగఁ గావ్య
ఫలము నర్పించి ధన్యుఁడైనాఁడు.

ఆదికవియగు నన్నయ్యభట్టారకునితోఁ గవులకు రాజాశ్రయ
మలవాటైనది. రాజులుగూడఁ గావ్యశ్రవణానందమగ్నులు. రాజరాజు,
మనుమసిద్ధి, వేమభూపాలుఁడు, వీరభద్రారెడ్డిమున్నగు ప్రభువులు
కావ్యరచనమునకు సమకాలికకవిరాజులను బ్రోత్సహించినారు. కవులు
వారియాశ్రయమున సమస్తభోగములతోఁ దులదూఁగుచు వాఙ్మయ
సేవ గావించి ధన్యులైనారు. ఈ పరిస్థితి పదమూడవశతాబ్ది కారం
భమువఱకు నెడతెగక నడచినది. ఈ సందిగ్ధకాలమున జనించిన
స్వాతంత్ర్యశీలుఁడు బమ్మెరపోతరాజు. సమకాలదోషముచేఁ బోతరాజు
గూడ ఇవటూరిసోమనారాధ్యుల సంస్మరణముతో వీరభద్రవిజయము
సర్వజ్ఞసింగభూపాలుని శృంగారలీలావిలాసవర్ణనములతో భోగినీదండ
కము రచించి కాలప్రవాహమునఁ గొంతకాలము కొట్టుకొని పోయి
నాఁడు. భాగవతరచనారంభమునుండి యాతని జీవితమున కొకవిశిష్టత్వ
మలవడినది. భోగభాగ్యములను దిరస్కరించినాఁడు. కావ్యాంకితమునకుఁ
బ్రాకులాడు రాజులను మనుజేశ్వరాధములని తెగడినాఁడు. రాజుల
కంకితమునొసంగుట కాలునిచే సమ్మెటవ్రేటులఁ దినుటకు సాధనమని
తలంచినాఁడు. హృదయమున శ్రీరామచంద్రునిసాన్నిధ్యమును గలిగించు
కొనినాఁడు. అంజలిబంధముగావించి కృతిభిక్షకొఱకు నిరీక్షించు సర్వజ్ఞ
సింగభూపాలుని యౌదార్యమును దిరస్కరించి శ్రీకైవల్యపదంబు జేరు
టకు భాగవతము శ్రీరామాంకితము గావించినాఁడు. జీవితమంతయు
సాటిలేని సంతుష్టితో గడుపుచు ఘోరతరమగుదరిద్రబాధకు దాసుఁడై
నాఁడు. దైవదత్తమగు కవితాశక్తి దైవసమర్పణ గావించుటయె "పర
మార్థ"మను రహస్యమును లోకమునకు ముక్తకంఠముగ సాటినవాఁడు
పోతన. ఈత్యాగమే యనంతరముగల కవులకుఁ జాలవఱకు మార్గదర్శక
మయ్యెను.

పోతనకాలమున ఆంధ్రదేశస్థితి మిగుల శోచ్యావస్థలోనుండెను.
ఆంధ్రవాఙ్మయసేవకు సర్వస్వము ధారబోసిన చాళుక్య చోళరాజ్యము
లంతరించెను. కవితకు, శిల్పములకు, జాతీయతకు, లలితకళావిలసనము
నకు మార్గదర్శకమగు కాకతీయ సామ్రాజ్యము ఛిన్నభిన్న మయ్యెను.

ఆర్యధర్మములు లుప్తప్రాయము లయ్యెను. రాచకొండ, ఆనెగొంది అద్దంకి మున్నగు తావుల రాజప్రతినిధులును వారివంశజులును చెదరిన యాంధ్రసామ్రాజ్యమును శకలములు జేసికొని నిరంకుశముగఁ బాలించుచుండిరి. ఈ విషమపరిస్థితిలో సర్వవిద్యాసనాథుఁడు కవిసార్వభౌముఁడు నగు శ్రీనాథకవి దేశదేశములు తిరుగవలసివచ్చినది. స్తోత్రపాత్రప్రియులగు రాజుల నెందఱనాశ్రయించినను ఆతని యవసరములు ముగియలేదు. శ్రీశైలములోని భిక్షావృత్తి మఠముతోడను అవచి తిప్పయ్యసెట్టి తోడను గూడఁ గృతిబాంధవ్యము నెఱపుకొనవలసివచ్చినది. ఆధ్యాత్మిక చింతతోఁ బరమార్థ సంగ్రహదీక్షతోఁ బవిత్ర జీవితమునకుఁ దోవ తీయుచున్న బమ్మెర పోతరాజు రాజాశ్రయమురోసి రామభక్తుఁడై ఈ కాలమున నే జీవితమున కొక నూతన మార్గము నన్వేషింపగలిగినాఁడు.

పోతరాజు భాగవతరచనమునకు దొరకొన్నది కైవల్యప్రాప్తికి. కోరిన ఫలము భవబంధవిముక్తి కాని అడుగడుగునకు భాగవతరచనా ప్రయత్న మాతనిహృదయమును సంక్షుభితము గావించినట్లు కొన్ని సూచనలు కలవు. భారతిని "పురాణము తెలిగింప నెంచితిని. తత్సరణిఁ బ్రసాదింపుము. సాహసమును మన్నింపుము. దయాంభోనిధీ" యని కేలొగ్గి ప్రార్థించినాఁడు. పూర్వకవుల నెగాక సమకాలిక కవులను భావికవులనుగూడ సంస్మరించినాఁడు. ఇంతలోఁ జంద్రగ్రహణము గంగాస్నానము శ్రీరామసాక్షాత్కారము భాగవతరచనానుజ్ఞ ఏకశిలానగరవాసులు భగవదాజ్ఞవిని భాగవతాంధ్రీకరణమునకుఁ బ్రోత్సహించుట జరిగినవి. ఈ సందర్భమునఁ బోతనామాత్యుని స్వాగత మొంతేని తనివిదీఱ మననము జేయఁ దగినది.

క. పలికెడిది భాగవతమఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట నే
పలికిన భవహరమగునఁట, పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా.

ఆ. వె. భాగవతము దెలిసి పలుకుట కష్టంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంతఁ గన్నంత, దెలియవచ్చినంతఁ దేటపఱతు.

స్వప్రయోజకత్వము లేకయే భాగవతమును శ్రీరామచంద్రుఁడు పలికించుచుండెనని పోతన దలంచినాఁడు. భాగవతము తత్త్వగ్రంథ మూలము భావగ్రహణము అసాధ్యమనియుఁ బండిత సాహచర్యమునఁ

దాను తొలుత గ్రహించిన దానినే పోతన చెప్పసాగెననియు తెలియు చున్నది.

పోతరాజు ఓరుగల్లు ప్రాంతనివాసి. ఆతనికాలమునందు శైవ మతము మిగుల వ్యాప్తిగ నుండెను. పోతరాజు తండ్రి కేసన. దాన మాన నీతి ధనుఁడు. బహుకలానిధి. శైవశాస్త్ర విజ్ఞాత. తల్లియగు లక్కాంబ పాతివ్రత్యశోభిత యేగాదు. "సదాశివ పాదయుగార్చనాను కంపాన యవాగ్భవాని" కావుననే పోతరాజు వంశపరంపరాగతమగు శైవమతాభిమానమును వీరభద్రవిజయమునందు వెల్లడించినాఁడు. భాగవతరచనమున నీతఁ డద్వైతమతాభిమానిగ మాఱినాఁడు. అనం తర మీాతనివంశజులు విశిష్టాద్వైతమత ప్రవిష్టులైరి. నిజాముదాష్ట్ర మునఁగల నియోగులు శ్రీవైష్ణవత్వము స్వీకరించి గోలకొండవ్యాపారు లనఁబడుచున్నారు. గోలకొండ వ్యాపారులు వేఱు. నియోగులు వేఱని శ్రీ వీరేశలింగము పంతులువారు తలంచిరిగాని యది పొరపాటు. ఈ విషయము స్థలాంతరమున విశ్లేషించి చర్చగావింపఁబడినది.

పోతరాజునకు శ్రీనాథమహాకవి, సర్వజ్ఞసింగ భూపాలుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, అనంతామాత్యుఁడు, దగ్గుపల్లి దుగ్గన, మున్నగు విద్వత్కవులు సమకాలికులు. నాచన సోమనాథుఁ డించుక పూర్వుఁడు. భాస్కరరామాయణము పరిసరభూములలో జనించిన ప్రసిద్ధగ్రంథము. అంత్యనియమమునందుఁ బోతన భాస్కరరామా యణపద్యముల నాదర్శముగఁ గైకొనినాఁడు. కొన్నియెడలఁ బద్య గమనమునను సత్యభామా సంగ్రామమునఁ బూర్తిగ ఉత్తర హరివంశ మును ననుకరించినాఁడు. ఆయా యనుకరణములు దశమస్కంధము నకుఁ బీఠిక వ్రాయునపుడు విశ్లేషించి చర్చింపఁబడును. మొత్తము మీాఁదఁ బోతన కవిత స్వాతంత్ర్యభావ విలసితము. చాలవఱకు మూలానుసారము. అట్లయ్యుఁ గల్పనములు నూత్నములు. పోతన కాలమున ఆంధ్రులకు జానుదెలుఁగు గవితయందును గొందఱకు మిశ్ర కతవియందును గొందఱకు దీర్ఘసంస్కృత సమాసకవితయందును ఆదర ముండెడిది. సర్వజన సమ్మతమగు నీమూఁడుగుణముల నలవఱచుకొనినఁ గాని తన ప్రయత్నము ఫలవంతము గాఁజాలదని పోతన తలంచినాఁడు. అందుల కనుకూలముగఁ గవిత నీ త్రిమార్గముల నడపించుటయే గాదు.

ఈ క్రిందివిధముగఁ బ్రతిజ్ఞసైతము కృత్యారంభమున బోతన యొనర్చెను.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ గొందఱకున్ సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱకు గుణములగు నే, నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

ఈ ప్రతిజ్ఞ యెంతవరకుఁ బోతరాజు జయప్రదముగా నిర్వహించెనో తెలిసికొనవలయునన్న ఏస్కంధమును జూచినను జాలును. భాగవతము ఆంధ్రదేశమున సర్వజనసమ్మతముగ నాదరింపఁబడుటయే యిందులకుఁ దార్కాణము. దీర్ఘసమాసముగల సంస్కృత రచనమున కుదాహరణముగ నొక్కపద్యము దీసికొందము.

సీ॥ కఠిన సటాచ్ఛటోత్కట జాతవాత నిర్ధూత జీమూత సంఘాత మగుచు
క్షురనిభ సునిశిత ఖుర పుటాహతచల, త్ఫణిరాజ దిగ్గజ ప్రచయ మగుచు
చండ దంష్ట్రోద్ధత వైశ్వానరార్చి స్స్రవ,ద్రజత హేమాద్రి విస్రంభ మగుచు
ఘోరగంభీర ఘుర్ఘురభూరినిస్వన, పంకిలాఖిల వార్ధి సంకులముగ...

తృ. స్కం. 412

అచ్చతెనుఁగు రచనములు పోతనకు సహజములైనటులె తోఁచును. చిఱుతబాలురకేని యవగతములగునట్లుండును.

"ఇక్కలురావు పిల్లలకు నేఁపటినుండియు మేఁతగానమిం
బొక్కుచు గూటిలో సెగసిపోవఁగ నేరవు......

"గుజ్జనగూండ్లను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ..."

మిశ్రకవిత్వమునకు భాగవతమునందలి ప్రతిభాగమునను ఉదాహరణములు లభించును. వెదుకఁ బనియుండదు. అరవిచ్చు మల్లెమొగ్గలవలె ఆరసినంతన విడివడు సమాసములు ముద్దులుమూటగట్టు పలుకు బొందికములు అందచందముల హావణించు మృదురచనములు భాగవతమునఁ బ్రతిఘట్టమునందును విరివిగా గోచరించుచుండును.

"బాలురచావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము చెక్కులఁగాఱ నేడ్చి పాం
చాలతనూజ నేలఁబడి జాలిబడంగని యెత్తి మంజువా
చాలతఁ జూపుచున్ జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్.

ప్ర. స్కం ౧౪౨.

పోతనకవితలోని గుణములు చెప్పుటకంటె భాగవతము పాఠకలోకమున కందించుటయె సుకరము. భక్తిచేఁ బోతన తన్మయుఁడై

భగవంతుని నెంతవర్ణించినను దనివిసనఁడు. భగవద్భక్తులకుఁ గలిగిన పరమేశ్వరసందర్శనము వింత వింత పోకడలతో విన్నాణముగ వర్ణించును. రచనము కుంటువడదు రసము తరుగదు. కల్పనములకంతము లేదు. పాఠకుల నొక్కుమ్మాఱు కథాస్థానమునఁబడవేసి భక్తిరసముగ్ధులఁ జేయుటలోఁ బోతరాజు అద్వితీయుఁడు.

పోతరాజుకవితలో ననిర్వాచ్యమగు నానందము కలిగించు నొక యద్వితీయశక్తి గలదు. అన్వయకాఠిన్య మీతనిపద్యములలోఁ గానరాదనియే చెప్పవచ్చును. దుష్కరప్రాసములు అంత్యనియమములు అను ప్రాసములు యమకములు నిరర్గళముగ నడచుచుండును. సాధారణముగ సరసయతినే వాడుచుండును. పదమధ్యవర్ణములు యతిప్రాసములలో నిమిడ్చి ధారకుఁ జిక్కుఁదనము గలిగించుట యీతఁ డెఱుంగఁడు. అందుచే స్వల్పమగు భాషాపరిచయముగలవాఁడేని భాగవతమును ధారాళముగఁ జదువఁ గలుగును. భగవద్వర్ణనమున నీతఁడు సగుణ రూపమును ధ్యానదృష్టితోఁ దిలకించియే వర్ణించుచున్నాఁడాయని యనిపించును. పోకడలలోఁగూడఁ గ్రొత్తదనము, ఆంధ్రీకరణమునందుఁ గూడ విన్నాణము, కథాంశములందుఁగూడఁ గవితాశిల్పము నెలకొల్పి పురాణమునఁ గావ్యలక్షణముల నిముడ్చుటలో నీతఁ డద్వితీయుఁడు. ఆంధ్రలోకమును భాగవతమువలె సర్వవిధముల నాకర్షించి యానంద తరంగములపై నుయ్యాలలూగించు పొత్తమింకొకటి లేదు. తిక్కనసోమయాజిచెప్పిన "పవిత్రరాజసూయావభృథంబునందు శుచిర్మైయైన పెను వొందిన వేణిబట్టి యీ యేవురుజూడఁగా సభకునీడ్చె"నను ద్రౌపదీ విషాదగీతమును బోతరాజు ఎంతమనోజ్ఞముగఁ జెప్పెనో చూడుఁడు.

తే॥ గీ॥ మూరిజనగేయ మగురాజసూయయజ్ఞ, విలసదవభృథసేకపవిత్రమైన
ద్రౌపదీచారువేణీభరంబు బట్టి, కొలువులోపలి కీడ్చిరి పచ్చితమున. తృ.స్కం. 25

ఇట్లు పోతన పద్యములో మాధుర్యగుణము మెండు.

## తృతీయస్కంధవిశేషము.

విదురుఁడు తీర్థయాత్రలకు వెడలి యందందుఁ దిరుగుచు నొకానొకదినమున ఉద్ధవునిగాంచి యాదవపాండవాదుల క్షేమాదికములఁ బ్రశ్నించెను. ఉద్ధవుఁడు యాదవకౌరవుల మరణము శ్రీకృష్ణుని నిర్యాణ

మును విచారముతో విదురునకు నివేదించెను. అంత విదురుఁడు శ్రీకృష్ణుని కంతరంగ మిత్రుఁడవగు నీవాతనివలన విన్న పరమార్థరహస్యముల నెఱింగింపుమని ఉద్ధవుని గోరెను. ఉద్ధవుఁడు మైత్రేయుఁడే యిట్టి యుపదేశములఁ గావింప సమర్థుఁడని విదురునితో నివేదించెను. విదురుఁడు మైత్రేయుని సందర్శించి తత్త్వరహస్యములఁ బడసెను. ఈ సందర్భమున నీస్కంధమునందు భగవదుత్పత్తిలక్షణము, బ్రహ్మతపస్సు, కాలపరిమితి సృష్టిక్రమము,సనకసనందనసులశాపము, హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మకథనము,భగవంతుఁడు లోకోద్ధరణముకొఱకు యజ్ఞవరాహస్వరూపము ధరించి హిరణ్యాక్షునివధించి లోకశుభము ప్రసాదించుట, మృదుమధురముగ వర్ణింపఁబడెను. దేవహూతికర్దములకు భగవానుఁడు కపిలనామమున జన్మించి జననికి తత్త్వజ్ఞానము నుపదేశించుట యీ స్కంధమునందలి ముఖ్యాంశము. దుర్భేదములగు తత్త్వవిషయములు మూల గ్రంథమునకంటె సులభముగాఁ బోతన తెలిగించి యీ స్కంధమునఁ దననైపుణ్యముజూపినాఁడు. శ్రీకృష్ణనిర్యాణవార్త ఉద్ధవుఁడు విదురున కెఱిఁగించుఘట్టమునందుఁ బ్రతిపద్యము హృదయము నుఱ్ఱూఁతలూపును. ఈ స్కంధమునందుఁ బోతరాజు భక్తి సాంఖ్యయోగముల స్వరూపము వేదాంతరహస్యములు సుగమముగఁ దెలిగించినాఁడు. యజ్ఞవరాహమూర్తి హిరణ్యాక్షుని జంపుట రసవత్తరముగ వర్ణింపఁబడినది. పోతన లేఖిని మృదుమధుర కవితా పరిపాటిని వెలయించిన దీ స్కంధము నుండియే.

ఈ తృతీయస్కంధము మాతృక కెంతవరకుఁ జేరువలో నున్నదియు ముద్రితప్రతులకును దాళపత్రగ్రంథములకును గల పాఠభేదములు ముద్రాపకుల సంస్కరణములు దెలుపుచుఁ బీఠికవ్రాయ సంకల్పించితిమిగాని స్థలాంతరమునకు (లేఖకుఁడు) మేము పరివర్తనము గావింపఁబడుటచేతను గ్రంథసముదాయము ఓరుగంటిలో విడిచివచ్చినందునను సాధ్యముకాదయ్యెను. ముం దీలోటు తీర్చుకొందుము.

| హనుమకొండ, | భాషా సేవకులు, |
|---|---|
| కవితావిలాసము, | శేషాద్రిరమణకవులు, |
| 26—10—1938. | శతావధానులు. |

# విషయసూచిక



## తృతీయస్కంధము.



## చిత్రములు.



శుకయోగి పరీక్షిన్న రేంద్రునకు భాగవతము చెప్పుట.

శ్రీ ర స్తు.

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

శ్రీ మ దాం ధ్ర

# భాగవతము

## తృ తీ య స్కం ధ ము





మహితవినుత దివిజ
స్తోమ యశస్సీమ రాజసోమ సుమేరు
స్థేమ వినిర్జితభార్గవ
రామ దశాననవిరామ రఘుకులరామా. 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె నట్లు [1]ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె. 2

ఉ. పాండునృపాలనందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్
[2]భండనభూమిలో గెలిచి [3]పాండురశారదచంద్రచంద్రికా
ఖండయశఃప్రసూనకలికాతతిఁ గౌరవరాజ్యలక్ష్మి నొం
డొండ యలంకరించుచు జయోన్నతి రాజ్యము సేయుచుండగన్. 3

క. మనుజేంద్ర విదురుఁ డంతకు
మును వనమున కేఁగి యచట మునిజన [4]గేయున్

---

1 ప్రాయోపవిష్టుడు = మరణార్థము సర్వకర్మపరిత్యాగముచేసి దర్భలమీద నున్నవాడు. 2 భండనభూమి = యుద్ధభూమి; 3 పాండుర...తతి = తెల్లని శరత్కాలపుచంద్రునియొక్క వెన్నెలవలె గొప్పదైన కీర్తియను పూమొగ్గల సముదాయము, 4 గేయున్ = కీర్తింపదగినవానిని.

[1]వినుతతపోధౌరేయున్
ఘను [2]ననుపమగుణవిధేయుఁ గని [3]మైత్రేయున్. 4

క. కనుఁగొని తత్పాదంబులు
దన[4]ఫాలము సోఁక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర సకలజగత్పా
వనచరితుఁడు కృష్ణుఁ డఖిల [5]వంద్యుం డెలమిన్. 5

క. [6]మండిత తేజోనిధియై, పాండవహితమతిని దూతభావంబున [7]వే
దండపురి కేఁగి కురుకుల, [8]మండనుఁడగు ధార్తరాష్ట్రుమందిరమునకున్.

తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త
వత్సలుండగు కృష్ణుండు వచ్చె నేమి
కతము నాకది యెఱిగింపు కరుణతోడ
ననుచు విదురుండు మైత్రేయు నడిగెననిన. 7

క. విని [9]వెఱఁగంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతి [10]నిస్తంద్రున్
మునికులజలనిధిచంద్రున్, [11]సునిశితహరిభక్తి [12]సాంద్రు శుకయోగీంద్రున్

క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుండగు విదురుఁ డే రహస్యములడిగెన్
ముని యేమిసెప్పె నేపగి, దిని దీర్థము లాడె నెచటఁ దిరుగుచు నుండెన్.

తే. ఇన్ని దెలియంగ నానతి యిచ్చి నన్ను
నర్థి రక్షింపవే విమలాంతరంగ

---

1 వినుతతపోధౌరేయుఁడు = స్తుతింపదగిన తపోభారము దాల్చినవాఁడు.
2 అనుపమగుణవిధేయుఁడు = సాటిలేని సుగుణములవలన నణఁకువగలవాఁడు.
3 మైత్రేయుఁడు:— ఇతఁ డొక ముని. పాండవులు వనవాసముచేయుచుండఁగఁ జూచి ధృరాష్ట్రునొద్దకువచ్చి వారి సేమముచెప్పి, దుర్యోధనుఁడు వారితో సంధిచేసికొనుట మేలనిచెప్పఁగా, దుర్యోధనుఁడు తొడలుసడలించుచు మునిని గేలిసేయఁగ; ముని కోపము చెంది యితని తొడలు భీముచే ఛేదింపఁబడుఁగాతమని శపించెను. 4 ఫాలము = నుదురు. 5 వంద్యుఁడు = నమస్కరింపఁదగినవాఁడు. 6 మండిత = ప్రకాశించుచున్న; 7 వేదండపురి = హస్తినాపురము; 8 మండనుఁడు = అలంకారమైనవాఁడు, 9 వెఱఁగంది = ఆశ్చర్యపడి; 10 నిస్తంద్రున్ = చొరవగలవానిని; 11 సునిశిత = వాఁడియైన; 12 సాంద్రున్ = దట్టమైనవానిని.

ఘన [1]దయాపాంగ [2]హరిపాద కమలభృంగ
మహితగుణ[3]సంగ [4]పాపతమఃపతంగ. 10

చ. అనవుడు [5]బాదరాయణి ధరాధిపుతో ననుఁ బూరువంశవ
ర్ధన విను కష్టుఁ డైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో
ధనముఖపుత్రులం గడుముదంబునఁ బెంచుచుఁ [6]బాండురాజు ద
ప్పినపిదపం దదాత్మజులు [7]వెల్కుటి తన్నని చేర వచ్చినన్. 11

వ. ఇట్లు వచ్చినపాండవులయెడ నసూయానిమగ్నులై సుయోధనాదులు.

క. పెట్టిరి విషాన్న మంటం, గట్టిరి ఘనపాశములను గంగానదిలో
నెట్టిరి రాజ్యము వెడలం, గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై. 13

క. క్రూరాత్ము లగుచు [8]లాక్షాగారంబున వారు నిద్రఁ గైకొనియుండన్
[9]దారుణశిఖిఁ దరికొలిపిరి, [10]మారణకర్మముల [11]కప్రమత్తత వెలయన్.

తే. [12]సూరిజనగేయ మగు రాజసూయయజ్ఞ,
[13]విలసదవభృథసేకపవిత్ర మైన
ద్రౌపదీ[14]చారువేణీభరంబు పట్టి,
కొలువులోపలి కీడ్చిరి కుచ్చితమున. 15

క. కావున వారల కపకృతి, గావింపని దొకదినంబుఁ గలుగదు తమజ
న్మావధి నిజనందనులను, వావిరి నయ్యంధనృపతి వల దనఁ డయ్యెన్.

తే. మాయజూదంబు వన్ని దుర్మార్గవృత్తిఁ
బుడమిఁ గొని యడవులకుఁ బోనడువ నచటఁ
దిరిగి వారలు [15]సమయంబు దీర్చి యేఁగు
దెంచి తమయంశ మడిగినఁ బంచి యీక. 17

---

1 దయాపాంగ = దయతోఁ గూడుకొనిన కడకంటి చూపులుగలవాఁడ; 2 హరిపాదకమలభృంగ = విష్ణువుయొక్క పాదము లనే కమలములకు తుమ్మెదవంటివాఁడ; 3 సంగ = కూడుకొన్నవాఁడ; 4 పాపతమఃపతంగ = పాప మనెడి చీకటికి సూర్యునివంటివాఁడ. 5 బాదరాయణి = శుకుఁడు; 6 పాండురాజు దప్పిన = పాండురాజు చనిపోయిన; 7 వెల్కుటి = భయపడి. 8 లాక్షాగారము = లక్కయిల్లు; 9 దారుణశిఖి = క్రూర మైన యగ్ని; 10 మారణకర్మ = చంపునటిపని: 11 అప్రమత్తత = జాగ్రత్త. 12 సూరిజనగేయము = పండితజనులచే కీర్తింపఁబడినది; 13 విలసద...పవిత్రము = ఒప్పుచున్న యవభృథస్నానమునఁ దడుపఁబడుటచేఁ బవిత్ర మైన; 14 చారువేణి = అంద మైన జడ. 15 సమయము = నియమము, ఒడంబాటు.

వ. ఉన్న యెడ. 18

చ. [1]సకలనియంత యైనహరి సర్వశరణ్యుఁడు మాధవుండు [2]సే
వకనవకల్పకంబు భగవంతుఁ డనంతుఁ డనంతశక్తి నం
దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే [3]నియుక్తుఁ డై
యకుటిలభక్తియోగమహితాత్మకుఁ డై ధృతరాష్ట్రపాలికిన్. 19

క. చని యచట భీష్మగురుత, [4]త్తనయకృపాచార్యనిఖిలధాత్రీపతులన్
విని యనుమోదింపఁగ ని,ట్లని యెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా.

క. కౌరవపాండవు లిరువురు, నారయ నీ కొక్కరూప యవనీవర నీ
వేరీతి నైనఁ బొందుకు, మారులపా లొసఁగి తేని [5]మను నుభయంబున్.

క. అని ధర్మబోధమునఁ బలి,
కినమాటలు సెవుల నిడమిఁ గృష్ణుఁడు విదురున్
ఘననీతిమంతుఁ బిలువం,
బనిచినఁ జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్. 22

వ. చనుదెంచి, యచటిజనంబులచేత [6]నుపస్థితంబయిన కార్యంబు దెలిసిన
వాఁ డయి ధృతరాష్ట్రు నుద్దేశించి యి ట్లనియె. 23

మ. ధరణీనాయక పాండుభూవిభుఁడు నీతమ్ముండు దత్పుత్రులం
బరిరక్షించిన ధర్మువుం దగవునుం బాటిల్లు వంశంబు సు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెందు శత్రుజయముం జేకూరు గోపాలశే
ఖరు చిత్తంబును వచ్చు న ట్లగుట యా గౌరవ్యవంశాగ్రణీ. 24

ఆ. వారితండ్రిపాలు వారికి నొసఁగి నీ,పాలు సుతుల కెల్లఁ బంచి యిచ్చి
[7]చలమువిడిచి ధర్మమలవడ నీబుద్ధిఁ,బొనుపవయ్య కులమునుపవయ్య.

చ. వినుము నృపాల నాపలుకు వేయును నేల [8]సమీరసూతి నీ
తనయులపేరు విన్నఁ [9]బద తాడిత దుష్టభుజంగమంబుచా

---

1 సకలనియంత= సమస్తము నడిపించువాఁడు; 2 సేవకనవకల్పకము= సేవకజనులకుఁ గ్రొత్తదైన కల్పవృక్షమువంటివాఁడు; 3 నియుక్తుఁడై = నియమింపబడినవాఁడై. 4 తత్తనయుఁడు = వానికుమారుఁడు (అశ్వత్థామ). 5 మను = బ్రతుకు. 6 ఉపస్థితంబయిన కార్యము = చేరిన కార్యము. 7 చలము = పట్టుదల. 8 సమీరసూతి = వాయుపుత్రుఁడు (భీముఁడు); 9 పద...చాడ్పున = పాదములతో తన్నఁబడిన చెడుపాముపలె.

డ్వునఁ గన లొండు నింతయును మున్నను జెప్పితిఁ గాదె వానిచే
తన భవదీయ పుత్రులకుఁ దప్పదు మృత్యువ దెన్నిభంగులన్. 26

వ. అదియునుం గాక.

క. నీపుత్రులశౌర్యంబును, [1]చాపాచా[2]ర్యాపగాత్మజాతకృపభుజా
టోపంబును గర్ణదురాలాపంబులు నిజముగాఁదలంతె మనమునన్.

వ. అట్లని వినుము. 29

ఉ. ఏపరమేశుచే జగము లీ[3]సచరాచరకోటితో [4]సము
ద్దీపిత మయ్యె నేవిభుని దివ్యకళాంశజు [5]లబ్జగర్భగౌ
రీపతిముఖ్యదేవముని బృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డాపురుషోత్తముండు కరుణాంబుధి కృష్ణుఁడు వో నరేశ్వరా. 30

ఉ. అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే
పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై
[6]యిట్టల మైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు వారలన్
[7]జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చునె పార్థివోత్తమా. 31

ఉ. కావునఁ బాండునందనులఁ [8]గాఱియ వెట్టక రాజ్యభాగమున్
[9]వావిరి నిచ్చి రాజ్యమును వంశముఁ బుత్రుల బంధువర్గముం
గావుము గాక లోభియగు కష్టసుయోధనుమాట వింటివే
భూవర నీ [10]యుపేక్ష నగుఁ బో కులనాశము బంధునాశమున్. 32

తే. ఒకనికై యిట్లు కుల మెల్ల [11]నుక్కడంప
నెత్తికోనఁ జూచె దిది నీతియే నృపాల
వినుము నామాట నీసుయోధనుని విడిచి
కులము రాజ్యంబుఁ దేజంబు నిలుప వయ్య. 33

---

1 చాపాచార్య = ద్రోణునియొక్క; 2 ఆపగాత్మజాత = గంగకుమారుడైన భీష్మునియొక్క. 3 సచరాచరకోటితో = కదలునట్టియు, కదలనట్టియు వస్తుసముదాయముతో; 4 సముద్దీపితము = ప్రకాశించునది; 5 అబ్జగర్భుఁడు = బ్రహ్మ. 6 ఇట్టలము = అధికము; జొట్టనవ్రేలు = చూపుడువ్రేలు. 8 కాఱియ = బాధ; 9 వావిరి = క్రమముగా; 10 ఉపేక్ష = అశ్రద్ధ. 11 ఉక్కడంచు = స్థైర్యము నడగించు.

క. అని యిట్లు దఱిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుండై తా
[1]నినతనయ శకుని దుశ్శా,సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్.

క. దాసీపుత్రుని మీఁర లు,దాసీనుం జేయు కిటకుఁ దగునె పిలువఁగా
[2]నాసీనుండై పేర్లెడు, [3]గాసిలిచెడిపోవ వెడలఁగా నడువుఁడీకన్. 35

వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబు సేయం గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొండు వలుక నొల్లక [4]శరశరాసనంబులు విడిచి క్రోధంబు నడంచి వనంబునకుం జని యందు. 36

సీ. విష్ణు[5]స్వయంవ్యక్త విమలభూములను బ
విత్రంబు లగుహరిక్షేత్రములను
నెలకొని దేవతానిర్మితహరిదివ్య
భూముల గంగాదిపుణ్యనదుల
సిద్ధపురాణ ప్రసిద్ధపుణ్యాశ్రమ
స్థలముల నుపవనస్థలములందు
గంధమాదన[6]ముఖ[7]క్ష్మాభృత్తటంబుల
మంజులగిరికుంజపుంజములను

తే. వికచకైరవ పద్మ హల్లకమరంద
పానపరవశమధుకరగానబుద్ధ
రాజహంసవిలాసవిరాజమాన
మగుచుఁ జెలు వొందు [8]పంకేరుహాకరముల. 37

క. మఱియును ఋష్యాశ్రమ వన,సరిదుపవననద పుళిందజనపద గిరిగ
హ్వర[9]గోష్ఠయజ్ఞశాలా, పుర[10]దేవాయతనపుణ్యభూములయందున్. 38

క. కూరలుఁ గాయలు నీళ్లా,హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం
స్కారశరీరుం డగుచు నుదారత [11]నవధూత వేషధరుఁడై వరుసన్. 39

---

1 ఇనతనయుఁడు = కర్ణుఁడు. 2 ఉదాసీనుఁజేయక = నిర్లక్ష్యముచేయక; 3 గాసిలి = కష్టపడి. 4 శరశరాసనములు = బాణములు, విల్లును. 5 స్వయంవ్యక్తము = ప్రత్యక్షము; 6 ముఖ = మొదలైన; 7 క్ష్మాభృత్తటము = పర్వత సమీపము; 8 పంకేరుహాకరము = సరస్సు. 9 గోష్ఠము = గోవులుమందలుండుచోటు; 10 దేవాయతనము = దేవాలయము. 11 అవధూత = సన్యాసి.

క. హర్షము గదురఁగ భారత,వర్షమునం గలుగు పుణ్యవరతీర్థము లు
[1]త్కర్షం జూచుచు [2]విగతా, మర్షుండై సంచరించె మనుజవరేణ్యా. 40

వ. ఇట్లు సంచరించుచుఁ [3]బ్రభాసతీర్థమ్మునకు వచ్చునప్పుడు. 41

చ. అరుగుచు [4]దైత్యభేదనదయాపరిలబ్ధసమస్తమేదినీ
భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ భూ
వర విదురుండుఁ దన్నికటవర్యతమాల రసాల మాధవీ
కురవక మాలతీ వకుళకుంజ లసత్తటమందు నున్నెడన్. 42

చ. నరవర [5]వేణుజానలవినష్టమహాటవిమాడ్కిఁ బాండుభూ
వర ధృతరాష్ట్రసూను [6]లనివార్యనిరూఢవిరోధ మెత్తి యొం
డొరుల జయింపఁ గోరి [7]కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం
దఱు మృతులౌటయున్ విని ఘనంబుగ శోక[8]నిమగ్నచిత్తుఁడై. 43

ఉ. ఆయెడఁ గాలు దన్నక రయంబున నేఁగి సరస్వతీనదీ
తోయములందుఁ గ్రుంకి మునితుల్యుఁడు వేచనియెం దనూనపా
త్తోయరుహాప్తభార్గవపృథుత్రితసోమసుదాసశక్తిభృ
ద్వాయుయమాభిధానయుత వాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్. 44

ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ [9]రమా
మండనుఁ డుండు[10]దివ్యరుచిమన్మణిచారుకవాటగేహళీ
మండిత సౌధగోపురవిమానము లున్నతభక్తిఁ జూచుచున్
నిండిన వేడ్కఁ గృష్ణపద నీరజ చింతనుఁడై క్రమంబునన్. 45

---

1 ఉత్కర్షం = ఉత్సాహము; 2 విగతామర్షుఁడై = పోయిన కోపము కలవాఁడై; 3 ప్రభాసతీర్థము;— ఇది సరస్వతీనది సముద్రములో కలయుచోటనున్నది. చంద్రు డశ్విన్యాది నక్షత్రముల సమముగ చూడనందున దక్షునిచే కృశించుమని శపింపబడినవాఁడై, యాశాపపరిహారార్థమై యీ తీర్థమున ప్రతియమవసనాఁడు స్నానముచేసి వృద్ధినొందుచుండును. 4 దైత్య......ధరుఁడు = కృష్ణమూర్తియొక్క దయచేత పొందిన సకల రాజ్యభారము కలవాఁడు. 5 వేణు.........మాడ్కి = వెదురుల రాపిడిచేఁ బుట్టిన యగ్నిచే నశించిన గొప్ప యడవివలె; 6 అనివార్యనిరూఢ = అడ్డుపెట్టరాని దృఢమగు; 7 కదనోర్వి = యుద్ధభూమి; 8 నిమగ్న = మునిఁగిన. 9 రమామండనుఁడు = లక్ష్మీదేవి కలంకారమైనవాఁడగు విష్ణుమూర్తి; 10 దివ్యరుచి......... విమానములు = మనోహరమగు ప్రకాశించు మణులచే సుందరమైన కవాటముల చేతను, గడపల చేతను, నలంకరింపబడిన సౌధములు, గోపురములు, మంటపములు.

—♦ విదురుం డుద్ధవుం గని కృష్ణాదులవృత్తాంతం బడుగుట ♦—

చ. చని చని తొంటిమత్స్యకురుజాంగలభూము లతిక్రమించి చ
య్యన యమునానదిం గదిసి యచ్చట భాగవతున్ [1]సరోజలో
చనదృఢభక్తు సద్గుణవిశారదు శాంతుని [2]దేవమంత్రిశి
ష్యుని మహితప్రసిద్ధుఁ [3]బరిశోషితదోషుఁ బ్రబుద్ధు [4]నుద్ధవున్. 46

క. కని యనురాగవికాసము, దనమనమునఁ దొంగలింపఁ దగగాఢాలిం
గన మాచరించి నెయ్యం,బునఁ గుశలప్రశ్న సేసి ముదమునఁ బలికెన్.

క. హరిభక్తులు పుణ్యాత్ములు, [5]దురితవిదూరులు [6]విరోధిదుర్దమబలులుం
గురుకులతిలకులు కుంతీ,వరసూనులు గుశలులే యవారితభక్తిన్. 48

చ. హరి దన నాభిపంకరుహమందు జనించినయట్టి [7]భారతీ
శ్వరుఁ డతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తులై
పరఁగ జనించి భూభరముఁ బాపినభవ్యులు రేవతీందిరా
వరు లట శూరసేనుని నివాసమునన్ సుఖ మున్నవారలే. 49

చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడునై తనర్చి సో
దరతరుణీజనంబులను దత్సుతులం గడుగౌరవంబునం
గరుణ దలిర్ప [8]నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు
స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికులప్రదీపకా. 50

శా. [9]కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి [10]భూదేవతా
బృందంబున్ భజియించి తత్కరుణ దీపింపం బ్రభావంబు పెం
పొందన్ రుక్మిణి గన్ననందనుఁడు ప్రద్యుమ్నుండు [11]భాస్వచ్చమూ
సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునన్ మించునే.

---

1 సరోజలోచనదృఢభక్తున్ = విష్ణువునందు దృఢభక్తికలవాని; 2 దేవమంత్రి = బృహస్పతి; 3 పరిశోషితదోషు = నశించిపోయిన పాపములుకలవాఁడు; 4 ఉద్ధవుఁడు:—ఇతఁడు కృష్ణుని భక్తుఁడు, వృష్ణివంశమువాఁడు; దేవభాగుని కుమారుఁడు. 5 దురితవిదూరులు = పాపములేనివారు; 6 విరోధిదుర్దమబలులు = శత్రువులచే జయింపబడని బలవంతులు. 7 భారతీశ్వరుఁడు = బ్రహ్మ. 8 ఆత్మజులకంటె = కుమారులకంటె. 9 కందర్పాంశము = మన్మథునియంశము; 10 భూదేవతలు = బ్రాహ్మణులు; 11 భాస్వచ్చమూసందోహము = ఒప్పుచున్న సైన్యముయొక్క, సమూహము

క. [1]సరసిజలోచన కరుణా, పరిలబ్ధ సమస్తధరణి ♦ పాలనమహిమం
బరమప్రీతి సుఖంచునె, చిరవిభవోదారుఁడుగ్ర ♦ సేనుఁడు జగతిన్.

చ. లలితపతివ్రతామణి వి ♦ లాసవతీ తిలకంబు పార్వతీ
లలన కుమారుఁ గన్నటు సు ♦ లక్షణ జాంబవతీలలామ ని
ర్మలగతిఁ గన్నపట్టి సుకు ♦ మారతనుండు విరోధిభంజనో
త్కలిక సుఖంచునే [2]గుణకదంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా. 53

క. [*]హరిపద సేవకుఁ డరిభీ, కరుఁడర్జునువలన మిగులఁ♦[3]గార్ముకవిద్యల్
[*] దిరముగఁ గఱచినసాత్యకి, వరసుఖవిభవములనున్న ♦వాఁడెధరిత్రిన్?

మ. [4]జలజాతాంకుశ చక్ర చాపకులిశ ♦ చ్ఛత్రాదిరేఖాంకితో
జ్జ్వల గోవిందపదాబ్జలక్షితవిరా ♦ జన్మార్గధూళిచ్ఛటా
కలితాంగుండు [5]విధూతకల్మషుఁడు ని ♦ ష్కామైకధన్యుండు స
త్కులజాతుం డన నొప్పునట్టి ఘనుఁ డ♦క్రూరుండు భద్రాత్ముఁడే?

క. [6]శ్రుతులును [7]క్రతుజాతము స
మ్మతిఁ దాల్చినయట్టి వేద ♦ మాతగతిక్ [8]శ్రీ
పతిఁ దనగర్భంబున ర,
క్షితుఁ జేసిన గరిత దేవ ♦ కీ సతి సుఖమే? 56

వ. మఱియు, మహాత్మా! మహితోపాసకు లగువారలకోర్కులునిండింపం
జాలిన పరమేశ్వరుండు శబ్దశాస్త్రంబునకుం గారణం బని తన్ను
నఖలదేవతాజనంబు లగ్గింపంగల మేటియగుటం జేసి మనోమయుం
డును సకలజీవచతుర్విధాంతఃకరణంబులయిన చిత్తాహంకారబుద్ధి
మనంబులకుం గ్రమంబున వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధు

---

1 సరసిజ.........మహిమక్ = కృష్ణునిదయచే పొందిన సకలభూపాలన మహిమచే. 2 గుణకదంబుడు = సుగుణసముదాయముకలవాఁడు. 3. కార్ముకవిద్య = విలువిద్య. 4 జలజాత.........కలితాంగుఁడు = పద్మము, అంకుశము, చక్రము, విల్లు, కులిశము, గొడుగు మొదలైన రేఖలగురుతులతో ప్రకాశించు కృష్ణుని పాదపద్మము లందు గురియుంచి ప్రకాశించు మార్గధూళిసముదాయముచేనొప్పు శరీరుఁడు; 5 విధూత కల్మషుఁడు = ఎగరఁగొట్టఁబడిన పాపములుకలవాఁడు. 6 శ్రుతులు = వేదములు; 7 క్రతుజాతము = యజ్ఞసమూహము; 8 శ్రీపతి = లక్ష్మీదేవికి భర్తయగు విష్ణువు;
*గఱచిన బలియుఁడు సాత్యకి వఱలిన సుఖలీల నున్న ♦వాఁడె — ప్రా. పా

లధిదైవతంబు లగుసు రట్టి చతుర్విధ తత్త్వంబులకు [1]ధుర్యంబైన తత్త్వంబునునైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుండగునే యని.

మ. ఇతరారాధన మాని కృష్ణుఁ గమలా ♦ కాంతుం [2]బయోజాసనా
ర్చితు భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ ♦ సేవించుపుణ్యుల్ జగ
న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులుమా♦న్యుల్ ధర్మమార్గుల్ సము
న్నతి సత్యాత్మజచారుదేష్ణగదు లా ♦ నందాత్ములే యుద్ధవా? 58

తే. [3]క్రోధ మాత్సర్యధనుఁడు సు ♦ యోధనుండు
వొలుచు నెవ్వనిసభఁ జూచి ♦ కలుష మొదవి
మనములోన నసూయా ని ♦ మగ్నుఁ డయ్యె
నట్టి ధర్మజుఁ డున్నాఁడె ♦ యనఘ చరిత. 59

తే. ఘన [4]గదాభ్యాస చిత్ర సం ♦ గతుల మెరసి
కురు కుమారుల భూరి సం ♦ గరము లోన
హతులఁ గావించి వెలసిన ♦ యట్టి [5]జెట్టి
[6]వాయుతనయుండు గుశలియై ♦ వఱలు నయ్య? 60

చ. [7]హరికరుణాతరంగిత క ♦ టాక్ష నిరీక్షణ లబ్ధశౌర్య వి
స్ఫురణఁ దనర్చి తన్ను నని ♦ బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్
బరవస మొప్పఁగా గెలిచి ♦ పాశుపతాస్త్రముఁ గొన్న శత్రు భీ
కరుఁడు ధనంజయుండు సుభ ♦ గస్థితి మోదము నొందుచుండెనే?

మ. తెఱఁ గొప్పన్ జననీ వియోగమునఁ గుం ♦ తీ స్తన్య పానంబు సో
దర సంరక్షయుఁ గల్గి [8]దేవ విభు వ ♦ క్త్రస్థామృతంబున్ [9]ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్న మాడ్కిఁ గురువం ♦ శ శ్రేణి [10]నిర్జించి త
ద్ధరణీ రాజ్యముఁ గొన్నమాద్రికొడుకుల్ ♦ధన్యాత్ములే యుద్ధవా?

---

1 ధుర్యము = సమర్థము. 2 పయోజాసనార్చితున్ = బ్రహ్మచే పూజింపఁబడిన విష్ణుని. 3 క్రోధమాత్సర్యధనుఁడు = క్రోధమాత్సర్యములు ధనముగాఁగలవాఁడు 4 గదాభ్యాసము = గదాయుద్ధము నేర్చుట; 5 జెట్టి = శూరుఁడు; 6 వాయుతనయుఁడు = భీముఁడు. 7 హరి.........స్ఫురణన్ = విష్ణువుయొక్క దయతోఁ గూడిన యలలవంటి చూపులచూచుటచే పొందిన పరాక్రమముయొక్క ప్రకాశముచేత 8 దేవవిభువక్త్రస్థామృతము = దేవేంద్రుని నోటియొద్దనున్న యమృతము; 9 ఖగేశ్వరుఁడు = గరుత్మంతుఁడు; 10 నిర్జించి = జయించి.

తే. పాండు భూమీశ్వరుండు సం ♦ ప్రాప్తమరణుఁ
డైన శిశువులఁ బ్రోచుట ♦ కై నిజేశుఁ
గూడి చన కున్న యట్టి యా ♦ కుంతిభోజ
తనయ జీవించునే నేఁడు ♦ మనుచరిత్ర. 63

వ. అని వెండియు. 64

మ. అనుజాతుం డగు పాండు భూవిభుఁడు ని♦ర్యాణంబునుం బొంద నా
తనిపుత్రుల్ దనుఁ జేర వచ్చినను మా♦ధ్యస్థ్యంబుఁ [1]బోఁ దట్టి యె
గ్గొనరించెన్ ధృతరాష్ట్రభూమిభుఁ డ♦ల్లాహింపఁగా నెగ్గు సే
సిన వాఁడేఁ యగుఁగాక మేలుగలదే ♦ చింతింపఁగా నుద్ధవా. 65

క. అనుజుఁడు వీఁడనకయ తన
తనయులు నను వెడల నడువఁ ♦ దా నూరక యుం
డిన ధృతరాష్ట్రుఁడు నరకం
బునఁ బడు నాకైనదుఃఖ ♦ మున ననఘాత్మా. 66

వ. అదియునుం గాక పరమశాంతుండవైన నీమనంబున దుఃఖంబు
కర్తవ్యంబు గాదంటేని. 67

క. నరలోక [2]విడంబనమున,
హరి పరమ పురుషుఁడు మాన ♦ వాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా,
స్ఫురణన్ మోహింపఁ జేయు ♦ భూజన కోటిన్. 68

ఉ. కావున నమ్మహాత్ముని వి ♦ కారవిదూరుని సర్వమోహ[3]మా
యావిల మాన సుండ నగు ♦ నప్పుడు సంసృతి దుఃఖ నాదు న
ద్దేవుని సత్కృపామహిమఁ ♦ దెలిన వేళ సుఖింతు నేన కా
దా[4]విధిశంకరప్రభృతు ♦ లవ్విభు మాయఁ [5]దరింప నేర్తురే. 69

వ. అయిన నమ్మహాత్ముని కరుణాతరంగితా[6]పాంగ పరిలబ్ధ విజ్ఞానదీపాం
కుర నిరస్త [7]సమస్తదోషాంధకారుండ నగుటం జేసి మదీయచిత్తంబు

---

1 పోఁదట్టి = తీసివేసి. 2 విడంబనముచేత = అనుకరించుటచేత. 3 మాయావిల మానసుఁడు = మాయచే కలుషమైన మనస్సుకలవాఁడు; 4 విధిశంకరప్రభృతులు = బ్రహ్మ శివుడు మొదలైనవారు; 5 తరింప = దాటు; 6 అపాంగ = కడకంటిచూపులు; 7 సమస్తదోషాంధకారుఁడు = అన్ని పాపములను చీఁకటులుగలవాఁడు.

హరిపరాయత్తంబయిన కారణంబునను దత్త్వంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు మఱియును. 07

సీ. అట్టి సరోజాక్షుఁ ♦ డాత్మీయ పద భక్తు
లడవుల నిడుమలఁ ♦ గుడుచు చుండ
[1]దౌత్యంబు సేయఁ గొం ♦ దఱువిరోధులు హరి
[2]బద్ధునిఁజేయ స ♦ న్నద్ధు లైన
బలహీను మాడ్కి మా ♦ ర్పడ లేఁడ యసమర్థుఁ
డని తలంచెద వేని ♦ నచ్యుతుండు
పరుల జయింపనో ♦ పక కాదు విద్యాభి
[3]జాత్యధనంబుల ♦ జగతిఁ బెక్కు-
తే. బాధల నలంచు దుష్టభూ ♦ పతుల నెల్ల,
సైన్యయుక్తంబుగా నని ♦ సంహరించు
కొఱకు సభలోన నప్పుడా♦కురుకుమారు
లాడు దుర్భాషణములకు ♦ [4]నలుగఁడయ్యె. 71

మ. జననం బెందును లేని యీశ్వరుఁడు దా♦జన్మించు టెల్లన్ విరో
ధి [5]నిరాసార్థము [6]వీతకర్ముఁ డగు న♦ద్దేవుండు గర్మప్రవ
ర్తనుఁడౌఁ టెల్లఁ జరాచరప్రకటభూ♦తశ్రేణులం గర్మవ
ర్తనులం జేయఁ దలంచి కాక కలవే♦ దైత్యారికిం గర్మముల్. 72

క. హరినరుల కెల్లఁబూజ్యుఁడు,హరిలీలామనుజుఁడును[7]గు♦ణాతీతుఁడునై
పరఁగినభవకర్మంబులఁ,బొరయఁడఁటహరికిఁగర్మ♦ములు లీలలగున్.

క. మదిఁ దనశాసన మిడి నిజ, పదములు సేవించు లోక♦పాలాదుల పెం
పొదవింప యదుకులంబున, నుదయించెను భువినిబల స♦ హో
[దరుఁడగుచున్.

తే. చలన మందక [8]భూరి సం♦సరణ తరణ,
మైనసత్కీర్తి దిక్కుల ♦ నతిశయిల్లి

---

1 దౌత్యము = రాయబారము; 2 బద్ధునిచేయన్ = కట్టుటకు; 3 అభిజాత్యము = మంచివంశములోఁ బుట్టుట; 4 అలుగఁడు = కోపింపఁడు. 5 నిరాసార్థము = నిరసించుటకొరకు; 6 వీతకర్ముఁడు = పోయిన కర్మలుకలవాఁడు - కర్మరహితుఁడు. 7 గుణాతీతుఁడు = సత్త్వరజస్తమోగుణముల కతీతుఁడు. 8 భూరిసంసరణ తరణమైన = పెద్ద సంసారమును దాటించునట్టిదైన.

వత్సల సమమతియైయున్న ♦ వాఁడై కృష్ణుఁ,
డనుచు విదురుఁడు యుద్ధవు ♦ నడుగుటయును. 75

వ. అట్టియెడ నయ్యుద్ధవుండు. 76

క. యదుకుల నిధి యగు కృష్ణుని,
పద జలజ వియోగ తాప ♦ భరమున మాటల్
1ప్రిదులక హృదయం 2బెరియఁగఁ,
బెదవులు దడుపుచును 3వగలఁ ♦ బెంపఱియుండెన్. 77

క. అనిచెప్పి బాదరాయణి,
మనుజేంద్రుని 4వలను సూచి ♦ మఱి యిట్లనియెన్
విను మొకనాఁ డీ యుద్ధవుఁ,
5డనయము నైదేండ్ల బాలుఁ ♦ డై యున్నతఱిన్. 78

వ. మున్ను కృష్ణునింగూడి యాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునింగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీమతల్లియగు తల్లి సనుదెంచి యాఁకొంటి విది యేల రావన్న యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండతేజోనిధి యైన పుండరీకాక్షుపాదారవిందమకరంద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణవియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పంజాలక 6యొప్పతి యుండుట యేమిచిత్రంబని వెండియు నిట్లనియె నంత నుద్ధవుండు 7సరోజాక్షపాదారవింద మకరంద సుధాజలనిధినిమగ్నమానసుండై 8సముత్కంఠ జింతించి యొక్కముహూర్తమాత్రంబునకు బాష్పజలపూరితలోచనుండై గద్గదకంఠుం డగుచు. 79

క. ఘనముగ నెమ్మనమునమిం, చినకృష్ణ9వియోగజనిత♦శిఖిదరికొనఁగాఁ
గనుఁగవఁ బెడ చేనొత్తుచుఁ, బెనుపొందిన10దురితశిఖరి♦భిదురున్ విదురున్

---

1 ప్రిదులక = సడలిరాక; 2 ఎరియఁగ = పరితపింపఁగ; 3 వగలు = దుఃఖము; 4 వలను = దిక్కు; 5 అనయము = అత్యంతము; 6 ఒప్పతి = ఒప్పిదముపోయి; 7 సరోజాక్ష......... మానసుండై = కృష్ణుని పాదకమలములందుఁ గలపూఁదేనె యను నమృతసముద్రమున మునిగినమనస్సుకలవాఁడై; 8సముత్కంఠ = గద్గదస్వరముతోఁ గూడిన; వియోగ......దరిగొనగా=ఎడబాటువలనఁ గలిగిన యగ్ని రవులుకొల్పగా; 10 దురిత శిఖరిభిదురున్ = పాపములను, పర్వతములకు వజ్రాయుధమువంటివానిని

వ. కనుంగొని యిట్లనియె. 81

క. యముఁడనఁ ఘనకాల1భుజంగమపుంగవుఁడెగఁచిపట్టఁ గాయదువంశో
త్తములచరిత్రలుఁదత్కుశలము లేమనిచెప్పఁగలంగెడి మనమున్

సీ. మునిజన ముఖ[2]పద్మ ♦ ములు [2]ముకుళింపంగ
ఖల జనలోచ నో ♦ త్పలము లలర
జార చోర [3]కోరిక ♦ సఫలత నొందంగ
దానవ దర్పాంధ ♦ తమస మడర
వరయోగి జనచక్ర ♦ వాకంబు లడలంగఁ
గలుషజనానురా ♦ గంబు పర్వ
భూరి దోషాగమ ♦ [4]స్ఫూర్తి వాటిల్లంగ
[4]నుదిత ధర్మక్రియ ♦ [5]లుడిగి మడఁగ

తే. మానుషాకార రుచికోటి ♦ మందపఱిచి
యనఘు డే మన నేర్తుఁ గృ ♦ ష్ణాభిధాన
లోకబాంధవుఁ డుత్తమ ♦ [6]శ్లోకమూర్తి
మించు తేజంబుతో నస్త ♦ మించెనయ్య. 83

వ. మఱియును. 84

క. హల కులిశ జలజరేఖా, లలిత శ్రీకృష్ణపాద ♦ [7]లక్షితయై ని
ర్మలగతి నొప్పెడుధరణీ, లలనామణి నేఁడభాగ్య♦లక్షణయయ్యెన్.

క. యాదవులవలన రాజ్య, శ్రీ దూలఁగెను ధర్మగతి న♦శించెను భువి మ
ర్యాదలు దప్పె [8]నధర్మో, త్పాదనమున దైత్యభేది♦దప్పినపిదపన్.

వ. మఱియు [9]లలిత నికషణ విరాజమాన మణిగణకిరణ సుషమావిశేష విడంబితవిమల సలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండల

1 భుజంగపుంగవుండు = సర్పశ్రేష్ఠుఁడు. 2 ముకుళింపఁగ = ముడుచుకొనిపోవఁగ; 3 ఆగమము = వచ్చుట; 4 ఉదిత = పుట్టిన; 5 ఉడుగు = మాను; 6 శ్లోకము = కీర్తి. 7 లక్షితయై = గురుతుఁగలదై; 8 అధర్మోత్పాదనమున = అధర్మము కలిగించుటవలన. 9 లలిత.........లందు = మృదువుగా సానపెట్టఁబడుటచేతఁ బ్రకాశించుచున్న మణుల సముదాయముయొక్క కాంతుల మనోజ్ఞతయొక్క విశేషము ననుకరించు స్వచ్ఛమైన జలములందు;

రుచి నిరీక్షించి జలచర బుద్ధిం జేసి తజ్జల [1]విలోలమీనంబు [2]లనూన స్నేహంబునం దలంచుచందంబునం గృష్ణానుచరులైన యదువృష్ణి కుమారు లమ్మహనీయమూర్తిం దమకు [3]నగ్రేసరుం డని కాని లీలామానుష విగ్రహుండైన పరమాత్ముం డని యెఱుంగక హరి మాయాజనితంబగు నసద్భావంబుం జేసి భోజన శయనాసనాను గమనంబులం జేరి సహోదరాదిభావంబులంగూడి చరియింతు రద్దేవుని మాయా [4]పయోనిధి నిమగ్నులుగాకుండ [5]నబ్జభవాదుల కైనం దీఱదు సర్వగుణగరిష్ఠులును సత్పురుషశ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కం దక్కినవారలకుం జెప్పనేల యది యునుం గాక [6]యభిజన విద్యా ధన బలగర్వ మదాంధీభూత [7]చేతస్కులైన శిశుపాలాదిభూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలుదలంచి మనస్తాపంబు నొందు చుండుదు నని వెండియు. 87

మ. [8]అవితృప్తేక్షణ ధీసమాహిత తపో ♦ వ్యాసంగు లైనట్టి భా
గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలై ♦ కజ్యోతిమై జూపి శో
కవిశోకంబులు నిర్దహించి కమలా ♦ కాంతుండు శాంతుండు మా
నవరూపం బగు దేహముజ్ఞ వదలి యం ♦ తర్ధానుం డయ్యెం జుమీ.

సీ. *మానవైక వికాస ♦ మానమై తనకును
[9]విస్మయ జనకమై ♦ వెలయునట్టి
యాత్మీయ యోగ మా ♦ యాశక్తిం జేపట్టి
చూపుచు నత్యంత ♦ [10]సుభగుం డగుచు
భూషణంబులకు ను ♦ భూషణంబై వివే
కముల కెల్లను బర ♦ కాష్ఠ యగుచు
సకల కల్యాణ సం ♦ స్థానమై సత్యమై
తేజరిల్లెడు నట్టి ♦ దివ్యమూర్తి

---

1 విలోలమీనంబులు = చలించు చేపలు 2 అనూన = తక్కువకాని 3 అగ్రేసరుఁడు = ముందు నడచువాఁడు, ఉత్తమమైనవాఁడు 4 పయోనిధి = సముద్రము 5 అబ్జభవాదులు = బ్రహ్మాదులు 6 అభిజనము=మంచికులము 8 చేతస్కులు=మనస్సు కలవారు 8 అవితృప్త......వ్యాసంగులు=తృప్తిచెందని చూపులచేత,బుద్ధిని బాగుగా నుంచఁబడిన తపమునం దాసక్తి కలవారు 9 విస్మయజనకము=అచ్చెరువు కలిగించునది. 10 సుభగుఁడు=మనోహరుఁడు. *మర్త్య వికాసైకలని పాఠాంతరము.

తే. తాన తనమూర్తి నిజశక్తిఁ ♦ దగ ధరించె
[1]యమతనూభవురాజసూ ♦ యాధ్వరంబు
నందు నెవ్వని శుభమూర్తి ♦ నర్థితోడ
నిండువేడుకఁ జూచి వ♦ర్ణించుచుండు. 89

క. ప్రకటముగఁ గమలభవసృష్టికిఁ గారణమి మ్మహాత్ముఁ ♦ డేయనుచును ను
త్సుకులై తన్మూర్తిని దప్పక చూచిరి గాదె తత్స♦భాజను లెల్లన్.

వ. మఱియు శాంతోగ్రరూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ [2]నిపీడ్యమానమానసుం డయ్యు [3]ననుకంపాయత్త చిత్తుండై వర్తించు పరాపరుండును బ్రకృతి కార్యంబైన మహత్తత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును [4]దారువులవలన ననలంబు దోఁచుచందంబున జననంబు నొందుచుండు నట్టి సరోజనాభుని హాస రాస లీలానురాగ [5]విలోకన ప్రతిలబ్ధ మానలైన గోపకామినులు [6]దన్మూర్తి దర్శనానుషక్తమనీషలం గలిగి వర్తించి రదియునుం గాక. 91

చ. దివిజుల కోర్కెఁ దీర్ప వసు♦దేవుని యింట జనించి కంస దా
నవుఁడు వధించు నన్భయము ♦ నం జని నందునియింట నుంటకున్
[7]యవనజరాసుతాదులకు♦ నాజి నెదుర్పడలేక సజ్జన
స్తవ మధురాపురిన్ విడిచి♦ దాఁగుటకున్ మదిఁ జింత నొందుదున్

వ. అదియునుం గాక. 93

సీ. కడఁగి పెక్కిడుములఁ ♦ గుడుచుచుఁ జిత్తముల్
గలఁగఁగ బంధనా ♦ గారములను
[8]వనరిన దేవకీ ♦ వసుదేవులను డాయఁ
జనుదెంచి భక్తి వం ♦ దన మొనర్చి

---

1 యమతనూభవుఁడు = ధర్మరాజు 2 నిపీడ్యమాన = పీడింపఁబడిన 3 అనుకంపాయత్తచిత్తుఁడు = దయతోఁ గూడుకొనిన మనస్సుకలవాఁడు 4 దారువులు = కొయ్యలు 5 విలోకనప్రతిలబ్ధమాన = చూచుటవలన పొందిన 6 తన్మూర్తి...... మనీషలన్ = ఆమూర్తిని చూచుటవలన తగులుకొనిన బుద్ధులతో 7 యవనజరాసుతాదులు = కాలయవనుఁడు జరాసంధుఁడు మొదలగువారు 8 వనరిన = దుఃఖించిన.

తలిదండ్రులార యేఁ గలుగంగ మీరలు
కనుచే [1]నలజడిఁ గ్రాఁగుచుండఁ
గడఁగి శత్రునిఁ జంపఁగాలేక చూచుచు
నున్న నాతప్పుఁ బ్రసన్ను లగుచుఁ
తే. గావుఁ డని యానతిచ్చిన దేవదేవు
[2]నద్భుతావహమధురవాక్యములఁ దలఁచి
తలఁచి నాచిత్తమునఁ బెద్ద గలఁగుచుందుఁ,
[3]బృథులపాతకభూమిభృ ద్భిదుర! విదుర! 94

క. విమలమతిఁ దలప నెవ్వని, [4]బొమముడిమాత్రమున నిఖిలభూదేవీభా
రము వాయునట్టి హరిపద, కమలమరందంబు గ్రోలుఘనుఁడెవ్వాఁడో. 95

క. మందప్రజ్ఞుఁడనై గోవిందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా
నందుని నందతనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్.

చ. అదియునుగాక మీరు నృపు లందఱుఁ జూడఁగ ధర్మసూతి పెం
పొదవిన రాజసూయ[5]సవనోత్సవమందును జన్మ మాదిగాఁ
బదపడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లెట్టి ద
ట్టి దని యెఱుంగ నోపని [6]కడింది పదంబును నొందెనే కదా. 97

చ. కురునృపపాండునందను లకుంఠిత కేళిఁ జమూసమేతులై
యరిది రణోర్వి నెవ్వనిముఖాంబురుహామృత మాత్మలోచనో
త్కరములఁ గ్రోలి [7]పార్థవిశిఖప్రకరక్షత పూతగాత్రులై
గురుతర మోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో తుదిన్. 98

సీ. అట్టిసరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు,
సుభగుండు త్రైలోక్యసుందరుండు

---

1 అలజడి = కష్టము; 2 అద్భుతావహము = అద్భుతము కలుగఁజేయునది; 3 పృథుల.........భిదుర = గొప్ప పాపములనెడి పర్వతములకు వజ్రాయుధము వంటివాఁడా! 4 బొమముడి = కోపమువలన వేయు కనుబొమల ముడి. 5 సవనము = యజ్ఞము; 6 కడింది = అధికము. 7 పార్థ.........గాత్రులై = అర్జునుని బాణ సమూహముచే గొట్టఁబడిన పవిత్రశరీరులై.

గమనీయ[1]సాగరకన్యకాకుచకుంకు
మాంకిత విపులబాహాంతరుండు
[2]సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్త
పద్మరాగారుణపాదపీఠుఁ
డజుఁ డనంతుఁడు సమానాధికవిరహితుం
డిద్ధమూర్తి త్రియాధీశ్వరుండు

తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య
రుచిరసింహాసనమున గూర్చుండఁ బెట్టి
భృత్యభావంబు నొంది సంప్రీతి నతని
పనుపు సేయుట కెపుడు నా మనము గుందు. 99

వ. అని వెండియు నిట్లనియె; ననఘా, పరాత్పరుండును యోగీశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమభాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబుగాదు తన్ను హరియింపం దలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతనయైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరానిపదంబుఁ గారుణ్యాయత్తచిత్తుండై యొసంగె నని నిజపదధ్యానపరాయణు లగువారల ననుసరించి సేవించుట సెప్ప నేల యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె; భక్తవత్సలుండును గారుణ్యజలనిధియు నై భాగవతజనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాసలోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱం గెఱింగింపు మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె. 100

---

1 సాగర........బాహాంతరుఁడు = సముద్రుని కుమార్తెయైన లక్ష్మీదేవి యొక్క కుచమందుఁగల కుంకుమముయొక్క గుర్తుగల విశాలవక్షస్థలము కలవాఁడైన విష్ణువు; 2 సకల........పీఠుఁడు = సమస్త దిక్పాలకులయొక్క ప్రకాశించుచున్న కిరీటములందున్న పద్మరాగమణులచేత నెఱ్ఱగాఁ జేయఁబడిన పాదపీఠముకలవాఁడు, అనఁగా దిక్పాలకులు తమ శిరములను విష్ణుపాదములఁ జేర్చి మ్రొక్కుచుందురని భావము.

మ. దనుజానీక మనేకవారములు దోర్దర్పంబు సంధిల్లఁగా
[1]వినతాసూను భుజావరోహుఁ డగు నవ్విష్ణుఁ [2]సునాభాస్త్రుఁ డా
[3]రనిలోఁ బోర్కొని పోకు పోకు హరి దైత్యారాతియంచుం దదా
ననముం జూచుచుఁ గూలి మోక్షపదము న్ప్రాపింతు రత్యున్నతిన్. 101

క. ధీరజనోత్తమ నవసిత సారసలోచనుఁడు గృష్ణుజననంబును ద
చ్చారిత్రము నెఱిఁగింతు ను, దారత నీవిపుడు వినుము తద్విధమెల్లన్. 102

చ. ధరణిభరంబు వాపుటకుఁ దామరసాసనుప్రార్థనన్ రమా
వరుఁ డల కంసబంధననివాసమునన్ వసుదేవదేవకీ
వరులకు నుద్భవింప బలవంతుఁడు గంసుఁడు హింస సేయు న
న్నెఱపున నర్ధరాత్రి సుతునింగొని యవ్వసుదేవుఁ డిమ్ములన్. 103

క. నందునిమందకుఁ జని త
త్సుందరితల్పమునఁ బరులు సూడకయుండన్
నందనుని నునిచి యానక
దుందుభి మరలంగ నేఁగెఁ దొల్లిటిపురికిన్. 104

క. హరి యేకాదశసంవ, త్సరములు నందవ్రజమున దను హరి యని యె
వ్వరు నెఱుఁగకుండ న[4]హల, ధరుతోఁ గ్రీడించుచుండె దద్దయుఁబ్రీతిన్.

క. [5]గోపాలవరులకైనను, [6]నాపోవఁగ దన సమంచితాకార మొగిం
జూపని శ్రీపతి వేడుక, గోపాలురఁగూడి కాచె గోవత్సములన్. 106

వ. అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు దోడిగోపాల
బాలురకుం జూపందలంచి. 107

చ. వరయమునానదీసలిలవర్ధిత [7]సౌరభయుక్తపుష్ప [8]మే
దురమకరందపాన పరితుష్టమధువ్రతయూథమాధవీ
కురవకకుందచందన[9]నికుంజములందు [10]మయూరశారికా
[11]పరభృతరాజకీరమృదుభాషలభంగిఁ జెలంగి పల్కుచున్. 108

---

1 వినతాసూను.........రోహుఁడు = వినతయొక్క కుమారుఁడైన గరుత్మంతునియొక్క భుజములపై నెక్కువాఁడు, (విష్ణువు;) 2 సునాభాస్త్రుఁడు = సుదర్శనాయుధుఁడు; 3 అనిలోన్ = యుద్ధములో. 4 హలధరుతోన్ = బలరామునితో. 5 గోపాల...కైనను = స్వర్గపాల శ్రేష్ఠులకైనను. 6 ఆపోవఁగ = తృప్తిపడఁగ 7 సౌరభయుక్త = సువాసనతోఁగూడుకొన్న. 8 మేదుర = నున్ననగు. 9 నికుంజములు = పొదరిండ్లు. 10 మయూరము = నెమలి. 11 పరభృతము = కోయిల.

ఉ. శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరముఁ బోలి లీలఁ గొ
మారదశన్ రమావిమల మందిరముం బురుడించు గోతతిన్
వారక మేపుచుండెఁ దన[1]వంశరవస్ఫుట మాధురీసుధా
సారముచేత గోపజనసంఘములన్ ముదమందఁ జేయుచున్. 109

వ. మఱియును. 110

మ. చిర కేళీరతి బాలకుల్ [2]దృణములన్ సింహాదిరూపంబులం
గర మొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునన్
గరుణాతీతులఁ గామరూపులగు నక్కంస [3]ప్రయుక్తక్షపా
చరులం గృష్ణుఁడు [4]సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్. 111

చ. వరయమునానదీజల నివాస [5]మహోరగ విస్తృతాస్యవి
స్ఫురిత విషానలప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో
త్కరములనెల్లఁ గాచి [6]భుజగప్రవరున్ వెడలంగఁ దోలి [7]త
త్సరిదమలాంబుపానమున సంతస మందఁగఁ జేసె గోతతిన్. 112

మ. దివిజాధీశుగుఱించి వానకొఱకై దీపింప నందాది [8]వ
ల్లవు లేఁటేఁట సమానసంపదల నుల్లాసంబునం జేయు ను
త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతి నొందన్ శచీ
ధవుగర్వం బడఁపంగ నవ్యయముగాఁ దాఁ జేసె గోయాగమున్. 113

చ. [9]హరిహయుఁడంత రోషవివశావిలమానసుఁడై సరోరుహో
దరుమహిమం బెఱుంగక మదం బడరంగ వలాహకాదిభీ
కర[10]ఘనపంక్తిఁ బంపిన నఖండ శిలామయభూరివర్షముల్
గురిసె సమానగర్జనల గోకుల మాకుల మౌచుఁ గుందఁగన్. 114

---

1 వంశరవము = వేణునాదము. 2 తృణము=గడ్డి. 3 ప్రయుక్త=ప్రయోగింపఁబడిన, క్షపాచరులు = రాత్రియందు చరించువారు, (రాక్షసులు.) 4 సంగరస్థలము = యుద్ధభూమి. 5 మహోరగ.........సోఁకునన్ = పెద్ద పాముయొక్క విశాలమైన నోటియందు ప్రకాశించుచున్న విషమను నగ్నియొక్క కాంతులతాఁకున. 6 భుజగప్రవరున్ = కాళింగియను సర్పమును 7 తత్సరిదమలాంబువు = ఆయమునానదియొక్క స్వచ్ఛమైన జలము. 8 వల్లవుండు=గొల్లవాఁడు. 9 హరిహయుఁడు= ఇంద్రుఁడు. 10 ఘనపంక్తి = మేఘపంక్తి.

ఉ. ఆతఱి మంద [1]గొందలము నందఁగ వల్లవు లెల్లఁ గృష్ణ! యీ
[2]చేతను లెల్ల నిట్టి [3]జడిఁ జిందఱవందఱ లై కలంగుచుం
[4]గాతరు లైరి నీవు కృపఁ గావుము కావు మనాథనాథ! ని
ర్ధూతకళంక! భక్తపరితోషణభూషణ! పాపశోషణా. 115

మ. అని యిబ్భంగి విపన్ను లై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స
జ్జనవర్ధిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుఁ డై దేవతా
జను [5]లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్త్రంబుఁగాఁ దాల్చె బో
రన గోవర్ధనశైలముం దటచరద్రమ్యామరీజాలమున్. 116

వ. వెండియు.

సీ. శరదాగమారంభ సంపూర్ణపూర్ణిమా
[6]చంద్రసాంద్రాతపోజ్జ్వలిత మగుచు
వెలయు బృందాటవీ వీథియం దొకనాఁడు
రాసకేళీమహోల్లాసుఁ డగుచు
రుచిరసౌభాగ్యతారుణ్యమనోరమ
స్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి దనర
సలలితముఖచంద్రచంద్రికల్ గోపికా
నయనోత్పలముల కానంద మొసఁగ

తే. భవ్యచాతుర్యభంగిఁ [7]ద్రిభంగి యగుచు
నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁ బూరించు వరమురళీనినాద
మర్థి [8]వీతేర విని మోహితాత్మ లగుచు. 118

చ. పతులు మఱందులుం సుతులుఁ బావలు నత్తలు మామలుం సము
న్నతి వల దన్న మానక మనంబునఁ గృష్ణపదాబ్జసేవనా
న్వితరతి గోపకామినులు వేచను దేర దయాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీ [9]నవపుష్పచాపుఁ డై. 119

---

1 కొందలము = క్షోభము. 2 చేతనులు=ప్రాణులు. 3 జడి=వాన. 4 కాతరులు = భయపడినవారు. 5 అగ్గింపన్ = స్తుతింపఁగా. 6 చంద్రసాంద్రాతపోజ్జ్వలితము = చంద్రునియొక్క దట్టమైన వెన్నెలచేఁ బ్రకాశించుచున్నది. 7 త్రిభంగి= కాలుమీద కాలువేసికొని నిలబడునొకవిధము. 8 వీతేరన్ = రాఁగ. 9 నవపుష్ప చాపుఁడు = క్రొత్తమన్మథుఁడు.

ఉ. రాముఁడు దాను గూడి మధురాపురికిం జని యందు వైభవో
ద్దామనృపాసనంబున ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు
ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లిని దండ్రి నంచిత
శ్రీమహితాత్ములై తనరఁ జేసె [1]సరోరుహనాభుఁ డున్నతిన్. 120

మ. నలు వొప్పంగ [2]షడంగయుక్తమహితామ్నాయంబుఁ [3]జౌషష్టివి
ద్యలు సాందీపునిచే నెఱింగెఁ జెలు వొందన్ విన్నమాత్రంబులోఁ
పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గలరే [4]లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్. 121

ఉ. మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొంది పోయి యా
[5]పంచజనోదరస్థుఁ డగు బాలకు దేశికునందనుం బ్రభో
దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తి న
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్. 122

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డన నొప్పు భీష్మకు
వరసుతామణి నవవారిజాక్షిఁ
బద్మాసమాన రూపశ్రీవిభాసితఁ
గమనీయ భూషణఁ గంబుకంఠిఁ
జతురస్వయంవరోత్సవసమాగతచైద్య
సాల్వ మాగధ ముఖ్య జనవరేణ్య
నికర[6]సమావృతఁ బ్రకటసచ్చారిత్రి
రుక్మిణి నసమాన [7]రుక్మకాంతి

తే. సమరగుప్తామృతంబు విహంగవిభుఁడు
గొనిన కైవడి మనుజేంద్రకోటిఁ ద్రోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ
దెచ్చి వరియించె నతని నుతింపవశమె. 123

---

1 సరోరుహనాభుఁడు=నాభియందు కమలముకలవాఁడు (విష్ణువు.) 2 షడంగయుక్తామ్నాయము = ఆఱంగములతోఁగూడుకొనిన వేదము, ఋగ్యజుస్సామాథర్వణవేదములు నాలుగు-శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పమను వేదాంగము లాఱు. 3 చౌషష్టివిద్యలు=అఱువదినాలుగు విద్యలు. 4 లోకవిడంబనార్థము = లోకము ననుకరించుటకొఱకు. 5 పంచజనుఁడు=సాందీపునికుమారుని భక్షించినరాక్షసుఁడు. 6 సమావృతము=చుట్టుకొనఁబడినది. 7 రుక్మకాంతిన్ = బంగారుయొక్క కాంతివంటి కాంతి కలదానిని.

చ. పరువడిఁ బట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దద్బల
స్ఫురణ సహింపఁ జాలక నృపుల్ దలపడ్డ జయించి [1]నగ్నజి
ద్ధరణిపునందనన్ వికచతామరసాక్షిఁ బ్రమోదియై స్వయం
వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్. 124

మ. ప్రతివీరక్షయకారి నాబరఁగి సత్రాజిత్తనూజాహృదీ
ప్సితముం దీర్పఁ దలంచి [2]నాకమునకుం బెంపారఁగా నేఁగి వ
ర్ణితశౌర్యోన్నతిఁ బారిజాత మిలకు న్లీలాగతిం దెచ్చె ను
ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁడన నేతన్మాత్రుఁడే చూడఁగన్. 125

సీ. మానితాఖిలజగన్మయదేహమునఁ బొల్చు
ధరణిదేవికిఁ బ్రియతనయుఁ డైన
నరకదానవుని సునాభాఖ్యుఁ జెన్నొందు
ఘనచక్రధారా [3]విఖండితోత్త
మాంగునిఁ జేయ నయ్యవనీలలామంబు
వేఁడినఁ దత్పుత్రు విమలరాజ్య
పదమున నిల్పి లోపలిమందిరంబులఁ
జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి

తే. నట్టికన్యలు నూఱుఁ బదాఱువేలు
నార్తబాంధవుఁ డైన పద్మాక్షుఁ జూచి
హర్షబాష్పాంబుధారా ప్రవర్ష మొదవఁ
బంచశరబాణనిర్భిన్నభావ లగుచు.

చ. లలిత తదీయసుందరవిలాసవిమోహిత లైనవారి నిం
పొలసినగోర్కెఁ దీర్చుటకు నొక్కముహూర్తమునన్ వరించి క
న్యల లలితా[4]వరోధభవనంబుల నందఱ కన్నిరూపులై
కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 127

క. చతురత తోనం దొక్కొక, యతివకుఁ బదు రేసిసుతుల నాత్మసముల ను
న్నతభుజశక్తులఁ గాంచెను, వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్.

---

1. నగ్నజిద్ధరణిపుసుత = నగ్నజిత్తుఁడను కోసలరాజు. కుమార్తెయైన నాగ్నజితి.
2 నాకము = స్వర్గము. 3 విఖండితోత్తమాంగుఁడు నరకఁబడిన శిరస్సుకలవాఁడు.
4 అవరోధభవనములు = అంతఃపురములు.

సీ. మధురాపురముఁ జతుర్విధ [1]బలౌఘములతో
నావరించిన కాల యవన సాల్వ
మగధభూపాలాది మనుజేంద్ర లోకంబు
సైన్యయుక్తముగాఁగ సంహరించి
తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన
భీమపార్థులకు నుద్దామవిజయ
మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి
బాణ శంబర ముర పల్వలాది
తే. దనుజనాయక సేనావితానములను
హలధరాదిసమేతుఁడై హతులఁ జేసె
దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర
భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి. 129

వ. వెండియుం గృష్ణుండు గౌరవ పాండవ భండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్సర్యోత్సాహసమేతులై సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప ననన్యసామాన్యంబు లయిన శంఖ భేరీ ప్రముఖతూర్య ఘోషంబులు నింగి ముట్టఁగఁ దురంగమ[2]రింఖా సముద్ధూతధూళి పటల[3]పరిచ్ఛన్న భానుమండలంబునుం గాఁ జను దెంచి కురుక్షేత్రంబున [4]మోహరించిన నుభయపక్షబలంబులం దుమహీక్షి నిఖిలరాజ్యవైభవ మదోన్మత్తుండయిన సుయోధనుండు నిఖిలరాజసమక్షంబునఁ గర్ణ శకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు సేసిన దోషంబునం జేసి సంగరరంగంబున భీము గదాఘాతంబునం దొడలు విఱిగి పుడమిం బడి [5]గతాయుశ్శ్రీవిభవుండై యుండఁ జూచినం గదా పరితుష్టచిత్తుండ నగుదు నని యపరిమిత బాహుబలోత్సాహు లైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నఖిల ధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి మఱియు స్వసమానబలు లయిన యదు

1 బలౌఘము=బలసముదాయము. 2 రింఖా=గిట్ట. 3 పరిచ్ఛన్నము= కప్పబడిన. 4 మోహరించిన = ఎదిరించిన. 5 గతాయుశ్శ్రీవిభవుఁడు = పోయినప్రాణములు, సంపదలు కలవాఁడు.

వీరుల జయింప నెంతవారలకైనం దీరదు. మధుపానమద [1]విఘూర్ణిత తామ్రవిలోచనులై వర్తించు యాదవుల కన్యోన్య వైరంబులు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై తన్నుం గలసినంగాని భూభారం బుడుగదని చిత్తంబునం దలంచినంత ధర్మనందనుచే నిస్సపత్నంబగు రాజ్యంబు పూజ్యంబుగాం జేయించుచు మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు బంధుమిత్రులకెల్లం బరితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి యభిమన్యువలన నుత్తరయందు గర్భంబు నిలిపి [2]గురుతనయప్రయుక్తమహితబ్రహ్మాస్త్రపాతంబునం దద్గర్భ[3]దళనంబుగాకుండ నర్భకుని రక్షించి నిజపదారవిందసేవారతుండైన ధర్మసుతుచేం గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం [4]దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు. 130

సీ. వలనొప్ప లౌకిక వైదికమార్గముల్
నడుపుచు ద్వారకానగరమందు
[5]నవిదితాత్మీయమాయాప్రభావమున [6]ని
స్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ
జెంది కామంబులచేత విమోహితుం
డై సుఖించుచు ముదితాత్ముఁడగుచు
నంచిత [7]స్నిగ్ధస్మితావలోకముల సు
ధాపరిపూర్ణ సల్లాపములను

తే. శ్రీనికేతన మైనశరీరమునను
బాండునందన యదుకుల ప్రకరములను
లీలఁ గారుణ్యమొలయఁ బాలించుచుండె
నార్తరక్షా [8]చణుండు నారాయణుండు.

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రిక నొప్పు
రమణీయ శారదరాత్రులందు

1 విఘూర్ణిత.......లోచనులు = తిరుగుడుపడిన యెఱ్ఱని నేత్రములు కలవారు. 2 గురుతనయుఁడు = అశ్వత్థామ. 3 దళనము = చీల్చుట. 4 తురంగమేధము = అశ్వమేధయాగము, 5 అవిదితము = స్పష్టముకానిది. 6 నిస్సంగుఁడు = కూడికలేనివాఁడు. 7 స్నిగ్ధస్మితము = దట్టమైన చిఱునవ్వు. 8 చణుఁడు = సమర్థుఁడు.

సలలిత కాంచనస్తంభ [1]సౌధోపరి
[2]చంద్రకాంతోపల స్థలములందు
మహితశి[3]కరేణుకా మధ్యదిగ్గజముల
గతిని [4]సౌదామినీలతలనడిమి
నీలమేఘంబుల లీల ముక్తాఫల
లలితమధ్యస్థ నీలములభాతి
తే. సతతయౌవనసుందరీ యుతవిహారుఁ
డగుచు సతులెందఱందఱ కన్నిరూప
ములను గ్రీడించెఁ [5]బెక్కబ్దములు సెలంగి
నందనందనుఁ డభినవానందలీల. 132

వ. అంతనొక్కనాఁడు. 133

చ. మునివరు లేగుదేర యదుముఖ్యులు గొందఱుగూడి ముట్టఁబ
ల్కిన గన లొంది వారు [6]దమకించి శపించినఁ గొన్నిమాసముల్
చనునెడ దైవయోగమున జాతరఁ బో సమకట్టి వేడుకల్
మనములఁ దొంగలింప గరిమన్ నిజ[7]యానము లెక్కి యాదవుల్.

ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో
దారత నందు దేవమునితర్పణముల్ పితృతర్పణంబులున్
వారనిభక్తిఁ జేసి నవ [8]వత్సలతోఁ బాలుపారు గోవులన్
భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్. 135

క. అజిన పట రత్న కంబళ, రజత మహారజత తిల ధరా వరకన్యా
గజ తురగ రథములను సద్ద్విజకోటికి నిచ్చెఁ బెంపు దీపింపన్.

వ. ఇట్లు సఫలంబు లయిన భూదానంబు మొదలుగాఁ గలదానంబు
[9]లనూనంబులుగా భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ. 137

తే. ఎసఁగుమోదంబు సంధిల్ల నిష్టమైన
రసికమృదులాన్న మర్థిఁ బారణలు సేసి

---

1 సౌధోపరి = మేడపైభాగమున. 2 చంద్రకాంతోపలస్థలములు = చంద్రకాంతపు రాళ్ళతోఁ గట్టఁబడిన ప్రదేశములందు. 3 కరేణువు = ఆడయేనుఁగు. 4 సౌదామినీలత = మెఱుపుతీగ. 5 పెక్కబ్దములు = చాల సేండ్లు. 6 తమకించి = పూని. 7 యానములు = వాహనములు. 8 వత్సలు = దూడలు. 9 అనూనముగ = తక్కువ కాకుండఁగ.

మంజులాసవరస[1]పాన మత్తులగుచుఁ
గడఁగి యన్యోన్య హాస్యవాక్యములఁ గలఁగి. 138

వ. ఇట్లు దమలోన మదిరాపానమదవిఘూర్ణిత తామ్రలోచను లయి మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్త యాదవులును వేణుజాతానలంబునఁ దద్వంశపరంపరలు దహనంబునొందుచందంబునం బొలిసి రది యంతయుం గనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు. 139

క. చతురతతో నిజమాయా, గతిఁజూచి లసద్విలోల కల్లోలసమం
చిత విమల కమల సార, స్వతజలముల విహితవిధులు సలిపినవాఁడై.

క. ఒకవృక్షమూలతలమున, నకలంకగుణాభిరాముఁ డాసీనుండై
యకుటిలమతి బదరీవని, కేఁక నీవరుగుమని [2]మొఱఁగి యేఁగిన నేనున్.

క. క్రమమున నిజకుల సంహా,రము సేయఁగడంగు టెఱిఁగి రమణీయ శ్రీ
రమణుచరణాబ్జయుగవిర,హమునకుమదినోర్వలేక [3]యనుగమనుఁడనై.

క. హరినరయుచుఁ జనిచనియొక, తరుమూలతలంబునందుఁ దన దేహరుచుల్
వరఁగఁగనున్న మహాత్ముని, బరునిఁ [4]బ్రపన్నార్తిహారుని భక్తవిధేయున్.

వ. మఱియును. 144

సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వ
గుణగరిష్ఠుని రజోగుణవిహీను
సురుచిరద్వారకాపుర సమాశ్రయు ననా
శ్రయు నీలనీరదశ్యామవర్ణు
దళదరవిందసుందరపత్త్రనేత్రు ల
క్ష్మీయుతుఁ బ్రీతకౌశేయవాసు
విలసిత[5]వామాంక విన్యస్తదక్షిణ
చరణారవిందు శశ్వత్ప్రకాశు

తే. ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ
జెన్ను గలలేఁతరావిపై వెన్ను మోపి

---

1 ఆసవరసము = కల్లు. 2 మొఱఁగి = పొంచి, దాగి. 3 అనుగమనుఁడు = అనుసరించి పోయినవాఁడు, 4 ప్రపన్నా......హారుఁడు = శరణాగతులైనవారి యాపదలఁ దీసివేయువాఁడు. 5 వామాంక......విందు = ఎడమతొడమీఁద నుంచిన కుడిపాదకమలముకల (పద్మాసనము)వాఁడు.

యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న
తండ్రి నానందపరిపూర్ణు దనుజహరుని. 145

మ. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి నాశ్రితరక్షకుం
గంటి యోగిజనంబుడెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము
క్కంటికిం గనరానియొక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే
కొంటి ముక్తివిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగన్. 146

వ. అయ్యవసరంబునం బరమభాగవతోత్తముండును మునిజనసత్తముం
డును ద్వైపాయనసఖుండును బరమతపోధనుండును [1] నఘశూన్యుం
డును నఖిలజనమాన్యుండును బుధజన విధేయుండును నగుమైత్రే
యుండు దీర్ఘాచరణంబు సేయుచుం జనిచని. 147

మ. కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాత[2]వర్ధిష్ణు శో
భనభాస్వత్పరిపూర్ణ యౌవనకళా [3]భ్రాజిష్ణు యోగీంద్రహృ
ద్వనజాతైక [4]చరిష్ణుఁ గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు [5]నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు [6]రోచిష్ణునిన్. 148

క. తదనంతరంబ హరిఁ దన
హృదయాబ్జమునందు ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు నానత
వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా. 149

వ. అంత దగ్గఱ నేతెంచియున్న మైత్రేయుండు వినుచునుండ దర
హాసచంద్రికాసుందరవదనారవిందుండును నానందసుధా [7]నిష్యంద
[8]కందళితహృదయుండును భక్తానురక్తదయాసక్తవిలోకనుండునునగు
పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చెఁ బూర్వ
భవంబున వసుబ్రహ్మలు సేయుసత్త్రయాగంబున వసువై భవదీయ
హృదయంబున నితరపదార్థంబులుగోరక మదీయపాదారవింద సేవం

---

1 అఘశూన్యుఁడు = పాపములు లేనివాఁడు.

2 వర్ధిష్ణువు = వృద్ధిపొందించువాఁడు. 3 భ్రాజిష్ణువు = ప్రకాశించువాఁడు. 4 చరిష్ణువు = అంతటఁ జరించువాఁడు. 5 నిలింపాహితజిష్ణుఁడు = దేవతలకు విరోధులగు రాక్షసులను జయించువాఁడు. 6 రోచిష్ణున్ = కాంతికలవానిని. 7 నిష్యంద = ప్రవహించునట్టి. 8 కందళితము = వికసించినది.

గాంక్షించితివి గావునం దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గనుచుండుదు నాత్మారాముండ నైన నన్ను నెవ్వరేనియు సదసద్వివేకులై[1] యెఱుంగంజాలరు. వారలకు నేను నగోచరుండనై యుండుదు మత్పరిగ్రహంబుగల నీకు నీజన్మంబ కాని పునర్భవంబు నొందకుండుటకు భవదీయపూర్వజన్మకృత సుకృత విశేషంబుకతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవింద సందర్శనంబు కలిగె నదియునుంగాక పద్మకల్పంబునందు మన్నాభిపద్మమధ్య [2]నిషణ్ణుండయిన పద్మసంభవునకు జన్మమరణాది [3]సంసృతినివర్తకంబును [4]నవిరతానశ్వర సౌఖ్యప్రవర్తకంబునునగు మన్మహాత్మ్యంబుఁ దెలియఁజేయు సద్దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతునని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమానసరసాలాపంబులు గర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన [5]రోమాంచకంచుకితశరీరుండును నానందబాష్ప ధారా[6]సిక్త కపోలుండును బరితోషసాగరాంతర్నిమగ్నమానసుండును నయి యంజలిపుటంబు [7]నిటలతటంబున ఘటియించి యిట్లనియె. 150

క. పురుషోత్తమ నీపదసర, సిరుహధ్యానామృతాభిషేకస్ఫురణం
గర మొప్పిననాచిత్తమి, తరవస్తువులందు వాంఛఁదగులునె యెందుఁ.

చ. జననము లేని నీవు భవసంగతినొందుట కేమి కారణం
బనియును గాలసంహరుఁడవై జగముల్ వెలయించు నీవు పా
యనిరిపుభీతిమై [8]పరిదుదంచితదుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ నామనమునందుఁ దలంతు సరోజలోచనా. 152

వ. అదియునుం గాక. 153

క. శ్రీరమణీశ్వర నీ వా, త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీకోటిం
గోరి రమించితివనియును, వారక యేఁదలఁతు భక్తవత్సల కృష్ణా.

1 సదసద్వివేకులై = మంచి చెడులఁగూర్చిన జ్ఞానముకలవారై. 2 నిషణ్ణుఁడు= ఉన్నవాఁడు. 3. సంసృతి = సంసారము. 4. అవిరతానశ్వరము = ఎప్పుడునశింపనిది. 5. రోమాంచ కంచుకిత =గగుర్పాటుచేతఁ (కవచముగ చేయఁగఁబడిన) గప్పఁబడిన 6. సిక్త = తడుపఁబడిన, 7 నిటలము = ఫాలము, 8 పరిదుదంచితము = ప్రవాహముతో నొప్పినది.

క. పరతత్త్వజ్ఞులు గరుణాకర నిను సంసారివనుచుఁ గడఁకఁ దలంపరె
అరసి ననుఁ గాచుటెల్లను, గరమరుదు దలంచిచూడఁ గమలాధీశా.

వ. దేవా నీ [1]వఖండిత విజ్ఞానరూపాంతఃకరణుండవయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తునిచందంబున విమోహికై వడిం బ్రవర్తించుచు నెందేని నొదిఁగియుండుటం దలంచి నాడెందంబు గుందుచుండు నరవిందలోచన సురవందిత ముకుంద యిందిరాసుందరీరమణ సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము. భవదీయ శాసనంబు ధరియించి [2]భూరిసంసారపారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుండును బ్రసన్న పారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగించిన. 156

క. సరసిజలోచనకరుణా, [3]పరిలబ్ధజ్ఞానకలితభావుఁడ నగుటం
[4]బరతత్త్వవేదినై త,చ్చరణసరోజముల కెరఁగి సమ్మతితోడన్. 157

క. హరిపదజలరుహవిరహాతురతన్ [5]దుర్దాంతదుఃఖతోయధిఁ గడవన్
[6]వెర వేది తిరుగవలసెను, [7]సరసిజభవకల్పవిలయసమయముదాఁకన్.

వ. ఇట్లు దిరుగుచు. 159

మ. నరనారాయణతాపసాశ్రమపదాన్నత్యంబునం బొల్చు భా
సురమందార రసాల సాల వకుళాశోకామ్ర పున్నాగ కే
సర జంబీర కదంబ నింబ కుటజాశ్వత్థస్ఫురన్మల్లి కా
కరవీర [8]క్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్. 160

క. చను చున్నవాఁడ నని ప
ల్కినపలుకుల [9]నులికి కళవళించుచు విదురుం
డనుపమశో[10]కార్ణవమున
మునిఁగియు నిజయోగసత్త్వమునఁ దరియించెన్. 161

---

1 అఖండితము = గొప్పది. 2 భూరి......తరణంబు = గొప్పసంసార మను సముద్రమును దాటుట. 3 పరిలబ్ధ=సంపాదించిన. 4 పరతత్త్వవేదినై =సత్యమును తెలిసికొనినవాఁడనై. 5 దుర్దాంతము = జయింపరానిది. 6 వెరవేది = ఉపాయము లేక. 7 సరసిజ........సమయము = బ్రహ్మకల్పముయొక్క నాశనకాలము. 8 క్షితిజము=చెట్టు. 9 ఉలికి = భయపడి. 10 అర్ణవము=సముద్రము.

వ. ఇట్లు విదురుండు శోక[1]పావకునిం దనవివేకజలంబుల నార్చి యుద్ధవుని కిట్లనియె. 162

మ. అనఘా యుద్ధవ నీకుఁ గృష్ణుఁ [2]డసురేంద్రారాతి మన్నించి చె
ప్పినయధ్యాత్మరహస్యతత్త్వవిమలాభిజ్ఞానసారంబు బో
రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్
విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్వింబ్రోవరే వెండియున్. 163

క. భగవద్భక్తులు సుజనులు, [3]దగ వెఱిఁగి పరోపకార తాత్పర్య వివే
కగరిష్ఠులై చరింతురు, జగతిం బొగడొంది వృష్ణిసత్తమ యెందున్.

క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు
రునకిట్లను ననఘ మునివరుఁడు సాక్షాద్వి
ష్ణు [4]నిభుండగు మైత్రేయుఁడు
దనమనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్. 165

క. హరిమురభేదిఁ బరాపరుఁ, గరుణాకరుఁ దలఁచునట్టిఘనుఁడమ్మునికుం
జకుకడ కేఁగిన నాతఁడు, గర మర్థిం దెలుపు [5]సాత్త్వికజ్ఞానంబున్.

వ. అని యుద్ధవుండు విదురుంగూడి చనిచని. 167

క. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు [6]హల్లకఫుల్లపద్మని
ష్యందమరందపానవిలసన్మదభృంగఁ జలత్తరంగ మా
కందలవంగలుంగలతికాచయ [7]సంగ సురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ యమునన్ [8]భవభంగ శుభాంగ నర్మిలిన్.

క. కనిడాయనేఁగి మోదం,బునఁద[9]త్సరిదమల [10]పులినభూములఁ దగనా
దినశేషము నివసించెను, వనజోదరపాదపద్మవశమానసుఁడై. 169

మఱునాఁడు[11]రేపకడభా,సురపుణ్యుఁడుఘనుఁడుమధు[12]నిషూదనచరణ
స్మరణక్రీడాకలితుఁడు,దరియించెం[13]గలుషగహనదహనన్ యమునన్.

---

1 పావకుఁడు = అగ్ని. 2 అసురేంద్రారాతి = రాక్షసశ్రేష్ఠులకు శత్రువు, విష్ణువు. 3 తగవు = ధర్మము. 4 నిభుఁడు = సమానుఁడు. 5 సాత్త్వికజ్ఞానము = సత్త్వగుణప్రధానమైన జ్ఞానము. 6 హల్లకము=నల్లకలువ. 7 సంగః = కూడుకొనిన దానిని. 8 భవభంగన్=జన్మమును తీసివేయుదానిని. 9 సరిత్=నది. 10 పులినము = ఇసుకతిన్నె. 11 రేపకడ = ఉదయము. 12 నిషూదనుఁడు = చంపినవాఁడు. 13 కలుషగహనదహనన్ = పాపము లను నరణ్యమును కాల్చివేయునది.

వ. ఇట్లుద్ధవుండు యమునానది [1] నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె ననిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె. 171

క. శౌరియు నతిరథవరులు మ,హారథసమరథులు యదుబలాధిపు లెల్లం
బోరి మృతిఁబొంద నుద్ధవుఁ, డేరీతిం బ్రదికెనాకు నెఱిఁగింపు తగన్.

సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ
డిట్లను మున్ను [2]లోకేశుచేత
సంప్రార్థితుం డైన జలరుహనాభుండు
వసుమతిపై యదువంశమందు
నుదయించి తనుఁ దాన మదిలోనఁ జింతించి
తెలి వొంది యాత్మీయ కులవినాశ
మొనరించి తాను బంచోపనిషణ్మయ
మగుదివ్యదేహంబునందుఁ జెందఁ

తే. దలఁచి విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁదఁ
దాల్చి జనకోటి కెఱిఁగింపఁదగిన ధీరుఁ
డుద్ధవుఁడు దక్క నితరు లేనోప రితఁడు
నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁడటంచు. 173

క. క్షితిపై నిలిపినకతమున, నతనికి మృతి దొరకదయ్యె నవనీశ రమా
పతియభిమానముగలిగిన, యతిపుణ్యుఁడుసనియెబదరికాశ్రమమునకున్

వ. అంత. 175

క. ఉద్ధవుఁడరిగినపిదప [3]సమిద్ధపరిజ్ఞాను సుజనహితు మైత్రేయున్
వృద్ధజనసేవ్యుఁ దాపస, వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్.

వ. యమునానది దాఁటి [4]కతిపయప్రయాణంబులఁ బుణ్యనదులను హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరితగమనంబున. 177

క. చనిచని ముందటఁ గనుఁగొనె, ఘనపాపతమఃపతంగఁ గరుణాపాంగం
గనదుత్తుంగతరంగన్, జనవరనుతబహుళపుణ్యసంగన్ గంగన్.

---

1 ఉత్తరించి = దాఁటి. 2 లోకేశుఁడు = శివుఁడు. 3 సమిద్ధ = బాగుగా ప్రకాశించుచున్న. 4 కతిపయ = కొన్ని.

క. అందు [1]నరవిందసౌరభ, నందితపవమానఘూత నటదూర్మిపరి
స్పందితకందళశీకర, సందోహలసత్ప్రవాహజలమజ్జనుఁడై. 179

సీ. [2]ఘనసారరుచివాలుకా సముదంచిత
[3]సైకతవేదికాస్థలమునందు
యమనియమాదియోగాంగక్రియానిష్ఠఁ
బూని పద్మాసనాసీనుఁ డగుచు
హరిపాదసరసీరుహ [4]న్యస్తచిత్తుఁడై
బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁదోలి
సకలవిద్వజ్జనస్తవనీయసముచితా
చారవ్రతోపవాసములఁ గ్రుస్సి

తే. యున్న పుణ్యాత్ము విగతవయోవికారు
వినుతసంచారు భువనపావనవిహారు
యోగిజనగేయు సత్తతిభాగధేయు
నాశ్రితవిధేయు మైత్రేయు నచటఁగాంచె. 180

—♦ విదురమైత్రేయ సంవాదము. ♦—

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రునిపాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తుండై యిట్లనియె మునీంద్రా లోకంబున సకలజనంబులు మనంబుల ఘనంబు లగు సౌఖ్యంబులందం దలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి [5]దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు కర్మంబులు బంధకంబులును దుఃఖహేతువులునుంగాని సౌఖ్యదాయకంబులై పాపనివృత్తిఁ జేయ నోప వది యట్లుండె భూరిదుఃఖానుసారంబైన సంసారచక్రంబునందుఁ [6]బరిభ్రమించుచుం గామవిమోహితులై పూర్వకర్మానుగతంబులై నశరీరం

---

1 అరవింద.....మజ్జనుఁడై = పద్మములయొక్క సువాసనచేత సంతోష పెట్టఁబడిన వాయువుచేత నెగరకొట్టఁబడుటచేఁ గదలుచున్న యలలయొక్క కంపముచే నంకురించిన తుంపురుల గుంపుచే నొప్పుచున్న నదీజలమందు స్నానము చేసినవాఁడై. 2 ఘనసారరుచివాలుక = కర్పూరముయొక్క కాంతికల యిసుక. 3 సైకతవేది = ఇసుకతిన్నె. 4 న్యస్తము = ఉంచబడినది. 5 దైవోపహతులు = అదృష్టములేనివారు. 6 పరిభ్రమించు = తిరుగు;

బులు దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుం బాపనివృత్తిం గానక [1]మాతృయౌవనవనకుఠారులై జనియించి వర్తించుమహాత్ములం బశుప్రాయుల రక్షించుకొఱకుం గాదె నారాయణ[2]పరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట యదియునుం గాక. 181

మ. [3]అవివేకానుగత స్వకార్యజలవేలాకీర్ణమై మితిబం
ధువధూపుత్ర జలగ్రహోగ్రయుతమై దుర్దాంతసంసారదు
ర్భవపాథోధిం దరించువారె హరిసంబంధక్రియాలోలభా
గవతానుగ్రహనావ లేని యధముల్ గారుణ్యసంధాయకా. 182

క. మునినాథచంద్ర ననుం గైకొని కాచుతలంపు బుద్ధిం గూడినయేనిన్
వినుము మదీప్సిత మదినా, చనవునం గావింపవయ్య సజ్జనతిలకా. 183

వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా త్రిగుణాత్మకమాయా[4]నియంతయగు భగవంతుండు స్వతంత్రుండయ్యు నవతరించి యేయే యవతారంబుల నేయేకర్మంబు లాచరించె నదియు నిష్క్రియుం డగునీశుండు మొదలం బ్రపంచంబు నేవిధంబునం గల్పించె నేపగిదిం బాలించె మఱియు నీవిశ్వంబు నాత్మీయహృదయాకాశగతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయయం దెట్లు వసియించె బ్రహ్మాండంబునందు నేలీల వర్తించె నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె భూసురగోసురాదులం బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యేయే ప్రయోజనంబులం దీర్చెం బయోరుహగర్భాండ[5]కటాహాంతర్గతంబులై లోకపాలసహితంబులైన లోకంబులను [6]లోకాలోకపర్వతంబులను బహిర్భాగంబులను నేయేతత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె నందుం బ్రదీపితం బగు జీవకోటి యెవ్వానిం గొల్చి

---

1 మాతృ........కుఠారులై=తల్లియొక్క యౌవనమను నరణ్యమునకు గొడ్డలి వంటివారై. 2 పరాయణులు = ఆసక్తికలవారు. 3 అవివేకా.....కీర్ణమై = తెలివితక్కువను పొందుటచేత స్వంతపనియను నీటియొడ్డుచే చుట్టంబడినదై. 4 నియంత = నడుపువాడు. 5 కటాహము = కుండ. 6 లోకాలోకపర్వతము — చక్రవాళపర్వతము (ఇది భూమిచుట్టునుండును).

బ్రిదుకు జనులకుఁ గర్మనామరూపభేదంబు లెట్లు నిర్దేశించె నింతయు సవిస్తరంబుగా వివరింపు ముత్తమశ్లోకమౌళిమండనుండును యోగీశ్వరేశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్రశ్రవణంబునంగాని జన్మమరణాదిసకలదుఃఖాకరంబులును దుష్కర్మప్రాప్తంబులును నగు భవబంధంబులు దెగ వని వెండియు ని ట్లనియె. 184

తరలము. సతతముఁ సరసీరుహోదరసత్కథామృతపూరముఁ
శ్రుతిపుటాంజలిచేత నిమ్ముల జుఱ్ఱియుం దనివోదు భా
రతకథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స
న్మతి నుతించినచోట సన్మునినాథ నామది నుబ్బుదుఁ. 185

క. ఇతరకథావర్ణనముల, నతిహేయత నొందె జిత్త మనఘాత్మ రమాపతిచరితామృతరతి సం,సృతివేదన లెల్ల బాయఁ జేయు మునీంద్రా.

తే. భూరివిజ్ఞాననిధులగు నారదాది
నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని
హరికథామృతపానంబునందు విసివి
యొల్ల ననువాఁడె పో వెఱ్ఱి గొల్లఁడనఘ. 187

వ. అదియునుంగాక. 188

సీ. అరవిందనాభుని యపరావతారమై
జననమందిన పరాశరసుతుండు
చతురవర్ణాశ్రమాచారధర్మంబులు
[1] శవణింప లోకవిడంబనంబు
లగుగ్రామ్యకథలు పెక్కండ్రిఁ గల్పించుచు
హరికథావర్ణన మందులోన
నించుకించుకగాని యేర్పడఁ జెప్పమి
నంచితవిజ్ఞాన మాత్మనిలువ

తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ
డగుచు హరివర్ణనామృత మాత్మఁగోరి
విమలసుజ్ఞాన నిధియన వినుతికెక్కి
ధన్యుఁడయ్యెను లోకైకమాన్యుఁడగుచు

1 శవణింప = కావింప.

వ. కావున.

క. నరసీరుహోదరుమంగళ, చరితామృతమాత్మగోష్ఠులు జనుఁడితరకథా
గరళముగోష్ఠులునె హరిసం,స్మరణము జీవులకు నఖిలసౌఖ్యద మనఘా.

క. [1]శ్రీవనితాధిపనామక, థా[2]విముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం
బోవుదురు నరకమునకుఁ, బావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా.

క. ఏనరుఁ డే నొకనిమిషం, బైన వృథావాదగతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే, నానరునకు నాయు వల్ప మగు మునినాథా.

చ. మృదుగతిఁ బుష్పరేణుయ రమించుచుఁ బానము సేయఁ బాఱుఁ[3]ష
ట్పదమును బోలి యార్తజనబాంధవు [4]విశ్వభవస్థితివ్యయా
స్పదమహితావతారుఁ డగు పంకరుహోదరునిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ బాయక ద్రోలెదఁ జెప్పవే దయన్. 194

క. అని విదురుఁడు మైత్రేయుం, డనుమునినాయకుని నడిగె నని వేదవ్యా
సునితనయుండభిమన్యుని, తనయునకుం జెప్పిమఱియుఁ దగ నిట్లనియెన్.

వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతిమృదు
మధురవచన రచనుం డై యిట్లనియె ననఘా కృష్ణకథాశ్రవణతత్ప
రుండ వై నీవు నన్నడిగితివి గావున భద్రంబయ్యె నీవు భగవద్భక్తుం
డవు గావున హరికథాసక్తుండవగుట విచిత్రంబుగా దదియునుం
గాక [5]మాండవ్యశాపంబున సాత్యవతేయు వలన భ్రాతృక్షేత్రంబున
శూద్రయోనిం బుట్టినట్టి ప్రజా[6]సంయమనుండవగు యముండవు
పరమజ్ఞాన సంపన్నుండవు నారాయణునకుం బ్రియతముండవు గావున
గృష్ణుండు నిర్యాణకాలంబునం దనసన్నిధికిం జనిన నన్నుం డాయం
జీరి విజ్ఞానంబెల్ల నుపదేశించి నీకు నెఱింగింపుమని యానతిచ్చుటం
జేసి యవశ్యంబును నీకు నెఱింగింతు దత్తావధానుండవై వినుము.

---

1 శ్రీవనితాధిపుఁడు = లక్ష్మీదేవిభర్తయగు విష్ణువు. 2 విముఖులు = అయిష్టులు. 3 షట్పదము = తుమ్మెద. 4 విశ్వ......తారుఁడు = ప్రపంచముయొక్క పుట్టుకకును, స్థితికిని, నాశమునకును నునికిపట్టయిన గొప్పయవతారపురుషుఁడు. 5 మాండవ్యశాపము:—మాండవ్యుఁడు తపము చేసికొనుచుండఁగా రాజభటులు వీని చోరుఁడని యెంచి రాజునొద్దకుఁ గొంపోవ నతఁడు కొఱుతవేయించెను. మాండవ్యుఁడు మరణించి పరలోకమునకేగి యమునిఁ దనకేల యట్టిశిక్ష విధించితివనియడిగి, యతనిని భూమిమీద శూద్రస్త్రీకి జనింపుమని శపించె. అతఁడే విదురుఁడు. 6 సంయమనుఁడు = బాగుగా నణచువాఁడు.

క. వనజాక్ష యోగమాయా, జనితంబగు విశ్వజనన సంస్థానవినా
శనముల తెఱఁ గెఱిఁగించుచు, ననఘా విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్.

సీ. సకలజీవుల కెల్లఁ బ్రకట దేహమునాత్మ
నాథుండుఁ బరుఁడు నానావిధైక
మత్యుపలక్షణ మహితుండునగు భగ
వంతుండు సృష్టిపూర్వంబునందు
నాత్మీయమాయ లయంబు నొందిన విశ్వ
గర్భుఁడై తాన యొక్కటి వెలుంగు
పరమాత్ముఁ డభవుం [1]డుపద్రష్ట యయ్యు వ
స్త్వంతర పరిశూన్యుఁ డగుటఁ జేసి

తే. ద్రష్టగాకుండు మాయాభిధానశక్తి
నతులచిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁ దన్ను
లేనివానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి
ద్రష్ట యగుఁ దనభువన నిర్మాణవాంఛ. 198

తే. బుద్ధిఁ దోఁచిన నమ్మహాపురుషవరుఁడు
గార్యకారణరూప మై ఘనత కెక్కి
భూరిమాయాభిధాన విస్ఫురితశక్తి
వినుతి కెక్కినయట్టి యవిద్యయందు. 199

క. పురుషాకృతి నాత్మాంశ,స్ఫురణము గలశక్తి నిలిపి పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుండజుఁడు నిజో, దరసంస్థితవిశ్వ మపుడు దగఁబుట్టించెన్.

సీ. ధృతిఁబూని కాలచోదితము నవ్యక్తంబుఁ
బ్రకృతియు ననుపేళ్ళఁ బరఁగు మాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మా
యాంశకాలాదిగుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుతదృగ్గోచ
ర మగుచు విశ్వనిర్మాణ వాంఛ
నందుటఁజేసి రూపాంతరంబునఁ బొంది
నట్టి మహత్తత్త్వమందు నోలిఁ

1 ఉపద్రష్ట = కార్యములఁ విచారించుకొనువాఁడు.

తే. గార్యకారణ కర్త్రాత్మకత్వమైన
మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ
దగు నహంకారతత్త్వ ముత్పన్నమయ్యెఁ
గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు, 201

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనంబును [1]వైకారిక కార్యభూతంబులైన దేవతాగణంబులును సంభవించె. నింద్రియాధిష్ఠాతలైన వానివలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటం జేసి జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులును గర్మేంద్రియంబులయిన వాక్పాణి పాదపాయూపస్థములును దైజసాహంకారంబున నుత్పన్నంబులయ్యె. దామసాహంకారంబువలన శబ్దస్పర్శరూప రసగంధంబు లుదయించె. నందుశబ్దంబు నిజగుణంబయిన శబ్దంబువలస నాకాశంబుఁ బుట్టించె. గగనంబు గాలమాయాంశ యోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలన వాయువుం గలిగించె. బవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనంబైన తేజంబు నుత్పాదించె. దేజంబు గాలమాయాంశయోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తంబగుచు రసతన్మాత్రంబువలన నంబువులం బుట్టించె. సలిలంబు గాలమాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి తేజోయుక్తంబైన గంధగుణంబువలనఁ బృథివిఁ గలిగించె. నందు గగనంబునకు శబ్దంబును వాయువునకు శబ్దస్పర్శంబులును తేజంబునకు శబ్ద స్పర్శరూపంబులును సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును బృథివికి శబ్దస్పర్శ రూపరసగంధంబులును గుణంబులై యుండుఁ గాలమాయాంశలింగంబులు గలిగి మహదాద్యభిమానంబులు నొందిన దేవతలు విష్ణుకళాకలితులగుచు రట్టి మహదాదితత్త్వంబు లైక్యంబు సాలమిం బ్రపంచంబులు గల్పింప సమర్థంబులుగాక కృతాంజలులై యోగీశ్వరేశ్వరుండైన నారాయణు నిట్లని స్తుతియించె. 202

---

1 వైకారికములు_ వికారసంబంధములైనవి.

దండకము. శ్రీనాథనాథా జగన్నాథ నమ్రైకరక్షా విపక్షక్షమాభృ
త్సహస్రాక్ష నీరేజపత్త్రేక్షణా దేవదేవా భవద్దాసవర్గానుతాపంబు
లం బాపఁగానోపు దివ్యాతపత్రంబు నాఁ బొల్చు యుష్మత్పదాంభోజ
మూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామసం
సారతాపంబులం బోవఁగా మీఁటి వర్తింతు రోతండ్రి యీశా సమ
స్తాఘనిర్ణాశ యీవిశ్వమం దెల్లజీవుల్ భవోదగ్ర దుర్వారతాపత్ర
యాభీలదావాగ్నిచేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యేకర్మమున్ ధర్మ
ముం బొందఁగాలేక సంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్మ
లై యుందు రమ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల యోదేవ విజ్ఞాన
దీపాంకురంబైన మీపాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు మబ్జాక్ష
సన్మౌనిసంఘంబు లైకాంతికస్వాంతతం బేర్చి దుర్దాంతపాపౌఘ
నిర్ణాశకాంబు ప్రవాహాభ్ర గంగానివాసంబుగా నొప్పు నీపాద
యుగ్మంబు యుష్మన్ముఖాంభోజ [1]నీడోద్గతంబైన వేదాం[2]డజశ్రేణి
చేతం [3]గవేషించి సంప్రాప్తులై యుందు రోనాథ వైరాగ్యశక్తిస్ఫుట
జ్ఞానబోధాత్ములైనట్టి ధీరోత్తముల్ నిత్యనైర్మల్య భవ్యాంతరంగం
బులం దే పరంజ్యోతి పాదాబ్దపీఠంబు గీలించి కైవల్య సంప్రాప్తులై
రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు మిందాదివంద్యా ముకుందా
సమస్తంబుఁ గల్పింపఁ బాలింప దూలింపఁగాఁ బెక్కు దివ్యావతా
రంబులంబొందు నీ పాదపంకేరుహ ధ్యానపారీణ సుస్వాంతులై
యొప్పు భక్తాళికిన్ మోక్షదంబైన నీ పాదకంజాతముల్ గొల్తు
మీశా రమాధీశ పుత్రాంగనామిత్ర సంబంధబంధంబులం జెంది
నిత్యంబు దుష్టక్రియాలోలురై దేహగేహంబులందోలి వర్తించు
దుర్మానవశ్రేణులం దంతరాత్మండవై యుండియున్ దూరమై
తోఁచు నీ పాదపద్మంబు లర్పింతు మో దేవ బాహ్యేంద్రియవ్యాప్తి
నుద్వృత్తులైనట్టి మూఢాత్ము లధ్యాత్మ తత్త్వప్రభావాఢ్యులై నీ
పదాబ్జాతవిన్యాస లక్ష్మీకళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం
గానఁగాఁజాల రప్పుణ్యులా దుష్టులంజూడఁగానొల్ల రంభోధిరా

---

1 నీడోద్గతము = గూటినుండివచ్చినది. 2 అండజశ్రేణి = పక్షులసముదాయము.
3 గవేషించి = వెదకి.

టక్కన్యకాకాంత వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు నీ సత్కథా
సార చంచత్సుధాసార పూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిన్ సోలి
ధీయుక్తులై వ్రాలి తాపంబులందోలి మోదంబులం దేలి సంప
న్నులై మన్న నిత్యప్రపన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠ
ధామంబు నల్పక్రియాలోలురై కాంతు రద్దివ్యవాసైకసంప్రాప్తికిం
గోరుచున్నార మో దేవ వైరాగ్య విజ్ఞానబోధాత్మ యోగ
క్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబు
గావించి హృత్పద్మ వాసుండవై చిన్మయాకారమై యున్న
నీయున్న తానంత తేజోవిలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి
యానందలోలాత్మతం బోల్చు యోగీశ్వరశ్రేణికిం దావకీనా[1]ను
కంపానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద రో
దేవతాచక్రవర్తీ సదానందమూర్తీ జగద్గీతకీర్తీ లసద్ఖ్యాతవర్తీ
భవద్దాసులైనట్టి మమ్ముం జగత్కల్పనాసక్తచిత్తుండవై నీవు
త్రైగుణ్య విస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుచే కాక నీభవ్య లీలాను
మేయంబుగా సృష్టి నిర్మాణముం జేయ నే మెంతవారాము మీం
శక్తియుక్తిం భవత్పూజ గావింతు మట్లుండె నీసత్కళాజాతులై నట్టి
మమ్మెన్నఁగా నేల నధ్యాత్మతత్త్వంబ వన్నం బరంజ్యోతి వన్నం
బ్రపంచంబ వన్న న్నధిష్ఠాత వన్నం సదాసాక్షి వన్నన్ గుణా
తీత నీవేకదా పద్మపత్త్రాక్ష సత్త్వాదిత్రైగుణ్య మూలంబునా
నొప్పుమాయాగుణం బందు నుద్యన్మహత్త్వమైనట్టి నీ వీర్యముం
బెట్టుటం జేసి నీ వింతకుం గారణం బౌదు వాయాయికాలంబుల
న్నీకుం సౌఖ్యంబు లేమెట్లుగావింతు మేరీతి నన్నంబు భక్షింతు
మెబ్భంగి వర్తింతు మేనిల్కడ న్నుందు మీజీవలోకంబె యా
ధారమై యుండి భోగంబులం బొందుచున్నన్న యిక్కార్యసంధాను
లైనట్టిమాకుం జగత్కల్పనాశక్తికిం దేవ నీశక్తిఁ దోడ్పాటు
గావించి విజ్ఞానముం జూపి కారుణ్యసంధాయివై మమ్ము రక్షింపు
లక్ష్మీమనఃపల్వల క్రోడ యోగీంద్రచేతస్సరోహంస దేవాదిదేవా
నమస్తే నమస్తే నమః. 203

1 అనుకంప = దయ.

సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల,
కన్యోన్యమైత్రిత్వ మందకున్న
కతమున నిఖిల జగత్కల్పనాశక్తి
వొడమ కుండుటఁ దనబుద్ధి నెఱిఁగి
కైకొని కాలవేగమున నుద్రేకంబు
నొందిన ప్రకృతితోఁ బొంది నిజబ
లము నిల్పి తా నురుక్రముఁ డన స్తవిం
శతితత్త్వములయందు సమతనొక్క

తే. పరి ప్రవేశించి యాతత్త్వ భవ్యగుణము
నందు జ్యేష్ఠానురూపంబు లలరఁ జెంది
యొకటినొకటిని గలయక యుండి విశ్వ
రచన నెఱుఁగని యాతత్త్వనిచయమునకు. 204

వ. ఇట్లు విశ్వనిర్మాణ నిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి తనయనుగ్రహంబునం బ్రేరితంబై కానంబడి క్రియాసామర్థ్యంబునం జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితం బయి స్వకీయంబు లగునంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబునుం జెందె నేతత్త్వంబున నేనియుఁ జరాచర లోకపుంజంబులు నిండియుండు నా హిరణ్మయంబైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వ జీవసమేతుండై యుండె నంత. 205

క. జలములలోపల నిమ్ముల, జలరుహజాతాండమందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా, కలితంబగు నవ్విరాట్పుగర్భము వరుసన్.

తే. దైవకర్మాత్మశక్తి వితానములను
దగిలి తనచేతఁ దనుఁ దాన దైవశక్తి
యగుచు వెలుఁ గొందుచును బ్రకాశాంతరమునఁ
దనువు వితతంబు గాని చైతన్య మొంది. 207

తే. రూపసంస్థితిఁ జేసి నిరూఢకర్మ,
శక్తియును వృత్తిభేదసంశక్తి దశవి
ధములు గలిగిన ప్రాణరూపమున నాత్మ
శక్తిబోధత్వ మగుచున్న శక్తిగలిగి. 208

క. త్రివిధం బగుచును నాధ్యా,త్మ్యవిభేదంబులను బాపి మఱి యధిభూతా
త్మవిరాడ్రూప మ్మగు నిది,వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్.

క. జీవంబై పరమాత్మకుఁ, దావలమై యాదిమావతారం బగు న
ద్దేవుని గర్భంబున భూ,తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్. 210

వ. ఇట్లు దోఁచినవిరాట్పురుషుం డాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు
లను భేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున వెలుఁగొందు ననుచు విదురు
నకు మైత్రేయుం డెఱింగించె నని చెప్పి వెండియు నిట్లనియె. 211

చ. హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గరతనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు గృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తి దా
మరసవిలోచనుండు బుధమాన్యచరిత్రపవిత్రుఁ డిమ్ములన్. 212

వ. ఇత్తెఱంగున నీశుండగు నధోక్షజుండు మహాదాదితత్త్వంబుల మనం
బుల ఘనంబులగు తలంపులు దా నెఱింగి యట్టి తత్త్వంబుల వివిధ
వృత్తిలాభంబునకై స్వకీయచిచ్ఛక్తిచే నిట్టు లొనర్తునని చింతించి
నిజకళాకలితంబగు విరాడ్విగ్రహంబునందు నగ్నిప్రముఖంబగు దేవ
తావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడినవై రాజపురుషుని యా
స్యాద్యవయవంబుల వినిపింతు దత్తావధానుండ వై వినుము.

సీ. నరనుత యాదిదివ్యపురుషోత్తమునిపృథ
గ్భావంబు నొంది ముఖంబువలన
భువనపాలకుఁ డైన పవమానసఖుఁ డంత
రాత్ముఁ డీశ్వరునంశ మైనవాని
కవయంబు ననుకూల మగుచు నిజస్థాన
మునఁ బ్రవేశించిన ముఖమునందుఁ

బరఁగుజీవుండు శబ్దము నుచ్చరించుఁ బృ
థగ్భావములను నేత్రముల నినుఁడు
తే. చక్షురింద్రియయుక్తుఁ డై సరవిఁ జెంది
రూపవిజ్ఞానమహిమ నిరూఢినొందు
మఱియుఁజర్మంబునను బవమానుఁ డీశ్వ
రాంశమై త్వగింద్రియ మందుఁగూడి. 214

వ. నిజవాసంబు నాశ్రయించి జీవుండు స్పర్శేంద్రియగతుం డై పృథగ్భావంబయ్యె శ్రోత్రంబుల దిక్కులచ్యుతకళాంశంబు లగు శ్రవణేంద్రియయుక్తుండై నిజస్థానంబునం బొంది శబ్దజ్ఞానగతుండగు వెండియుఁ దాలువు నిర్భిన్నం బయిన లోకపాలుండగు వరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెఁ బరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్ఠానం బై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణసమర్థం బయ్యె వెండియు భిన్నం బయిన చర్మంబును నోషధులును బరమపురుషాంశంబు లయిన కేశంబులం గూడి నిజనివాసంబునొంది జీవుండు కండూయమానుండగు భిన్నభూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి నిజస్థానంబు నొంది రేతంబున జీవుండానందంబునం బొరయు భిన్నభావంబైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొంది పాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందుచు జీవుండు విసర్గంబుఁ జెందు వేఱువేఱైన బాహువులం దింద్రదశాధీశ్వరుం డయిన పురందరుండు క్రియవిక్రియాది శక్తియుక్తుండగుచు నిజస్థానంబునొంది జీవుండు వానిచేత జీవికంబొందు మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబులయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమ నార్హుం డయ్యె వెండియు భిన్నభావంబయినహృదయంబు మనంబుతోడం గలసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించి శరీరసంకల్పాదిరూపవిబగ్గు వికారంబునుం బొందు భిన్నభావం బైన యహంకారంబున నహంకృతియుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు నా యహంకృతిచే శరీరి కర్త

వ్యంబులు నడపు బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబుతోడం గలిసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు నట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును జరణంబుల వసుమతియు నాభియందు గగనంబునుం గలిగె. సత్త్వాదిగుణపరిణామంబుల నమరులై యార్జిత సత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబును బొందిరి. రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి. తామసంబున భూతాదులైన రుద్రపారిషదులు ద్యావాపృథివ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి. ముఖంబువలన నామ్నాయంబు లుత్పన్నంబులయ్యె వెండియు. 215

క. ధరణీదివిజులు శ్రుతులును, నరవర యమ్మేటిముఖమునం బొడముట భూ
సురుఁ డఖిలవర్ణములకున్, గురుఁడును ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ.

క. ధర బ్రాహ్మణాదికము దస్కరబాధలఁ బొందకుండఁ గైకొని కావం
బురుషోత్తము బాహువులన్, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ. 217

క. గణుతింపఁగఁ గృషిగోర, క్షణవాణిజ్యాదికర్మ కలితంబుగ నా
గుణనిధి యూరువులందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్.

తే. తివిరి సేవకధర్ములై దేవదేవు
పదములను శూద్రసంతతు లుదయ మైరి
వీర లందఱుఁ దమతమ విహితకర్మ
మలరఁ జేయుచు జనకుండు నాత్మగురుఁడు.

క. అఘనద్వేషుఁ బరాత్పరు, జగదేకప్రభుని పాదజలజాతంబుల్
దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగ నిపుణాత్మకులై.

తే. మహిమ దీపింపఁ గాలకర్మస్వభావ
శక్తి సంయుక్తుఁడగు పరేశ్వరుని భూరి
యోగమాయా విజృంభణోద్యోగ మెవ్వఁ
డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత. 221

ఉ. అన్యకథానులాపము లహర్నిశముం బఱియించి చాలమా
లిన్యము నాత్మశోభనవిలీనత నొందు మదీయజిహ్వ సా
జన్యముతోడఁ గ్రోలు హరిసద్గుణ దివ్యకథామృతంబు స
న్మాన్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁ జెందఁగన్. 222

మ. హరినామాంకిత సత్కథామృతరస[1]వ్యాలోలుఁడై నట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందారమరందపానకుతుక స్వాంత [2]ద్విరేఫంబు స
త్వరమై పోవునె [3]చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్మమై. 223

క. హరిమహిమముఁ దన్నాభీ, సరసిజసంజాతుఁడైన చతురాననుఁడుం
బరికించి యెఱుఁగఁడన్న ని, తరమనుజులఁ జెప్పనేల తత్త్వజ్ఞనిధీ 224

తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ
రీకలోచను నుత్తమశ్లోక చరితు
నమరగణవంద్యమాన పాదాబ్జయుగళు
వెదకి కనుఁగొనలేవండ్రు విమలమతులు.

క. హరియుందనమాయాగతిఁ, బరికించియుఁ గానఁడయ్యెఁ బరిమితి లేమిన్
మఱిమాయావినిమోహిత, చరితముఁ గనుఁగొందురెట్లు?[4]చతురాస్యాదుల్

క. ఆదివిజాధీశుఁడు మహా, దాదులు దిక్పతులుఁ బంకజాసనుఁడున్ గా
రీ దయితుఁడు గనఁజాలని, శ్రీదేవునిపదయుగంబుఁ జింతింతుమదిన్.

క. అని మైత్రేయుండవ్విదు, రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న
ర్జునపౌత్రునకుఁ బరాశర, మునిమనుమం డెఱుఁగఁ జెప్పె ముదము దలిర్పన్

వ. వెండియు నిట్లనియె. 229

క. భూమీశ్వర మైత్రేయమ, హాముని విదురునకునట్లు హరిగుణశుభలీ
లామాహాత్మ్యముఁ జెప్పిన, నా మైత్రేయునకు విదురుఁడనియెన్ మఱియున్

1 వ్యాలోలుఁడు = ఆసక్తిగలవాఁడు. 2 ద్విరేఫము = తుమ్మెద. 3 చేఁతి వేములు = చేఁదైన వేపచెట్లును. 4 చతురాస్యుఁడు = బ్రహ్మ.

క. అగుణున కవికారునకున్, జగదవనోద్భవవినాశ సత్కర్మములుం
దగులీలలెట్టు లాతఁడు, సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ. 231

సీ. అని యర్భకునిగతి ననఘుని మైత్రేయ
మునిఁ జూచి విదురుఁ డిట్లని యె మరల
బాలుఁడు క్రీడావిలోలమానసమున
దీపించు లీలానురూపుఁ డగుచుఁ
గానిచోఁ గామానుగతుఁడై రమించును
నర్భకుఁ డర్థి వస్త్వంతరమున
నర్భకాంతరమున నైనను బాలకే
ళీసంగుఁ డగుచు నోలిని జరించు
తే. హరియు నెపుడు నివృత్తుఁ డత్యంతతృప్తుఁ
డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు
మఱియుఁ ద్రిగుణాత్మకం బైనమాయఁ గూడి
యఖిలజగములఁ గల్పించె ననుట యెట్లు. 232

సీ. అమ్మాయచేత నీయఖిలంబు సృజియించి
పాలించి పొలియించి పరమపురుషుఁ
డనఘాత్మ దేశకాలావస్థలందును,
నితరులయందు నహీన మైన
జ్ఞానస్వభావంబుఁ బూని యాప్రకృతితో
నెబ్బంగిఁ గలసెఁ దానేక మయ్యుఁ
గోరి సమస్తశరీరంబులందును
జీవరూపమున వసించి యున్న
తే. జీవునకు [1]దుర్భగక్లేశసిద్ధి యెట్టి
కర్మమున సంభవించెను గడఁగి నాదు
చిత్త మజ్ఞానదుర్గమస్థితిఁ గలంగి
యధిక ఖేదంబు నొందెడు ననఘచరిత. 233

1 దుర్భగక్లేశసిద్ధి = దుష్టయోనియం దుండుటచే దుఃఖ గుట.

వ. అది గావున సూరిజనోత్తముండవై నసీవు మదీయమానసికసంశయంబులం దొలంగింప నర్హుండ వని విదురుండు మైత్రేయమహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూభవుం డభిమన్యునందనున కిట్లనియె. 234

క. సరసిరుహోదరుమంగళ, చరితామృతపానకుతుక సంగంబున ని ర్భరుఁడగు విదురునకుమునీ,శ్వరుఁడగుమైత్రేయుఁడనియెసజ్జనతిలకా.

చ. వినుము వితర్కవాదములు విష్ణువి ఫుల్లసరోజపత్త్రినే త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁ బరేశు నిత్యశో భనయుతు బంధనాదిక విపద్దశలుం [1]కృపణత్వ మెప్పుడే ననయముఁ బొంద లేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్.

వ. మఱియును. 227

చ. పురుషుఁడు నిద్ర వోఁ గలలఁ బొందు సమస్తసుఖంబు లాత్మసం హరణశిరోవిఖండనము లాదిగ జీవునికిం [2]బ్రబోధమం దరయఁగఁ దోఁచు చున్నగతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం బొరయక తక్కు నెట్లనుచు బుద్ధిని సంశయ మందె దేనియున్. 238

వ. అవ్విధం బతనికిం గలుగ నేర దది యెట్లంటేని. 239

చ. లలితవిలోలనిర్మలజల ప్రతిబింబిత పూర్ణచంద్ర మం డలము దదంబుచాలన విడంబనహేతువు నొందియుఁ బియ త్తలమునఁ గంప మొందని విధంబున సర్వశరీరధర్మముల్ గలిగి రమించు నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్. 240

వ. కావున జీవునకు నవిద్యామహిమం జేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగుంగాని సర్వభూతాంతర్యామి యైన యీశ్వరునకుం బ్రాప్తంబు గానేరదని. 241

చ. నరునకు నాత్మదేహజగుణంబులఁ బాపఁగ నోపు పంకజో దరచరణారవిందమహితస్ఫుటభక్తియ యుంద్రియంబు లీ

1 కృపణత్వము = లోభము. 2 ప్రబోధమందు = జాగ్రదవస్థయందు.

శ్వరవిషయంబు లైన [1]మది [2]సంచితనిశ్చలతత్త్వ మైన చోఁ
సరసిజనేత్రుకీర్తనమె చాలు విపద్దశలం జయింపఁగన్. 242

చ. హరిచరణారవిందయుగళార్చన సన్నుతిభక్తియోగముల్
నిరతము గల్గువారు [3]భవనీరజగర్భుల కందరాని భా
సురపదమందుఁ జేరుదురు సూరిజనస్తవనీయ యట్టి స
త్పురుషుల పూర్వజన్మఫలముం గణుతింపఁ దరంబె యేరికిన్. 243

వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళితహస్తుం డును వినమితమస్తకుండును నగుచుఁ దనమనంబున శ్రీహరిం దలంచుచు వినయవచనరచనుండై యిట్లనియె మునీంద్రా భవదీయ వాక్యంబులచేత నామనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు శరీరధారియైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియునుం బొడమినసంశయంబు నేఁడు [4]నివృత్తంబయ్యె నెట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు నారాయణభక్తిప్రభావంబు ప్రాణిగోచరం బైన యవిద్యకు నాశనకారణంబనం దనరుచుండు నారాయణుండు దనకు నాధారంబులేక సమస్తంబునకుం దాన యాధారభూతుండై విశ్వంబుం బొదివి యందుఁ దానుండు తెరం గెట్లు శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముండై సంసార ప్రవర్తకుండగు నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముండైన పుండరీకాక్షుని జెందు వీర లిద్దఱును సంశయక్లేశంబులు లేమింజేసి సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధినొందు వారలగుదు రెవ్వండు సుఖ దుఃఖా[5]నుసంధానంబుచే లోకానుగతుండగుచుం బ్రమోద వేదనంబుల నొందు నతండు దుఃఖాశ్రయుండగు నారాయణభజనంబున సమస్తదుఃఖనివారణంబగు నని భవదీయచరణసేవానిమిత్తంబునం గంటి ప్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగి యున్నదయిన నందులకుఁ గారణంబు లేకుండుటంజేసి తెలియనివాఁడనై వర్తింతు నని వెండియు. 244

---

1 మది = మనస్సు. 2 సంచితము = కూర్పఁబడినది. 3 భవుఁడు = శివుఁడు. 4 నివృత్తము = తీసివేయఁబడినది. 5 అనుసంధానము = కూడిక.

క. లలి నామదిఁ దలఁపుము సుమ, తులుగొనియాడంగఁదగినతోయజనాభుం
డలవడ నల్పతపోనిర, తులతలపోఁతలకు మిగుల దుర్లభుఁ డనియున్.

సీ. ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహ
దాదుల నితరేత రానుషంగ
ముగఁ జేసి వానియం దొగి విరాడ్దేహంబు
పుట్టించి యందుఁ జేపట్టి తాను
వసియించు నాతఁడు వరుస సహస్ర సం
ఖ్యాకంబు లగు మస్త కాంఘ్రిబాహు
కలితసత్పురుషునిఁగా బ్రహ్మవాదులు
వలుకుదు రా విరాట్ప్రభువునందు

తే. భువనజాలంబు లలజడిఁ బొరయ కుండుఁ
బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి
యాధిదైవతములుఁ గూడ ననఘ త్రివిధ
మగుచు విప్రాదివర్ణములయ్యె నందు. 246

క. ఇలఁ బుత్రపౌత్రసంపద, గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా
లలిఁ బ్రజ లేగతిఁ గలిగిరి, కలిగిన యాప్రజలచే జగము లెట్లుండెన్.

క. చతురత దీపింపఁ బ్రజా, పతులకుఁ బతియనఁగ వెలయు పద్మాపతి యే
గతిఁబుట్టించెను స్రష్ట్ర, ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్.

తే. వానిభేదంబులును మనువంశములును
మనుకులాధీశ్వరులును దన్మనుకులాను
చరితములు నే విభూతి నే జాడ దీని
నింతయును బుట్టఁ జేసె నా కెఱుఁగఁ బలుకు. 249

క. సరవిం గ్రిందక మీఁదఁ, ధరణికిఁ గలలోకములను దత్స్థితులన్
వరుసం [1]బరిణామంబుల, నెఱిఁగింపఁ గదయ్య నాకు నిద్ధచరిత్రా. 250

క. సుర తిర్యఙ్నర రాక్షస, గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చరముఖభవములు మునికుం, జర గర్భస్వేదజాండజముల తెఱంగున్.

క. త్రిగుణప్రధానకంబుగ, నగు నవతారములఁ బూర్ణమై వెలసిన యా
జగ దుత్పత్తిస్థితిలయ, నిగమములవిధంబు వాని నిలుకడలు దగన్.

---

1 పరిణామము = వృద్ధి; మార్పు.

క. చక్రాయుధుసౌందర్య ప, రాక్రమముఖగుణములును[1]ధరామరముఖవ
ర్ణక్రమములు నాశ్రమధ, ర్మక్రియలును శీలవృత్తమతభావములున్.

తే. యోగవిస్తారమహిమలు యోగములును
జ్ఞానమార్గంబులును బరిజ్ఞానసాధ
నములు నైరయొప్పు సాంఖ్యయోగములు వికచ
జలజనయనకృతంబు లౌ శాస్త్రములును. 254

సీ. పాషండధర్మంబుఁ బ్రతిలోమకుల విభా
గములు జీవుల గుణకర్మములును
బలుకుల గతులును గలిగెడి ధర్మ మో
క్షములయందలి పరస్పరవిరోధ
ములు లేని సాధనమును భూమిపాలక
నీతివార్తలు దండనీతి జాడ
యును బృథగ్భావంబులును విధానములును
బితృమేధములును దత్పితృవిసర్గ

తే. గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర
మున వసించిన నిలుకడలును దపములు
దానములుఁ దత్ఫలంబులుఁ దనరు ప్రబల
ధర్మములుఁ బ్రజ లొనరించు కర్మములును. 255

చ. వదలక భూజనావళికి వచ్చువిపద్దశధర్మముల్ సరో
జదళనిభాక్షుఁ డేగతిని సంతస మందెడు నెట్టివారి మే
ల్వదలక కానవచ్చు గురులం బ్రియశిష్యులు గొల్వ వారు స
మ్మదమునఁ గోరు నర్థములు మానుగ నెల్లెఱిఁగింతు రిమ్ములన్. 256

క. విలయాదిభేదముల న, య్యలఘునిఁ బరమేశు నెవ్వ రంచితభక్తిం
గొలుతుర దెవ్వారిలో ను, త్కలికన్ సుఖియించుజీవతత్త్వము మఱియున్.

క. గోవిందునిరూపంబున, జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెటు లా
భావన నుపనిషదర్థం, బై వెలసెడిజ్ఞాన మెట్టి దార్యస్తుత్యా. 258

1 ధరామరులు = బ్రాహ్మణులు.

తే. ఉచిత మగునట్టి శిష్యప్రయోజనములు
సజ్జనులచేత విజ్ఞానసాధనములు
నేమి వలుకంగఁబడు వాని నెల్ల మఱియుఁ
బొలుచు వైరాగ్యమునఁ దగు పురుషభక్తి. 259

తే. ఇన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్ను
నర్థిరక్షింపు యజ్ఞదానాదిపుణ్య
ఫలము వేదంబు సదివినఫలము నార్త
జనులఁగాచిన ఫలముతో సమముగావు. 260

క. అని విదురుఁడు మైత్రేయుని,
వినయంబునఁ దెలియ నడుగు విధ మెల్లను వ్యా
సునిసుతుఁ డభిమన్యునినం
దనున కెఱింగించి మఱియుఁ దగ నిట్లనియెన్. 261

చ. ఇలఁ గల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై
వెలసినపూరువంశము పవిత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా
కలితయశఃప్రసూనలతికాతతికిం బ్రతివాసరంబుఁ బెం
పలరఁగఁ [1]బ్రోది వెట్టుదు గదయ్య ముకుందకథామృతంబునన్. 262

తే. అల్పతర మైన సుఖముల నందుచున్న
జనులదుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి
పుండరీకాక్షు గుణకథా [2]ప్రోత మైన
వితతనిగమార్థ మగు భాగవతము నీకు. 263

వ. ఎఱింగింతు విను మని యి ట్లనియె. 264

సీ. అమ్మహాభాగవతామ్నాయ [3]మొకనాఁడు
గైకొని పాతాళలోకమందు
[4]నప్రతీకజ్ఞానియై వాసుదేవాఖ్యఁ
బొలుచుసంకర్షణమూర్తి దివ్య

1 ప్రోది=పోషణము. 2 ప్రోతము=కుట్టఁబడినది. 3 ఆమ్నాయము=వేదము.
4 అప్రతీకము = అనుకూలము.

పురుషుండు దన్నుఁ దాన బుద్ధిలోఁ జూచుచు
సలలితధ్యాన ముకుళితనేత్రుఁ
డై సనందాభ్యుదయార్థంబు గనువిచ్చి
చూచిన వారు సంస్తుతు లొనర్ప

తే. సమర గంగా[1]వగాహను లై [2]యహీంద్ర
కన్య లార్ద్రజటాబంధకలిత లగుచు
భర్తృవాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ
గదియ నేతెంచి తత్పాద కమలయుగము. 265

క. సేవించి భక్తితో నా,నావిధపూజోపహార[3]నతినుతులను నా
దేవునిహృదయము వడసిరి, యావేళ సనందనాదు లమ్మహితాత్మున్.

మ. [4]ఘనసాహస్రకిరీటరత్న విలసత్కాంత ప్రసిద్ధ ప్రభా
జనితోదగ్రరుచి ప్రకాశిత ఫణాసాహస్రుఁడా దేవతా
వనరక్షా[5]చణుగూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా
రనురాగ[6]స్ఖలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యాదేవుఁడున్. 267

తే. భూరినిగమార్థసారవిచార మగుచుఁ
దనరునీభాగవతము సాదరతఁ బలికె
నలినభవసూతియైన సనత్కుమార
కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు. 268

క. పరఁగ నతం డంతఁ బరా,
శరునకు నుపదేశ మిచ్చె సన్మతి నతఁడున్
సురగురున కొసఁగె నాతఁడు
గర మరుదుగ నాకుఁ జెప్పెఁ గైకొని యేనున్. 269

క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుం డగు సు
శ్లోకునిచరితామృత[7]పరి,షేకుఁడవై ముదము గదురఁ జెలఁగుము విదురా.

---

1 అవగాహనులు = స్నానముచేసినవారు. 2 అహీంద్రకన్యలు = నాగకన్యలు 3 నతి = నమస్కారము. 4 ఘన.....సాహస్రుఁడా = గొప్పవైన వేయికిరీటము లందలి రత్నముల ప్రకాశముచే నొప్పుచున్న ప్రఖ్యాతమైన కాంతులనుండిపుట్టినభయంకరమైన కాంతిచేఁ బ్రకాశింపఁజేయఁబడిన వేయి పడగలుగలవాఁడా. 5 చణుఁడు = సమర్థుఁడు. 6 స్ఖలితము = జారినది. 7 పరిషేకుఁడు = తడుపఁబడినవాఁడు.

వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును[1] ఋషిసంప్రదాయానుగతంబును బురు
షోత్తమ స్తోత్రంబును బరమపవిత్రంబును [2]భవలతాలవిత్రంబును
నయిన భాగవతకథా ప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు
నీకు నుపన్యసించెద వినుము. 271

సీ. అనఘ యేకోదకమై యున్నవేళ నం
త[3]ర్నిరుద్ధానల దారువితతి
భాతిఁ జిచ్ఛక్తిసమేతుఁడై కపటని
ద్రాలోలుఁ డగుచు [4]నిమీలితాక్షుఁ
డైననారాయణుం డంబుమధ్యమున భా
సురసుధాఫేనపాండురశరీర
రుచులు సహస్రశిరోరత్నరుచులతోఁ
జెలిమి సేయఁగ నొప్పు శేషభోగ

తే. తల్పమునఁ బవ్వళించి యనల్పతత్త్వ
దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁ డగుచు
నభిరతుం డయ్యుఁ గోర్కులయందు బాసి
ప్రవిమలాకృతి నానందభరితుఁ డగుచు. 272

తే. యోగమాయావిదూరుఁడై యుగసహస్ర
కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి
పేర్చి మఱి కాలశ[5]క్త్యుపబృంహితమున
సమత సృష్టిక్రియాకలాపముల దగిలి. 273

క. తనజఠరములోపలఁ దాఁ, జినలోకనికాయముల సృజించుటకును సా
ధన మగుసూక్ష్మార్థము మన,సునఁ గని కాలానుగతరజోగుణమంతన్.

సీ. పుట్టించెఁ దద్గుణంబునఁ బరమేశ్వరు
నాభిదేశమునందు నళిననాళ
ముదయించె మఱి యప్పయోరుహముకుళంబు
గర్మబోధితమైనకాలమందుఁ

---

1 ప్రోక్తము = చెప్పఁబడినది. 2 భవలతాలవిత్రము = సంసారమను తీగెకు కొడవలివంటిది. 3 నిరుద్ధము = అరికట్టఁబడినది. 4 నిమీలిత = మూసికొనఁబడిన, 5 ఉపబృంహితము = వృద్ధిపొందుట.

దన తేజమునఁ బ్రవృద్ధం బైన జలముచే
జలజాప్తగతిఁ బ్రకాశంబు నొందఁ
జేసి లోకాశ్రియస్థితి సర్వగుణవిభా
సితగతి నొప్పురాజీవమందు
తే. నిజకళాకలితాంశంబు నిలిపి దాని
వలన నామ్నాయమయుఁడును వరగుణుండు
నాత్మయోనియునై నతోయజభవుండు
సరవిఁ జతురాననుండునా జననమయ్యె. 275

తే. అతఁడు దత్పద్మకర్ణికయందు నిలిచి
వికచలోచనుఁ డై లోకవితతి దిశలు
నంబరంబును నిజచతురాననములఁ
గలయఁబరికించి చూచుచుఁ గమలభవుఁడు. 276

చ. [1]అలఘుయుగాంతకాలపవనాహతసంచలదూర్మిజాల సం
కలితజల ప్రభూత మగుకంజముఁ దద్వనజాత[2]కర్ణికా
తలమున నున్నతన్ను విశదక్రియ గల్గిన లోకతత్త్వముఁ
నలిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచార మొందుచున్. 277

వ. ఇట్లని వితర్కించె. 278

ఉ. ఈజలమందు నీకమల మేగతి నుద్భవ మయ్యె నొంటి నే
నీజలజాతపీఠమున నేగతి నుంటి [3]మదాఖ్య యెద్ది నా
కీజననంబు నొందుటకు నెయ్యది హేతువు బుద్ధిఁ జూడ నే
యోజ నెఱుంగలే నని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁ డై. 279

క. ఆవనజనాళమూలం, బావనములలోన నర్థి నరయుటకొఱ కై
యావనజాతప్రభవుం, డావనరుహనాళవివర మం దభిముఖుఁ డై. 280

మ. అతిగంభీరవిశాలవారినిధి[4]తోయాంతర్నిమగ్నాంగుఁ డై
చతురాస్యుం డొగి దివ్యవత్సరసహస్రం బబ్జమూలంబు స

---

1 అలఘు...కంజము = గొప్ప ప్రళయకాలవాయువుయొక్క తాఁకుడుచేతఁ గదలిన తరంగ సముదాయముతోఁ గూడుకొనిన జలమునుండి పుట్టిన పద్మము; కర్ణిక = పూవునడుమనుండుదుద్దు. 3 మదాఖ్య = నాపేరు. 4 తోయాంతర్నిమగ్నాంగుఁడు = నీటిలోపల మునిఁగిన శరీరము గలవాఁడు.

న్మతి నీక్షించియుఁ గాన లేక భగవన్మాయామహత్త్వంబు వి
స్మృతిఁ గావింప విభీతుఁడై మరలఁ జేరెం దత్సరోజాతమున్. 281

తే. అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జకీశ
మందు నష్టాంగయోగక్రియానురక్తిఁ
బవను బంధించి మహితతపస్సమాధి
నుండె శతవర్షములు సనుచుండ నంత. 282

ఆ. అట్టియోగజనితమైనవిజ్ఞానంబు, గలిగి యుండె దానఁ గమలనయనుఁ
గాన లేక హృదయకమలకర్ణికయందు, నున్నవానిఁ దన్నుఁ గన్నవాని.

మ. కని యొక్క నిశ్చలభక్తియోగమహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలస[1]త్పద్మాకళత్రుం [2]సుధా
శనముఖ్యస్తుతిపాత్రు దానవ[3]చమూజైత్రుం దళత్పద్మనే
త్రు నవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రుం [4]బక్షిరాట్పత్త్రునిన్. 284

వ. మఱియును. 285

చ. అలఘు[5]ఫణాతపత్రనిచయాగ్రసముంచితనూత్నరత్నని
ర్మలరుచిచే యుగాంతతిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవసారసనాళసితైకభోగముం
గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్. 286

సీ. వరపీతకౌశేయ పరిధానకాంతి సం
[6]ధ్యాంబుదరుచినిచయంబు గాఁగఁ
గమనీయనవహేమకలితకిరీటంబు
రమణఁ గాంచనశిఖరంబు గాఁగ
మానితవరా క్తికమాలికారుచి సాను
[7]పతితనిర్ఝరపరంపరలు గాఁగఁ

---

1 పద్మ = లక్ష్మీదేవి. 2 సుధాశన ముఖ్యస్తుతిపాత్రుఁడు = (అమృతమాహారముగాఁగల) దేవతలలో ముఖ్యుఁడైన దేవేంద్రునియొక్క స్తుతికిఁదగినవాఁడు. 3 చమూజైత్రుఁడు = సైన్యముల జయించువాఁడు. 4 పక్షిరాట్పత్త్రుని = గరుత్మంతుఁడు వాహనముగాఁగలవానిని, (విష్ణువును.) 5 ఫణాతపత్రము=పడగయను గొడుగు. 6 అంబుదరుచి = మేఘకాంతి. 7 పతితనిర్ఝరము = పడుచున్న ప్రవాహము.

జెలు వొందు నవతులసీదామకములు లా
లితతటజౌషధీలతలు గాఁగ
తే. వరభుజంబులు నికటస్థవంశములుగఁ
బదము లంగణ[1]పాదపప్రచయములుగ
లలితగతి నొప్పు మరకతాచలవిడంబి
తాత్మదేహంబు గలుగు మహాత్ము హరిని. 287

వ. మఱియు [2]నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోక సంగ్రహం బును నతివిస్తారవ ర్తు[3]లాయామంబును నై వివిధ విచిత్రదివ్యమణిభూష ణంబుల నాత్మీయనిర్మలద్యుతిచేతం బ్రకాశంబు నొందంజేయు దివ్య దేహంబు దనర వివిధంబు లగుకామంబు లభిలషించి విశుద్ధం బైన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేను వసందగిన పాదపద్మయుగంబును నలికఫలక లలితరుచినిచయంబులకు నోటువడి కృపాపాత్రుం డై చంద్రుండు బహురూపంబులఁ బదసరో జంబుల నాశ్రయించె నన నొప్పు పదనఖంబులును గమలాభూకాంత లకు [4]నుపధానరూపంబు లనందగి నీలకదళికాస్తంభంబులడంబు విడం బించునూరుయుగళంబునుగనకమణిమయమేఖలాకలాపాభిరామంబుఁ గదంబకింజల్క శోభితపీతాంబ రాలంకృతంబునై విలసిల్లు కటిమండ లంబును శృంగారవాహినీజలావ ర్తంబు నాఁ బొలుపొందు నాభివివ రంబును జఠరస్థనిఖిల బ్రహ్మాండమువహురుద్భవ కృశీభూతం బనం దగుమధ్యభాగంబును మహితముక్తాఫలమాలికావిరచితరంగ వల్లీవిరాజితంబు నవతులసీదామకిసలయాకల్పంబుఁ గుసుమమాలి కాలంకృతంబు ఘనసారకస్తూరికాచందనవిలిప్తంబుఁ గౌస్తుభరత్న దీప్తిప్రదీప్తంబు శ్రీవత్సలక్షణలక్షితంబు నై యిందిరారమణికిఁ గేళిమందిరం బనం బొల్చు వక్షస్థలంబును సుఖకేళీసమారంభ పరి రంభణాంభోధిరాట్కన్యకా కరాంభోజకీలితకనక మణికంకణ[6]నికషం బులం బొలుపారు రేఖాత్రయవిరాజమానం బైన[7]కంధరంబును సువ

1 పాదపము = చెట్టు. 2అపరిచ్ఛిన్నము = ఎడ తెగనటువంటిది. 3 ఆయామము = విశాలము. 4 ఉపధానము=తలగడ. 5 ఆవర్తము=సుడి. 6 నికషము= ఒరయునేది. 7 కంధరము=మెడ.

హితానర్ఘ దివ్యమణిప్రభావిభాసిత కేయూరకంకణముద్రికాలంకృతంబు లయిన బాహువులును సకలలోకార్తినివారక దరహాసచంద్రికాధవళితంబులైన కర్ణకుండలమండనమణిమరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబు లగు చెక్కుటద్దంబులును బరిపక్వబింబఫల ప్రవాళపల్లవారుణాధరంబును నఖిలభువనపరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించు నయనయుగళంబునకు సీమాస్తంభంబుఁ జంపక ప్రసూనరుచివిభాసంబు నగు నాసాదండంబును గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృత తరంగితాపాంగంబులై కర్ణాంతవిశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులును సలలిత శ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకం బయ్యె ననం దగు కర్ణంబులును నిక్షుచాపచాపద్వయంబు నాఁ జూపట్టు [1]భ్రూయుగళంబును నపర పక్షాష్టమీ శశాంకశంకాస్పద ఫాలఫలకంబును నీలగిరీంద్రశృంగసంగత బాలమార్తాండ మండల విడంబితపద్మరాగమణిఖచిత కాంచన కిరీటంబునం బొలుపారి సూర్యేందుపవ[2]నానల ప్రకాశంబులకుఁ నవకాశంబుసూపక త్రిలోక వ్యాపకసమర్థంబులగు తేజోవిశేషంబుల జెలువొంది సంగరరంగంబుల దానవానీకంబుల హరింపంజాలు సుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదంబగు దివ్యరూపంబునుం గలిగి మఱియును. 288

ఉ. హారకలాపపుష్పనిచయంబులఁ జంచదనర్ఘరత్నకే
యూరకరాంగుళీయక మహోజ్జ్వలబాహుసహస్రశాఖలొ
ప్పారఁగఁ జూడ నొప్పి భువ నాత్మకలీల [3]నదృష్టమూలవి
స్ఫారితభోగివేష్టితవిభాసిత చందనభూరుహాకృతిన్. 289

మ. విలసత్కుండలి[4] రాజసఖ్యమున [5]నుర్వీభృత్సమాఖ్యన్ సము
జ్జ్వలితోదార శిరోవిభూషణ సహస్రస్వర్ణకూటంబులన్

---

1 భ్రూ = కనుబొమ్మ. 2 అనలుఁడు = అగ్ని. 3 అదృష్టము...కృతిన్ = కనఁబడని మొదలుగల విరివియైన పాముచే చుట్టుకొనఁబడినట్టి ప్రకాశించు మంచిగంధపు చెట్టుయొక్క యాకారమువలెన్. 4 కుండలి = పాము, (ఆదిశేషువు); 5 ఉర్వీభృత్ = పర్వతము.

సలిలావాసతఁ జారుకౌస్తుభవిరాజ ద్రత్నగర్భంబునన్
నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్. 290

క. వితతార్థజ్ఞానజప, స్తుతిమకరంద [1]ప్రహృష్ట శ్రుతిజాత [2]మధు
వ్రతగణపరివృతశోభా, గతకీర్తిప్రసవమాలికలు గలవానిన్. 291

వ. కనుంగొని చతురాననుండు. 292

సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంతశూన్యుని
ధన్యుని జగదేక మాన్యచరితుఁ
దన్నాభిసరసిజోద్భవసరోజంబును
నప్పాల ననిలుని నంబరమును
మానిత భువననిర్మాణదృష్టిని బొడ
గనెఁ గాని యితరముఁ గానలేక
యాత్మీయకర్మ బీజాంకురంబును రజో
గుణయుక్తుఁ డగుచు నకుంఠితప్ర

తే. జాభిసర్గాభిముఖుఁ డ [3]నవ్యక్తమార్గుఁ,
డైనహరియందుఁ దనహృదయంబుఁ జేర్చి
యమ్మహాత్మునిఁ బరము ననంతు నభవు,
నజు నమేయుని నిట్లని యభినుతించె. 293

సీ. నలినాక్ష మాయాగుణవ్యతికరమునఁ
జేసి కార్యంబైన సృష్టిరూప
మునఁ బ్రకాశించు నీఘనరూపవిభవంబు
రూపింప దేహధారులకు దుర్వి
భావ్యంబు దలపోయ భగవంతుఁడవు నైన
పద్మాక్ష నీస్వరూపంబుకంటె
నన్య మొక్కటి సత్యమై బోధకం బైన
యది లేదు గాన నీయతులదివ్య

---

1 ప్రహృష్ట = సంతోషించిన. 2 మధువ్రతగణము = తుమ్మెదల సమూహము. 3 అవ్యక్తము = అస్పష్టము.

తే. మైనరూపంబు నాకుఁ బ్రత్యక్షమయ్యె
నదియుఁగాక వివేకోదయమునఁ జేసి
వరద నీరూప మజ్ఞాన గురుతమోని
వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప. 294

క. ఘనసత్పురుషానుగ్రహ, మునకై యమితావతారమూలం బగుచుం
దనరెడి నీరూపము శో, భనమగు భవదీయ నాభిపద్మమువలనన్.

క. జననం బందిన నాచే, ననయము మొదలనె గృహీతమయ్యె జగత్పా
వన నీదు సుస్వరూపము, ఘనరుచిరంబై స్వయంప్రకాశక మగుటన్.

వ. మఱియు జ్ఞానానందపరిపూర్ణమాత్రంబును [1]ననావృత ప్రకాశంబును భేదరహితంబును బ్రపంచజనకంబును బ్రపంచ విలక్షణంబును భూతేంద్రియాత్మకంబును నేకంబును నైన రూపంబు నొందియు నెందును బొడగాననట్టి నిన్ను నాశ్రయించెద నదియునుంగాక జగన్మంగళస్వరూపధరుండవై నీయుపాసకుల మైన మా మంగళంబులకొఱకు నిరంతరధ్యానంబుచేత నీదివ్యరూపంబునం గానంబడితి విట్టి నీవు [2]నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచేత [3]ననాదృతుండవు గావు. మఱియుం గొందఱు కృతార్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవింద కోశ గంధంబు వేదమారుతానీతం బగుటం జేసి తమతమ కర్ణకుహరంబులచేత నాఘ్రాణించు చుందురు. వారల హృదయకమలంబులయందు భక్తి పారతంత్ర్యంబున గృహీత పాదారవిందంబులు గలిగి ప్రకాశింతు వదియునుంగాక ప్రాణులకు ద్రవ్యాగారసుహృన్నిమిత్తంబయిన భయంబును దన్నాశనిమిత్తంబయిన శోకంబును ద్రవ్యాది స్పృహయును దన్నిమిత్తంబయిన పరిభవంబును మఱియు నందుఁ దృష్ణయు నది ప్రయాసంబున లబ్ధంబైన నార్తిమూలం బగు తదీయంబైన వృథాగ్రహంబును నీ శ్రీపాదారవిందంబులందు వైముఖ్యం బెంతకాలంబు గలుగు నంతకాలంబును బ్రాప్తంబు

---

1 అనావృతము = చుట్టుకొనఁబడనిది. 2 నిరయభాక్కులు = అశుభకర్మలను భజించువారు. 3 అదృతుఁడు = ఆదరింపఁబడువాఁడు.

లగుంగాని మానవాత్మనాయకుండ వగు నిన్ను నాశ్రయించిన భయ[1]నివృత్తి హేతువైన మోక్షంబు గలుగు మఱియునుం గొందఱు సకల పాపనివర్తకంబయిన త్వదీయ నామస్మరణకీర్తనంబులందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రియ పరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు సేయుచుందురు దానంజేసి వాతాదిత్రిధాతుమూలంబైన క్షుత్తృడాదిదుఃఖంబుల చేతను శీతోష్ణవర్ష వాతాదిదుఃఖంబులచేతను నతిదీర్ఘంబైన కామాగ్ని చేతను నవిచ్ఛిన్నం బగు క్రోధంబు చేతనుం, [2]దహ్యమానులగుదురు వారలం గనిన నాచిత్తంబు గలంకం బొందు జీవుండు భవదీయ మాయా[3]పరిభ్రామ్యమాణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియు నంతకాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసార సాగరంబు దరి యింపంజాలకుండు సన్మునీంద్రులైనను భవదీయ నామస్మరణంబు మఱచి యితరవిషయాసక్తులై రేని వారలు దివంబులందు వృథా ప్రయత్నులై సంచరించుచు రాత్రులయందు నిద్రాసక్తులై స్వప్న గోచరంబు లయిన బహువిధసంపదలకు నానందించుచు శరీర పరిణామాదిపీడలకు దుఃఖించుచుం బ్రతిహతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులై వర్తింతురు నిష్కాములై నిన్ను భజియించు సత్పురుషులకర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరి[4]శోభితంబైన హృత్సరోజకర్ణికాపీఠంబున వసియింతు వదియునుం గాక. 297

మ. పరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనో
హరరూపంబుఁ దలంచి యే గుణగణధ్యానంబు గావింతు ర
ప్పురుషశ్రేష్ఠపరిగ్రహంబునకునై పొల్పారఁ దద్ధ్యానగో
చరమూర్తిన్ ధరియింతుగాదె పరమోత్సాహుండవై మాధవా!

తే. అరయ నిష్కామధర్ములైనట్టి భక్తు
లందు నీవు ప్రసన్నుండవైనరీతి

1 నివృత్తి = పోవుట. 2 తప్యమానులు = బాధింపఁబడినవారు. 3 పరిభ్రామ్యమాణుఁడు = త్రిప్పఁబడినవాఁడు. 4 శోభితము = ప్రకాశింపఁబడినది.

హృదయముల బద్ధకాములై యెనయు దేవ
గణములందుఁ బ్రసన్నత గలుగ నీవు. 299

చ. అరయ సమస్తజీవహృదయంబులయందు వసించి యేకమై
పరఁగి సుహృత్క్రియానుగుణభాసితధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవునై తనర్చుచు నసజ్జనదుర్లభ మైనయట్టి సు
స్థిర మగు సర్వభూతదయచేఁ బొడగానఁగ వత్తు వచ్యుతా. 300

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజప సత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప వఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారెడి పాదపద్మయుగళీసేవాభిపూజాసమ
ర్పితధర్మం డగువానిభంగి నసురారీ దేవచూడామణీ. 301

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి
మహిమచేత [1]నపాస్తసమస్తభేద
మోహుఁడ వఖిలవిజ్ఞానమునకు నాశ్రి
యుండ వగు నీకు మ్రొక్కెద నో రమేశ! 302

క. జననస్థితివిలయంబుల, కనయంబును హేతుభూతమగు మాయాలీ
లను జెంది నటన సలిపెడు, ననఘాత్మక నీ కొనర్తు నభివందనముల్.

సీ. అనఘాత్మ మఱి భవదవతారగుణకర్మ
ఘనవిడంబన హేతుకంబు లయిన
రమణీయ మగు దాశరథి వసుదేవకు
మారాదిదివ్యనామంబు లోలి
వెలయంగ మనుజులు వివశాత్ములై యవ
సానకాలంబున సంస్మరించి
జన్మజన్మాంతరసంచిత దురితంబుఁ
బాసి కైవల్యసంప్రాప్తు లగుదు

తే. రట్టిదివ్యావతారంబు లవతరించు
నజుఁడ వగు నీకు మ్రొక్కెద ననఘచరిత

---

1 అపాస్తము = నివర్తింపఁబడినది.

చిరశుభాకార! నిత్యలక్ష్మీ విహార!
భక్తమందార! దుర్భవభయవిదూర! 304

తరలము. జననవృద్ధివినాశహేతుకసంగతిం గల దేను నీ
వును హారుండుఁ ద్రిశాఖ లై మనువుల్ మరీచిముఖామరుల్
దనర నం దుపశాఖ లై భవదాత్మ దీనికి మూల మై
యనయముఙ్ [1]భువనద్రుమాకృతి వైన నీ కిదె మ్రొక్కెదన్. 305

మ. పురుషాధీశ భవత్పదాబ్జయుగళీపూజాదికర్మ క్రియా
పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయుఙ్ మనుష్యాధముఙ్
[2]జరయుఙ్ నాశము నొందఁ జేయ నతిదక్షుం డైన కాలంబు త
ద్గురుకాలాత్ముఁడ వైన నీకు మది సంతోషంబునఙ్ మ్రొక్కెదన్.

సీ. సర్వేశ కల్పాంతసంస్థిత మగు జల
జాతమం దేను సంజనన మంది
భవదీయ సుస్వరూపముఁ జూడ నర్థించి
బహువత్సరములు దపంబు సేసి
[3]క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ
బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ
బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక
కరుణచే నఖిలలోకైకవంద్య

తే. మాన సతతప్రసన్న కోమలముఖాబ్జ
కలిత భవదీయ దివ్యమంగళవిలాస
మూర్తి దర్శింపఁగలిగె భక్తార్తిహరణ
కరణ [4]'తుభ్యం నమో'యని మరలఁబలుకు. 307

సీ. అమర తిర్యఙ్మనుష్యాది చేతనయోను
లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి
కమనీయశుభమూర్తి గలవాఁడవై ధర్మ
సేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది

---

1 భువనద్రుమాకృతి = ప్రపంచమనెడు చెట్టువంటివాఁడు. 2 జర = ముసలితనము. 3 క్రతువు = యజ్ఞము. 4 తుభ్యం నమః = నీకు నమస్కారము.

విషయసుఖంబుల విడిచి సంతతనిజా
నందానుభవసమున్నతిఁ దనర్తు
వది గాన పురుషోత్తమాఖ్యఁ జెన్నొందుదు
వట్టి నిన్నెప్పుడు నభినుతింతు
తే. నర్థి భవదీయపాదంబు లాశ్రయింతు
మహితభక్తిని నీకు నమస్కరింతు
భక్తజనపోష పరితోష పరమపురుష
పరివిమలాకార సంసారభయవిదూర. 308

సీ. తలకొని పంచభూత ప్రవర్తక మైన
భూరిమాయాగుణస్ఫురణఁ జిక్క
వడక లోకంబులు భవదీయ[1]జఠరంబు
లో నిల్పి ఘనసమాలోలచటుల
[2]సర్వంకషోర్మి భీషణవార్ధినడుమను
ఫణిరాజభోగతల్పంబునందు
యోగనిద్రారతి నుండంగ నొకకొంత
కాలంబు సనఁగ మేల్కనినవేళ
తే. నలఘు భవదీయనాభితోయజమువలనఁ
గలిగి ముల్లోకములుఁ సోపకరణములుగఁ
బుట్టఁ జేసితి వతులవిభూతి మెఱసి
[3]పుండరీకాక్ష సంతతభువనరక్ష. 309

క. నిగమస్తుత లక్ష్మీపతి, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం
దగుభవదైశ్వర్యంబున, నగణితసౌఖ్యానుభవము నందింతు గదే. 310

సీ. జలజాక్ష యెట్టివిజ్ఞానబలంబునఁ
గల్పింతు వఖిలలోకంబు లోలి
నతజనప్రియుఁడవు నాకట్టిసుజ్ఞాన
మర్థి మైఁ గృపసేయు మయ్య వరద

1 జఠరము = ఉదరము. 2 సర్వం...వార్ధి = సమస్తము నొరయునట్టి తరంగములుగల భయంకర సముద్రము. 3. పుండరీకము = పద్మము.

సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నాచిత్తంబు
దత్కర్మకౌశలిఁ దగిలి యుండి
యును గర్మవైషమ్యమును బొందుకతమున
దురితంబుఁ బొరయక తొలఁగునట్టి

తే. [1]వెరవు నా కెట్లు కలుగు నవ్విధముఁ దలఁచి
కర్మవర్తను నను భవత్కరుణ మెఱసి
తగఁ గృతార్థునిఁజేయవే నిగమవినుత
సత్కృపామూర్తి యో దేవ చక్రవర్తి. 311

చ. భవ దుదరప్రభూత మగు పద్మమునందు వసించి యున్న నే
నవిరళ తావకీనకలితాంశమువం దనరారు విశ్వముం
దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలముల్
శివతర మై ఫలింపఁ గృప సేయుము భక్తఫలప్రదాయకా. 312

చ. అని యనుకంప దోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారులో
చన సరసీరుహుం డగుచు సర్వజగత్పరికల్పనారతిం
దనరిననన్నుఁ బ్రోచుటకుఁ దా నిటు సన్నిధి యైన యీశ్వరుం
డనయము నాదుదుఃఖము దయామతిఁ బాపెడు నంచు నమ్రుఁడై.

క. వనరుహసంజాతుఁడు నె
మ్మనమున హర్షించె ననుచు మైత్రేయమహా
ముని ఘనుఁ డగువిదురునకున్
వినయంబున నెఱుఁగఁజెప్పి వెండియుఁ బలికెన్. 314

మ. [2]వనజాతప్రభవుండు కేవలతపోవ్యాసంగుఁడై పద్మలో
చను గోవిందు ననంతు నాద్యుఁ దనవాక్ప్రవృత్తిన్ నుతింపన్ [3]సుధా
శనవంద్యుండు ప్రసన్నుఁడై నిఖిలవిశ్వస్థాపనా[4]లోకనం
బునఁ జూచెన్ విలయప్రభూత బహు [5]వాఃపూరంబులన్ వ్రేల్మిడిన్.

---

1 వెరవు = ఉపాయము. 2 వనజాత ప్రభవుండు = బ్రహ్మ. 3 సుధాశన వంద్యుడు = దేవతలచేత నమస్కరింపఁబడినవాఁడు = విష్ణువు. 4 ఆలోకనము=చూపు. 5 వాఃపూరము = జలప్రవాహము.

తే. అట్లు వొడగని యార్తుఁడై ♦ యట్టి పద్మ
భవుని వాంఛిత మాత్మఁ దీ♦ర్పంగఁ దలఁచి
యతని మోహనివారక ♦ మైనయట్టి
యమృతరసతుల్యమధురవా♦క్యముల ననియె. 316

చ. తలకొని నీయొనర్చుపని ♦ దప్పి మదిం దలపోయు దుఃఖముం
దలఁగుము నాదులీలకుఁ బ్ర♦ధాన గుణంబగు సృష్టికల్పనం
బలవడఁ జేయు బుద్ధి హృ♦దయంబునఁజొన్పి తపస్సమాధి ని
ష్ఠల నతిభక్తులై ననుఁబ్ర♦సన్నునిఁజేయుము చెందుకోరికల్.

క. నీ వొనరించు, తపోవిద్యావిభవ[1]విలోకనీ♦యమగు నీసృష్టిం
గావింపుము లోకంబుల,లో వెలిఁగెడినన్నుఁ గందు♦లోకస్తుత్యా.

క. నాలోని జీవకోటులు, వాలాయము నీకుఁగాన♦వచ్చు నిపుడు నీ
వాలోకింపుము దారువి,లోల[2]హుతాశనునికరణి♦లోకస్తుత్యా. 319

సీ. నలువొంద నఖిల జీ♦వులయందుఁ గల నన్నుఁ
దెలిసి సేవింపుము ♦ నలినగర్భ
భవదీయదోషముల్ ♦ వాయును భూతేంద్రి
యాశ్రయవిరహిత♦మై విశుద్ధ
మైన జీవుని విమ♦లాంతరాత్ముఁడ నైన
నను నేకముగఁ జూచు♦నరుఁడు మోక్ష
పదమార్గవర్తియై ♦ భాసిల్లు బ్రహ్మాండ
మందును వివిధక♦ర్మానురూప

తే. పద్ధతులఁ జేసి పెక్కురూ♦పముల నొగసు
జీవతతి రచియించు నీ♦చిత్త మెపుడు
మత్పదాంబుజయుగళంబు ♦ మరగియున్న
కతన రాజసగుణమునఁ ♦ గలుగ[3]దఘము. 320

క. విను మదియుఁగాక ప్రాణుల
కనయము నెఱుఁగంగ రాని ♦ యనఘుఁడఁ దేజో

1 విలోకనీయము = చూడఁదగినది. 2 హుతాశనుఁడు = అగ్ని. 3 అఘము =

ధనుఁడఁ బరేశుఁడ నీచే
తను గానంబడితి నిదె పి♦తామహ కంటే. 321

వ. మఱియు భూతేంద్రియగుణాత్మకుండనియు జగన్మయుండనియు నన్ను నీచిత్తంబునందుఁ దలంపుము తామరసనాళ[1]వివరపథంబు వెంటం జని జలంబులలోనం జూడం గోరినట్టి మదీయస్వరూపంబు.

క. నీకిప్పుడు గానంబడె, [2]నాకులకును [3]నురగపతి [4]పి♦నాకులకైనన్
వాకొనఁగం దలపోయను, రాకుండు మదీయరూప♦రమ్యత్వంబుల్.

క. కావున మచ్చారిత్ర క,థావిలసితమైనసుమహితస్త♦వము జగ
త్పావనము విగతసంశయ, భావుఁడవై బుద్ధి నిలుపు♦పంకజజన్మా.

క. సగుణుఁడనై లీలార్థము,జగములఁగల్పింపఁదలఁచు♦చతురుని నన్నున్
సగుణునిఁగా నుతియించితి,తగ సంతసమయ్యె నాకుఁ♦దామరసభవా.

క. ఈమంజుస్తవరాజము, నీమనమునఁ జింతఁ దక్క♦నిలుపుము భక్తిన్
ధీమహిత నీమనంబునఁ, గామించిన కోర్కెలెల్లఁ♦గలుగుం జుమ్మా.

క. అనుదినమును ద్రిజగత్పా,వన మగు నీమంగళస్త♦వంబుఁ బఠింపన్
వినినను జనులకు నేఁబొడ,గనబడుదు[5]నవాప్తసకల♦కాముఁడనగుచున్.

తే. వన తటాకోపనయనవి♦వాహ దేవ
భవన నిర్మాణ భూమ్యాది♦వివిధదాన
జపతపోవ్రత యోగ య♦జ్ఞముల ఫలము
మామకస్తవ ఫలము స♦మంబుగాదు. 328

క. జీవావలిఁ గల్పించుచుఁ, జీవావలిలోనఁ దగ వ♦సించుచుఁ[6]బ్రియవ
స్వావలిలోపలఁ బ్రియవ,స్వావలినై యుండు నన్ను♦ననిశముఁ బ్రీతిన్

క. తలఁపుము మత్ప్రీతికినై, కలిగించితి నిన్ను భువన♦కారణ నాలో
పల నడఁగి యేకమై ని,శ్చలగతి వసియించి యున్న♦జగముల నెల్లన్

తే. తగ నహంకార మూలత♦త్త్వంబు నొంది
నీవు పుట్టింపు మనుచు రా♦జీవభవుఁడు

---

1 వివరపథము=రంధ్రమార్గము. 2 నాకులకు=మునులకు. 3 ఉరగపతి=ఆదిశేషువు. 4 పినాకి=శివుఁడు. 5 అవాప్తసకలకాముఁడు = పొందిన సమస్తకోరికలు గలవాఁడు. 6 వసు + ఆవళి=వసుసమూహము.

నినఁగ నానతి యిచ్చి యంబుజనాభుఁ
డంత నంతర్హితుం డయ్యె ♦ ననఘచరిత. 331

క. అని చెప్పిన మైత్రేయునిఁ
గనుఁగొని విదురుండు వలికెఁ ♦ గడుమోద మొప్పన్
జననుత నలినదళాక్షుఁడు
సనిశం బద్మజుఁడు దేహ♦సంబంధమునన్. 332

క. మానససంబంధంబును,బూనిన యీసృష్టి యెట్లు ♦ పుట్టించె దయాం
భోనిధివై నాకింతయు, మానుగ నెఱిఁగింపవయ్య♦మహితవిచారా.

వ. అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షు వరదాన ప్రభావంబునం బంకజాసనుండు శతదివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబు గావించి తత్కాలవాయువుచేఁ గంపితంబగు నిజనివాసం బయిన పద్మంబును వాయువును జలంబులను గనుంగొని యాత్మీయతపశ్శక్తి చేత నభివృద్ధిం బొందిన విద్యాబలంబున వాయువును బాధించి తోయంబులతోడ నొక్క తోయంబు సమస్తంబునుం గ్రోలి యంత గగనవ్యాప్తియగుజలంబును గనుంగొని.

ఉ. వారిజసంభవుండు [1]బుధ♦వంద్యుఁడు చిత్తమునం దలంచె దై
త్యారిఁ [2]బయోవిహారి సము♦దంచితహారిశతాఖిలామృతా
హారి రమాసతీహృదయ♦హారి నుదారి విదూరభూరిసం
సారి భవప్రహారి విల♦సన్నుతసూరి నఘారినయ్యెడన్. 335

తే. అట్లు దలఁచి సరోజజుం♦డంబుజమును
గగనతలమునఁ జూచి యా♦కమలకోశ
లీనమై యున్న లోకవి♦తానములను
నొయ్యఁ బొడగని హరిచే [4]ని♦యుక్తుఁడైన. 336

తే. వానిఁగాఁ దన్నుఁ దలఁచి య♦వ్వనరుహంబు
లోపలికిఁ బోయి మున్నందు♦లోన నున్న
ముజ్జగంబులఁ జూచి యి♦మ్ముల సృజించె
మఱి చతుర్దశభువనముల్ ♦ మహిమఁ జేసి. 337

---

1 బుధవంద్యుఁడు=పండితులచే నమస్కరింపఁదగినవాఁడు 2 పయోవిహారి= జలములందు విహరించువాఁడు 3 శతా......హారి=కోనియాను దేవతలు గలవాఁడు. 4 నియుక్తుఁడు = నియోగింపఁ బడినవాఁడు.

క. పరఁగ 1సుధాశన తిర్య, ఙ్నర వివిధస్థావరాది • నానాసృష్టి
స్ఫురణ నజుండొనరించెం, బరువడి నిష్కామధర్మ • ఫలరూపమునన్

వ. ఇట్లు భువనంబులఁ బద్మజుండు గల్పించెనని మైత్రేయుండు విదురున [కెఱింగించిన. 339

క. విదురుఁడు 2దురితావనిభృ
ద్భిదురుఁడు మునివరునిఁ జూచి • ప్రియము మనమునం
గదురఁగ నిట్లని పలికె న
తిదురంతం బయిన విష్ణు • దేవుని మహిమన్. 340

తే. అమరె భువనంబు లతనికా • లాఖ్యతయును
గణుతిసేయు తదీయ ల • క్షణము లర్థి
నాకు నెఱిఁగింపు మయ్య వి • వేకచరిత
యనిన మైత్రేయుఁ డవ్విదు • రునకు ననియె. 341

సీ. ఆద్యంతశూన్యంబు • నవ్యయం బై తగు
తత్త్వమింతకు 3నుపా • దాన మగుట
గుణవిషయములు గై • కొని కాలమును మహ
దాదిభూతములు • దన్నాశ్రయింపఁ
గాలానురూపంబుఁ గైకొని • యీశుండు
దనలీల కై తనుఁ • దా సృజించెఁ
గర మొప్ప నఖిలలో • కములందుఁ
దనలోన నఖిలంబుఁ • దనరుచుండుఁ

తే. గాన విశ్వమ్మునకుఁ గార్య • కారణములు
దాన యమ్మహాపురుషుని • తనువువలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్ర • భాస మొందె
మానితాచార యీవర్త • మానసృష్టి.

క. తెఱఁ గొప్ప నఖిలవిశ్వముఁ
బురుషోత్తము మాయచేతఁ • బుట్టుం బెరుఁగున్
విరతిం బొందుచు నుండుం
గర మర్థిన్ భూతభావి • కాలములందున్. 343

---

1 సుధాశనులు=దేవతలు. 2 దురితావనిభృద్భిదురుఁడు=పాపములను కొండలకు వజ్రాయుధము వంటివాఁడు. 3 ఉపాదానము=కారణము.

వ. అట్టి [1]సర్గంబు నవవిధం బండుఁ బ్రాకృతవైకృతంబులు గాల ద్రవ్య
గుణంబులను త్రివిధంబగు భేదంబుచేఁ బ్రతిసంక్రమంబు లగుచు
నుండు నందు మహత్తత్త్వంబు ప్రథమసర్గంబది నారాయణసంకా
శంబున గుణవైషమ్యంబునం బొందు ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబైన
యహంకార తత్త్వంబు ద్వితీయసర్గంబు శబ్దస్పర్శరూపరసగంధంబు
లను పంచతన్మాత్రద్రవ్యశక్తియుక్తియుక్తంబైన పృథివ్యాదిభూత
సర్గంబు మూఁడవదియై యుండు జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షు
శ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులుఁ గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపా
యూపస్థములుననుదశవిధేంద్రియజననంబు చతుర్థసర్గంబు సాత్త్వికా
హంకారజనితంబైనసుమనోగణసర్గం బైదవసర్గంబైయొప్పునదిమనో
మయంబైయుండు జీవలోకంబునకు నబుద్ధికృతంబులైన [2]యావరణ
[3]విక్షేపంబులం జేయు తామససర్గం బాఱవదై యుండు నియ్యాఱు
నీశ్వరునకు లీలార్థంబులయిన ప్రాకృతసర్గంబులయ్యె నింక వైకృత
సర్గంబు లేడవది మొదలుగాఁ గలుగునని వినిపింతు వినుము పుష్పో
త్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస[4]న్యగ్రోధాదు
లైన వనస్పతులును బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహియవ
ముద్గాద్యోషధులును [5]నారోహణానపేక్షంబులైన మాలతీమల్లి
కాదిలతలును త్వక్సారంబులైన వేణ్వాదులును గఠినీభూతమూలంబు
లును శిఖావిస్తృతంబులునునగు లతావిశేషరూపంబులైన వీరుధం
బులును బుష్పవంతంబులయి ఫలప్రాప్తంబులగు చూతాదిద్రుమం
బులును నవ్యక్తచైతన్యంబులు [6]నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శం
బులుఁ దమఃప్రాయంబులునై స్థావరంబులయిన యీయాఱు నేడవ
సర్గంబయ్యె నెనిమిదవసర్గం బిరువదియెనిమిది భేదంబులుగలిగి శ్వస్త
నాదిజ్ఞానశూన్యంబులయి యాహారాదిజ్ఞానమాత్ర నిష్ఠంబులయి
ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున
దీర్ఘానుసంధానరహితంబులైవర్తించు [7]ద్విశఫంబులుగల వృషభ

---

1 సర్గము=సృష్టి. 2 ఆవరణము=మూఁత. 3 విక్షేపము=చలించుట. 4 న్యగ్రోధ=మఱ్ఱిచెట్టు. 5 ఆరోహణానపేక్షము = ఎక్కుటకుఁ గోరనిది. 6 ఊర్ధ్వస్రోతము=పైకి ప్రవహించునది. 7 ద్విశఫము=కాలిగిట్ట రెండుగాఁ జీలినది.

మహిషా[1]జకృష్ణసూకరోష్ట్ర[2]గవయ[3]రురుమేషముఖర నవకంబును నేకశఫంబుగల [4]ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును బంచనఖంబులుగల శునక శృగాల వృక వ్యాఘ్ర మార్జాల శశ [6]శల్యక సింహ కపి గజ కూర్మ [7]గోధాముఖభూచరద్వాదశకంబును మకరాది జలచరంబులును గంక గృధ్ర బక [8]శ్యేన [9]భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకో[10]లూకాదిఖేచరంబులును మొదలుగాఁ గలది తిర్యక్సర్గం బయ్యె నర్వాక్స్రోతం బై యేకవిధంబగు మానుషసర్గంబు రజోగుణప్రేరితం బై కర్మకరణ దక్షం బై దుఃఖంబందును సుఖంబుగోరు నిది దొమ్మిదవ సర్గంబనం దగు నీత్రివిధసర్గంబులు వైకృతసర్గంబులనంబడు నింక దేవ సర్గంబు విను మరియు నెనిమిది తెఱంగులు గలిగి యుండు నందు విబుధ పితృసురాదులు మూఁడును గంధర్వాప్సరసలొకటియు యక్ష రక్షస్సు లేకంబును భూతప్రేత పిశాచంబు లొకటియు సిద్ధచారణ విద్యాధరు లేకంబును గిన్నరకింపురుషు లొకటియుంగా దేవసర్గం బయ్యె నిట్టి బ్రహ్మనిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి నింక మన్వంతరంబుల నెఱింగించెదఁ గల్పాదులయందు నీ ప్రకారంబున స్వయంభూతుండును నమోఘసంకల్పుండునునగు నప్పుండరీకాక్షుండు రజోగుణయుక్తుం డై స్రష్ట యగుచు స్వస్వరూపంబయిన విశ్వంబు నాత్మీయసామర్థ్యంబునం గల్పించె నయ్యీశ్వరునిమాయావ్యాపారంబులచే నీసృష్టియందు [11]నద్యావర్తంబులంబడి భ్రమించుచున్న మహీరుహంబులుం బోలెఁ బూర్వాపర భావంబు తెలియంగ బడకుండు నీకల్పంబునందుండు దేవాసురాదులు ప్రతిమన్వంతరంబునందును నిట్లు నామరూపంబులచే నిర్దేశింపంబడుదురు మఱియు నిందొకవి- విశేషం బెఱింగించెదఁ గౌమారసర్గం బనునది దేవసర్గాంతర్భూతం బయ్యును బ్రాకృత వైకృతోభయాత్మకం బై దేవత్వమనుష్యత్వరూపం బైన సనత్కుమారాదిసర్గంబనంబడె నమోఘసంకల్పుం డైన పుండరీకాక్షుండు దనుం దాన యిట్లు విశ్వభేదంబును గల్పించెనని మైత్రేయుండు విదురునకుఁ జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁ డై యిట్లనియె. 344

1 అజ=మేక. 2 గవయ=గురుపోతు. 3 రురు=చాఱలదుప్పి.

సీ. భువిఁ దనకార్యాంశ♦ములగు గొంతపు నన్య
వస్తుయోగంబు లే♦వలన లేక
ఘటపటాదికజగ♦త్కార్యంబునకు నిజ
సమవాయకారణ♦త్వముగఁ బరఁగి
జాలసూర్యమరీచి♦సంగతగగనస్థ
మగు త్రసరేణుష♦డంశ మరయఁ
బరమాణు వయ్యెఁ ద♦త్పరమాణువం దను
గతి యెంత దడప్ర ♦ కతా లమగుచు
తే. సూక్ష్మకాలంబు విను మది ♦ సూర్యమండ
లంబు ద్వాదశరాశ్య♦త్మకం బనంగఁ
గలుగు జగమున నొకయేఁడు♦గడచి చనినఁ
గాలమేఁతగు నది మహా♦త్కాల మనఘ. 345

వ. అందుఁ బరమాణుద్వయం బొక్క-యణు వగు నణుత్రితయంబొక-
త్రసరేణువగు నవి మూఁడుగూఁడ నొక్క- త్రుటియగు నాత్రుటి
శతం బొక్క-వేధ యనంబరఁగు నట్టివేధలు మూఁడుగూడ నొక్క-
లవం బనందగు నవి మూఁడైన నొక్క-నిమేషం బనం జను నిమేష
త్రయం బొక్క-క్షణంబగు క్షణపంచకం బొక్క- కాష్ఠ యనందగు
నవి పదియైన నొక్క-లఘువన నొప్పునట్టి లఘుపంచదశకం బొక్క-
నాడియనం బరఁగు నట్టి నాడికాద్వయం బొక్క- ముహూర్తం
బయ్యె నట్టి నాడికలారైన నేడైన మనుష్యులకు నొక- ప్రహరం
బగు నదియ యామంబనం జను దివసపరిమాణవిజ్ఞేయం బగునాడి
కోన్మాన లక్షణం బెఱింగింతు వినుము షట్ఫలతామ్రంబునం
బాత్రంబు రచియించి చతుర్మాషసువర్ణంబునం 1జతురంగుళాయా
మశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున 2ఛిద్రంబుఁ
గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్రతోయంబు పరిపూర్ణంబు
నొందు నంతకాలం బొక్క-నాడిక యగు యామంబులు నాలుగు
నన నొక్క-పగలగు రాత్రియు నిప్పగిది జరగు నట్టియహర్నిశంబులు
గూడ మర్త్యుల కొకదివసంబగు నవి పదునేనైన నొక్క-పక్షంబగు

1 చతురంగుళాయామము=నాలుగుఅంగుళముల పొడవు. 2ఛిద్రము=రంధ్రము.

శుక్లకృష్ణనామంబులం బరఁగిన యప్పక్షంబులు రెండుగూడ నొక్క మాసంబగు నది పితృదేవతలకు నొక్కదివసంబగు నట్టిమాసంబులు రెండైన నొక్కఋతువగు షణ్మాసంబు లరిగిన నొక్కయయనం బగు దక్షిణోత్తరనామంబులం బరఁగినట్టి యయనంబులు రెండు గూడి ద్వాదశమాసంబులైన నొక్క సంవత్సరంబగునట్టి సంవత్సర శతంబు నరులకుం బరమాయువై యుండుఁ గాలాత్ముండును నీశ్వ రుండునునైన సూర్యుండు గ్రహనక్షత్ర తారాచక్రస్థుండై పర మాణ్వాది సంవత్సరాత్మకంబైన కాలంబునం జేసి ద్వాదశరాశ్యా త్మకంబైన జగంబున సౌర బార్హస్పత్య సావనచాంద్ర నాక్షత్రమాన భేదంబులం గానంబడుచున్నవాఁడై సంవత్సరపరివత్స రేడావత్స రానువత్సరవత్సర నామంబులసృజ్యంబైనబీజాంకురంబులశక్తింగాల రూపంబైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుఁ బురుషులకు నాయురాది వ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గలవారికి యజ్ఞముఖంబులం జేసి గుణమయంబులైన స్వర్గాదిఫలంబుల విస్తరింపం జేయుచు గగనంబునఁ బరువువెట్టు వత్సరపంచకప్రవర్తకుండగు మార్తాండునకుం బూజగావింపుమని మైత్రేయుండు వలికిన విదురుం డిట్లనియె. 346

క. నరపితృసుర పరమాయుః, పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి మునీ
శ్వర యెఱిఁగింపు త్రిలోకీ, పరిలోకవిలోక నైక ♦ పరులగువారిన్.

ఉ. పూనిన యోగసిద్ధి దగఁ ♦ బొందిన నేత్రయుగంబునన్ బహి
ర్జ్ఞానము గల్గియుండి భువ ♦ నంబులఁ జూచుచు నుండువారికి
న్మానుగఁ గల్గు కాలగతి ♦ నా కెఱిఁగింపుము మునీంద్ర నావుడు
న్మానయశాలి యవ్విదురు ♦ నాదర మొప్పఁగఁ జూచి యిట్లనున్.

సీ. జనసుత కృతయుగ ♦ సంఖ్య నాలుగువేల
దివ్యవర్షములు ద♦దీయసంధ్య
లెనమనూఱేండ్లగు విను ♦ త్రేత వత్సర
త్రిసహస్రములగుఁ ద♦దీయసంధ్య
లాఱునూఱేఁడులు నగు ♦ ద్వాపరము రెండు

లోలి నన్నూఱేఁడు లొగిఁ గలియుగము స
హస్రవర్షములు సంధ్యాంశమరయ
తే. రెండునూఱేఁడులును నిల్చి యుండుఁ జువ్వె
యనఘ సంధ్యాంశమధ్యంబునందు ధర్మ
మతిశయించును సంధ్యాంశమందు ధర్మ
మల్పమై కానఁబడు చుండు ననఘచరిత. 349

వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగుపాదంబులును త్రేత యందు మూఁడుపాదంబులును ద్వాపరంబునం బాదద్వయంబును గలియుగంబున నేకపాదంబును గలిగి సంచరించు నట్లగుటం జేసి. 350

క. పాదవిభేదంబున మర్త్యాదులును దఱుఁగు నధర్మ మాకొలఁదినె [1]యు
త్పాదిల్లి వృద్ధిఁ బొందు [2]ధరాదివిజులు పాదబుద్ధిరతు లగుదు రిలన్.

సీ. భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడవునఁ
గడునొప్పు సత్యలోకంబునందు
నుండు బ్రహ్మకుఁ జతుర్యుగసహస్రము లేఁగ
దివ మొక్కటియగు రాత్రియును నిట్ల
చన ధాత నిద్రవో జగము లడంగు మే
ల్కనిచూడ మరల లోకములు పుట్టుఁ
దద్దినమ్మునఁ జతుర్దశమను లగుదు రం
దొక్కొకమనువున కొనర దివ్య
తే. యుగము లొలిని డెబ్బదియొక్కమాఱు
సనినమనుకాలమయ్యె నమ్మనుకులంబు
సురలు మునులును సప్తర్షు లరయ భగవ
దంశమునఁ బుట్టి పాలింతు రఖిలజగము. 352

క. హరి పితృ[3]సుపర్వతిర్యఙ్నరరూపములఁ జనించి నయమున మన్వం
తరముల నిజసత్త్వంబునఁ బరిపాలించును జగంబుఁ బౌరుషమొప్పన్.

క. క్రమమునఁ ద్రైవర్గిక సర్గము సెప్పంబడె సరోజగర్భుఁడు దివసాం
తమునఁ దమః[4]పిహితపరాక్రముఁడై శయనించు నిద్రఁ గైకొనియంతన్

1 ఉత్పాదిల్లు = పుట్టు. 2 ధరాదివిజులు = బ్రాహ్మణులు. 3 సుపర్వులు = దేవతలు. 4 పిహితము = కప్పఁబడినది.

సీ. ఆరాత్రి భువనత్రయము దమఃపిహిత మై
భానుచంద్రులతో విలీన మైన
సర్వాత్ముఁడగు హరి శక్తిరూపంబయి
కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని
భువనత్రయంబును దవిలి దహింప న
య్యనలకీలలఁ బొడమిన మహోష్మ
మలమినఁ గమలి మహర్లోకవాసులు
జనలోకమునకును జనుదు రపుడు
తే. విలయసమయసముత్కట విపులచండ
వాతధూతోర్మిజాలదుర్వారవార్ధి
భువనములు ముంచు నమ్మాఁడు భువనములను
దత్పయోరాశిమీఁదఁ బద్మావిభుండు. 355

ఉ. చారుపటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా
పూర మృణాళ హార పరిపూర్ణ సుధాకర కాశ మల్లికా
సారనిభాంగశోభితభుజంగమ తల్పమునందు యోగని
ద్రారతిఁ జెందియుండు నితరస్థితభూర్భువరాదిలోకుఁ డై. 356

క. జనలోకస్థితవాసులు ఘనకీర్తిని వినుతింపంగ నతుల దివ్యప్రభచేఁ
దనరుచు మహితాలితనిజలోచనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్.

వ. ఇవ్విధంబున. 358

సీ. కైకొని బహువిధ కాలగత్యుపలక్షి
తము లై యహోరాత్ర తతులు జరగ
శతవత్సరంబులు జనులకుఁ బరమాయు
వై నరీతిని బంకజాసనునకుఁ
బరమాయు వగు శతాబ్దంబు లందుల నగ
మరిగిన నదియు పరార్ధమండ్రు
గాన పూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వి
తీయపరార్ధంబు దీని పేరు
తే. గడఁగి పూర్వపరార్ధాది కాలమందు
బ్రహ్మకల్పాఖ్య నెంతయుఁ బరగు నందు

బ్రహ్మయుదయించుటం జేసి బ్రహ్మకల్ప
మనియు శబ్దాత్మకబ్రహ్మమనియు నెగడె. 359

క. విను మెన్నఁడు పంకజనాభుని నాభీసరసియందు భువనాశ్రయమై
తనరిన పద్మము వొడవడు, ననఘా యది పద్మకల్ప మన విలసిల్లున్.

వ. పూర్వపరార్ధాదినిం గలిగిన బ్రహ్మకల్పంబుఁ జెప్పితి నింక ద్వితీయ
పరార్ధంబు మొదల నెన్నఁడేని హరి [1]సూకరాకారంబు దాల్చె నది
[2]వరాహకల్పం బనందగు నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం
బగు చున్నది వెండియు. 361

సీ. దీపింపఁ గాలస్వరూపుఁ డై నట్టి ప
ద్మాత్ముఁడనంతుఁ డనాదిపురుషుఁ
డఖిల విశ్వాత్మకుఁ డగు నీశునకుఁ బర
మాణ్వాదియుగపరార్ధాంత మగుచు
జరగు నీకాలంబు చర్చింప నొక్క ని
మేషకాలం బయి మెలఁగు చుండుఁ
గాని యీశ్వరునకుఁ గర్త గాఁజాల ది
క్కాలంబు విను మది గాక !

తే. మందిరార్థాదికర్మాభిమాన శీలు
రైనవారికి నాశ్రయం బగుటఁజేసి
యరయ హరి తద్గుణవ్యతికరుఁడు గాన
కాల మమ్మేటి కెన్నఁడుఁ గర్త గాదు.

వ. మఱియు షోడశవికారయుక్తం బై ప
బయి దశావరణంబులు గలిగి పంచాశత్కోటివిస్తీర్ణం బై బ్రహ్మాండ
కోశంబు దనర్చు చుండు. 363

చ. హరిపరమాణురూపమున నందు వసించి విరాజమానుఁ డై
సరి వెలుఁ గొందు నిమ్ముల నసంఖ్యము లైన మహాండకోశముల్
నెఱిఁ దనయందు డింద నవనీరజనేత్రుఁ డనంతుఁ డాద్యుఁ [3]డ
క్షరుఁడు పరాపరుం డఖిలకారణకారణుఁ [4]డప్రమేయుఁ డై. 364

---

1 సూకరము = అడవిపంది. 2 వరాహము = అడవిపంది. 3 అక్షరుఁడు = నాశనములేనివాఁడు. 4 అప్రమేయుఁడు = మితిలేనివాఁడు.

క. నిరతిశయోజ్జ్వల తేజః స్ఫురణం దనరారుపరమపురుషుని విష్ణుం బురుషోత్తము వర్ణింపను,సరసిజభవభవుల కైన శక్యమె చెప్పుమా. 365

క. అని మైత్రేయుఁడు విదురుం
గనుఁగొని వెండియును బలికెఁ గాలాహ్వయుఁ డై
తనరిన హరిమహిమల నే
వినిపించితి సృష్టిమహిమ విను మెఱిఁగింతున్. 366

వ. పరమేష్ఠి యాసృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధిం గల మోహంబును నంగనాసంగమ [1]స్రక్చందనాది గ్రామ్యభోగేచ్ఛలు గల మహామోహంబును దత్ప్రతిఘాతజాతం బైన క్రోధంబు నందుఁ గలుగు నంధతామిస్రంబును దన్నాశంబునం 'దహ మేవ మృతోఽస్మి' యను తామిస్రంబును జిత్తవిభ్రమంబును నను నవిద్యాపంచక మిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయచిత్తంబునం బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత[2]పూతమానసుండై యూర్ధ్వరేతస్కులును బరమపవిత్రులును నైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లను మునుల సత్త్వగరిష్ఠుల ధీరజనోత్తముల నార్యుల హరిపరాయణులంగా దివ్యదృష్టిం గల్పించి వారలం జూచి మీ మీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుం గని మోక్షధర్ములును నారాయణపారాయణులును నై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన నుదయించిన క్రోధంబు బుద్ధిచే నిగ్రహింపఁబడినను నరవింద సంభవుని భ్రూమధ్యంబు వలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుం డై యుదయించుచు [3]నాక్రందనం బొనరించె నంత. 367

మ. జననం బందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి
ట్లను నో దేవ మదాఖ్య లెట్టివి మదీయావాసముల్ వీఁక నా
కనయంబు న్నెఱిఁగింపవే యనుడు నయ్యంభోజగర్భుండు లా
లనముం దోఁపఁ గుమార నీజననవేళన్ రోదనం బిచ్చుటన్. 368

---

1 స్రక్చందనములు_పూలు, గంధము. 2 పూతము_పవిత్రము. 3 ఆక్రందనము_ఏడుపు.

తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ
జంద్రసూర్యానలానిల సలిలగగన
పృథివి ప్రాణతపోహృదింద్రియములనఁగ
గలుగు నేకాదశస్థానములు వసింప. 369

వ. అని వెండియు మన్యు మను మహాకాల మహచ్ఛివ ఋతధ్వజోరురే
తోభవ కాల వామదేవ ధృతవ్రతు లను నేకాదశనామంబులు గలిగి
ధీ వృత్త్యశనోమా నియుత్సర్పి రిలాంబి కేరావతీ సుధా దీక్షా
నామపత్నీ సమేతుండ వై పూర్వనియుక్తంబు లయిన నామంబులం
దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపు మని నిర్దేశించిన
భగవంతుం డగు నీలలోహితుండు విశ్వగురుం డైన పితామహునిచే
నియుక్తుం డై సత్త్వాకృతిస్వభావంబుల నాత్మసము లైన ప్రజలం
గల్పించె. 370

ఉ. రుద్రునిచేత నీగతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డయా
రుద్రగణంబు లోలి నవరుద్ధతవిశ్వము మ్రింగ నమ్మహో
పద్రవశాంతి కై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార మీ
రాద్రివిలోకనానలభరంబునఁ గ్రాఁగె సమస్తలోకముల్. 371

క. మీసృష్టి సాలు నింకన్, ధీసత్తములార వినుఁడు ధృతి మీరు తపో
వ్యాసంగచిత్తులై చనుఁడా సన్మంగళములగు దృఢంబుగ మీకున్.

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వభూ
తగణావాసు నధోక్షజున్ [1]శ్రితజనత్రాణైకపారీణు నా
జగదాత్ముం గను చుందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై. 373

వ. అనిన విని. 374

ఉ. కైకొని యిట్లు పంకరుహగర్భ నియంత్రితులైన రుద్రులు
ద్రేకముఁ దక్కి కానలకు ధీయుతులై తప మాచరింప [2]న
స్తోకచరిత్ర నేఁగిరి చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా
లోకనుఁడై సృజించె జనలోకశరణ్యుల ధీవరేణ్యులన్. 375

---

1 శ్రిత.....పారీణుఁడు = ఆశ్రయించిన జనులను రక్షించుటయం దాసక్తి గలవాఁడు. 2 అస్తోకము = అధికము.

తే. వినుము భగవ [1]ద్బలాన్వితవినుతగుణులు
భువనసంతానహేతు విస్ఫురణకరులు
పద్మసంభవతుల్యప్రభావయుతులు
పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు. 376

సీ. అరవిందసంభవు నంగుష్ఠమున దక్షుఁ
డూరువువలనను నారదుండు
నాభిఁబులహుఁడు గర్ణములఁబుల స్త్యుండు
త్వక్కున భృగువు హస్తమునఁగ్రతువు
నాస్యంబునలన నయ్యంగిరసుఁడు ప్రాణ
మున వసిష్ఠుఁడు మనమున మరీచి
గన్నుల నత్రియుఁ గాఁ బుత్రదశకంబు
గలిగిరి వెండియు నలినగర్భ

తే. దక్షిణస్తనమువలన ధర్మ మొదవె
వెన్నువలనను నుదయించె విశ్వభయద
మైన మృత్యు వధర్మంబు నంద కలిగె
నాత్మఁగాముండు జననము నందె మఱియు. 377

సీ. భ్రూయుగళంబునఁ గ్రోధంబు నధరంబు
నందు లోభంబు నాస్యమున వాణి
యును మేఢ్రమందుఁ బయోధు లపానంబు
నందు నఘాశ్రయుఁడైన నిరృతి
లాలితచ్ఛాయవలన దేవహూతివి
భుండు గర్దముఁడును బుట్టి రంత
నబ్జజుఁ డాత్మదేహమున జనించిన
భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి

తే. పంచశరబాణనిర్భిన్న భావుఁ డగుచుఁ
గాతురని పాపమునకు సంకోచపడక
కవయఁ గోరిన జనకునిఁగని మరీచి
మొదలుగాఁగల యమ్మునిముఖ్యులెఱిఁగి. 378

1 బలాన్వితులు= బలముతోఁగూడుకొనినవారు.

వ. ఇట్లనిరి. 379

ఉ. చాలుఁ బురే సరోజభవ సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని
[1]ట్లాలరి వైరమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే
చేలరి వైతి నీతగవుఁ బెద్దతనంబును నేలపాలుగా
శీలము వోవఁ దట్టి యిటు సేసిన వారలు మున్ను గల్గిరే. 380

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ విట్టిచోట రా
జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁ డయ్యె నీ
[2]భావభవప్రసూనశరబాధితుఁడై తనకూఁతుఁ బొందెఁ బో
[3]వావి దలంప లేకనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే. 381

క. పాపముదలఁపక నిమిషము,లోపలఁ జెడుసౌఖ్యమునకులోనైతి వెయిం
తే పో ధారుణిఁ[4]'గామాన్ధోఽపి నపశ్యతి' యనంగఁ దొల్లియు వినమే.

మ. అని యిబ్భంగి మునీంద్రు లాడిన కఠో[5] రాలాపముల్ వీనుల
న్విని లజ్జా [6]వనతాననుం డగుచు నానీరేజగర్భుండు స
య్యాన దేహంబు [7]విసర్జనీయముగఁ జేయన్ దిక్కు లేతెంచి త
త్తనువుం గైకొనఁ బుట్టె దిక్కలితమై [8]తామిస్రనీహారముల్. 383

వ. అంత. 384

చ. ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహముఁ దాల్చి ధైర్యమున్
విడువక సృష్టిపూర్వ [9]సమవేతమునన్ సృజియించునేర్పు దాఁ
బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులన్
వెడలె [10]ననూనరూపముల వేదము లంచితధర్మయుక్తితోన్. 385

తే. మఱియు [11]మఖములు మహితకర్మములుఁ దంత్ర
ములును నడవళ్లు నాశ్రమములుఁ దదీయ
ముఖచతుష్కమునందున పొడమె ననిన
విని మునీంద్రునిఁ జూచి యవ్విదురుఁ డనియె. 386

---

1 అలరి = దుశ్శీలుఁడు. 2 భావ...బాధితుఁడై = మన్మథుని పుష్పబాణములచే బాధితుఁడై. 3 వావి = వరుస. 4 కామాంధోపినపశ్యతి = స్త్రీవాంఛచే గ్రుడ్డి వాఁడగు నతఁడు చూడఁజాలఁడు.

5 ఆలాపములు = మాటలు. 6 అవనత = వంపఁబడిన. 7 విసర్జనీయము = విడువఁదగినది. 8 తామిస్రనీహారములు = చీకటియు, మంచును. 9 సమవేతము = కూడినసంబంధము నొందినది. 10 అనూనము = అధికము. 11 మఖము = యజ్ఞము.

క. తోయజసంభవుఁ డత్తఱి
నే యేముఖమండలమున నేయేసృష్టిన్
ధీయుతుఁడై సృజియించెను
బాయక యత్తెఱఁగుఁ దెలియఁబలుకుము నాకున్. 387

వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో నిట్లనియె ఋగ్యజుస్సామాథర్వంబు లను వేదంబులును [1] హోతృకర్మంబు లయిన యప్రగీతమంత్రస్తోత్రంబు లగు శస్త్రంబులును [2] నధ్వర్యుకర్మం బైన యిజ్యయు సంప్రగీతస్తోత్రంబయిన స్తుతియును[3] నుద్గాతృప్రయోజ్యం బైన ఋక్సముదాయరూపం బగు స్తోమంబును బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబును నాయుర్వేద ధనుర్వేదగాంధర్వవేదంబులను నుపవేదంబులును విశ్వకర్మ శాస్త్రంబగు స్థాపత్యంబును బ్రాగాది ముఖంబుల నుత్పన్నంబు లయ్యెఁ బంచమవేదంబగు నితిహాసపురాణంబులు సర్వముఖంబులం గలిగె మఱియుఁ గర్మతంత్రంబు లయిన షోడశ్యుక్థ్యలును యజనాగ్నిష్టోమంబులును నాప్తోర్యామాతిరాత్రంబులును వాజపేయగోసవంబులును ధర్మపాదంబు లైన విద్యాదానతపస్సత్యంబులును బ్రహ్మచర్యగృహస్థ వానప్రస్థ యత్యాశ్రమంబులును ననువీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబులైన వృత్తులును గలిగియుండు నందు సావిత్రంబన బ్రహ్మచర్యం బది యుపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుటయు ప్రాజాపత్యం బన వేదవ్రతచతుష్టయం బందుఁ బ్రతివ్రతంబును వ్రతులు సంవత్సరపర్యంతంబుగా నాచరింప నగు బ్రాహ్మంబు వేదగ్రహణాంతంబు నాచరింపందగు బృహత్తన నైష్ఠికం బియ్యవి యను బ్రహ్మచారివృత్తిచతుష్టయంబును ననిషిద్ధకృష్యాదివృత్తియగు వార్తయు యజనాదికర్మప్రయుక్తంబైన యాచ్ఞాదిరూపధనసంచయంబును బరులయాచింపకుండు నయాచితం బగుశాలీనంబును క్షేత్రపతితకణిశకణసంగ్రహణ రూపంబగు శిలోంఛంబును నను గృహస్థవృత్తులు నాలుగును నకృష్టపచ్యాహారులగు వైఖానసులును నూతన

1 హోత = ఋగ్వేదమంత్రము లెఱిఁగిన ఋత్విక్కు. 2 అధ్వర్యుఁడు = యజ్ఞమునందు యజుర్వేదతంత్రము నడపువాఁడు. 3 ఉద్గాత = యజ్ఞమునందు సామవేద తంత్రము నడుపువాఁడు.

ఫలంబు లబ్ధంబైనఁ బూర్వసంచితపదార్థత్యాగంబు గల వాలఖిల్యు
లును బ్రాతఃకాలంబున నేదిక్కు విలోకింతు రద్దిక్కునకుం జని
యచ్చట లభించు పదార్థంబుల భుజించి జీవించు నౌదుంబరులును
దమంత ఫలించి [1]తరుపతితంబు లగు ఫలంబులఁ దినుచుండు ఫేనపు
లును నను చతుర్విధవృత్తులు గల వానప్రసులును స్వాశ్రమవిహిత
కర్మంబులం బ్రధానుం డగు కుటీచకుండును గర్మం బుపసర్జనంబు
సేసి జ్ఞానప్రధానుం డయిన బహూదకుండును గేవల జ్ఞానాభ్యాస
నిష్ఠుండగు హంసుండును బ్రాప్తంబైన పరబ్రహ్మ తత్త్వంబు గల
నిష్క్రియుండును నను సన్న్యాసిచతుర్విధవృత్తులును మోక్షఫల
ప్రదంబై యాత్మానాత్మవివేక విద్యారూపం బగు నాన్వీక్షకియు
స్వర్గాదిఫలప్రదంబై కర్మవిద్యారూప మగు త్రయియు జీవన
ఫలప్రధానంబై కృష్యాదిరూపం బగు వార్తయు నర్థసంపాదనైక
ప్రయోజనంబగు దండనీతియు మోక్షధర్మ కామార్థంబులైన
న్యాయవిద్యా చతుష్టయంబును భూర్భువస్సువ యను వ్యాహృతు
లును బూర్వాది ముఖంబులవలన నుదయించె మఱియు నతని
హృదయాకాశంబు వలనం బ్రణవంబునుం రోమంబువలన నుష్ణి
క్ఛందంబును ద్వగింద్రియంబువలన గాయత్రీఛందంబును
మాంసంబు వలనఁ ద్రిష్టుప్ఛందంబును [2]స్నాయువువలన ననుష్టు
ప్ఛందంబును నస్థివలన జగతీచ్ఛందంబును మజ్జవలన పంక్తిచ్ఛదం
బును బ్రాణంబువలన బృహతీఛందంబును గకారాది పంచ
వర్గాత్మకంబు లయిన స్పర్శంబులను జీవుండును నకారాది
స్వరాత్మకంబైన దేహంబును నూష్మంబు లను శషసహ వర్ణ
చతుష్టయ రూపంబులగు నింద్రియంబులును నంతస్థంబు లగు
య ర ల వ యను వర్ణంబులు షడ్జాది సప్తస్వర రూపంబు నాత్మ
బలంబు నయిన శబ్దబ్రహ్మంబును జతుర్ముఖుని లీలావిశేషంబున
నుత్పన్నం బయ్యె వ్యక్తావ్యక్తంబై వైఖరీప్రణవాత్మకంబైన శబ్ద
బ్రహ్మంబువలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం డగుటం జేసి పరి
పూర్ణుండును వ్యక్తాత్మకుం డగుటం జేసి యింద్రాది శక్త్యుప

1 తరుపతితంబులు = వృక్షమునుండి పడినవి. 2 స్నాయువు = సన్ననినరము.

బృంహితుండునునై కానంబడుఁ బదంపడి యజుండు భూరివీర్యవంతు
లయినఋషిగణంబుల సంతతి యవిస్తృతంబని తలంచి పూర్వతను
పరిగ్రహంబు సాలించి యనిషిద్ధ కామాసక్తంబైన దేహాంతర
పరిగ్రహంబుసేసి నిత్యంబుఁ బ్రజాసృష్టియందు వ్యాసక్తుండ నైనం
బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమికారణంబగు నని యచ్చెరు
వొంది దత్ప్రవృద్ధియగు విధం బాలోచించుచు దైవం బిచ్చట
విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకంబని దాని నెదురు
చూచుచు యథోచితకృత్య కరణదక్షుం డగుచుండ చతుర్ముఖుని
దేహంబు ద్వివిధం బయిన నట్టి రూపద్వయ విభాగంబు స్వరాట్టగు
స్వాయంభువమనువును దన్మహిషి యగు, శతరూప యను
కన్యకయుంగా మిథునం బయిజనియించె నమ్మిథునంబువలనం బ్రియ
వ్రతోత్తానపాదులను పుత్త్రద్వయంబు నాకూతి దేవహూతిప్రసూ
తులను కన్యకాత్రయంబునుం గలిగి రందు నాకూతినిరుచికునకును
దేవహూతిం గర్దమునకును బ్రసూతిందక్షునకును నిచ్చెవీరలవలనఁ
గలుగు ప్రజాసంతతులచేత జగంబులు పరిపూర్ణంబులయ్యె.

—♦ స్వాయంభువ మనువు ప్రజావృద్ధి సేయుట ♦—

క. అని మైత్రేయుండు పలికిన, వినిమనముఁ నహర్షమొదవ ♦ విదురుఁడు మునినా
థునిఁ జూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదరపాదభక్తి ♦ నశమానసుఁడై.

క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ
తనయుండు స్వాయంభువుండు ♦ దైతేయవిభే
దనసేవాచతురుండును
జనవినుతుం డాదిరాజ ♦ సత్తముఁ డౌటన్. 390

క. అతనిచరిత్రం[1]బవ్యా, హతసుఖదమునిఖిల [2]శమంగ ♦ ళావహము సమం
చితముం గావున బుధసే, వితనాకెఱుఁగంగఁ బలుక ♦ వే మునితిలకా.

క. అదియునుగాకముకుందుని, పదకమలమరంద పాన ♦ పరవశులైపెం
పొదవిన వారిచరిత్రము, సదమలమతి వినిన భవము ♦ సఫలముగాదే.

చ. అని విదురుండు పల్కిన ద ♦ యాన్వితుఁడై మునినాథచంద్రుం డి
ట్లను శ్రుతిశాస్త్రపారకలి ♦ తాత్మకుఁడైన నరుఁడు పద్మలో

---

1 అవ్యాహతసుఖదము=ఎడతెగని సుఖమునిచ్చునది. 2 ...శుభముకలుగఁజేయునది.

చనచరణారవిందయుగ ♦ సంగము గల్గిన సజ్జనుండు వాం
ఛితఫల మొందు భాగవత ♦ దివ్య కథాశ్రవణాను రక్తిచేన్.

క. అని చెప్పి మునికులాగ్రణి
దనుజారి కథాసుధాప్లు ♦ తాత్మ్మ ఁడౌచుం డై
తనువునఁ బులకాంకురములు
మొనయఁగ నానందబాష్ప ములు జడిగురియన్. 394

సీ. వినిపింపఁ దొడఁగె నా ♦ ఘనుఁడు స్వాయంభుఁ
డంగనాయుక్తుఁడై ♦ యబ్జభవు
నకు మ్రొక్కి వినయవి ♦ నమితోత్తమాంగుఁడై
హస్తముల్ మొగిచి యి ♦ ట్లనియెఁ బ్రీతి
జీవరాసులకు రా ♦ జీవసంభవ నీవ
జననము ఋణ వినా ♦ శముల నరయ
హేతుభూతుఁడవు మా ♦ కెద్ది యాచరణీయ,
మైన కర్మము దాని నానతిమ్ము

తే. ఎట్టికర్మంబు సేసిన ♦ నెసఁగునీకు
శినవహితంబైన సంతోష ♦ మాత్మజుండు
జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి
నంది నుతికెక్కి వర్తించు ♦ నంచు నిందు. 395

వ. కావున నెఱింగిపు మట్టి సత్కర్మంబు

క. అని పలికిన స్వాయంభువ
మను మృదుభాషలకు నలరి మనమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరి
గొనఁ బ్రియతముఁడైన సుతున ♦ కును నిట్లనియెన్. 396

చ. మునుకొని తండ్రియాజ్ఞఁ దల ♦ మోచి నిజోచితకృత్యమేమి వం
చినఁ దనశక్తియుక్తి నెడ ♦ సేయక చేయుట పుండరీక లో
చనపదసేవ సేయుట ప్రి ♦ జాపరిపాలన శాలి యాటయుఁ౯.
జనకునకుఁ౯ సుతుండు పరి ♦ చర్య లొనర్చుట సువ్వె పుత్రకా. 397

వ. కావున.

1 అప్ల = మునింగిన. 2 వినమితోత్తమాంగుఁడు = వంచినశిరస్సుకలవాఁడు

మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ ♦ విష్ణున్ హృషీకేశుఁ గే
శవుఁ బద్మాక్షుఁ గుఱించి జన్నములు శ ♦ శ్వద్భక్తిఁ గావింప మా
ధవుఁ డాత్మం బరితోష మొందు నతఁ డు ♦ ద్యత్ప్రీతిఁ గైకొన్నలో
కవితానంబులు 1దుష్టి నొందు ననఘా! ♦ కావింపుమా యజ్ఞముల్

చ. అకుటిలభక్తిఁ గేశవస ♦ మర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వాన
ర్పక విపరీతులై యుముక ♦ దాసులు దంచి ఫలంబు నందఁగా
నక చెడుకీతినూరక ధన ♦ వ్యయ మోటయ కాని మోక్షదా
యక మగుచున్నతత్ఫలము ♦ నందరు విష్ణుపరాఙ్ముఖక్రియల్. 400

ఉ. కావున యజ్ఞముల్ హరి వి ♦ కారవిదూరుఁ గుఱించి చేయు నీ
భావము సూనృతవ్రత శు ♦ భస్థితిఁ జెందెడు నీకుమారులున్
నీవును నీధరాభరము ♦ నెమ్మి వహింపుము సజ్జనావలిం
బ్రోవుము ధర్మమార్గమునఁ ♦ బుత్రక 2దోషలతాలవిత్రకా. 401

క. అనవుడు నతనికి నతఁ డి,ట్లని యెన్ భవదీయమైన ♦ యానతి యెట్ల
ట్లొనరించెద నాకును నా,తనయులకు వసించియుండఁ ♦ దగు నెల వెందున్.

—♦ శ్రీయజ్ఞవరాహావతారాభివర్ణనము ♦—

తే. అరయ లేదా విధాత యీ ♦ యఖిలజంతు
జాతముల కెల్ల నాధార ♦ భూతమైన
ధరణి యిప్పుడు ఘనజలాం ♦ తర3నిమగ్న
మైనకతమునఁ జోటు లే ♦ దంటి దండ్రి. 403

క. కావున భూమ్యుద్ధరణము, గావించు నుపాయమిపుడు ♦ గైకొని నాకున్
దేవా నీ వెఱిఁగింపుము, నావుడుఁ బద్మజుఁడు దనమ ♦ నంబునఁ దలచెన్.

మ. జలమధ్యంబున లీన మొందిన ధరా ♦ చక్రంబు నే నేర్పునన్
నిలుపన్ వచ్చును బూర్వమందు జగముల్ ♦ నిర్మించునాఁ డాది4న
ప్పులఁ బుట్టించిన మీఁద నవ్వసుమతిం ♦ బుట్టించితిం బుత్రయ
ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునం ♦ బొందెం గదా 5పృథ్వియున్.

సీ. అఖిలజగత్కల్ప ♦ నాటోపములకుఁ బా
ల్పడిన నాచేత నె ♦ బ్బంగి నిపుడు

---

1 తుష్టి = సంతృప్తి 2 దోషలతాలవిత్రకా = పాపములను తీఁగలకుఁ గొడవలి వంటివాఁడా! 3 నిమగ్నము = మునిఁగినది. 4 అప్పు = జలము. 5 పృథ్వి = భూమి.

దగిలి [1]విశ్వంభరో ♦ ద్ధరణంబుఁ గావింప
నగు నని సర్వభూ ♦ తాంతరాత్ముఁ
బురుషోత్తముని నవ ♦ పుండరీకాక్షు ల
క్ష్మీపతిఁ దనమన ♦ స్సీతునిఁ జేసి
తలపోయుచున్నఁ బ ♦ ద్మజు[2]నాసికావివ
రమ్మున యజ్ఞవ ♦ రాహమూర్తి
తే. యర్థి నంగుష్ఠమాత్ర దే ♦ హంబు తోడ
జననమంది [3]వియత్తల ♦ స్థాయి యగుచు
క్షణములోపల భూరి గ ♦ జ ప్రమాణ
మయ్యె నచ్చటి జనముల ♦ కద్భుతముగ. 406
సీ. అంతఁ బ్రజాసర్గ ♦ మందు నియుక్తులై
నట్టి మరీచ్యాదు ♦ లైన మునులు
మనుకుమారకులు న ♦ మ్మనుసహితంబుగ
యజ్ఞవరాహంబు ♦ నర్థిఁ జూచి
యిట్టి యాశ్చర్య మె ♦ ట్లొందెనిఁ గలదె నా
సారంధ్ర [4]నిర్గత ♦ స్తబ్ధరోమ
లోకంబు మనము వి ♦ లోకింప నంగుష్ఠ
మాత్రమై యాక్షణ ♦ మాత్రలోన
తే. మహిమ దీపింప [5]దంతిప్ర ♦ మాణమును మ
హోన్నతంబైన గండ[6]శై ♦ లోపమంబు
నయ్యె ననుచు వితర్కించి ర ♦ బ్జభవుఁడు
హర్ష మిగురొత్తఁ జూచి యి ♦ ట్లని దలఁచె. 407
క. నామనమునఁ గలదుఃఖ[7]వి,రామముఁ గావించుకొఱకు♦రాజీవాక్షుం
డీమేర యజ్ఞ[8]పోత్రి, శ్రీమూర్తి వహించె నిది వి ♦ చిత్రము దలఁపన్
వ. అని వితర్కించుసమయంబున సూకరాకారుండయిన భగవంతుండు.

1 విశ్వంభరోద్ధరణము = భూమిని పైకెత్తుట. 2 నాసికావివరము = ముక్కు రంధ్రము. 3 వియత్తలము = ఆకాశము. 4 నిర్గతము = బయలుదేరినది. 5 దంతి = ఏనుఁగు. 6 శైలము = పర్వతము. 7 విరామము = విశ్రాంతి. 8 పోత్రి = పంది.

తే. [1]ప్రళయ జీమూత సంఘాత ♦ భయద ఘోర
గర్జనాటోపలోభ కృ ♦ ద్ఘన గభీర
రావ మడరింప నపుడు రా ♦ జీవభవుఁడు
మునులు నాసంస్తుతింపఁ బొంది ♦ రఘుచరిత. 410

వ. అంత మాయావరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండ[2]కోటర పరిస్ఫోటనంబుగా వినిన విని జనస్తపస్సత్యలోకనివాసు లయిన మునులు ఋగ్యజుస్సామమంత్రంబుల వినుతించిరి. యజ్ఞ వరాహ రూపధరుం డయిన సర్వేశ్వరుండు సత్పురుషపాలనదయాపరుండు గావునఁ దిగ్గజేంద్ర లీలావిలోలుండై. 411

సీ. [3]కఠినసటాచ్ఛటో ♦ త్కటజాతవాత ని
ర్ధూతజీమూత సం ♦ ఘాత మగుచు
[4]క్షురనిభ సునిశిత ♦ ఖురపుటాహతచల
త్ఫణిరాజ దిగ్గజప్ర ♦ చయ మగుచుఁ
[5]చండదంష్ట్రోత్థవైశ్వా ♦ నరార్చిస్స్రవ
ద్రజత హేమాద్రి ♦ విస్రంభ మగుచు
ఘోర గంభీర ఘుర్ఘుర ♦ భూరినిస్స్వన
పంకిలాఖిలవార్ధి ♦ సంకులముగఁ

తే. బొరలుఁ గెరలు నటించు ♦ నంబరము దెరల
రొప్పు [6]నుప్పర మెగయును ♦ గొప్పరించు
ముట్టె బిగియించు మునమున ♦ మూరుకొనుచు
నడరు సంరక్షితక్షోణి ♦ యజ్ఞ [7]ఘోణి. 412

1 ప్రళయ.....రావము = ప్రళయకాలపు మేఘముల సముదాయముయొక్క భయము కల్గించునట్టి పెద్దగర్జనవంటి సంభ్రమముతో ప్రబద్ధలుచేయఁబడిన దిక్కులుగల పెద్ద గంభీరధ్వని. 2 కోటరపరిస్ఫోటనము = కుహరమును భేదించుట. 3 కఠిన......సంఘాతము = బిరుసైన జూలుయొక్క సముదాయమువలన నధికముగాపుట్టిన గాలిచేత నెగురఁగొట్టఁబడిన మేఘముల సముదాయముగలది. 4 క్షుర.....ప్రచయము = కత్తితో సమానమైన పదునుగల్గిన పుటములవంటి గిట్టలచేత కొట్టఁబడుటచేఁ గదలిన యాదిశేషువును దిగ్గజముల సమూహముకలది. 5 చండ.....విస్రంభము = వాఁడిగలకోరలనుండి పుట్టిన యగ్నిజ్వాలల స్రవించుచున్న కైలాస మేరుపర్వతములను బోలినదియు 6 ఉప్పరము = ఆకాశము. 7 ఘోణి = పంది.

వ. మఱియు నయ్యజ్ఞ వరాహంబు.

సీ. తివిరి చతుర్దశ ♦ భువనంబులనుదొంతు
లౌరగఁ గొమ్ములఁ జిమ్ము నొక్కమాటు
[1]పుత్తడికొండ మూఁ ♦ పురమును నొరయంగ
నుఱుకు రాపాడు నొక్కొక్కమాటు
[2]ఖురముల సప్తసా ♦ గరముల రొంపిగా
నుక్కించి మట్టాడు ♦ నొక్కమాటు
నాభీలశివాల వా ♦ తాహతిచే మింటి
నొరసి బ్రద్దలుసేయు ♦ నొక్కమాటు

తే. గన్నుఁగొనల[4]విస్ఫులిం ♦ గములు సెదర
నురుభయంకర గతిదోఁచు ♦ నొక్కమాటు
పరమ యోగీంద్ర జనసేవ్య ♦ భవ్యవిభవ
యోగ్యమై కానఁగా నగు ♦ నొక్కమాటు. 414

వ. ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందిన తృతీయ[5]సవనరూపుండయిన యజ్ఞవరాహమూర్తియగు సర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగనిద్రావశుండై యుండు నవసరంబున నుదకస్థంబైన భూమి రసాతలగతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁదరియం జొచ్చు వేగంబుఁ సైరింపంజాలక సముద్రుం డూర్ములను భుజంబులెత్తి [6]విశీర్ణహృదయుండై యార్తునిపగిది 'యజ్ఞవరాహ! నన్ను రక్షింపు రక్షింపు'మని యాక్రోశింప నిసిత[7]కరాళక్షురతీక్ష్ణంబులైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారంబయిన రసాతలంబుఁ బ్రవేశించి భూమిం బొడగను నవసరంబున.

క. [8]శరనిధిలోన మహోగ్రా
[9]మరకంటకుఁ డెదురఁ గాంచె ♦ మఖమయగాత్రా
ఖురవిదళితకుల[10]గోత్రా
ధరణీకళత్రా గవేష ♦ ధాత్రా [11]పోత్రిన్.

---

1 పుత్తడికొండ = మేరువుపర్వతము. 2 ఖురము = గిట్ట 3 విస్ఫులింగము = అగ్నికణము. 4 సవనము = యజ్ఞము, 5 ఊర్మి = అల. 6 విశీర్ణ = చెదరిన. 7 కరాళము భయంకరము. 8 శరనిధి = సముద్రము. 9 అమరకంటకుండు = రాక్షసుఁడు. 10 గోత్రము = పర్వతము. 11 పోత్రి = వరాహము.

వ. ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుండై. 417

మ. గద సారించి యసహ్యవిక్రమ సమ ♦ గ్రస్ఫూర్తిచే వేఁయగా
నది దప్పించి వరాహమూర్తి నిజదం ♦ ష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁబెం
పొదవం గ్రోధమదాతిరేకబలశౌ ♦ ర్యోదారవిస్తారసం
పదఁ[1]బంచాస్యము [2]సామజేంద్రుఁజలమొ♦ప్పం ద్రుంచు చందంబునన్.

మ. దితిజాధీశుని నీగతిం దునిమి యు ♦ ద్వృత్తిం దదియాంగ[3]శో
ణితపంకాంకితగండభాగుఁ డగుచు ♦ న్విష్ణుండు దా నొప్పె వి
స్తృత సంధ్యాంబుద ధాతు చిత్రత సము ♦ ద్దీప[4]క్షమాభృద్గతిన్
క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరా ♦ శిం బాసి యేతేరఁగన్

తే. బాల[5]శీతాంశురేఖావిభాసమాన
ధవళ దంష్ట్రాగ్రమున నున్న ♦ ధరణి యొప్పె
హరికి నిత్యానపాయినియైన లక్ష్మి
నెరయఁ బూసిన కస్తూరి ♦ నికర మనఁగ. 420

—♦ శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట ♦—

వ. అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసనప్రముఖు లిట్లని స్తుతియించిరి. 421

సీ. దేవ [6]జితం జితం ♦ తే జితం పరమేశ!
సితయజ్ఞభావన ♦ శ్రుతిశరీర!
యనుచుఁ గారణసూకరా ♦ కారుఁ డగు నీకు
నతిభక్తి మ్రొక్కెద ♦ మయ్య వరద
భవదీయరోమకూ ♦ పములందు లీనంబు
లైయుండు నంబుధు లట్టి [7]యధ్వ
రాత్మకమై తన ♦ రారు నీరూపంబు
గానంగ రాదు దు ♦ ష్కర్మపరుల

తే. కట్టినీకుఁ బ్రణామంబు లాచరింతు
మఖిలజగదేకకీర్తిద ♦ యానువర్తి

---

1 పంచాస్యము = సింహము. 2 సామజము = ఏనుఁగు. 3 శోణితము = రక్తము.
4 క్షమాభృత్తు = పర్వతము. 5 శీతాంశురేఖ = చంద్రరేఖ. 6 జితం=జయింపఁబడినది.
7 అధ్వరము = యజ్ఞము.

భవ్యచారిత్ర పంకజపత్త్రనేత్ర
చిరశుభాకార యిందిరాచిత్తచోర. 422

వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి. 423

సీ. [1]త్వక్కున నఖిలవేదములు రోమంబుల
యందును [2]బర్హిస్సు లక్షులందు
నాజ్యంబు పాదంబులందుఁ జాతుర్హోత్ర
కలితంబు లగు యజ్ఞకర్మములును
[3]స్రుక్కు తుండంబున [4]స్రువము నాసికను ని
డాపాత్ర ముదరకోటరమునందు
శ్రవణాస్యబిలములఁ జమసప్రాశిత్రముల్
గళమున నిష్టిత్రికంబు జిహ్వఁ

తే. దగుఁ బ్రవర్గ్యము నగ్నిహోత్రములు నీదు
చర్వణంబును సభ్యావసథ్యు లుత్త
మాంగ మసువులు చయనము లగుఁ గిటీశ
యనుచు నుతియించి రత్తఱి యజ్ఞవిభుని. 424

వ. వెండియు ముహుర్ముహు ర్భగవదావిర్భావంబు దీక్షణీయేష్టియగు నీదు దంష్ట్రలు ప్రాయణీయం బను దీక్షానంతరేష్టియు నుదయనీయం బను సమాప్తేష్టియు యుష్మద్రేతంబు సోమంబును ద్వదీయావస్థానంబు ప్రాత స్సవనాదులు నీదు త్వఙ్మాంసాది సప్తధాతువు లగ్నిష్టోమోక్థ్యషోడశీవాజపేయాతిరాత్రాప్తోర్యామంబు లను సంస్థాభేదంబులును ద్వాదశాహాదిరూపంబులైన బహుయాగసంఘాతరూపంబులు నగు సర్వసత్త్రంబులు భవదీయశరీరసంధులు ససోమాసోమంబు లగు యజ్ఞక్రతువులు నీవ మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుందు వదియునుంగాక. 425

క. [5]హవరూపివి హవనేతవు, హవభోక్తవు నిఖిలహవఫలాధారుఁడవుఁ
హవరక్షకుఁడవునగుదీ, కవితతముగ నుతులొనర్తు మయ్య ముకుందా.

---

1 త్వక్కు=చర్మము. 2 బర్హిస్సు=అగ్ని. 3 స్రుక్కు, 4 స్రువము=యజ్ఞమునందాజ్యము హోమము చేయుట కుపయోగించు గరిటెలవంటి పాత్రలు. 5 హవము=యజ్ఞము.

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు
భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును
హృదయపద్మంబునం దోలి నెఱుఁగఁబడిన
యట్టి నీకు నమస్కార మయ్య వరద. 427

మ. అరవిందోదర [1]తావకీన [2]సితదంష్ట్రాగ్రావలగ్న క్షమా
ధర నద్యబ్ధి నదాటవీయుత సమిద్ధక్ష్మాతలం బొప్పె భా
సుర కాసార జ[3]లావతీర్ణ మదవ [4]చ్ఛుండాలరాడ్దంత శే
ఖర [5]సంసక్త వినీలపంకజము రేఖం బొల్పు దీపింపఁగన్. 428

వ. మఱియును. 429

మ. చతు [6]రామ్నాయ వపు ర్విశేషధర చంచ త్సూకరాకార నీ
సితదంష్ట్రాగ్ర [7]విలగ్నమై ధరణి రాజిల్లెం గులాద్రీంద్రరా
జితశృం [8]గోపరి లగ్న మేఘముగతిం జాలం దగెఁ సజ్జనాం
చితహృ [9]త్పల్వలలోల భూరమణ లక్ష్మీనాథ దేవోత్తమా. 430

సీ. సమధికస్థావర జంగమాత్మకమైన
వసుమతీ చక్ర మవక్రలీల
నుద్ధరించితి కరుణోపేతచిత్తుండ
వగుచు[10]నస్మన్మాత యయ్యె ధరణి
మాతయో యట్లని మదిఁ దలంచెద వేనిఁ
జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుఁడ వగుట[11]యుష్మత్పత్ని భూదేవి
యగుట మాకును దల్లి యయ్యె నిపుడు

తే. ధరకు నీతోడఁ గూడ వందన మొనర్తు
మరణియందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు
కరణి మీ తేజ మీ ధరా కాంతయందు
నిలుప ధరణి పవిత్రయై నెగడుఁగాన. 431

1 తావకీన = నీయొక్క. 2 సిత = తెల్లనైన. 3 అవతీర్ణ = దిగిన. 4 శుండాల రాట్ = ఏనుఁగులలో రాజు. 5 సంసక్తము = కూడుకొనినది. 6 ఆమ్నాయవపుః = వేదములను శరీరముగా. 7 విలగ్న = పొందిన. 8 ఉపరి = మీద. 9 పల్వలలోల = గుంటలోఁ దిరుగునట్టివాఁడా. 10 అస్మత్ = నాయొక్క. 11 యుష్మత్ = నీయొక్క.

చ. తలఁప రసాతలాంతర గత క్షితిఁ గ్రిమ్మఱి నిల్పినట్టి నీ
[1]కలితన మెన్న విస్మయము గాదు సమస్తజగత్తు లోలి నై
గలుగఁగఁ జేయు టద్భుతము గాక మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే రమేశ్వరా. 432

చ. సకల జగన్నియామక విచక్షణలీలఁ దనర్చునట్టి నం
దకధర తావక స్ఫుర దుదారత మంత్రిసమర్థుఁడైన యా
జ్ఞికుఁ డరణిన్ [2]శిఖాతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మా
టకుఁ దలపోసి యీక్షితి దృఢంబుగ నిల్పితి వయ్య యీశ్వరా. 433

చ. సలలిత వేదశాస్త్రమయ [3]సౌకరమూర్తిఁ దనర్చుచున్ రసా
తలమున నుండి వెల్వడు నుదారత మేను విదుర్పఁ దత్సటో
చ్చలితములైన బిందువుల సాధుతపోజన సత్యలోక వా
సుల మగు మేము దోఁగి పరిశుద్ధి వహించితి మయ్య మాధవా. 434

ఉ. విశ్వభవస్థితి ప్రళయవేళలయందు వికారసత్త్వముల్
విశ్వము నీవయై నిఖలవిశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర యీశ కేశవ [4]త్రియీమయ దివ్యశరీర దేవ నీ
శాశ్వతలీల లిట్టివని సన్నుతి సేయఁగ మాకు శక్యమే. 435

సీ. పంకజోదర నీ[5]వపారకర్మండవు
భవదీయకర్మాబ్ధి పార మేద
నెఱిఁగెద నని మది నిచ్ఛగించినవాఁడు
పరికింపఁగా మతిభ్రష్టుగాక
విజ్ఞానియే చూడ విశ్వంబు నీయోగ
మాయాపయోనిధి మగ్నమాటఁ
దెలిసియుఁ దమబుద్ధిఁ దెలియని మూఢుల
నే మన నఖిలలోకేశ్వరేశ

తే. దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు
వితతకరుణాసుధా [6]తరంగితము లైన

---

1 కలితనము = సామర్థ్యము 2 శిఖాతాశనుఁడు = అగ్ని. 3 సౌకరమూర్తి = అడవిపందియొక్క మూర్తి. 4 త్రియీమయ = వేదమయుఁడా. 5 అపారము = అంతు లేనిది. 6 తరంగితములు = వెల్లివిరియుచున్నవి.

నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ
జూచి సుఖులను జేయవే సుభగచరిత. 436

క. అనిబ్రహ్మాదులగు సన్మునివర్యులు భక్తియోగమున వినమితులై
మనమున మోదముఁబ్బిరి, గొనఁబొగడిరి[1]ఖురవిదళితగోత్రుం బోత్రిన్.

ఉ. అంతట లీలఁ బోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య
త్యంతగభీరభీషణ మహార్ణవతోయ సమూహమున్ ఖు[2]రా
క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతల మంబులమీఁద నిల్పి వి
శ్రాంతి వహింపఁజేసి గుణశాలి[3]తిరోహితుఁడయ్యె నయ్యెడన్. 438

ఉ. మంగళమైనయీకథ సమంచితభక్తిఁ బఠింప విన్నవా
రిం గరుణార్ద్రదృష్టిఁ గని శ్రీహరి సాలఁ బ్రసన్నుఁడౌను స
త్సంగతుఁడైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్
మంగళముల్ లభించు ననుమానము లేదది గాక వెండియున్. 439

చ. హరి నిజదాసకోటికిఁ దదాశ్రయులై రమియించునట్టి స
త్పురుషుల కిష్టవస్తుపరిపూర్ణ మనోరథసిద్ధి గల్గు సు
స్థిరమగు చున్న ముక్తియును సిద్ధముగాఁ జెలువారు నన్న న
స్థిరతర తుచ్ఛసౌఖ్యములు నేకుఱుటల్ మఱి చెప్ప నేటికిన్. 440

ఉ. కాన సరోజలోచను జగత్పవనీయ కథా సుధారసం
బానినయట్టి జిహ్వ యసదన్యకథా[4]లవణోదకంబులం
బానము సేయఁ జూచునె [5]సుపర్వమహీజమరంద పానలా
భానుభవంబు నొందు మధుపంబును బోవునె వేపచెట్లకున్. 441

క. అని మైత్రేయమునీంద్రుం, డనఘుఁడువిదురునకుఁ జెప్పినట్టి తెఱంగ
ర్జునపౌత్రునకున్ వ్యాసుని,తనయుఁడువినిపించిమఱియుఁదగనిట్లనియెన్.

క. అని చెప్పిన మైత్రేయుని,గనుఁగొని విదురుఁడుపల్కు ఘనతరమగునా
దనుజకులాంతకు చరితము,విని తనియదు నా మనంబు విమలచరిత్రా.

చ. సవన వరాహమూర్తికథ సర్వము నీదయ వింటి వెండియున్
వివరముగా వినం బలుకవే గుణసాంద్ర మునీంద్రచంద్ర మా

---

1 ఖుర...గోత్రిన్ = గిట్టలచేతఁ జీల్పఁబడిన పర్వతముగలదానిని. 2 ఆక్రాంతము = ఆక్రమింపఁబడినది. 3 తిరోహితుఁడు = అంతర్ధానము పొందినవాఁడు. 4 లవణోదకము = ఉప్పునీరు. 5 సుపర్వమహీజము = దేవతావృక్షమైన కల్పవృక్షము.

ధవ గుణకీర్తనామృతవితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం
జవిఁగొన కేల మాను జనసంతతికిన్ భవతాపవేదనల్. 444

వ. కావున. 445

సీ. శ్రీహరి యజ్ఞవరాహరూపముఁ దాల్చి
మించి హిరణ్యాక్షుఁ దుంచె ననుచు
నప్పుడు మునినాథ చెప్పితి నాతోడ
నవ్వరాహంబు దంష్ట్రాగ్రమునను
ధరణి నెబ్భంగిని ధరియించె హరికి హి
రణ్యాక్షుతోడ వైరమున కేమి
కారణ మసుర నేఁగతి సంహరించెఁ దా
నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత

తే. యనిన మైత్రేయముని విదురునకు ననియె
హరిక[1]థాకర్ణనమునఁ బెంపారునీకు
జన్మఫలసిద్ధి యగుటకు సందియంబు
వలదు హరిమాయ విధికైన వశమె తెలియ. 446

క. అనఘాత్మ నన్ను నీ వడిగిన యీకథ ధ్రువుఁడు విష్ణుకీర్తనపరతం
దనరిన నారదు నడుగ న్నతని కతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్.

తే. దండధరు బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు
నిందునందును వాసికి నెక్కినట్టి
విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు
దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱుతు. 448

వ. ఆకర్ణింపుము. 449

—◆ మైత్రేయమహాముని విదురునకు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మవృత్తాంతం బెఱింగించుట. ◆—

సీ. బలిసి దక్షప్రజాపతి తనూభవ దితి
సంతానరుచి మానసమునఁ బొడమ
నొకనాఁడు పుష్పసాయక శరనిర్భిన్న
భావ యై విరహాతాపమున వచ్చి

1 ఆకర్ణనము = వినుట.

పతిసమాగమవాంఛ ప్రభవింప నిజనాథు
సన్నిధి నిలిచి యస్ఖలితనియతి
నగ్నిజిహ్వుండును [1] యజురధీశుండును
నగువిష్ణుఁ దనచిత్తమందు నిలిపి
తే. తగఁ [2] బయస్సున నగ్నిహోత్రంబు సేసి
[3]కమలహితుఁ డస్తశైలసంగతుఁడు గాఁగ
హోమశాలాంగణమునఁ గూర్చున్న విభునిఁ
గశ్యపునిఁ గాంచి విమలవాక్యముల ననియె. 450
చ. గజవిభుఁ డుద్ధతి న్ననఁటికంబములన్ విదళించులీలఁ జి
త్తజుఁడు ప్రసూనసాయకవితానముచేత మదీయచిత్తమున్
గజబిజి సేసి పెన్వగలఁ గాఱియ వెట్టఁగ నాథ నీపదాం
బుజములఁ గానవచ్చితిఁ బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁగావవే. 451
వ. అదియునుంగాక నాతోడిసవతులెల్లను భవత్కృపావిశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండంజూచి శోకవ్యాకులితచిత్తనై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు నీవు విద్వాంసుఁడవు నీయెఱుంగని యర్థంబు గలదే నీవంటిమహానుభావు లయిన సత్పురుషు లార్తులైన వారికోర్కులు వ్యర్థంబులు గాకుండ దీర్చుట ధర్మం బని వెండియు ని ట్లనియె. 452
క. పతిసమ్మానము వడసిన, సతులకు నభిమతపదార్థసంసిద్ధియు నూర్జితయశముఁగలిగి లోకస్తుతమై చెలువారుచుండుఁజువ్వే మహాత్మా.
క. తనధర్మపత్నివలనను, మునుకొని తాఁ బుత్రరూపమున నుదయించున్ వినుదీప మందు ముట్టించిన దీపము రెండు గావె శిఖయొక టయ్యున్.
క. కావున నీయర్థము [4]"యాత్మావై పుత్ర"యని వేదతతులం దోలిన్ వావిరిఁ బలుకఁగ వినవే, ధీవర ననుఁ గావు మధికదీనం గరుణన్.
చ. వరకరుణామతిన్ దుహితృవత్సలతం దనరారునట్టి మ
ద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దనకూఁతుల నందఱఁ బిల్చి మీమనో
హరు నెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార యటన్న నందులోఁ
బురుషవరేణ్య యేము పదుముగ్గుర మర్మిలి నిన్ వరింపమే. 456

---

1 యజుస్సు=యజుర్వేదము. 2 పయస్సు=పాలు. 3 కమలహితుఁడు=సూర్యుఁడు. 4 ఆత్మావై పుత్రః = తానేపుత్రుఁడు.

క. దితియీగతిఁగామవిమో, హితమతిబహువచనములఁ బ్రాదీశునిఁ బలుకఁ
ధృతిఁ గృపణఁ బతివ్రత నిజ, సతిఁగనికశ్యపుఁడు వలికెసల్లాపమునన్.

వ. నీవు చెప్పినయట్లు పురుషులకు నంగనలవలన ధర్మార్థ కామంబులు సిద్ధించుఁ గర్ణధారుండు నావచేతం బయోధిఁ గడచుచందంబున గృహమేధి సర్వాశ్రమవాసుల నరసి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియింపంజేయు భార్య పురుషునందు సర్ధంబు భార్యయందు సకలగృహకార్యభారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖయించు చుండు మఱియు నితరాశ్రమదుర్జయంబులైన యింద్రియశత్రువర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైనరాజు శత్రుసంఘంబుల జయించుచందంబున లీలామాత్రంబునం జయించు నిట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకలగుణాభిరాములగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులకు నైన సమర్థులు గారనిన మముబోఁటి వారలు సేయనోపుదురే యైన నీమనంబునంగల దుఃఖంబు దక్కుమని యిట్లనియె. 457

తే. తరళలోచన నీవు సంతానవాంఛఁ
జేసి వచ్చితివో గులశీలవర్త
నములుగల భార్యమనమున నమరుకోర్కెఁ
దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ. 458

మ. తరుణీ యొక్కముహూర్త ముండు మిది సంధ్యాకాల మిక్కాలమం
దరయన్ భూతగణా వృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే
శ్వరయానంబున సంచరించుట నభావ్యం బయ్యె నీయుగ్రవే
ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు నేలా ధర్మమున్ వీడఁగన్. 460

మ. అరవిందానన వీఁడె నీమఱఁది లీలాటోప రుద్రక్షమా
చర ఝంఝానిలధూతపాంసుపటలచ్ఛన్నుండు ధూమ్రైకదు
ర్భరవిద్యోతితకీర్ణభీషణజటాబద్ధుండు భస్మావలి
ప్తరుచిస్ఫారసువర్ణవర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై. 461

---

1 ఆవృతుఁడు = చుట్టుకొనఁబడినవాఁడు. 2 కామారాతి = శివుఁడు. 3 నిషిద్ధము = నిషేధింపఁబడినది. 4 రుద్రక్షమ = శ్మశానభూమి. 5 పాంసువు = ధూళి. 6 ఛన్నుండు = కప్పఁబడినవాఁడు. 7 కీర్ణము = నిండినది. 8 అవలిప్త = పూయఁబడిన.

క. అనలసుధాకరరవిలో, చనముల వికసింపఁజేసి సమధికరోషం
బునఁ జూచు చున్నవాఁ డదె, వనితా! బంధుత్వమరయవలవదుసుమ్మీ.

క. అతనికిఁ దలఁపోయ హితా, హితులునుసమాన్యులునువిహీనులునతిగ
ర్హితులును లేరీశుఁడుసమ, మతియునునిఖిలైకభూతమయుఁడై యుండున్.

క. కావున మద్భ్రాతభవ,[1]దేవరుఁ డని తరుణి నీమదిం జూడకు మా
దేవాదిదేవుఁ ద్రిజగ, త్పావను నిఖిలైక నేత భగవంతు హరున్.

వ. ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై [2]దూరతోన్యస్తంబైన పుష్పమాలికయునుం బోలె నమ్మహాత్ముని చరణారవిందవందనాభిలాషిణియైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతు మదియునుం గాక.

సీ. ఎవ్వనికరుణ బ్రహ్మేంద్రాదిదిక్పాల
వరు లాత్మ పదవైభవములఁ దనరి
రెవ్వనియాజ్ఞ వహించి వర్తించును
విశ్వనేత్రి యగు నవిద్యయెపుడు
నెవ్వనిమహిమంబు లిట్టి వట్టివి యని
తర్కింప లేవు వేదంబు లయిన
నెవ్వని సేవింతు రెల్లవారును సమా
నాధికరహితుఁడై యలరు నెవ్వఁ

తే. డట్టి దేవునిఁ ద్రిపురసంహారకరుని
నస్థిమాలాధరుండు భిక్షాశనుండు
భూతి లిప్తాంగుఁ డుగ్ర [3]పరేతభూమి
వాసుఁడని హాస్యమొనరించు వారుమఱియు. 466

క. ధరశునకభోగ్యమును నిహా,పరదూరము నైన తనువు[4]పాథేయముగా
నెఱి నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించు పామరజనులున్.

క. ఘననిర్భాగ్యులుగా మదిఁ, గనుమనియీరీతిబ్రియుకుఁగశ్యపుఁడెఱిఁగిం
చినదితిగ్రమ్మఱఁబలికెను, మనసిజసాయకవిభిన్న మానస యగుచున్.

1 దేవరుఁడు = మగని తోఁబుట్టువు. 2 దూరతోన్యస్తము = దూరముగా నుంపఁబడినది. 3 పరేతభూమి = శ్మశానము. 4 పాథేయము = దారిబత్తెము.

క. మునుకొని లజ్జావనతవ, దనయై ప్రాణేశుకొంగు దాలిమి దూలం
బెనఁగొనియె [1]వారకామిని, యనువున వినిషిద్ధకర్మమం దభిముఖియై.

వ. ఇట్లు సేసిన భార్యానిర్బంధంబునకుం దొలంగనేరక యీశ్వరునకు నమస్కారం బొనరించి యేకాంతంబున నిజకాంతాసంగమంబు దీర్చి సంగమానంతరంబున [2]వార్చి స్నాతుండై ప్రాణాయామంబును [3]విరజంబును సనాతనంబును నైన బ్రహ్మ గాయత్రి జపియించె నంత. 470

క. దితియును నిషిద్ధకర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా నతవదన యగుచు నా[4]పశు,పతివలని భయంబు గల్గి పరమప్రీతిన్.

వ. కశ్యపుం గనుంగొని యిట్లనియె సమస్తభూతపతి యైన పరమేశ్వరుండు నాచేసిన యపరాధంబు సహించి మద్గర్భపరిపాలనంబు సేయుం గాక రుద్రుండును మహాత్ముండును స్వయంప్రకాశుండును [5]నలంఘ్యుండును సకామజన ఫలప్రాపకుండును నిష్కామజన మోక్షప్రదుండును న్యస్తదండుండును ధృతదండుండును దుష్టశిక్షకుండును బరమాత్ముండును జగదంతర్యామియు నిర్గుణుండును నిష్కాముండును భక్తసులభుండును భగవంతుండును నగు నప్పరమేశ్వరునకు నమస్కరించెద మఱియు షడ్గుణైశ్వర్యసంపన్నుండును జగద్భర్తయు మహానుగ్రహశీలుండును నిర్దయపరిపాల్య వధూ రక్షకుండును సతీదేవీపతియు నైన యాసర్వేశ్వరుండు నన్ను రక్షించుం గాత మని సన్నుతించి. 472

క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజనాథువలనఁ గమలానన కా విర్భూత మైనఁగర్శవి,నిర్భరపరితోష మాత్మ నెలకొనియుండెన్. 473

వ. అంతఁ గశ్యపుండు దత్కాల సముచిత సంధ్యావందనంబులు దీర్చి.

క. ఆచెలికి గర్భచిహ్నము, లేచినఁ బరితోషమాత్మ [6]నేపారక మా రీచుండు నిజతలోదరిఁ,జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్.

మ. సతి నీవేగతి నింద కోడక మనోజాతేక్షు కోదండ ని
ర్గతనారాచపరంపరాహతవిశీర్ణస్వాంత వై పాపసం

[1] వారకామిని = వేశ్య. [2] వార్చి = ఆచమించి. [3] విరజము = రజోగుణము లేనిది. [4] పశుపతి = శివుఁడు. [5] అలంఘ్యుఁడు = దాటుటకు వీలులేనివాఁడు. [6] ఏపారక = అతిశయింపక.

గతి లజ్జాభయధర్మముల్ విడిచి దుష్కాలంబునందే రమిం
చితి బల్మిన్ వెలయాలి కైవడిని దుశ్శీలక్రియాలోలతన్. 476

వ. అట్లగుటం జేసి. 477

*క. సతి విను భూతగణప్రే, రితులై రుద్రానుచరులు [1]పృథుశక్తిసమ
న్వితు లుగ్రకర్ము లతిశౌ, ర్యతములు భద్రానుభద్రులనునామములన్.

క. పరఁగినదర్పోద్ధతు లిద్దఱు గొడుకులు నీకుఁ బుట్టి ధరణికి [2]వ్రేఁగై
నిరతము బుధజనపీడా, పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్. 479

తే. అట్టి దుష్కర్ములకును మహాత్ము లలిగి
విశ్వవిభుఁడైన హరికిని విన్నవింప
నతఁడు కోపించి హరి [3]కులిశాయుధమున
గిరుల నఱకిన గతి వారి ధరణిఁ గూల్చు.

క. అని కశ్యపుఁ డెఱిఁగించిన
విని దితి భయ మంది చాల విహ్వలమతియై
తనహృదయేశు ముఖాబ్జముఁ గనుగొని
యిట్లనియె విగతకౌతుక యగుచున్. 481

చ. ధర సుజనాపరాధు లగు తామసచిత్తుల కెందు నాయువున్
సిరియు నశించి పోవు స్మృతి సేకుఱు శత్రులచేత నింత యేకా
నరయఁగ నిక్కువంబు భవదాత్మజు లార్యుల కెగ్గు సేయు భూ
సురుల [4]క్రుధాగ్ని పాల్పడక శోభన మా హరిచేతి[5] పంచతన్. 482

చ. అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను నింతి నీవు చే
సినవిపరీతకర్మమునఁ జేకుఱె నిట్టియవస్థ దీనికిన్
మనమునఁ దాప మొందకుము మాధవుపాదసరోజయుగ్మ చిం
తనమునఁజేసియున్ నను ముదంబునఁ గొల్చుటజేసియుం దగన్. 483

తే. రమణి నీసుతులందు హిరణ్యకశిపు
వలన నుదయించువారిలోపల ముకుంద

---

*ఈపద్యము వ్రాతప్రతులం జూపట్టెడి.

1 పృథుశక్తిసమన్వితులు = గొప్పశక్తితోఁ గూడుకొన్నవారు. 2 వ్రేఁగు = భారము. 3 కులిశము=వజ్రాయుధము. 4 క్రుధాగ్ని = కోపాగ్ని. 5 పంచత = చావు.

పదసరోజాత విన్యస్త భావుఁడైన
తనయుఁ డుదయింపఁగలఁ డతి ధార్మికుండు. 484

వ. మఱియును. 485

ఘనపుణ్యుఁడు [1]అన్వయపావనుఁడగు నప్పుణ్యాత్మముని వరకీర్తిలతల్
[2]వనజభవాండోదర మెల్లను నిండఁగఁ బర్వు బుధలలామం బగుటన్.

తే. వామలోచన వినుము దుర్వర్ణ హేమ
మగ్నిపుటమునఁ బరిశుద్ధమై వెలుఁగు
నట్లు దుష్టాత్మసంభవుఁ డయ్యు వంశ
పావనుండగు హరిపాదభక్తుఁ డగుట. 487

తే. అంచితాష్టాంగయోగ క్రియాకలాపు
లైన యోగీశ్వరులు సమ్మహానుభావు
నతులశీలస్వభావ విజ్ఞానసరణిఁ
దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెప్పుడు. 488

మ. ఆమహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల
క్ష్మీమహిళాధినాథుఁ దులసీదళదాముఁ బరేశు నాత్మహృ
త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం
దా మదిలో హసించు హరి దాస్య విహార వినిశ్చితాత్ముఁడై. 489

వ. అట్టి నీపౌత్త్రుండు. 490

సీ. మహిత దేహాద్యభిమానంబు దిగనాడి
చిరతరాలంపట శీలుఁ డగుచుఁ
బరసమృద్ధికి నాత్మఁ బరితోష మందుచుఁ
బరదుఃఖమునకుఁ దాపమునుబొందు
నీవిశ్వ మంతయు నేవిభుమయ మని
యెవ్వనికరుణచే నెఱుఁగ నయ్యె
నట్టియీశ్వరునిఁ దానాత్మసాక్షిగ మోద
మడరంగఁ జూచు ననన్యదృష్టి

తే. నతినిదాఘోగ్రసమయంబునందు నిఖిల
జంతుసంతాప మడఁగించు చంద్రుమాడ్కి

---

1 అన్వయపావనుఁడు = వంశమునందుఁ బవిత్రమయినవాఁడు. 2 వనజభవాండము = బ్రహ్మాండము 3 నిదాఘము = ఎండకాలము.

నఖిలజగములదుఃఖంబు లపనయించు
రాంఘ్రి నాతఁ డజాతవిరోధి యగుచు.

వ. మఱియు హరిధ్యాననిష్ఠాగరిష్ఠుం డగు నమ్మహాభాగవతాగ్రగణ్యుండు.

క. విమలాంతరంగ బహిరంగములను స్వేచ్ఛానురూపకలితుం డగు నా
కమలాధీశ్వరుకుండల, రమణీయముఖంబుఁజూచుఁ బ్రమదం బెసఁగన్.

తే. మఱియు నీవిశ్వ మాహరిమయముగాఁగ
మనములోపలఁ దలఁచు నమ్మనువిభుండు
మను మహాత్ములలోన నీమనుమఁ డధికుఁ
డనఁగ నుతికెక్కె నంచుఁ గశ్యపుఁడువలుక.

క. విని తనతనయులు మధుసూ
దనుచే హతు లగుదు రనుచుఁ దనమనుమఁడు స
జ్జననుతభాగవతుం డగు
ననుచు మదిం జాల దుఃఖహర్షము లొందవన్. 495

వ. ఉండునంత నాదితియుఁ గశ్యపవీర్యసంభృతం బైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును నన్య తేజోవిరామంబును దినదినప్రవర్ధమానం బును నై నివ్వటిల్ల నిజోదరస్థితు లైన కుమారు లమరదమనులై వర్తింపఁగల రని చింతించుచు గర్భంబు శతవర్షంబులు ధరియించి యున్నయనంతరంబ.

ఉ. ఆదితిగర్భమందు రుచిరాకృతితో నొక తేజ మన్య తే
జోదమలీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం
ఛాదితపద్మబాంధవనిశాకరదీప్తులు గల్గి సూచికా
భేదమహోగ్రసంతమస భీషణమైన భయాకులాత్ములై. 497

చ. అమరగణంబు లెల్ల గమలాసను పాలికి నేఁగి తత్పదా
బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి
త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించి రో
యమరకులాగ్రగణ్య దురి[1]తార్ణవతారణ! సృష్టికారణా! 498

ఉ. నీవు చరాచర ప్రచయ[2]నేతవు ధాతవు సర్వ లోకపా
లావళి మౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ వా

---

1 అర్ణవతారణ = సముద్రమును దాటించువాఁడా. 2 నేత = ఈశ్వరుఁడు.

ణేవర యీయాయజాండమున నీవు నెఱింగని యర్థ మున్న దే
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 499

వ. దేవా కార్యరూపం బగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండ వైన నీచేత సమస్తభువనంబులును సృజియింపంబడియె నీవు సర్వభూతాత్మభావ[1]విదుండవు లోకనాథ శిఖామణి భూతుండవు విజ్ఞానవీర్యుండ వవిద్యం జేసి యిట్టి స్రష్టృరూపంబు నొందితి గృహీత రజోగుణుండవు నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండు సుపక్వ యోగంబు నొంది నిష్కాములై ధ్యానంబున ని న్నరయుచు నిర్జిత శ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసినవారలకుం బరాభవంబు లెక్కడి యెవ్వనివాగ్జాలంబుచేఁ బాశబద్ధంబు లైన పశువుల చందంబున నిఖిలజీవులు వర్తింతు రట్టి నీకు నమస్కరించెద మహోరాత్రవిభాగాభావంబున [2]లుప్తకర్మంబు లగు లోకంబులకు నేమంబు గావింపుము శరణాగతుల మైన మమ్ము నతిశయకరుణారసపరిపూర్ణంబు లగు కటాక్షంబుల నీక్షించి రక్షింపుము. కశ్యపు వీర్యంబు దితిగర్భంబుననుండి సకలదిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్ని చందంబున లీనంబై ప్రవృద్ధం బగుచున్నదని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె

—♦ సనకసనందనాదులు వైకుంఠమున కరుగుట ♦—

క. [3]గీర్వాణులార యుష్మత్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర
న్నిర్వాణులు సనకాదులు, సర్వంకష శేముషీ విచక్షణు లెందున్. 501

క. వారలునిస్స్పృహులగుచున, వారణభువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్
ధీరు లొకనాఁడు భక్తి, శ్రీరమణీశ్వరపదాబ్జసేవానిరతిన్. 502

చ. చని చని కాంచి రంత [4]బుధసత్తము లంచితనిత్యదివ్యశో
భనవిభవాభిరామముఁ బ్రపన్న జనస్తవనీయనామమున్
జననవిరామమున్ సుజనసన్నుతభూమము భక్తలోకపా
లనగుణధామముం బరలలామముఁ జారు [5]వికుంఠధామమున్. 503

1 విదుఁడు = తెలిసినవాఁడు. 2 లుప్తము = లోపించినది. 3 గీర్వాణులు = దేవతలు. 4 బుధులు = దేవతలు. 5 వికుంఠధామము = వైకుంఠము.

ఉ. ఆమహనీయపట్టణమునందు వసించెడువార లాత్మని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై
శ్రీమహిళాధిపాంఘ్రి సరసీరుహ పూజ లొనర్చుచున్ మహో
ద్దామ తదీయరూపములఁ దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్. 504

చ. విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధస
త్త్వగుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతుఁ డనంతశక్తియుక్
[1]నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చల నిర్మల ధర్మమూర్తియు
న్నగు హరి పేరఁ బెం పెసఁగు నన్నగరోపవనమ్ము లిమ్ములన్. 505

వ. మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు [2]నైశ్శ్రేయసనామంబున నభిరామం బై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ [3]నీరిక లెత్తిన కోరికలు సారికలు గొనసొనసంగుచు నితర తరురహితంబులును గామదోహనసహితంబులును బుష్పఫలభరితంబులును నైతనర్చు సంతాన వనసంతానంబులు సమంచిత వసంతసమయ సౌభాగ్యసంప దభిశోభిత వాసంతికా కుసుమ విసర పరిమళమిళిత గళితమకరందలలితామోద ముదితహృదయులై యఖండ తేజోనిధియగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గడింపలేక ఖండిత జ్ఞాను లయ్యును నిరతిశయవిషయసుఖానుభవ కారణం బగుట నిందిరాసుందరీ రమణచరణసేవా విరమణకారి యై యున్నదని తలంచి తద్గంధపాపకగంధవహునిం దిరస్కరించి నారాయణ భజనపరాయణులై చరియించు సుందరీయుక్తులైన వైమానికులును వైమానికమానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగముఖ్య విహంగ కోలాహలవిరామంబుగా నరవిందనయన కథాగానంబు లనూనంబులుగా మొరయు మదవదిందిందిర సందోహకలిత పుష్ప వల్లీమతల్లికలును సకుంతితచరిత్రం బైన వికుంఠనిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీదామంబుం గనుంగొని యాతులసీ [4]దామంబు హరిగళవిలగ్నం బై యుండు సౌభాగ్యంబు వడయుట

---

1 నిగమచయాంతము = ఉపనిషత్తు. 2 నైశ్శ్రేయసము = ముక్తి సంబంధమగు.
3 ఈరిక = మొలక. 4 దామము = దండ.

కేమితపంబు గావించెనో యని బహూకరించుచందంబున నొప్పు చందన మందార కుందారవింద పున్నాగనాగవకుళాశోకకురవకోత్పల పారిజాతాది ప్రసూనమంజరులును మంజరీపుంజరంజిత నికుంజంబుల యందు నత్తుంగపీనకుచభారాకంచితమధ్యంబులుఁ గటితటకనక [1]మేఖలాకలాపనినదోపలాలితసిలకుకూలశోభితపృథునితంబభరాలస యానహాసిత కలహంసమయూరగమనంబులు ననమశరకుసుమశర విలసితంబు నపహాసించు నయనకమలంబులుం గలిగిన సుందరీ సందోహంబులం బగిలి కందర్పకేళీవిహారంబుల నానందంబు నొందక ముకుంద చరణారవింద సేవాపరిలబ్ధ మరకతవైడూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్యప్రదేశంబులును నిందిరాసుందరి త్రైలోక్యసౌందర్యఖని యైన మనోహరమూర్తి ధరియించి రమణీయ [2]రణితమణినూపురచరణారవిందయై నిజహృదయేశ్వరుం డైన సర్వేశ్వరుని మందిరంబునం జాంచల్య దోషరాహిత్యంబుగ వర్తింపం గరకమల భ్రమణీకృత లీలాంబుజాతయై తననీడ కాంచనస్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతనసమ్మార్జన కైంకర్యంబ పరమధర్మం బని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరు సౌరభాభిరామంబులగు తులసీదళదామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్పించుచు నొసలి మృగమదపు [3]టసలున మసలుకొని తుంపెసలాడు కురులను లలిత [4]తిలప్రసూన రుచిరాభ నాసం దనరు మోముఁ దామర విమలసలిలంబుల బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం జుంబితంబగుట గాఁదలంచి లజ్జావనతవదనయైయుండంజేయు ప్రవాళ లతికాకులంబులైన కూలంబులుగల నడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును ధర్మంబునకు నిర్మలస్థానంబును సుకృతమూలంబునకు నాలవాలంబును నయి పొలుపొందుచుండు.

చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృతచిత్తులుఁ బాపవర్తులు
[5]న్నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైన దుష్కథా

---

[1] మేఖలము = ఒడ్డాణము. [2] రణితము = ధ్వని. [3] అసలు = బురద.
[4] తిలప్రసూనము = నువ్వుపువ్వు. [5] నిరయము = నరకము.

నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో
హరచరణారవిందభజనాత్మకు లుండెడు గొంది నారయన్. 507

వ. వెండియు. 508

చ. హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతిసాధనం బగు స్వభావముఁ దాల్చినయట్టి మర్త్యులా
సరసిజనేత్రుమాయను భృశంబుగ మోహితు లై తదంఘ్రిపం
కరుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్.

చ. మఱియు సరోరుహోదరుని మంగళదివ్యకథానులాపని
ర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గద
స్వరపులకీకృతాంగు లగు వారలు నిస్స్పృహచిత్తు లత్యహం
కరణవిదూరు లుందురు సుకర్మలయుండెడి పుణ్యభూములన్. 510

వ. అందు. 511

మ. వరవైకుంఠము [1] సారసాకరము దివ్యస్వర్ణశాలాంకగో
పురహర్మ్యావృత మైన తద్భవన మంభోజంబు దన్మందిరాం
తరవిభ్రాజిత [2] భోగి కర్ణిక తదుద్యద్భోగ[3]పర్యంకమం
దిర వొందన్ వసియించు మాధవుఁడు దానేపారు[4]భృంగాకృతిన్.

వ. అంత 513

మ. హరిచేఁ బాలిత మైన కాంచనవిమా[5]నారూఢ మైనట్టి స
త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణప్రభావోన్నతిం
గర మొప్పారు తదీయ[6]ధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతు లై చెచ్చెరన్. 514

వ. డాయం జని. 515

చ. మరకతరత్నతోరణ సమంచిత[7]కుడ్యకవాట[8]గేహళీ
విరచిత షట్సుకక్ష్య లరవిందదళాక్షవిలోకనోత్సవా
దరమతి నన్యముం గనక దాఁటి యనంతర కక్ష్యయందు ని
ద్దఱును దదీయపాలుర నుదారసమాన వయోవిశేషులన్. 516

---

1 సారసాకరము = సరస్సు. 2 భోగి = ఆదిశేషువు. 3 పర్యంకము = శయ్య. 4 భృంగము = తుమ్మెద. 5 ఆరూఢము = ఎక్కబడినది. 6 ధామము = భవనము. 7 కుడ్యము = గోడ. 8 గేహళి = గడప.

సీ. కాంచన నవరత్న కటకాంగుళీయక
హార కేయూరమంజీరధరులఁ
గమనీయ1సౌరభాగత మత్త మధుకర
కలిత సద్వనమాలికా విరాజి
తోరస్థలుల గదాయుతులను ఘనచతు
ర్బాహుల నున్నతోత్సాహమతుల
నాయాఘరోషానలారుణితాక్షుల
భ్రూలతాకౌటిల్య ఫాల తలుల
తే. వేత్రదండాభిరాముల వెలయు నమ్ము
కుందశుద్ధాంతమందిరా2ళిందభూమి
నున్నయిద్దఱ సనకాదియోగివరులు
నూచుచును వృద్ధు లయ్యు నాసుభగమతులు. 517

క. ధీరతఁ బంచాబ్దముల కు,మారకులై కానఁబడుచు మనమున శంకం
గూరక చతురాత్మకు లని, వారితగమనపుల ద్వాయవచ్చిన నెదురన్.

క. శ్రీ లలనేశ్వర దర్శన, లాలసులై యేఁగు బుధలలాముల నతిదు
శ్శీలతఁ దద్వచన ప్రతి,కూలమతిం బోవకుండఁ గుటిలాత్మకులై.

క. వారించిన వారలు బృం,దారకు లీక్షించుచుండ దారుణపటురో
షారుణి4తాంబకులై రోద,వారించుచు వారు నచటివారును వినఁగన్.

వ. ఇట్లనిరి. 521

చ. పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిం దరుదేర నిచ్చలుఁ
భరితముదాత్ములై కొలువఁ బాయక తద్భజ5నాంతరాయ త
త్పరమతి మాకు నిప్పు6డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే. 522

వ. అని మఱియు సనకసనందనాదు లిట్లనిరి. మీమనంబులస్వామిహితా
ర్థంబై నిష్కపటవర్తనుల మైన మాబోఁటులఁ 7 గుహకవృత్తిగల
యితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యనుశంకంజేసి

---

1 సౌరభము = సువాసన. 2 అళిందము = తలవాకిటి ప్రక్కనుండుగది. 3 అనివారితము = అడ్డుపెట్టఁబడరానిది. 4 అంబకము = నేత్రము. 5 అంతరాయము = విఘ్నము. 6 అరిపడు = అడపడు. 7 కుహకము = వంచనము.

కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ గొందఱ వారించుటయు దౌవా
రికస్వభావం బని వారింపం దలంచితి రేనిఁ బ్రశాంతదివ్యమంగళ
విగ్రహుండును గతవిగ్రహుండును భగవంతుండును విశ్వగర్భుండును
నైనయీశ్వరుండు ప్రాప్యంబును బ్రాపకంబును బ్రాప్తియు నను భేద
శూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు
వేఱు లేక యేకంబై తోఁచుచందంబున విద్వాంసు లగువా రమ్మహా
త్ముని సకలాత్మభేద రహితునింగాఁ బొడగందు రదియునుం గాక
లోకంబునందు రాజులు సాపరాధులయిన కింకరజనంబుల నాజ్ఞాపించు
చందంబున నీశ్వరుండు దండించునో యనుభయంబునం జేసి వారించితి
మని తలంచితి రేని భూసురవేషధారుల మైన మాకును వైకుంఠ
నాయకుం డైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంక
సేయం బని లే దిట్లగుట యెఱింగి మందబుద్ధుల రై మమ్ము వారిం
చిన యనుచితకర్ము లగు మీరలు మదీయశాపార్హు లగుదురు గావున
భూలోకంబునం గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం
బుట్టుం డని పలికిన. 523

క. వారలు విని తమమనముల, భూరిస్ఫుటచండకాండ [1] పూగంబులచే
వారింప రాని భూసుర, దారుణ వాక్యముల కులికి తల్లడపడుచున్. 524

క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనునిభటులు సనకాదిమునీ
శ్వరులపదాంబుజములకుం, గరమర్థి మ్రొక్కి నిటలఘటితాంజలు లై

వ. ఇట్లనిరి. 526

మ. వరయోగీశ్వరులార మమ్ము మది [2] నొవ్వన్ మీర లిట్లన్న ని
ష్ఠురవాక్యంబుల కింక మామనములన్ శోకింపగా రాదు స
త్పురుషశ్రేణికిఁ బరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా
దురితం బింతకుఁ దెచ్చె మీఁదశుభముం [3] దూకొందు మే మారయన్.

వ. అది యె ట్లంటి రేని.

ఉ. మీకరుణావలోకనసమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్
దూకొనె నేని మా చనవుఁ ద్రోయక యీఁ దగుఁ గామలోభముల్

1 పూగము = సమూహము. 2 నొవ్వన్ = నొచ్చుకొనన్. 3 తూకొందుము= పూనుదుము, చొచ్చుదుము.

గై కొని పుట్టుచోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం
బై కొన కుండ దాననె శుభంబగు మీఁది మదీయజన్మముల్. 529

వ. అనుసమయంబున. 530

మ. హరి సద్వేషుఁ డనంతుఁ డాకలకలం బాలించి [1]పద్మాలయా
సరసాలాపవినోద సౌఖ్యరచనల్ సాలించి శుద్ధాంతమం
దిరమాణిక్యసుగేహాళుల్ గడచి యేతెంచెం బ్రసన్నార్తి సం
హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండై మానితాకారుఁ డై. 531

వ. మఱియును. 532

చ. [2]శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడ రా మనో
హరనిజలీలమైఁ బరమహంసమునీశ్వర వంద్యపాద పం
కరుహములన్ వినూత్న మణికాంచననూపుర మంజుఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజన వంద్యుఁడు యోగిజనైకసేవ్యుఁడై. 533

చ. కరమణి హేమకంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న
చ్చరలిడు హంసపక్ష సిత చామర గంధవహోచ్చలత్సుధా
కరరుచి రాతపత్రి సుభగ[3]ప్రవిలంబితహారవల్లరీ
సరసగళ త్తుషార కణ జాల విరాజిత మంగళాంగుఁడై. 534

వ. మఱియును. 535

సీ. నిఖిలమునీంద్ర వర్ణిత సస్మిత ప్రస
న్నాననాంబుజముచే నలరువాఁడు
వికసిత స్నేహార్ద్రవీక్షణ నిజభక్త
జన గుహాశయుఁ డనఁ దనరువాఁడు
మానిత[4]శ్యామాయమాన వక్షమున నం,
చిత[5]వైజయంతి రాజిల్లువాఁడు
నతజనావన కృపామృత తరంగితములై
భాసిల్లు లోచనాబ్జములవాఁడు

---

1 పద్మాలయ = లక్ష్మీదేవి. 2 శరనిధికన్యక = సముద్రునికూఁతురు, లక్ష్మి. 3 ప్రవిలంబితము=వ్రేలాడుచున్నది. 4 శ్యామాయమానము=నల్లనైనది. 5 వైజయంతి=విష్ణునిమాలిక.

తే. నఖిల యోగీంద్రజన సేవ్యుఁ డైన వాఁడు
సాధుజనముల రక్షింపఁ జాలువాఁడు
భువనచూడా విభూషమై భూరిమహిమ
మించు వైకుంఠపురము భూషించువాఁడు. 536

సీ. కటివిరాజిత పీతకౌశేయశాటితో
విలసిత కాంచీగుణ ద్యుతి నటింప
నాలంబి కంఠహారావళి ప్రభలతోఁ
గౌస్తుభరోచులు గ్రిందుకొనఁగ
నిజకాంతిజితతటిద్వ్రజకర్ణకుండల
రుచులు గండద్యుతుల్ పొదిసేయ
మహనీయనవరత్నమయకిరీటప్రభా
నిచయంబు దిక్కులనిండఁ బర్వ

తే. వైనతే[1]యాంసవిన్యస్త వామహస్త
కలిత కేయూరవలయకంకణము లొప్ప
నన్యకరతల [2]భ్రమణీకృతాను మోద
సుందరాకారలీలారవింద మమర. 537

వ. మఱియుఁ జరణారవింద మంజుకింజల్కపుంజప్రభారంజిత తులసీమరంద బంధుర గంధానుబంధ సుగంధి [3]గంధవహాస్వాదకలిత సేవాతత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు బహిఃకరణాంతఃకరణపరితోష [4]ప్రకీర్ణ రోమాంచ రుచి దాయకంబును బ్రభాపూర్తి యుక్తంబునునగు మూర్తితోడ నిజసౌందర్య వరకళా వినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుండగుచుఁ బాదచారియై యఖిల విశ్వగురుండైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు. 538

చ. స్థిరశుభలీల నల్లగు దెంచిన యవ్విభు [5]విద్రుమారుణా
ధరనవ పల్లవస్ఫుర దుదంచిత కుందరుచిస్మితైక సుం
దరవద నారవిందము ముదంబునఁ దప్పక చూచి యమ్మునీ
శ్వరులు నిజాత్మలం దనివి సాలక వెండియుఁ జూచి రిమ్మలన్. 539

---

1 అంసవిన్యస్తము = భుజమునందుంచఁబడినది. 2 భ్రమణీకృతము = త్రిప్పఁబడుచున్నది. 3 గంధవహుఁడు = గాలి. 4 ప్రకీర్ణరోమాంచ = నిండినపులకలయొక్క. 5 విద్రుమము = పగడము.

చ. సునిశితభక్తిఁ దన్ముఖముఁ జూచినచూడ్కులు ద్రిప్ప లేకయుం
గనుఁగొని రెట్టకేలకు సకల్మషభక్త [1]విధూతభేదముల్
మునిజనచిత్తమోదములు ముక్తినివాస కవాటభేదముల్
వినుతవినూత్ననూపురిత వేదము లమ్మహనీయుపాదముల్. 540

చ. కని నఖపద్మరాగ మణి కాంతి విభాసిత పాదపద్మము
ల్మనములయందుఁ గీల్కొలిపి లబ్ధమనోరథ యుక్తులై పునః
పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగమా
ర్గ[2]నిరతచిత్తులుం [3]వెదకి కానఁగ లేని మహానుభావునిన్. 541

క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁ డైన వానిఁ దత్త్వజ్ఞులకుం
గాన నగువాని భక్తజ,నానందకరైకమూర్తి నలకిన వానిన్. 542

వ. మఱియుం జక్షురింద్రియగ్రాహ్యం బగు దివ్యమంగళవిగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్త తేజోనిధిం జూచి సనకాదు లి ట్లని స్తుతియించిరి. 543

—♦ సనకాదులు నారాయణదేవుని స్తుతించుట ♦—

చ. వనజదళాక్ష భక్తజనవత్సల దేవ భవత్సుతుండు మ
జ్జనకుఁడు నైన పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె
ప్పిన భవదీయమంగళ గభీర పరిగ్రహవిగ్రహంబు మే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థుల మై తగ మంటి మీశ్వరా.

సీ. దేవదుర్జనులకు భావింప హృదయసం
గతుఁడ వై యుండియుఁ గానఁబడవు
కడఁగి నీదివ్యమంగళవిగ్రహంబునఁ
జేసి నమంచితాశ్రితుల నెల్లఁ
జేకొని సంప్రీతచిత్తులఁగాఁ జేయు
దతిశయకారుణ్యమతిఁ దనర్చి
కమలాక్ష సర్వలోకప్రజాధిప భవ
దనుసరణాభిలాషానులాప

తే. విదితదృఢభక్తి యోగప్రవీణు లగుచు
నర్థిమై వీతరాగు లైనట్టియోగి

1 విధూతము = ఎగురకొట్టఁబడినది. 2 నిరతము = ఆసక్తి. 3 వీతరాగులు = పోయినరాగములుగలవారు.

జనమనఃపంకజాతనిషణ్ణమూర్తి
వనియెఱుంగుదు రయ్య ని న్నాత్మవిదులు. 545

క. యుక్తిం దలఁప భవద్ద్యుతి, రిక్తము లైనట్టి యితరదృథకర్మంబుల్
ముక్తిదము లయిన నీపద, భక్తులు తత్కర్మములను బాటింప రిలన్.

ఉ. కావునఁ గీర్తనీయ గత కల్మషమంగళ తీర్థకీర్తి సు
శ్రీవిభవ ప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే
వా విమలాంతరంగ [1]బుధవర్గ మనర్గళభంగి నన్యముఁ
భావమునం దలంచునె కృపాగుణభూషణ పాపశోషణా. 547

చ. పరమతపో విధూత [2]భవపాపులమై చరియించు మాకు నేఁ
డరయ భవత్పదాశ్రితుల కల్గి శపించిన భూరిదుష్కృత
స్ఫురణ [3]నసత్పథైకపరిభూతులమై నిజధర్మహానిగా
నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే. 548

చ. కర మనురక్తి [4]షట్పదము [5]గమ్రసుగంధ మరంద వాంఛచేఁ
దర మిడి [6]శాతకంటక వృతస్ఫుటనవ్యతరప్రసూనమం
జరులను డాయుపోల్కి ని [7]భృశం బగు విఘ్నములన్ జయించు నీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితిమయ్య కేశవా. 549

చ. అలరు భవత్పదాంబుజయుగార్పితమై పొలు పొందునట్టియా
తులసి పవిత్ర మైన గతిఁ దోయజనాభ భవత్కథాసుధా
కలితము లైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్
విలసితలీలమై భువిఁ బవిత్రము లై విలసిల్లు మాధవా. 550

చ. మహితయశోవిలాసగుణ[8]మండన సర్వశరణ్య యింద్రియ
స్పృహులకుఁ గాన రాక [9]యతసీకుసుమద్యుతి నొప్పు చున్న నీ
సహజశరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయదృక్కు లిం
దహహా! కృతార్థతం బొరసె నచ్యుత ప్రొక్కెద మాదరింపవే. 551

---

1 బుధవర్గము = పండితసముదాయము. 2 భవపాపులము = జన్మపాపము గలవారము. 3 అసత్పథైక పరిభూతులము = చెడుమార్గమునందు చరించుటచే ముఖ్యముగా నవమానింపఁబడినవారము. 4 షట్పదము = తుమ్మెద. 5 కమ్రము = మనోహరము. 6 శాతకంటకావృతము = వాఁడియైన ముండ్లచే చుట్టుకొనఁబడినది. 7 భృశము = అధికము. 8 మండనము=అలంకారము. 9 అతసి = నూనెఅగిసె.

క. అని సనకాదులు దత్పద, వనజములకు మ్రొక్కి భక్తివశమానసులై
వినిపించిన గోవిందుఁడు, మునివరులం జూచి పలికె ముదితాత్ముండై.

వ. ఈయిరువురు జయవిజయా[1]భిధానంబులు గల మదీయద్వారపాలకులు
వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణు లయి చేసిన యప
రాధంబునకుఁ దగిన దండంబు గావించితి రది నాకు నభిమతం బయ్యె
ననియునుం గాక భృత్యవర్గంబు సేయు నపరాధంబు స్వామిదియ
కాన యీతప్పునకు మానసీయుండ నైన నన్ను మన్నించి ప్రసన్ను
లగుదురు గాక యని వెండియు. 553

చ. తనువునఁ బుట్టినట్టి వెడిదం బగు కష్టమహా[2]గదంబుచే
వనరి తదీయచర్మము వివర్ణత నొందినరీతి భృత్యులో
ప్పనిపని సేసినన్ విభులు బంధురచారుయశంబుఁ బేరుఁ బెం
పును జెడిపోయి దుర్యశముఁ బొందుచునుందురు[3]విష్టపంబులన్. 554

చ. అలవడ నాకు మీవలన నబ్బిన తీర్థసుకీర్తనీయ స
ల్లలిత వినిర్మలామృతవిలాస [4]యశోవిభవాభిరాము మై
వెలయు వికుంఠనామ మపవిత్రమన [5]శ్వపచాధమాదిలో
కుల చెవి సోఁకఁ దక్షణము కోరి పవిత్రులఁ జేయు వారలన్. 555

తే. అట్టి నేను దలంప మీయట్టిసాధు
జనుల కపకార మర్థిఁ జేసిన మదీయ
బాహుసము లైనఁ ద్రుంతు నుత్సాహలీల
నన్న నితరుల మీ మ్రోల నెన్న నేల. 556

క. ధరణీసురో త్తమ సేవా, [6]పరిలబ్ధం బయిన యట్టి పాతకనాశం
కర నిఖిలభువనపూత, స్ఫురితాంఘ్రిసరోజ [7]తోయములు గలనన్నున్.

క. అలఘుమతి విరక్తునిఁ గా, దలఁపక నిజశుభకటాక్షదామక కలితా
ఖిలసంపద్విభవశ్రీ, లలనారత్నం బురస్స్థలంబును జెందెన్. 558

చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టి తద్ఘృత
[8]ప్లుతచరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహధర్మమార్గ సం

1 అభిధానము = పేరు. 2 గదము = రోగము. 3 విష్టపము = లోకము.
4 యశము = కీర్తి. 5 శ్వపచులు = చండాలులు. 6 పరిలబ్ధము = పొందినది.
7 తోయము = నీరు. 8 ప్లుత-చరువు = అతిశయించుహవ్యము.

గతుఁ డగు భూసురోత్తము ముఖంబున వేడ్కభుజించున య్యావి
స్తృత కబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్. 559

సీ. సతతంబు నప్రతిహత యోగమాయా వి
భూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందునేను
నేమహీసురుల సమిద్ధ నిర్మల పాద
నలినరజో వితానములు భక్తి
హాటక నవరత్న [1]కోటీరమునఁ దాల్తు
నట్టి నాచరణాంబుజాంబువులను
దవిలి ధరించి సద్యఃపవిత్రాత్ములై
రర్థిఁ [2]జంద్రావతంసాదిదేవ

తే. చయము లెవ్వాఁడు బ్రాహ్మణజనులు దమకు
నపకృతుల్ సేసిరేని మాఱలుగఁ డతఁడు
విప్రులను నన్నుఁ గాఁగ భావించు నతఁడు
ధర్మపద్ధతి నాప్రియతముఁడు వాఁడు. 560

ఉ. గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్
వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద నందు [3]నా
శీవిష రోష విస్ఫురణఁ జెంది [4]కృతాంతభటుల్ మహోగ్ర [5]గృ
ధ్రావలివోలెఁ [6]జంచువుల నంగము లుద్ధతి నొంతు రెప్పుడున్. 561

చ. ధరణిసురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్
దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలుఁ బూజ సేయుచున్
సరసవచోవిలాసముల సన్నుతి సేయుచుఁ దండ్రి నాత్మజుల్
గర మనురక్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నాసముల్. 562

క. వినుఁ డ య్యనఘచరిత్రుల
కనయముఁ బ్రియతముఁడ నగుచు నమ్ముదువోదున్
మును నన్ను [7]భృగువు దన్నినఁ
గనలక పరితోషవృత్తిఁ గైకొంటిఁగదే. 563

1 కోటీరము = కిరీటము. 2 చంద్రావతంసుఁడు = శివుఁడు. 3 ఆశీవిషము = పాము. 4 కృతాంతుఁడు=యముఁడు. 5 గృధ్రము = గద్ద. 6 చంచువు = ముక్కు. 7 భృగువు విష్ణువును తన్నుట:— బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో నెవరు ముక్తినివ్వగలవారని మునులలో వివాదమురాఁగ, భృగువు పరీక్షించుటకై విష్ణువును దన్నెను.

సీ. పొలుచు నా మానసాంభోజాత భావంబు
తెలియంగలేక [1]యుద్వృత్తులగుచు
గడంగి నాయానతిఁ గడచినఁ దద్దోష
ఫలము మీరలకు సంప్రాప్తమయ్యె
మునులార నాచిత్తమున నున్న నీతిగా
నిట్టిద భూమిపైఁ బుట్టి వీర
లచిరకాలమున నాయంతికంబునఁ గోత్రి
నరుదెంచు నట్లుగా ననుమతింప

తే. వలయునని యమ్మహాత్ముండు వలుకుటయును
వినిమనంబున సనకాది మునివరేణ్యు
లమ్మహాత్ముని మృదుల భాషామృతంబుఁ
దవిలిగ్రోలియు రోషవిసందష్టులగుచు. 564

సీ. మునివరుల్ దమచిత్తములఁ దృప్తిఁ బొందక
పంకజాక్షుండు వలికినట్టి
పరిమితగంభీర బహులార్థయుక్తవగా
హములును విస్ఫురదమృతతుల్య
మాధుర్యసుగుణ సమన్వితమ్ములు విని
ర్గతశబ్దదోష నికాయములును
నైనవాక్యములకు నాత్మలఁ బరితోష
మంది యుల్లముల నెయ్యమున మనిచె

తే. [3]నొడయఁ డిప్పుడు నందించియో తలంప
నర్థి నిందించియో మత్కృతైకదండ
మునకు నంకోచమందియో యనుచు సంశ
యాత్ములగుచు వివేకించి యంతలోన. 565

క. నలినాక్షుఁడు దమ దేసఁగృప, గలిగిన భావంబుఁదెలిసి కౌతుకమొలయం
బులకీకృతాంగులై యు, త్కలికన్ హర్షించినిటలఘటితాంజలులై 566

క. భరితనిజయోగమాయా, స్ఫురణం దనరారు నతివిభూతియు బలముం
బరమోత్కర్షముఁగల యీ, శ్వరునకునిట్లనిరి మునులు సద్వినయమునన్.

---

1 ఉద్వృత్తి = గర్వము. 2 సందష్టులు=కరవఁబడినవారు. 3 ఒడయఁడు=రాజు.

తే. పొలుపు దీపింప నిత్య విభూతినాయ
కుఁడవు భగవంతుఁడవు ననఘుఁడవు నీవు
మత్కృతంబిప్డు నీకభిమత మటంటి
వీశ భవదీయ చారిత్ర మెఱుఁగఁ దరమె. 568

ఉ. దేవగణాలి కెల్లఁ బరదేవతలై తనరారునట్టి వి
ప్రావలి కాత్మనాయకుఁడవై పెనుపొందిన నీకు నీధరా
దేవత లెల్ల నెన్న నధిదేవత లైరఁట యెట్టిచోద్యమో
దేవ సమస్తపావన సుధీజనతావన విశ్వభావనా. 569

చ. కమలదళాక్ష నీవలనఁ గల్గిన ధర్మము దావకావతా
రముల సురక్షితం బగుఁ దిరంబగు నీశ్వర నిర్వికార త
త్త్వమునఁ దనర్చు నిన్నరయఁ దత్ఫలరూపముఁ దత్ప్రధానగో
ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన పాపమోచనా. 570

చ. మహిఁ దలపోయ నెవ్వని సమగ్ర పరిగ్రహముఁ లభింప[1]ని
స్పృహమతులై మునీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు రట్టి స
న్మహితవివేకశాలి గుణమండన నీకిల [2]నన్యసత్పరి
గ్రహ మది యెట్టిచోద్యము జగత్పరిపాలన నిత్యఖేలనా. 571

సీ. సతతంబు నర్థార్థి జనశిరోలంకార
పదరేణువులుగల పద్మ మనెడు
జలజకింజల్క నిష్యంద మరంద [3]లో
భాగత భ్రమర నాయకుని పగిది
ధన్యజనార్పితో దంచితతులసికా
దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లు భవదీయ పాదారవిందముల్
విలసితభక్తి సేవించుచుండి

తే. కమలనయన కృపావలోకనము లొలయ
నర్థిఁ బొడసూపు భాగవతానురక్తిఁ
జేసి భవదీయమహిమంబు చిత్ర మరయ
చిరశుభాకార యిందిరా చిత్తచోర. 572

1 నిస్పృహుఁడు = కోరికలులేని వాఁడు. 2 అన్యసత్పరిగ్రహము = ఇతరుల మంచివి గ్రహించుట. 3 లోభాగత = ఆశచేవచ్చిన.

మ. చిరభాగ్యోదయ దేవదేవ లలిత శ్రీవత్సలక్ష్మాంకగ యీ
వరవిప్రానుపదైకపుణ్యరజమే వర్ణింప నీ[1]మేని కా
భరణం బంటివి సర్వలోకులకు విప్రశ్రేణి మాహాత్మ్యమ్ మీ
వెలుఁగం జెప్పుటకై ధరించితిగదా యెన్నం బవిత్రాకృతిన్. 573

వ. అదియునుం గాక. 574

సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగునీవు
పోషింపఁ దగువారిఁ బోషివవేని
నవిరళవేదోక్తమగు ధర్మమార్గమ
సన్మార్గ మగుఁ గాన సత్త్వగుణ వి
శిష్టుండ వగుచు నీజీవసంఘము నేమ
మరసి రక్షింతు నీ దైన శక్తి
చేతను ధర్మవిఘాతుల దండించు
నీకు సంచితమైన నిగమధర్మ

తే. మార్గనాశక విధములు మదికి నింపు
గావు విప్రులయందు సత్కరుణ మెఱసి
ఘనతఁ బలికిన వినయవాక్యములునీకు
యుక్తమగుచుండు సతతంబు భక్తవరద. 575

వ. అట్లు మునం బరులయెడ వినయంబులు వలికినఁ బ్రాభవహాని యగు
నని తలంచితి వేని. 576

తే. విశ్వమున కెల్లఁగర్తవు విశ్వనిధివి
విశ్వసంరక్షకుండవై వెలయు నీకుఁ
గడఁగి ప్రాభవహాని యెక్కడిది దలఁప
వినయములు నీకులీలలై వెలయుఁగాన. 577

తే. మునుల మగు మమ్ము నతిమోదమునను నీవు
సత్కరించుట లెల్ల సజ్జనపరిగ్ర
హార్థమై యుండుఁ గాదె మహాత్మ యొకటి
విన్నవించెద మీ జయ విజయులకును. 578

---

1 మేను = శరీరము.

తే. అలిగి యేము శపించితి మంతకంటె
[1]బెడిద మగు నాజ్ఞ సేయ నభీష్ట మేనిఁ
జేయు మదిగాక సముచిత శ్రీ దనర్పఁ
జేసి రక్షించెదేని రక్షింపుమీశ. 579

వ. అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతినిర్మ
లాంతఃకరణులునైన వీరలకు ననృతంబులు వలికితిమేని మమ్మాయినం
జిత్తంబుకొలంది నాజ్ఞాపింపుమని కరకమలంబులు మొగిచికృతాంజలు
లై యున్న మునులం గరుణార్ద్రదృష్టిం గనుంగొని. 580

క. అనఘుఁడు భగవంతుం డిట్లనియెన్ మునులార వీర లలరన్ భువికిం
జనియచటనసురయోనిన్, జనియింతుకులోభమోహాసంగతులగుచున్.

క. దేవజనావళి [2]నుపహతిఁ, గావించుచు నిఖిలభువన కంటకవృత్తిన్
జీవించుచు నాయెడ సం, భావితవైరానుబంధ భావులు నగుచున్. 582

క. ఆహవముఖమున నను నతి, సాహసమున నెదిరిపోరి చక్రనిశితధా
రాహతిఁ దెగివచ్చెద రు, త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్.

వ. అదియునుంగాక. 584

క. ననువైరంబుననైనను, మనమునఁదలఁచుటను నాసమక్షమున మదా
నన మీక్షించుచు[3]నీల్గుట, [4]ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్. 585

క. వినుఁ డిలమీఁద నిఁ కెన్నఁటి, కిని బుట్టువు లేదు వీరికిని మీరలు వ
ల్కినయట్ల నాదుచిత్తము, నను దలఁతుం గాన మీమనంబుల నింకన్.

ఉ. దీనికిఁ జింతఁ దక్కుఁడు సుధీజనపుంగవు లన్నఁ బ్రీతులై
యానలినాసనాత్మజు లనంతునిభావము దా మెఱింగి పెం
పూనినవేడ్కఁ దేలి తెలివొందినచిత్తములన్ నుతించి రం
భోనిధిశాయి నార్తజనపోషణ భూషణుఁ బాపశోషణున్. 587

ఉ. ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ నన లొత్త బాష్పధా
రా[5]సుభగాత్ములై మునిశరణ్యువరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరు దివ్యమంగళశరీరముఁ జారుతదీయధామముల్
భాసురలీలఁ జూచి నవపద్మదళాక్షునకున్ వినమ్రులై. 588

---

1 బెడిదము = భయంకరము. 2 ఉపహతి = హాని. 3 ఈల్గుట = చచ్చుట.
4 అనఘాత్ములు = పాపములేనివారు. 5 సుభగము = శోభ.

క. తమ పలికిన భాషణములు, కమలోదరు భాషణములు గాఁ దలఁచుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మీ, ప్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్.

క. [1]ఆమంత్రితులై తగ నిజ, ధామములకుఁ జనిరి వారు తడయక లక్ష్మీ
కాముఁడు జయవిజయుల సభి, రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్.

క. మీ రసురయోనియం దని, వారితులై జనన మొంద వలసెను నేఁ దు
ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్రవచనము లెందున్.

క. అది గాన దనుజయోనిం, బడపడి జనియించి మద్విపక్షులరై మీ
మది నెప్పుడు నన్నే తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్.

ఉ. పొండని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్త్రనేత్రుఁ డా
ఖండలముఖ్య దిగ్వర నికాయ కిరీట లసన్మణిప్రభా
మండితపాదపీఠుఁడు రమారమణీమణి దోడ నేఁగు దే
నిండిన వేడ్క నేఁగె నిజనిర్మలపుణ్యనివాసభూమికిన్. 593

వ. అంత. 594

క. నిజతేజోహానిగ జయ, విజయులు ధరఁ గూలి రపుడు విహ్వలు లగుచుం
ద్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలఁగన్.

క. వారలె యీ దితిగర్భా, గారంబున నున్నవారు గడఁగి తదీయో
దారఘన తేజ మిపు డని, వారణ మీ తేజమెల్ల [3]వమ్ముగఁ జేసెన్.

ఉ. ఇంతకు మూల మాహరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె సర్వభూతభవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా
ద్యంతవికారశూన్యుఁడు దయానిధి మీయెడ మేలుసేయు నీ
చింత దొఱంగి వేచనుఁడు చేకురు మీకు మనోరథార్థముల్. 597

క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం
బున కేఁగిరి దితి నిజనా, థుని మాటలు దలఁచి యపరితోషముతోడన్.

—♦ జయవిజయులు దితియందు హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టుట ♦—

తే. ఇంతి తనసుతుల్ సురలఁ [4]గారింతు రనుచుఁ
దలఁచు చుండంగ నంత వత్సర శతంబు

---

1 ఆమంత్రితుఁడు = సెలవు తీసికొనఁబడినవాఁడు. 2 విపక్షులు = శత్రువులు.
3 వమ్ము = వ్యర్థము. 4 కారింతురు = బాధపెట్టుదురు.

సనఁగ నట మీఁదఁ గనియెఁ గశ్యపుని దేవి
యఖిల లోకైక కంటకు లైన సుతుల. 599

వ. అయ్యవసరంబున. 600

తే. ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె
జలధులు గలంగెఁ [1]దారకావళులు డుల్లె
గగన మగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల
మిడుఁగుఱు లెగసెఁ బిడుగులు పుడమిఁ బడియె. 601

సీ. హోమానలంబుల ధూమంబు లడరెను
బ్రతికూల వాయువుల్ బలసి వీచెఁ
దరువు లెల్లెడ [2]విటతాటంబు లై కూలె
గ్రహ తారకావళి కాంతి మాసె
బెరసి [3]మొగిళ్లు నెత్తురువాన గురిసెను
మెఱుఁగుల దెసల మిర్మిట్లు గొలిపె
[4]స్వర్భానుఁ డాగి యపర్వమున భానునిఁ బట్టెఁ
గైకొని చిమ్మచీకట్లు పర్వె

తే. మొనసి కుక్కలు మొఱిఁగెను మోర లెత్తి
పగలు నక్కలు వాపోయె [5]ఖగము లార్త
రవము లిచ్చెను దేవతా ప్రతిమ లొరగెఁ
గన్నులను నశ్రుకణములు గ్రిందుకొనఁగ. 602

క. మొదవులు నెత్తురుఁ జీమును
బిదికెఁ గార్దభ రవంబు భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరుల కటములఁ,
బొదివెఁ దురంగముల వాలముల నిప్పు లొగిన్. 603

క. గుహలు రొదలిచ్చెఁ బాప,గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించెను దు,స్సహ తేజోదితితనూజసంభవ వేళన్. 604

మ. భయదప్రక్రియ నట్లు దోఁచినమహోత్పాతంబు లీక్షించి సం
క్షయ కాలం బని కాని సాధు [6]హననోగ్రక్రూర దేవాహితో

---

1 తారకావళులు = నక్షత్రసమూహములు. 2 విటతాటము = తారుమాఱు. 3 మొగిళ్ళు = మేఘములు. 4 స్వర్భానుఁడు = రాహువు. 5 ఖగము = పక్షి.

దయ సంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిసంఘాతము
ల్భయమందెన్ సనకాదియోగిజనము ల్దర్కింప బుధేంద్రోత్తమా

వ. అట్లావిర్భవించిన యనంతరంబ. 606

మ. కుల [1]శైలాభశరీరులున్ దనర రక్షోనాథు లత్యుగ్రదో
ర్బల మొప్పం జనియించిరంత ఘన సద్రత్న కేయూరకుం
డల కాంచీ కటకాంగుళీయక కిరీట స్వర్ణ మంజీర ని
ర్మలకాంతుల్ పులకింప నాత్మరుచిచే [2]మందీకృతార్కాంశులై. 607

వ. ఉన్నసమయంబునం గశ్యపుండు నిజతనూభవులం జూడం దలంచి దితి మందిరంబునకుం జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి. 608

చ. దితి [3]జఠరంబునందుఁ దన తేజము మున్నిడినట్టిపుత్త్రు న
ద్భుతచరితున్ హిరణ్యకశిపుం డను పేరఁ బ్రసూతివేళ నా
దితి మును గన్నపట్టి రవితేజునిఁ గాంచనలోచనుండు నా
హితమతిఁ బేరు వెట్టి చనియెన్ నిజనిర్మల పుణ్యభూమికిన్. 609

వ. అయ్యవసరంబున నతుల తేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు [4]హిరణ్యగర్భవరదానగర్వంబునను దుర్వార [5]పరిపంథిగర్వ[6]నిర్వాపణాఖర్వభుజావిజృంభణంబునను నిఖిలలోకపాలాదుల జయించి స్వవశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండెఁ దత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతి దివసంబు జండ వేదండ [7]శుండాదండమండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తన్ను నెదిరి [8]కదనంబు సేయం జాలిన [9]యరివీరునిం గానక భూలోకంబెల్లఁ గ్రుమ్మరి [10]దివంబునకు దాడి వెట్టి యందు సమరవిముఖులయిన [11]బర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబుఁ జింతించి హితులు నెలంగ నహితులు గలంగ

---

1 శైలాభ = శైలముతో సమానమైన. 2 మందీకృతార్కాంశులు = మందముగాఁ జేయఁబడిన సూర్యకాంతులుగలవారు. 3 జఠరము=కడుపు 4 హిరణ్యగర్భుఁడు= బ్రహ్మ. 5 పరిపంథి = శత్రువు. 6 నిర్వాపణాఖర్వ = తీసివేయునట్టి తక్కువకాని. 7 శుండము = తొండము. 8 కదనము = యుద్ధము. 9 అరి = శత్రువు. 10 దివము = స్వర్గము. 11 బర్హిర్ముఖులు = దేవతలు.

మహిత వైజయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల
మణినూపురంబులు మొరయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం
జనుదెంచువానిం గని భీతచిత్తు లయి దేవతాగణంబులు గరుడునిం
గని పఱచు నురగంబులుంబోలె నిజ నివాసంబు లర్కనివాసంబులు
గాంచనావాసంబులుంగా నొనర్చి యెక్కడి కేగిం జనిన. 610

ఉ. శౌర్యము వోవఁ దట్టి నిజసాధనముల్ దిగ నాడి విక్రమా
దార్య పరాక్రమక్రమము దప్పఁగ భీతిలి పాఱి రక్కటా
కార్యముఁ దప్పి [1]నాకు లని గైకొని యార్చి సుమేరుపర్వత
స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతి దర్పిత భూరిభుజావిజృంభియై. 611

వ. ఇట్లు సొచ్చిన. 612

క. వరుణుని బలములు దనుజేశ్వరు తేజముఁ దేఱిచూడఁ జాలక శౌర్య
స్ఫురణము సెడి యెందేనిని, బఱచెం దజ్జలధి మధ్యభాగమునందున్.

క. అమరారి విపులనిశ్వా, సములం [2]బ్రభవించినట్టి జలనిధికల్లో
లములను విపులగదాదం, డమునం బోనడిచె నతిదృఢం బగు శక్తిన్.

చ. మఱియును న మ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కువ
త్సరములు గ్రీడ సల్పి రిపుసైన్య [3]విదారణశౌర్య [4]ఖేలనా
పరతఁ జరించి యవ్వరుణపాలిత మైన లస ద్విభావరీ
పురమున కేఁగి యందుఁ బరిపూర్ణత నున్న పయోధినాథునిన్. 615

వ. మఱియును. 616

సీ. యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళభు
వనపరిపాలుఁడై తనరు చున్న
వరుణునిఁ గనుఁగొని పరిహాసితోక్తుల
నిట్లను విశ్వమం దెన్నఁ గలుగు
సకలలోకైక పాలకులలో నతిబలా
ధికుఁ డని జగము నుతింపఁ దగిన
శూరుండ విపుడు నీపౌరుష మొప్పంగఁ
గదన రంగమున నన్నెదిరి చూడు

---

1 నాకులు = స్వర్గమందుండువారు. 2 ప్రభవించిన = పుట్టిన 3 విదారణ = చీల్చునట్టి. 4 ఖేలనము = ఆట.

తే. నీ భుజావిక్రమంబును బాహుభవంబు
నడఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
[1]పగతు జయమును వృద్ధియు బలము నాత్మ
బలముఁ దలపోసి దనుజుతో [2]బవరమునకు. 617

సమయముగాదని తనచి, త్తమునం గలరోషవహ్నిఁ దాలిమియను [3]తో
యములం దగనార్చుచు [4]నుపశమితోక్తులం బల్కె దనుజసత్తముతోడన్.

చ. మనమున శాంతిఁ బూని నియమంబున సంగర ముజ్జగించి యే
నసయము నున్నవాఁడ నిపు డాహవకేళిఁ జరింపరాదు నీ
ఘనభుజవిక్రమస్ఫురితగాఢవిజృంభణముల్ జయింపఁ జా
లిన ప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క నెక్కుడన్. 619

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా
[5]నని మొనఁ జెక్కుమూరు [6]నభియాతుల నోలి జయించి శక్తి పెం
పున [7]సడిసన్న వీరుఁ డని భూజనకోటి నుతించు నందు వే
చను మతఁ డిచ్చు నీకుఁ దని సర్వముఁ దీర్చెడు నంతమీఁదటన్. 620

ఉ. నిందకు నోర్చి [8]యాజిమొన నిల్వఁగ నోపఁగ వీఁగి పాఱు నీ
పందల వెంటఁబడ్డ మగపంతమె సర్వశరణ్యుఁ డైన గో
విందుఁడు దీర్చు నీ పని వివేకవిహీన చనంగ నోపు దే
నందుల కేఁగు మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్.

వ. అదియునుం గాక.

క. పురుషాకృతిఁ బ్రతియుగమునఁ, బురుషోత్తముఁ డవతరించి భూరిభుజావి
స్ఫురణన్ దుష్ట[9]నిశాటుల, హరియించుచునుండు మునిగణార్చితపదుఁడై.

ఉ. కావున నావిభుం [10]దొడరి కయ్యము [11]దయ్యము మెఱుంగఁ జేసి ర
క్షోవర నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి [12]సారమే
యావళి కాశ్రయం బగుదు వచ్చటి కిప్పుడ యేఁగు దేని నీ
[13]చేవయు [14]లావు నేర్పడును జెప్పఁగ నేటికి మీఁదికార్యముల్. 624

---

1 పగతుఁడు = శత్రువు. 2 బవరము = యుద్ధము. 3 తోయము = నీరు. 4 ఉపశమితోక్తులు = శాంతపు మాటలు. 5 అనిమొన = యుద్ధముయొక్క ముందు భాగము. 6 అభియాతులు = శత్రువులు. 7 సడిసన్న = నిందపోయిన ఖ్యాతిఁజెందిన. 8 ఆజి = యుద్ధము. 9 నిశాటులు = రాక్షసులు. 10 తొడరి = పూని. 11 దయ్యము = దేవుఁడు. 12 సారమేయము = కుక్క. 13 చేవ = సారము. 14 లావు = బలము.

చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం
డనయము మానసంబున భయంబు బొకయించుక లేక సంగరా
వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనుఁ జనా
ర్దను ననుచుఁ వికుంఠనగర స్ఫుటసంచిత మార్గవర్తియై. 625

క. చనుననవసరమున నారద, మునివరుఁ డెదు రేఁగుదెంచి ముదముదలిర్పన్
దనుజేంద్ర యెందుఁబోయెద, వనియడిగిన నారదునకు నతఁడిట్లనియెన్.

చ. సరసిరుహోదరుం దొడరి సంగర మే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోదవి
స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠ పథానువర్తినై
యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవ [1]నేత కిట్లనున్. 627

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరము వహింప నాది[2]కిటిభావముఁ దాల్చి [3]రసాతలంబునం
దరవుగ నున్నవాఁ డచటి కేఁగఁగ నోపుదువేని నేఁగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. 628

—• హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహం బగు హరి నెదిరించి పోరుట. •—

చ. అనవుడు దానవేంద్రుఁడు [4]హుతాశను కైవడి మండి పద్మలో
చను నెదిరించు వేడుకలు సందడిగొల్ప ననల్పతేజుఁడై
ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ జండభుజాబలదర్పమేర్పడన్. 629

వ. చని జలమధ్యంబున. 630

క. దివిజారి యెదురఁ దగఁ గనె, నవిరళదంష్ట్రాభిరాము నమరలలాముం
గువలయభరణోద్దాముఁ, నవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్.

వ. అయ్యవసరంబున సూకరాకారుం డైన హరియు. 632

క. వనజరుచిసన్నిభములగు, తనలోచనయుగళదీప్తి దనరఁ దదాలో
కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁజేసెఁ దత్క్షణ మాత్రన్.

వ. మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱు లేని విహా
రంబునం జరియించు నట్టియెడ. 634

[1] నేత = రాజు. [2] కిటి = అడవిపంది. [3] రసాతలము = పాతాళలోకము.
[4] హుతాశనుఁడు = అగ్ని.

సీ. తుద మొదళ్ళకుఁ జిక్కఁ దునిసి పాఱఁగ [1]మోర
గులశైలముల జిమ్ముఁ గొంత దడవు
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ
గొమ్ములఁ దాటించుఁ గొంతదడవు
జలధు లేడును బంక సంకులంబై యుండ
ఖురముల మట్టాడుఁ గొంతదడవు
[2]నుడురాజు సూర్యుఁడు నొక్క మూలకుఁ బోవఁ
గుఱుచవాలము ద్రిప్పుఁ గొంతదడవు
తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు
నెగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపు రేఁగి
దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ
బంది మెల్లన రణపరిపంథి యగుచు. 635

వ. మఱియును. 636

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశితదంష్ట్రాగ్ర[3]యుతవసుంధరుఁడగుచుం
దన కెమరే తేఁ గని య, [4]వ్వనచర మేరీతి నిపుడు [5]వనచర మయ్యెన్.

క. అని యాశ్చర్యభయంబులు, దనమనమునఁ దొంగలింపఁ దనుజాధిపుఁ డి
ట్లనియెన్ భీకరసూకర, తనువొంది చరించు దనుజదర్పాపహుతోన్.

క. ఘనసూకర మూర్ధాత్మక, వనరుహసంభూత [6]దత్తవరదానమునం
గనిన రసాతల [7]గతభువి, యనయంబును నాయధీనమై వర్తించున్.

క. గొనకొని నీవీధరణిం, గొనిపోకుము విడుము కాక కొని యేఁగెద వేఁ
గొనియెదనీప్రాణముఁ గ్రై, కొనుమిదె నామాట[8]చలముకొన నేమిటికిన్.

క. మాయావి వగుచు నిప్పుడు, వాయక యిప్పుడమిఁ జోరభావంబున నీ
వీయెడఁ గొనిపోఁజూతువె, [9]యాయతభుజబలముచేత నడఁపక యనుచున్.

సీ. [10]అవిరళ యోగమాయా బలంబునఁ జేసి
యల్పపౌరుషమున నలఁతు నిన్ను

---

1 మోర = ముట్టె. 2 ఉడురాజు = చంద్రుఁడు. 3 యుత = కూడుకొనిన. 4 వనచరము = మృగము 5 వనచరమయ్యెన్ = జలమునందుఁ జరించునదయ్యెను. 6 దత్త = ఇవ్వఁబడిన 7 గత = పొందిన 8 చలము = మాత్సర్యము. 9 ఆయత = విశాలమైన. 10 అవిరళ = ఎడతెగని.

నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య
  కలుల కెల్లను మోద మొలయఁ జేయఁ
జెలు వేది మద్దదా [1]శీర్ణుఁడ వగు నిన్నుఁ
  గనుఁగొని దేవతాగణము లెల్ల
నిర్మాలులై చాల నెఱి నళించెద రన్న
  విని యజ్ఞపోత్రియై వెలయు చున్న

తే. హరి సరోజాతభవ ముఖామరుల కెల్ల
వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది
నిశితదంష్ట్రాగ్రలసితమై నెగడు ధరణి
దేవితో నొప్పె నా దేవదేవుఁ డంత. 642

క. సురరిపువాక్యాంకుశముల, గురుకుపితస్వాంతుఁడగుచుఁ గోమరారావసుం
ధరతోడ భీతినొందిన, కరిణిం గల కరికులేంద్రకరణిం బెలుచన్. 643

తే. నిశితసితదంత [2]రోచులు నింగిఁ బర్వఁ
[3]గంధి వెడలి భయంకరాకారలీల
నరుగు భీషణ [4]మఖవరాహావతార
మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక. 644

క. కరివెనుకఁదగులు [5]నక్రము, కరణింజని దైత్యవిభుఁడుగదిసియిటులనుఁ
దురితపయోనిధి[6]తరికిం, గిరికిఁ ఖురదళితమేరుగిరికిఁ హరికిన్. 645

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం
బొందెదనని తలఁచుచు నిటు, పందగతిం బాఱ బంటు పంతమె నీకున్.

వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు కోపోద్దీపితమానసుండై. 647

క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ
దోయజనాభుఁడు దనబల, మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్.

తే. కుసుమముల వృష్టి బోరనఁ గురిసె నంత
విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ
గడఁక వీతెంచె గంధర్వగానరవము
నందితము లయ్యె నప్సరోనర్తనములు. 649

---

1 శీర్ణుఁడు = కృశించినవాఁడు. 2 రోచులు = కాంతులు. 3 కంధి = సముద్రము. 4 మఖము = యజ్ఞము. 5 నక్రము = మొసలి. 6 తరికిన్ = దాటింపఁజేయువానికిన్.

వ. అయ్యవసరంబున నయ్యజ్ఞ వరాహమూర్తిధరుండైన కమలలోచ
నుండు గనకకుండల కేయూర గ్రైవేయ కటకాంగుళీయక భూషణ
రోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుండై.

చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచన నవ్య విచిత్ర[1]వర్మ మిం
పొనరఁగఁ దాల్చి దానవ నియుక్త దురుక్తి నిశాతబాణముల్
దన ఘన[2]మర్మముల్ గలఁప దానవహంత నితాంతశౌర్యుఁడై
కనలుచు వచ్చి నద్దనుజుఁ గన్గొని రోష విభీషణాకృతిన్. 651

వ. ఒప్పి నగుచు నిట్లనియె. 652

మ. వినరా యోరి యమంగళాచరణ యుద్వృత్తిన్ ననున్ నీ మది
న్ననయంబున్ వనగోచరం బగు మృగం బంచుం దలం తౌర నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలిమై యేతెంచు నీబోఁటి యా
శునకశ్రేణి వధింతు నేఁ డని మొనన్ [3]స్తోఁకోర్చి వర్తించినన్. 653

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము నీకో
ర్కులు నేఁడు దీర్తు నూరక, తలపోయ[4]వికత్థనంబు దగదు దురాత్మా.

చ. విను మది గాక సంగరవివేకవిశారదులైనయట్టి స
జ్జనములు మృత్యుపాశములఁ జాల [5]నిబద్ధులు నయ్యు నీవలెన్
గొనకొని యాత్మ సంస్తుతులకున్ ముద మందురె యేల యీ విక
త్థనములు బంటుపంతములె దైత్యకులాధమ యెన్ని చూడఁగన్.

మ. ధృతిఁ బాతాళమునందు నీ వనెడి సంప్రోక్త[6]నిక్షేప మే
నతి దర్పంబునఁ గొందుఁ జూడు మిదె దేవారాతి నన్నెన్న దా
గతలజ్జుం డన దాఁగి యుండి రణముం గావింతు యుష్మద్గదా
వితత ద్రావితు నన్ను నేఁ డెదురుచూ వే తీర్తు నీ కోరికల్. 656

ఉ. ఎన్నఁ బదాతి యూథముల కెల్ల విభుండవు పోటుబంటవై
నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయ బలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు మిది మేరఁగ మేదిని పీతదైత్యమై
వన్నెకు నెక్కఁజేసెద నవార్య పరాక్రమ విక్రమంబునన్. 657

---

1 వర్మము = కవచము. 2 మర్మములు = ఆయువుపట్టులు. 3 స్తోఁకు=త్రాసుడు.
4 వికత్థనంబు = ఆత్మస్తుతి. 5 నిబద్ధులు = కట్టఁబడినవారు. 6 నిక్షేపము = నిధి.

చ. నను నెదురంగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం
బును గలవేని నిల్వు రణభూమిని నీ హితులైన వారికిం
గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ
య్యనఁ జనఁ బొమ్ము దానవకులాధమ యూరక [1]రజ్జు లేటికిన్. 658

క. నను నిట సంస్థాపించెద, నని పలికితి వంతవాఁడ వౌదువు నీకున్
[2]సెనరైన చుట్టములఁ బొడ, గనిరా యిదె యమునిపురికిఁ గాఁపుర మునుగన్.

మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప
ల్కిన హాసోక్తుల కుల్కి రోషమద సంఘీభూత చేతస్కుఁడై
కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమం గాఁ[3]గినుకమైఁ దోఁకఁ ద్రొ
క్కిన[4]కృష్ణోరగరాజుమాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్. 660

క. చలితేంద్రియుఁడై నిట్టూ, ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా
కులమానసుఁడై గదఁ గొని, జలజాక్షున కెదురు నడచె సాహస మొప్పన్.

వ. అత్తఱి హిరణ్యాక్షుం డతిభయంకరాకారుండై. 662

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై మాధవుం
గుదియన్ వ్రేసిన వ్రేటు గైకొనక [5]రక్షోహంత శౌర్యోన్నతిన్
గద గేలన్ ధరియించి దానిఁ దునుకల్ గావించినం దైత్యుఁడు
న్మదుఁడై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్.

చ. అది దనుఁ దాఁకకుండ దనుజారి గదా రణకోవిద క్రియా
స్పద[6]కరలాఘవక్రమముఁ బైకొని చూపి విరోధి[7]పేరురం
బదరఁగ వ్రేయ వాఁడు [8]వివశాకులభావము నొంది యంతలో
మదిఁ దెలివొంది వ్రేసె రిపుమాన[9]విమర్దను నాజనార్దనున్. 664

వ. ఇట్లు దలపడి యన్యోన్య జయకాంక్షల నితరేతర[10]తుంగతరంగతాడి
తంబు లగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ బరస్పరశుండా
దండఘట్టిత మదాంధ గంధసింధురయుగంబు చందంబున రోషభీషణా
టోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున నద్దర్పాతిరేకంబున నెదిర్చి

---

1 రజ్జులు = వ్యర్థపుమాటలు. 2 సెనరు = దయ. 3 కినుకమై = కోపముతో.
4 కృష్ణోరగము = కృష్ణసర్పము. 5 రక్షోహంత = రాక్షసులహింసించువాఁడు-విష్ణువు.
6 కరలాఘవము = చేతినేర్పు. 7 పేరురము = విశాలవక్షము 8 వివశాకుల భావము = మూర్ఛ. 9 విమర్దనుఁడు = అణచువాఁడు. 10 తుంగతరంగ తాడితములు = ఎత్తైన

అంకిలి వైచు మదవృషభంబుల రభసంబున ననన్యసింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు [1]సవ్యమండలభ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండల భ్రమణంబునం దిరిగి విపక్షువక్షం [2]బశనిసంకాశం బగు గదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి దనుజపరిపంథిఫాలంబు నొప్పించె నప్పు డమ్మేటి వీరులు [3]శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులం బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల [4]రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచువేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్ర సిద్ధసాధ్య దేవగణంబులతోడఁ జనుదెంచి ధరిత్రీ నిమిత్తంబున నసురవరుని తోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె. 665

ఉ. అంచితదివ్యమూర్తి పరమాత్మక యీ కలుషాత్ముఁ డైన [5]న
క్తంచరుఁ [6]డస్మదీయ వర గర్వముఁన్ భువనంబు లెల్లఁ గా
రించు మదించి యిట్టి విపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్. 666

క. బాలుఁడు గరమున నుగ్ర[7]వ్యాళము ధరియించి యాడువడువున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక [8]పాలార్చుట నీతియే శుభప్రద యింకన్.

వ. అదియునుం గాక. 668

మ. అనఘా యీ [9]యభిజిన్మహూర్తమున దేవారాతి మర్దింపవే
ననయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మేతెంచినన్
ఘన మాయాబలశాలి యైన దనుజున్ ఖండింపగా రాదు గా
వున నీ వేళన త్రుంపు సజ్జనహిత ప్రోద్యోగ రక్తుండవై. 669

---

1 సవ్యమండల పరిభ్రమణంబు = ఎడమనుండి కుడివైపునకుఁ దిరుగుట. 2 అశని సంకాశము = పిడుగుతో సమానము. 3 శోణితసిక్తాంగులు = రక్తముతోఁ దడుపఁబడిన శరీరులు. 4 రుధిరంబు లాఘ్రాణించు = నెత్తురువాసనచూచు 5 నక్తంచరుఁడు = రాత్రి సంచరించువాఁడు, రాక్షసుఁడు. 6 అస్మదీయ = నాయొక్క. 7 వ్యాళము = పాము. 8 పాలార్చుట = ఉపేక్షించుట. 9 అభిజిత్తు = పగలు 14 ఘడియలమీద 2 ఘడియల కాలము.

క. అని సరసిజగర్భుఁడు పల్కినవచనము లర్థివిని [1]నిలింపులు గుంపుల్
గొనిచూడసస్మితానన,వనజము సెలువొందనసురవరు కభిముఖుఁడై.

తే. పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష
నిరతిఁ దరుణారుణాంభోజ నేత్రుఁ డగుచు
ఘనగదాదండ మెత్తి రాక్షసుని [2]హనువు
నుగ్రగతి మొత్తె వాఁడును [3]నోసరించె. 671

క. పరువడి దితిసుతుఁ డతిభీ, కరగదఁ జేఁ బూని చిత్రగతులను బద్మో
దరు డాసి చేతిగద సా,గరమునఁ బడనడిచె బాహుగర్వ మెలర్పన్.

వ. అంత. 673

తే. హరి నిరాయుధుఁ డైన సురారి సమర
ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబుఁ దక్కి
నిలిచి చూచుచు నుండెను [4]నింగి నమర
వరుల హాహారవంబులు భరిత మయ్యె. 674

క. సరసిజనేత్రుఁడు దనుజే,శ్వరు సంగర ధర్మమునకు సమధిక శౌర్య
స్ఫురణకుఁ దనచిత్తంబున, గరమాశ్చర్యంబునొంది కడఁక దలిర్పన్.

మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా
దితిసంతాన కులాటవీ మహిత సంకీప్తప్రభాశుక్రమున్
సతతోద్యజ్జయశబ్దసన్ముఖర భాస్వచ్చక్రమున్ సంతతా
శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధాత్రీ చక్రముం జక్రమున్. 676

వ. అదియునుం బ్రచండ [5]మార్తాండ మండల ప్రభా పటల చటుల [6]విద్యోతమానంబును బటునటజ్జ్వాలికా పాస్త సమస్త కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహా గర్వాంధకారంబును నసహ్య కహకహ నిన [7]దాధరీకృత సాగర ఘోషంబును సకల దేవతాగణ జేగీయమానంబును ననంత తేజోవిరాజితంబును నిజప్రభా పటలపూరిత బ్రహ్మాండ[8]కటాహంబును నై రయంబునం జనుదెంచి దనుజారి దక్షిణ

---

1 నిలింపులు = దేవతలు. 2 హనువు = చెక్కిలి, 3 ఓసరిల్లు = ప్రక్కకు నొదుగు 4 నింగి = ఆకాశము. 5 మార్తాండమండలము = సూర్య మండలము. 6 విద్యోతమానము = ప్రకాశించుచున్నది. 7 అధరీకృతము = తక్కువగాఁ జేయఁబడిన, 8 కటాహము = కుండ.

కరసరోజంబు నలంకరించిన నా శుభాంగుండు రథాంగ పాణియై
[1]దివంబున నమరగణంబులు జయజయ శబ్దంబులు పలుక నసురవిభున
కెదురుగా నడచిన. 677

క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁ [2]బొలివోని బంటుతనమున [3]బీరం
బుడుగక భీషణగదఁగొని, యడిచె మఖమయవరాహు నమిత్రోత్సాహున్

క. [4]త్రిదశారి దన్నుఁ బ్రేసిన, గద బదమునఁ బోవఁ దన్ని కమలాక్షుఁడు పెం
పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదనకమలము బొదువన్.

వ. ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె. 680

చ. ఘనగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు రార యనివారణ దైత్యకులేశ్వరాధమా
యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె వ్రేసినం
దనుజ విభేది పట్టెఁగొనెఁ [5]దార్క్ష్యుఁ [6]డహీంద్రునిఁ బట్టుకైవడిన్. 681

క. దితిజుఁడు దనబలు [7]మప్రతి, హత తేజుం డగు సరోరుహాక్షుని శౌర్యో
న్నతిమీఁదఁ బెట్టకుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము పేర్మిన్.

వ. అంత. 683

సీ. [8]కాలానలజ్వాల జ్వాలావిలోల క
రాళమై పెంపొందు శూల మంది
సురవైరి యజ్ఞసూకర రూపధరుఁడైన
వనజనాభునిమీఁద వైవ నదియు
సద్విజోత్తముమీఁదఁ జపలతఁగావించు
[9]నభిచారకర్మంబు నట్ల పెండు
పడి పఱతేఁ గని పద్మోదరుఁడు దానిఁ
జక్రధారాహతిఁ జండవిక్ర

తే. మమున నడుమన వడిఁద్రుంచె నమరభర్త
మహిత[10]దంభోళిచే గరుత్మంతుపక్ష

---

1 దివము = స్వర్గము. 2 పొలివోని = నశింపని. 3 బీరము=గర్వము. 4 త్రిదశారి = దేవతలశత్రువైన రాక్షసుఁడు. 5 తార్క్ష్యుఁడు=గరుత్మంతుఁడు. 6 అహీంద్రుని= సర్పశ్రేష్ఠుని. 7 అప్రతిహతము = అడ్డులేనిది. 8 కాలానల......కరాళమై=ప్రళయ కాలాగ్నియొక్క మండు మంటలయొక్క కదలికవలె భయంకరమై. 9 అభిచారకర్మ=

మతిరయంబునఁ ద్రుంచిన గతిఁ జెలంగి
సురలు మోదింప నసురులు సొంపుడింప. 684

వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం
బందుటంగని. 685

క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతి [1]నిష్ఠురముష్టిఁ బొడిచె హరి నాలోకో
న్నతుఁడొప్పె గుసుమమాలా,హతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁడై.

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్
ధరణీచక్రము[2]భూరిపాంసుపటల ధ్వాంతంబునం గప్పె భీ
కర [3]పాషాణ [4]పురీషమూత్ర ఘనదుర్గం [5]ధాస్థి రక్తావళుల్
గురిసెన్ మేఘము [6]లభ్రవీథిని మహాక్షోభక్రియాలోలమై. 687

వ. మఱియును. 688

చ. తవిలి [7]విముక్తకేశ పరిధానము లుగ్రకరాళదంత [8]తా
లువులును రక్తలోచనములుం గల భూత పిశాచ ఢాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధ పాణులై మహా
రవముగ యక్షదైత్య చతురంగబలంబులఁ గూడి తోఁచినన్. 689

వ. అంత. 690

క. [9]త్రిసవనపాదుండగు నా, బిసరుహనేత్రుండు లోకభీకర మగునా
యసురాధిపుమాయా[10]విని, రసనకరంబైన శస్త్రరాజముఁ బనిచెన్.

క. ఆచక్రభానుదీప్తి ధ,రాచక్రమునందు నిండి రయమున నమ్మా
యాచక్రము నడఁగించెను, నీచక్రముఁడైన[11]యామినీచరు నెమరన్.

వ. అంత నిక్కడ. 693

క. దితి దనవిభువాక్యంబుల, గతిదప్పదయనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో
ణితధార లొలికె[12]రక్షః,పతియగు [13]కనకాక్షుపతనభావము దోఁపన్.

---

1 నిష్ఠురముష్టి = కఠినమైన పిడికిలి. 2 భూరి...ధ్వాంతము = పెద్దదుమ్ము యొక్క సమూహమువలని చీకటి. 3 పాషాణము = రాయి. 4 పురీషము = మలము. 5 అస్థి = ఎముకలు. 6 అభ్రము = ఆకాశము. 7 విముక్త...పరిధానములు = ఊడిపోయిన జుట్టు, వస్త్రములు కలవి. 8 తాలువు = దవుడ. 9 త్రిసవనపాదుఁడు = యజ్ఞపురుషుఁడు. 10 వినిరసనకరము = తిరస్కరించునది. 11 యామినీచరుఁడు =

వ. అయ్యవసరంబున నసురవిభుండు దనచేసిన మాయాశతంబులు గృతఘ్ను నకుం గావించిన యుపకారంబులుంబోలె హరిమీఁదఁ బని సేయక విఫలంబు లయినం [1]బొలివోవని బంటుతనంబునఁ బుండరీకాక్షుఁజేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరివక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగుముష్టిఁ బొడిచిన నసురాంతకుండు [2]మిసిమింతుండుగాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రవజ్రసన్నిభం బగు నఖచేతం గఱకు టసుర[3]కటితటంబుఁ జటులగతి వ్రేసిన నాహిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి [4]యుదస్తలోచనుండై సోలి యెట్టకేలకు నెదురనిలువం బడె నంత. 695

క. [5]దిటచెడి లోఁబడె దైత్యుఁడు, సటికిటిదంష్ట్రావిభిన్నశత్రుమహోరస్తటికిటి ఖరఖురపుటికిం, గటితట హతకమలజాండ ఘటికిం గిటికిన్. 

వ. ఇట్లు లోఁబడిన. 697

మ.* దివి నింద్రాదులు సంతసింప హరి మొత్తెం గర్ణమూలంబునం
[6]బవి సంకాశ కఠోరహస్తమున శుంభల్లీలమై దానవా
నవలోకేశుఁడు రక్తనేత్రుఁడగుచు న్దైన్యంబు వాటిల్లఁగా
భువిమీఁదం బడి సోలె మారుతహతోన్మూల [7]లావనీజాకృతిన్. 698

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, [8]వెడరూపము దాల్చి గ్రుడ్లు వెలికుఱుక నిలం బడి పండ్లు గీటుకొనుచును, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్.

తే. పడినదనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ
వాది దివిజులు వెఱఁ గంది రాత్మలందు
నితఁడు వొందుట యెట్లొకో యీయవస్థ
నని తలంచుచు మఱియు నిట్లనిరి వరుస. 700

*మ. దివి నింద్రాదులు సంతసింప హరి యుద్రేకం బనేకంబుగాఁ బవిసంకాశ కఠోర హస్తమున శుంభల్లీలమై వ్రేయు దానవ—అని పాఠాంతరము.

1 పొలివోవని = నశింపని 2 మిసిమింతుఁడు = అలసినవాఁడు. 3 కటితటము= నడుము. 4 ఉదస్త = తొలగింపఁబడిన. 5 దిట = దార్ఢ్యము. 6 పవిసంకాశము = వజ్రముసుబోలిన. 7 అవనీజము = చెట్టు. 8 వెడరూపము = వికారము.

మ. పరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతు రాపంకజో
దరు[1]పాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్ దర్శించుచుం జచ్చె దు
ర్భరితోత్తంసుఁడు దైత్యవల్లభుని సౌభాగ్యంబు దా నెట్టిదో. 701

చ. సమ మతి వీరు [2]దైత్యకుల శాసను పారిషదుల్ మునీంద్రశా
పమున [3]నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
[4]సమయుటఁ జేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్యవా
సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్. 702

క. అని వెఱఁగు నొంది పావన,తను వొందినయట్టి వికచ తామరసాక్షు
న్ననిమిష మునియోగిజనా,వనదక్షున్ దనుజ[5] కరటి వర[6]హర్యక్షున్.

వ. కనుంగొని. 704

చ. వనజదళాక్ష యీజగతివారల మర్మము లీ వెఱింగి యీ
సునఁ బగఁబట్టు నీ[7]దివిజ సూదనుఁ జంపితి గాన యింక శో
భన మగు నంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁ బుణ్యశీలునిన్. 705

వ. అంత. 706

చ. సవనవరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచిన మీఁద [8]భారతీ
ధవముఖ దేవతాముని కదంబము దన్ను నుతించునట్టి సం
స్తవమున కాత్మలోనఁ బ్రమదంబునఁ బొంది సమగ్రమంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్.707

చ. అరిగె వికుంఠధామమున కమ్మహితోత్సవసూచకంబుగా
మొరసె [9]సుపర్వదుందుభు లమోఘములై ధరణీతలంబునం
గురిసెఁ బ్రసూనవృష్టి [10]శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె భా
స్కరశశిమండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్. 708

---

1 పాణ్యాహతి = చేతిదెబ్బ. 2 దైత్య...పారిషదుల్ = విష్ణుకింకరులు. 3 నికృష్టము = నీచము. 4 సమయుట = చచ్చుట. 5 కరటి = ఏనుఁగు. 6 హర్యక్షము = సింహము. 7 దివిజసూదనుండు = రాక్షసుఁడు. 8 భారతీ...కదంబము = బ్రహ్మ మొదలయిన దేవతామునుల సమూహము. 9 సుపర్వదుందుభి = దేవతల భేరి. 10 శిఖి = అగ్ని.

క. అని యీపుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు [1]త్రిదివ వాసులకుం జె
ప్పినయది మైత్రేయుఁడువిదురునకెఱిఁగించినవిధంబు రూఢముగాఁగన్.

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁజెప్పెనని సూతుఁడు శౌ
నకముఖ్యులైనమునివరులకుఁదెలియఁగఁజెప్పెమఱియులాలనమొప్పన్.

వ ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లెనని.

క. అనఘంబగు నీచరితము, వినినఁ బఠించిన లభించు విశ్రుతకీర్తుల్
వనజోదరుపదభక్తియు, మునుకొనియిహపరసుసౌఖ్యములుజనములకున్.

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె నట్లు పరీక్షిన్న రేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబును స్వాయంభువ మనువుఁ బుట్టించిన యనంతరంబున విరించి దిర్యగ్జాతి జంతుసృష్టి నిమిత్తంబులైనమార్గంబు లెన్ని సృజించె మహాభాగవతోత్తముం డయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనులగు ధృతరాష్ట్రపుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముండగుచుఁ దన మనోవాక్కాయకర్మంబులు గృష్ణునంద చేర్చి భాగవతజనోపాసకుండై [2]పుణ్యతీర్థ సేవా సమాలబ్ధ యశోవిగత కల్మషుండగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నంబులడిగె నవి యెల్లందెలియ నానతిమ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 713

సీ. విమలాత్ముఁడైన యవ్విదురుండు మైత్రేయ
మునివరుఁజూచి యిట్లనియెఁ బ్రీతిఁ
జతురాత్మ సకల ప్రజాపతియైనట్టి
జలజగర్భుఁడు ప్రజాసర్గమందు
మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ
జిత్తమం దేమి సృజింపఁదలఁచె
మును సృజించినయట్టి మును లమ్మరీచ్యాదు
లజ్జజు నాదేశ మాత్మ నిలిపి

1 త్రిదివము = స్వర్గము. 2 పుణ్య...కల్మషుఁడు = పుణ్యతీర్థములను సేవించుటచేఁ బొందినకీర్తిచేతఁ బోయిన పాపములుకలవాఁడు.

తే. యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము
మెఱసి మఱి వారు భార్యాసమేతులగుచు
నేమిసృజియించిరదిగాక కామినులను
బాసి యేమిసృజించి రా భద్రయశులు.

క. అందఱుఁ దమలో నైక్యముఁ, జెందిచో నేమిదగ సృజించిరి కరుణా
కందళితహృదయయిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపుమయ్య బుధనుత నాకున్.

* చతుర్ముఖుం డొనర్చు యక్షాదిదేవతాగణసృష్టిం దెలుపుట *

సీ. అనిన మునీంద్రుఁడిట్లనియె జీవాదృష్ట
పరుఁడు మాయాయుక్త పురుషవరుఁడుఁ
గాలాత్మకుఁడు ననుకారణంబున నిర్వి
కారుఁ డైనట్టిజగన్నివాసుఁ
డాది జాతక్షోభుఁ డయ్యె నమ్మేటి వ
లనను గుణత్రయంబును జనించె
నాగుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ
మది రజోగుణహేతు వైన దాని

తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ
బొడమె మఱి దానివలనఁ బ్రభూత మయ్యె
బంచతన్మాత్ర లందు సంభవము నొందె
భూతపంచక మీసృష్టిహేతు వగుచు. 716

వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువననిర్మాణకంబునకు సమర్థం
బులు గాక యన్నింటిసంఘాతంబునఁ బాంచభౌతికం బైన హిరణ్మ
యాండంబు సృజియించె నదియును జలాంతర్వర్తి యై వృద్ధిఁ బొందు
చుండె నంత. 717

సీ. నారాయణాఖ్య నున్నతి నొప్పుబ్రహ్మంబు
సాహస్రదివ్య వర్షంబు లోలి
వసియించి యుండె నావాసుదేవునినాభి
యందు సహస్రసూర్యప్రదీప్తిఁ
దనరుచు సకలజీవ నికాయయుత మగు
పంకజాతంబు సంభవము నొందెఁ

బరఁగంగ నందులోఁ భగవ దధిష్ఠితుం
డై స్వరాట్టగు చతురాననుండు
తే. జనన మందెను దత్పద్మసంభవుండు
నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ
డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము
వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు. 718

సీ. తామిస్రమును నంధతామిస్రమును దమ
మును మోహమును మహామోహనంబు
నను పంచమోహరూపాత్మకమైన య
విద్యఁ బుట్టించి యవ్వేళఁ దనకు
నది తమోమయదేహ మని ధాత రోసి త
త్తనువు విసర్జించె ధాతృ[1]ముక్త
దేహంబు సతత [2]క్షు[3]త్తృష్ణల[4]కావాస
మును రాత్రిమయము నయ్యెను దలంప
తే. నందులోఁ యక్షరక్షస్సులన జనింప
వారి కప్పుడు క్షుత్తృష్ణల్ వఱలఁ గొంద
ఱా చతుర్ముఖు భక్షింతమనిరి కొంద
ఱతని రక్షింపమని తగనాడి రంత.

వ. ఇట్లు వలుకుచు భక్షించువారలయి [5]ధాతసన్నిధికిం జనిన నతండు భయ[6]విహ్వలుండై 'యేను మీ జనకుండను మీరలు మత్పుత్రులరు నన్ను హింసింపకుండుఁడు మా[7]మాజక్షత రక్షత' యను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షో నామంబులు ప్రకటంబులయ్యె వెండియుం బ్రభావిభాసితంబైన యొక్క కాయంబు ధరియించి సత్త్వగుణగరిష్ఠులుం బ్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులంగా సృజియించి తత్ప్రభామయగాత్ర విసర్జనంబు సేసిన నది [8]యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె. మఱియు జఘనంబువలన నతిలోలుపులైన యసురలం బుట్టింప వార

1 ముక్త=వదలిపెట్టఁబడిన. 2 క్షుత్తు=ఆకలి. 3 తృష్ణ=దాహము. 4 ఆవాసము=ఉనికిపట్టు. 5 ధాత = బ్రహ్మ. 6 విహ్వలుఁడు=మనస్సు చెదరినవాఁడు. 7 మాజక్షత=భక్షించవదు. 8 అహోరూపము= పగలురూపము.

లతి కాముకులగుటం జేసి య[1]య్యజునిం జేరి మిథునకర్మం బపేక్షిం
చిన [2]విరించి నగుచు నిర్లజ్జులయిన యసురులు దనవెంటం దగులం
బఱచి ప్రపన్నార్తిహారుండును భక్తజనానుగ్రహపరదర్శనుండును
నైన నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె.

క. రక్షింపుము రక్షింపు ము,పేక్షింపక వినుత నిఖిల బృందారక వి
శ్వక్షేమంకర విను మిటు, దక్షత నీయాజ్ఞ నేను దల నిడి వరుసన్.

తే. ఈప్రజాసృష్టి కల్పనం జే నొనర్ప
నందుఁ బాపాత్ము లైన యీయసురు లిపుడు
నను రమింపంగ డాయ వచ్చినఁ గలంగి
యిటకు వచ్చితి ననుఁగావు మిద్ధచరిత. 722

వ. అదియునుం గాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం గ్లేశంబునం
బొందిన వారల క్లేశంబు [3]లపనయింపను నీవ కాక యితరులు గలరే
యని స్తుతియించినఁ బద్మజు [4]కార్పణ్యంబెఱుంగ నవధరించి వివిక్తా
ధ్యాత్మదర్శనుం డగుచుఁ గమలసంభవ భవద్ఘోరతనుత్యాగంబు సేయు
మని యానతిచ్చిన నతండు నట్ల చేసెనంత నదియును. 723

సీ. నవ్యకాంచన [5]రణ న్మణినూపురారావ
విలసితపాదారవిందయుగళ
కాంచీ కలాప సంకలిత దుకూల వ
స్త్రస్ఫార [6]పులిననితంబబింబ
రాజితాన్యోన్య కర్కశపీన కరికుంభ
పృథు కుచభార కంపిత వలగ్న
[7]మదిరారసాస్వాద మద విఘూర్ణిత చారు
సిత నవవికచ రాజీవనయన

తే. [8]యపరపక్షాష్టమీ శశాంకాభ నిటల
మదవ దలికుల రుచిరోపమాన [9]చికుర

1 అజుఁడు = బ్రహ్మ. 2 విరించి = బ్రహ్మ. 3 అపనయించుట = తీసివేయుట.
4 కార్పణ్యము = లోభము. 5 రణత్ = ధ్వనిచేయుచున్న. 6 పులిన నితంబబింబ =
ఇసుక తిప్పలవంటి పిరుదులమండలము. 7 మదిరారసాస్వాదనము = కల్లుత్రాగుట.

లలితచంపకకుసుమ విలాస నాస
హాస లీలావలోకన యబ్జపాణి. 724

క. అనఁ దగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిం
గనుఁగొని దానవు [1]లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్.

క. ఈ సౌకుమార్య మీ వయ, సీ సౌందర్యక్రమం బీ నిర్ధైర్యంబు
నీ సౌభాగ్యవిశేషము, నే సతులకుఁ గలదు చూడ నిది చిత్రమగున్.

చ. అని వెఱఁ గంది యద్దనుజు లందఱు నిట్లని [2]తలోదరిం
గని మన మంతనుండియును గామకవృత్తిఁ జరించుచుండఁగా
మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో
యని బహుభంగులం బలికి రా ప్రమదాకృతి యైన సంధ్యతోన్. 727

క. [3]కదళీస్తంభోరువ, యేకుల మేజాడ దాన వెవ్వరిసుత వి
ప్లోకాంతంబున నిచ్చట, నేకారణమునఁ జరించె దెఱిఁగింపు తగన్. 728

క. భవదీయచారురూప, [4]ద్రవిణ లసత్పుణ్యభూమిఁ దగు మోహముసం
దవిలినదుర్భగులను మముఁ, గవయు పుష్పాస్త్రబాధ ఘనమయ్యెం గదే.

వ. మఱియుఁ దదీయ సౌందర్యం [5]బుగ్గడింపనలవిగాక చింతించుచు. 730

సీ. గురుకుచభార సంకుచి [6]తావలగ్నంబు
దనరారు నాకాశతలము గాఁగ
లలితపల్లవపాణి తలమునఁ జెన్నొందు
చెందు [7]పతత్పతంగుండు గాఁగ
సలలితనీల పేశలపృథు [8]ధమ్మిల్ల
బంధంబు ఘనతమఃపటలి గాఁగఁ
బ్రవిమలతర కాంత భావ విలోకన
జాలంబు దారకా సమితి గాఁగఁ

---

1 ఉపగూహనము=కౌగిలింత. 2 తలోదరి = పల్చని కడుపుగల, స్త్రీ. 3 కదళీ...రువ= అనఁటి కంబములవంటి తొడలుగలయో స్త్రీ. 4 ద్రవిణలసత్పుణ్యభూమి = బంగారముతో నొప్పుచున్న పవిత్రమైనభూమి. 5 ఉగ్గడింప = చెప్ప. 6 అవలగ్నము=నడుము. 7 పతత్పతంగుఁడు = పడుచున్న సూర్యుఁడు. 8 ధమ్మిల్ల బంధము = జొట్టుముడి.

తే. కడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁగ
సంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ
గదిసి మనముల మోహంబు గడలుకొనఁగ
నసురు లందఱుఁ గూడి యిట్లనిరి మఱియు. 731

క. వెలయఁగఁ బద్మం బేక, స్థలమున నే యొప్పుఁగాని త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక, స్థలములఁ దనరారుఁగాదె తరుణాబ్జముఖీ. 732

క. అని దనుజులు దమమనముల, ననురాగము లుప్పతిల్ల నందఱు నాసం
ధ్యను బట్టికొనిరి వనజా, సనుఁడప్పుడు హృదయమందు సంతసమందెన్.

క. సరసిజభవుఁ డయ్యెడఁదన, కర[1]మాఘ్రాణింప నపుడు గంధర్వులు న
ప్సరసలుఁ బుట్టిరి ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁ బాసిన నదియున్.

వ. చంద్రికారూపంబైనఁ దద్గాత్రంబు విశ్వావసు [2]పురోగము లగు గంధర్వాప్సరో గణంబులు గైకొనిరి వెండియుం గమలగర్భుండు దందోన్మాదజృంభికా నిద్రారూపం బైన శరీరంబు దాల్చి పిశాచ గుహ్యకసిద్ధభూతగణంబులం బుట్టించిన వారలు దిగంబరులు ముక్త కేశులు నయినం జూచి ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి వెండియు నజుండు దన్ను నన్నవంతునింగాఁ జఁతించి యదృశ్య దేహుం డగుచుం బితృసాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించిన యదృశ్యశరీరంబునకుం గార్యం బగు దేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్య[3]కవ్యంబు లాచరింతురు మఱియును. 735

సీ. సజ్జనస్తుత విను చతురతఁ బంకజా
సనుఁడు [4]తిరోధానశక్తి వలన
నర సిద్ధ విబుధ కిన్నరులను బుట్టించి
తవిలి వారికిఁ దిరోధాననామ

---

1 ఆఘ్రాణింప = వాసనఁజూడఁగ. 2 పురోగములు = ముందునడచువారు.
3 కవ్యము = పితృదేవతల కియ్యఁదగిన అన్నము. 4 తిరోధానశక్తి = అంతర్ధానశక్తి.

ధేయ మైనట్టి యాదేహంబు నిచ్చెను
  వెండియు భారతీ విభుఁడు దనకుఁ
బ్రతిబింబమగు శరీరమునఁ గిన్నరులఁ గిం
  పురుషులఁ బుట్టింపఁ బూని వారు
తే. ధాతృప్రతిబింబదేహముల్ దాల్చి వరుస
నిద్ద ఱిద్దఱు గవగూడి యింపు లొదవ
బ్రహ్మ పర మైనగీతముల్ వాడు చుండి
రంతఁ బంకజసంభవుఁ డాత్మలోన. 736

క. తనసృష్టి వృద్ధి లేమికిఁ, గనలుచు శయనించి చింతఁ గరచరణాదుల్
గొనకొనికదలింపఁగ రా, లిన[1]రోమము లుగ్ర[2]కుండలి వ్రజమయ్యెన్.

క. వనజజుఁడు దన్నుఁ గృతకృ, త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టివహింపన్
మనమున నిఖిలజగత్పా, వనులగు మనులం ద్రిలోకవరుల సృజించెన్.

సీ. పుట్టించి వారికిఁ బురుషరూపంబైన
  తనదేహమిచ్చినఁ దగిలి వారు
గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా
  వనజసంభవున కిట్లనిరి దేవ
యఖిల జగత్స్రష్టవైన నీచేతఁ గా
  వింపంగఁ బడిన యీ వితతసుకృత
*మాశ్చర్యకరము యజ్ఞాది క్రియాకాండ
  మీమనుసర్గ మం[3]దీడ్య మయ్యెఁ
తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ
లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె
ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల
వినుతి సేసిరి భారతీవిభుని మఱియు 739

---

1 రోమములు = వెండ్రుకలు. 2 కుండలివ్రజము = పాముల సముదాయము.

* మాశ్చర్యకర మయ్యె నందు యజ్ఞాదిక్రియాకాండ మిది నిశ్చయంబు గొందె— అని పాఠాంతరము.

3 ఈడ్యము = పొగడదగినది.

వ. వరతపోయోగ విద్యాసమాధియుక్తం బగుచు ఋషివేషధరుండును హ్యృషీకాత్ముండును నై ఋషిగణంబులం బుట్టించి సమాధియోగై శ్వర్యతపోవిద్యావిరక్తియుక్తంబగు నాత్మీయశరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునం బొంది గోవిందుచరణారవిందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె.

సీ. వరగుణ స్వాయంభువ మనువంశం బిలఁ
బరమసమ్మతము దప్పదు తలంపఁ
గొనకొని తద్వంశమున మిథునక్రియఁ
జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు
అదియును గాక స్వాయంభువ మనువుకుఁ
బూని ప్రియవ్రతోత్తానపాదు
లనుసందనులు గల రంటివి వారు స
ప్తద్వీపపతి యైనధాత్రి నెల్ల

తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ
ననఘులై యెట్లు పాలించి రయ్య వారి
చరిత మెల్లను సత్కృపా నిరతబుద్ధి
నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర. 741

వ. అదియునుం గాక తన్మనుపుత్రియు యోగలక్షణసమేతయు నగు దేవహూతియను కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నేవిధంబునం బెండ్లిచేసె నా దేవహూతియందు మహాయోగియయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె. నదియునుంగాక కర్దముండు రుచియను కన్యను దక్షప్రజాపతికి నిచ్చెనని చెప్పితి వా రుచియందు నమ్మహాత్ముం డీ సృష్టి యేలాగునం బుట్టించె నవి యన్నియుం దెలియ నానతీయవలయునని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె. 742

—♦ కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లియాడుట. ♦—

క. వినుమనఘకృతయుగంబున, మునినాథుండయినకర్దముఁడు ప్రజలస్సృజిం
పను వనజసంభవునిచే,త నియుక్తుండగుచు మది ముదము సంధిల్లన్.

తే. ధీరగుణుఁడు సరస్వతీ తీరమందుఁ
దవిలి పదివేలదివ్యవత్సరము లోలిఁ
దపము సేయుచు నొకనాఁడు జపసమాధి
నుండి యేకాగ్రచిత్తుఁడై నిండువేడ్క. 744

క. వరదుఁ బ్రసన్ను మనోరథ, వరదాన సుశీలు నమరవంద్యు రమేశున్
దురితవిదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై.

వ. అంతరిక్షంబునం బ్రత్యక్షంబైన. 746

సీ. [1]తరణి సుధాకర కిరణసమంచిత
సరసీరుహోత్పల స్రగ్విలాసుఁ
గంకణనూపుర గ్రైవేయ ముద్రికా
హార కుండల కిరీ టాభిరాముఁ
గమనీయ సాగర కన్యకా కౌస్తుభ
మణిభూష ణోద్భాసమాన వక్షు
నలలిత దరహాస చంద్రికాధవళిత
చారుదర్పణ విరాజ త్కపోలు

తే. శంఖచక్రగదాపద్మ చారుహస్తు
నలికులాలక రుచిభాస్వ దలికఫలకుఁ
బీతకౌశేయవాసుఁ గృపాతరంగి
తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 747

వ. మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండును సదాత్మకుండును జ్ఞానైకవేద్యుం
డును [2]వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిం
దుని గనుంగొని సంజాతహర్ష [3]లహరీపరవశుండును లబ్ధమనోరథుం
డును నగుచు సాష్టాంగ దండప్రణామంబులాచరించి తదనంతరంబ.

క. ముకుళితకరకమలుండయి, యకుటిలసద్భక్తిపరవశాత్మకుఁడగుచున్
వికచాంభోరుహలోచను,నకు నిట్లనియెం దదాననముఁగనుఁగొనుచున్.

1 తరణి = సూర్యుఁడు. 2 వైనతేయ...విందుఁడు = గరుత్మంతుని భుజములపై నుంచఁబడిన పాదకమలములు గలవాఁడు. 3 లహరీ = ప్రవాహము.

సీ. అజ్ఞాత్మ సకలభూతాంతరాత్ముఁడవనఁ
దనరుచుండెడినీదు దర్శనంబుఁ
దలకొని సుకృత సత్ఫల భరితంబు లై,
నట్టి [1]యనేక జన్మానుసరణ
ప్రకట యోగక్రియాభ్యాస నిరూఢు లై
నట్టియోగీశ్వరు లాత్మఁగోరి
యెంతురు యోగీశ్వరేశ్వర యే భవ
త్పాదారవింద సందర్శనంబు

తే. గంటి భవవార్ధిఁ గడవంగఁ గంటి [2]మంటిఁ
గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు
తవిలి సఫలత నొందె మాధవ ముకుంద
చిరదయాకార నిత్యలక్ష్మీవిహార. 750

వ అదియునుం గాక దేవా భవదీయమాయావిమోహితులై [3]హత మేధస్కులై సంసార [4]పారావారోత్తారకంబులైన భవదీయపాదార విందంబులు దుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామయోగ్యంబులగు మనోరథంబుల నిత్తు వట్టిసకాములైన వారి నిందించు నేనును గృహమేధధేనువు నశేషమూలయుం [5]త్రివర్గ కారణయు సమానశీలయునయిన భార్యం బరిణయంబుగా నపే క్షించి కల్పతరుమూలసదృశంబులైన భవదీయ పాదారవిందంబులు సేవించితి నయిన నొక్క విశేషంబుగలదు. విన్నవించెద నవధరిం పుము. బహిరాత్మకుండవయిన నీదు వచస్తంతునిబద్ధులై లోకులు కామహతులై రఁట. యేనును వారల ననుసరించినవాఁడనై కాలా త్మకుండవైన నీకు నభిమతం బగునట్లుగాఁ గర్మమయంబైన భవ దాజ్ఞాచక్రంబు ననుసరించుటకుఁగాని మదీయ కామంబుకొఱకుఁ గాదు. భవదీయ మాయావినిర్మితంబును గాలాత్మకభూరివేగ సమా

---

1 అనేక...నిరూఢులు = అనేక జన్మల వరుసచే స్పష్టమైన యోగాభ్యాసము చేసి ప్రసిద్ధిఁజెందినవారు. 2 మంటిని = బ్రతికితిని. 3 హతమేధస్కులు=మందబుద్ధులు 4 పారావారోత్తారకంబులు = సముద్రమును దాటించునవి. 5 త్రివర్గము = ధర్మార్థ కామములు.

యుక్తంబును నక్షరంబును నైన బ్రహ్మంబునందు భ్రమణశీలంబును నధిమాససమేత త్రయోదశ[1]మాసారంబును షష్ట్యుత్తర శతత్రయాహోరాత్రమయపర్వంబును ఋతుషట్కసమాకలిత [2]నేమియుం [3]చాతుర్మాస్య త్రయవిరాజిత [4]నాభియు నపరిమిత క్షణలవాది పరికల్పితపత్త్రశోభితంబునుం గాలాత్మకభూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకలజీవ నికరాయు[5]ర్గ్రసన తత్పరంబగుం గాని కామా[6]భిభూతజనానుగత పశుప్రాయులగు లోకుల విడిచి భవపరితాపనివారణ కారణంబయిన భవదీయచర[7]ణాతపత్రచ్ఛాయాసమాశ్రయులై తావకీనగుణకథా సుధాస్వాదన రుచిరలహరీనిరసితసకల దేహధర్ములైన భగవద్భక్త జనాయుర్హరణసమర్థంబు గాకుండునని వేఁడియు. 751

మ. అనఘా యొక్కఁడ వయ్యు నాత్మకృతమాయా జాతసత్త్వాదిశ
క్తి నికాయస్థితి నీ జగజ్జనన వృద్ధిక్షోభ హేతుప్రభా
వ నిరూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య సర్వేశ నీ
ఘనలీలామహిమార్ణవంబుఁ గడవంగా వచ్చునే యేరికిన్. 752

వ. దేవా శబ్దాది విషయసుఖకరంబగు రూపంబు విస్తరింపఁజేయు టెల్ల నస్మదనుగ్రహార్థంబుగాని నీకొఱకుంగా దాత్మీయమాయా పరివర్తిత లోకతంత్రంబుగలిగి మదీయమనోరథ సుధా[8]ప్రవర్షి వైన నీకు నమస్కరించెద. 753

మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్
వినతానందన [9]కంధరోపరిచర ద్విభ్రాజమానాంగుఁడై
యనురాగస్మిత చంద్రికాకలిత శోభాలోకుఁడై యమ్మునీం
ద్రునిఁ గారుణ్య మెలర్పఁజూచి పలికెన్ రోచిష్ణుఁడై వ్రేల్మిడిన్.

క. మునివర యేకోరిక నీ, మనమునఁ గామించి నను సమంచిత భక్తిన్
[10]నెనరునఁ బూజించితి నీ, కనయము నాకోర్కి సఫలమయ్యెడుఁ జుమ్మీ.

---

1 మాసారము = నెలలను బండికంటియాకులుగలది. 2 నేమి = బండికంటికడకమ్మి. 3 చాతుర్మాస్య = నాలుగు మాసములయొక్క. 4 నాభి = చక్రపు నడితూము. 5 గ్రసనము = మ్రింగుట. 6 అభిభూత=తిరస్కరింపఁబడిన. 7 ఆతపత్రము =గొడుగు. 8 ప్రవర్షి = వర్షము కురిపించువాఁడు. 9 కంధ...నాంగుఁడు = మెడపైని కదలుచు ప్రకాశించు శరీరముకలవాఁడు. 10 నెనరు=ప్రియము.

వ. అని యానతిచ్చి [1]ప్రజాపతిపుత్రుండునుసమ్రాట్టునునైన స్వాయంభువమనువు బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలామండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ డమ్మహాత్ముం [2]డపర దివసంబున నిందులకు శతరూప యను భార్యా సమేతుండై [3]భర్తృకామ యగు కూఁతుం దోడ్కొని భవదీయసన్నిధికిం జనుదెంచి నీకు [4]ననురూపవయశ్శీల సంకల్పగుణాకర యైన తనపుత్త్రిం బరిణయంబు గావించు భవదీయమనోరథంబు సిద్ధించు ననుం జిత్తంబున సంస్మరించుచుండు మక్కన్యక నిను వరించి భవద్వీర్యంబువలన నతిసౌందర్యవతు లయిన కన్యలం దొమ్మండ్రం గను నాకన్యకానవకంబునందు మునీంద్రులు పుత్త్రోత్పాదనంబులు సేయంగలరు నీవు మదీయశాసనంబును ధరియించి మ దర్పితాశేష కర్ముండవగుచు నైకాంతిక స్వాంతంబున భూతాభయదాన దయాచరితజ్ఞానివై నాయందు జగంబులుగల వనియు నీయందు నేఁ గల ననియు నెఱింగి సేవింపుము [5]చరమకాలంబున ననుం బొందఁగలవు భవదీయవీర్యంబువలన నేను నీభార్యాగర్భంబుఁ బ్రవేశించి మత్కళాంశంబునఁ బుత్త్రుండనై సంభవించి నీకుండ త్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు గర్దమున కెఱింగించి యతండు గనుంగొను చుండ నంతర్హితుండై. 756

చ. అతుల సరస్వతీ సరి దుదంచిత బాలరసాలసాలశో
భిత తటతుంగరంగ మగు బిందుసరంబు [6]వినిర్గమించి యం
చిత గరు[7]డాధిరోహణము సేసి తదీయ గరుత్ప్రభూత రు
క్ప్రతతి విలక్షణ క్రమ విరాజితనాదము వించు [8]మోదియై 757

చ. అరిగె వికుంఠధామమున కంత సకాముఁడైన కర్దముం
డరయ విమోహియై మనము నందలి ముందటవచ్చు కోరికల్

1 ప్రజాపతి = బ్రహ్మ. 2 అపరదివసము = మరుసటిదినము. 3 భర్తృకామ= భర్తయందుఁ గోరికకలది. 4 అనురూప = తగిన. 5 చరమ = చివర. 6 వినిర్గమించి= దాటి. 7 అధిరోహణము=ఎక్కుట. 8 మోది = సంతోషించినవాఁడు.

పిరికొనుచుండఁ దత్క్షణమ బిందుసరంబున కేఁగి యిందిరా
వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁడై.

వ. అంత స్వాయంభువుండు గనకర[1]థారూఢుం డగుచు నిజభార్యాసమేతుండై భర్తృవాంఛాపర యైన పుత్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగినవరు నన్వేషించుచు భువనంబునం గలయం గ్రుమ్మరి యొందునుం గానక వచ్చి వచ్చి. 759

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడుగర్దము౯ మహా
నందమెలర్పఁ జూచి నయనంబుల రాలినబాష్పముల్ ధర౯
బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుట౯
బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్. 760

ఉ. అందుఁ దమాల సాల వకుళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కంద కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుంద మధూక మంజుల నికుంజములం దనరారి వెండియున్. 761

క. పరిపక్వ ఫలభరానత, తరుశాఖా నికర నివసిత స్ఫుట విహగో
త్కర బహుకోలాహలరవ,[2]భరిత దిగంతములు గలిగి భవ్యంబగుచున్.

క. అతినిశిత చంచు[3]దళన, క్షత[4]నిర్గత పక్వఫల రసాస్వాదన మో
దిత రాజ[5]శుకవచోర్థ, శ్రుతి ఘోషము సెలఁగ శ్రవణ సుఖదంబగుచున్.

క. లలిత[6]సహకారపల్లవ, కలితాస్వాదనకషాయ కంఠవిరాజ
[7]త్కలకంఠ పంచమస్వర, [8]కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యములై.

క. అతుల తమాల[9]మహీజ, ప్రతతిక్షణజాతజలద పరిశంకాంగీ
కృత తాండవఖేలన విల, సితపింఛవిభాసి బాల[10]శిఖిసేవ్యంబై. 765

క. కారండవ జలకుక్కుట, సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహ కైరవ నవక,హ్లార విరాజిత సరోరుహాకర యుతమై. 766

క. కరి పుండరీక వృక కా, సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ, శరభ ప్రము[11]ఖోగ్ర వన్యసత్త్వాశ్రయమై.

---

1 ఆరూఢుఁడు = ఎక్కినవాఁడు. 2 భరితదిగంతములు=నిండినదిక్కులచివరలు. 3 దళనము=ఖండించుట. 4 నిర్గత = బయలుదేరిన. 5 శుకము = చిలుక. 6 సహకారపల్లవము = తీయమామిడిచిగురు. 7 కలకంఠము = కోకిల. 8 కల = మనోహరమైన. 9 మహీజము=చెట్టు. 10 శిఖి=నెమలి. 11 ఉగ్రవన్యసత్త్వములు=భయంకరమృగములు.

వ. ఒప్పు నప్పరమ తాపసోత్తముని యాశ్రమంబుఁ గనుంగొని మితపరిజనంబులతోడం జొచ్చి యందు.

సీ. అంచిత బ్రహ్మచర్యవ్రత యోగ్యమై
విలసిల్లు ఘన తపోవృత్తిచేత
దేహంబు రుచిరసందీప్తమై చెలువొందఁ
గడుఁ గృశీభూతాత్మ [కా]యుఁ డయ్యు
[1]నలినోదరాలాప నవసుధాపూరంబు
[2]శ్రోత్రాంజలులఁ దావి చొక్కియున్న
కతనఁ గృశీభూత [3]కాయుండుగాక జ
టా[4]వల్క [5]లాజిన శ్రీ వెలుంగఁ

తే. కమలపత్రవిశాల నేత్రములు దనర
నలిన సంస్కార సంచి [6]తానర్ఘ్యనూత్న
రత్నమును బోలియున్న కర్దమునిఁజూచి
భక్తి నమ్మను [7]వెరఁగెఁ దత్పాదములకు. 769

వ. ఇట్లు వందనంబుగావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన యమ్మనువు నాదరించి యర్ఘ్యపాద్యాదివిధులం [8]బరితుష్టునిం గావించి పూర్వోక్తంబైన భగవ[9]దాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె. 770

సీ. వరగుణాకర భగవద్భక్తియుక్తుఁడ
వైన [10]త్వదీయ పర్యటనమెల్ల
శిష్టపరిగ్రహ దుష్ట[11]నిగ్రహముల
కొఱకుఁ గదా పుణ్యపురుష మఱియు

---

1 నలినోదరాలాపము = విష్ణువుఁగూర్చినమాటలు. 2 శ్రోత్రాంజలులు = చెవులను దోసిళ్ళు. 3 కాయము = శరీరము. 4 వల్కలము=నారబట్ట. 5 అజినము=లేడిచర్మము. 6 అనర్ఘ్యము = నిరూపింపరాని విలువగలది. 7 ఎరఁగె=నమస్కరించెను. 8 పరితుష్టుని = సంతోషించినవాని. 9 ఆదేశము=ఆజ్ఞ. 10 త్వదీయ పర్యటనము = నీతిరుగుట. 11 నిగ్రహము = చంపుట.

[1]వనజహితాహిత వహ్నిసమీర [2]వై
వస్వత [3]వార్ధిప [4]వాసవాత్మ
కుఁడవు హరిస్వరూపుఁడ వైన నీకును
మానితభక్తి నమస్కరింతు

తే. ననఘ నీ విప్పు డే నేమి యఖిలలోక
జైత్రి మగు హేమమణిమయ [5]స్యందనంబు
నెక్కి [6]కోదండపాణివై యుద్ధసైన్య
పదవిఘట్టనచే భూమిభాగ మగల. 771

మ. [7]తరణిం బోలెఁ జరింప కున్న ఘననిద్రిం బొంది యెందేని భూ
వర పద్మోదర కల్పితంబు లగు నీ వర్ణాశ్రమోదార వి
స్తర [8]పాథోనిధి సేతుభూత మహిమాచారక్రియల్ దప్పి సం
కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుం జుమీ. 772

వ. అని పలికి భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది యనవుడు [9]సమాహిత సకల నిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె. 773

క. సరసిజగర్భుఁడు దనచే, విరచిత మైనట్టి వేద వితతుల నెల్లన్
ధర వెలయించుటకై బుధ,వర మిమ్ముం దనముఖంబువలన సృజించెన్.

క. దురితస్వరూప [10]పాటచ్చర పీడం బొందకుండ సకలక్షోణిం
బరిపాలించుటకై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్.

క. నెఱినట్టి జలజభవునకుఁ, గర మంతఃకరణగాత్రికములై వసుసం
బరఁగిన బ్రహ్మక్షత్త్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్.

వ. కావున హరిస్వరూపుండవై దుర్జనదుర్దర్శనుండ వయిన నినుం గనుట మదీయభాగ్యంబున సిద్ధించె భవత్పాద[11]కంజ కింజల్క పుంజరంజితంబైన మదీయ [12]మస్తకంబును దావక వచన సుధాపూరితంబులైన

---

1 వనజహితాహితులు = సూర్యచంద్రులు. 2 వైవస్వతుఁడు = యముడు. 3 వార్ధిపుఁడు = వరుణుఁడు. 4 వాసవుఁడు = ఇంద్రుఁడు. 5 స్యందనము = రథము. 6 కోదండము = విల్లు. 7 తరణి = సూర్యుఁడు. 8 పాథోనిధిసేతుభూతము = సముద్రములు

శ్రవణంబులును మంగళాకరత్వంబున సాఫల్యంబునుం బొందె నేను గృతార్థుండ నైతి దుహితృ స్నేహ దుఃఖ [1]పరిక్లిన్నాంతఃకరణుండనై సకలదేశ [2]భ్రమణఖిన్నుండ నైన నావిన్నపం బవధరింపుమని యిట్లనియె. 777

మ. వరయోగీశ్వర దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్రి దా
వర లావణ్యగుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర కా
తురయై నారదుపంపునన్ మిము వరింతున్ వేగ యం చెంచె నీ
తరుణీభిక్షుఁ బరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్. 778

క. అమలిన [3]గృహమేధిక కర్మములకు ననురూపగుణవిరాజితశీల
క్రమములఁ దనరిన తరుణిం, బ్రమదమునవరింపుమయ్య భవ్యచరిత్రా.

క. అనఘ విరక్తుల కైనం, దనయంత లభించుసౌఖ్యతతి వర్జింపం
జనదఁట కాముకులకు న,బ్బిన మానుదురే లభించుప్రియసౌఖ్యంబుల్.

క. వినుము ఫలారంభుఁడు [4]కృప,ణుని నడిగినఁదనయశంబునుందగుమానం
బును జెడుఁగావునఁదగనీ, వెనయువివాహేచ్ఛఁదగులు జెఱిఁగియిచటికిన్.

క. చనుదెంచితి మన్మతాప్రి, ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం
డనమునిస్వాయంభువునిం,గనుఁగొనిమరలంగఁబలికెఁగడుమోదమునన్

సీ. అనఘ నీచేత [5]ననన్య దత్తముగఁ బ్ర
తిష్ఠితం బైన యీతీవఁబోఁడి
కమనీయరూపరేఖావిలాసంబుల
మానిత లక్ష్మీ సమాన యగుచు
నొకనాఁటి రాత్రియం [6]దుడురాజచంద్రికా
ధవళిత నిజసౌధ తలమునందు
మహిత [7]హిరణ్మయ మంజీరశోభిత
చరణ యై నిజసఖీ సహిత యగుచుఁ

తే. [8]గందుకక్రీడఁ జరియింప గగనమందు
వరవిమానస్థుఁ డగుచు విశ్వావసుండు

1 పరిక్లిన్నము = కష్టము. 2 భ్రమణము = తిరుగుట. 3 గృహమేధి = గృహస్థునియొక్క. 4 కృపణుఁడు = దీనుడు. 5 అనన్యదత్తము = ఇతరులకివ్వఁబడనిది. 6 ఉడురాజచంద్రికాధవళితము = చంద్రునియొక్క వెన్నెలచేఁ దెల్లగాఁజేయఁబడినది. 7 హిరణ్మయము = బంగారువికారము. 8 కందుకము = చెండు.

నాఁగఁ దనరిన గంధర్వ నాయకుండు
తరుణిఁ జూచి విమోహితుఁడై ధరణిఁబడియె. 783

తే. పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లీ తలోదరిఁ బొడగాన రేమి సెప్ప
నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన
వచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె. 784

క. ఈకన్యారత్నమునకు, నాకును గుణరూప వర్తనంబుల యెడ నా
లోకింప సమమ కావునఁ, గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్. 785

క. విమలాత్మ దీని కొక[1]సమ,యముగల దెఱిఁగింతు వినుగుణాకరయగునీ
రమణికి [2]నపత్యపర్యం, తము వర్తింపుదు గృహస్థధర్మ క్రియలన్. 786

ఆ. అంతమీఁద విష్ణునాజ్ఞ యాఁదలఁదాల్చి
శమదమాదియోగ సరణిఁ బొంది
సన్న్యసించువాఁడ జలజనేత్రుని వాక్య
కారణమునఁ జేసి ధీరచరిత. 787

క. శ్రీవిభునివలన నీ లో, కావళి యుదయించుఁ బెరుఁగునడఁగునువినురా
జీవభవాదుల కతఁడే, భూవర నిర్మాణ హేతుభూతుం డరయన్. 788

వ. అది గావున నమ్మహాత్ముని యాజ్ఞో[3]ల్లంఘనంబు సేయ రా దని కర్దముండు పలికిన విని స్వాయంభువుండు నిజభార్య యైన శతరూప తలంపును బుత్రి యైన దేవహూతిచిత్తంబును నెఱింగినవాఁడై మునిసమయంబున కియ్యకొని [4]పరిహృష్టహృదయుం డగుచు సముచిత గుణగణాఢ్యుం డయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్త ప్రకారంబున వివాహంబు సేయించెఁ దదనంతరంబ శతరూపయును బారిబర్హ[5]సంజ్ఞికంబు లైనవివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతికర్దముల కొసంగె నివ్విధంబున నిజకులాచారసరణిం బరిణయంబు గావించి విగత చింతాభరుం డై స్వాయంభువుండు దుహితృవియోగవ్యాకులితస్వాంతుండై కూఁతుం గౌఁగిలించుకొని

---

1 సమయము = ఏర్పాటు. 2 అపత్యము = సంతానము. 3 ఉల్లంఘనము = దాటుట. 4 పరిహృష్ట = సంతోషించిన. 5 సంజ్ఞికము = గుర్తుగలది.

[1]చుబుకంబుఁ బుడుకుచుఁ జెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని
ప్రేమాతిరేకంబున బాష్పధారా [2]సిక్తమస్తకం జేసి తల్లీ పోయి
వచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రితుండై నిజభార్యాసమే
తంబుగ రథంబెక్కి సపరివారుండై. 789

చ. తరళతరంగ [3]వీచి సముదంచిత బిందుసర స్సరస్వతీ
సరి దరవింద తుందిల లస త్తరుతీరనివాస సన్మునీ
శ్వర నికరాశ్ర[4]మా కలిత సంపదలం గనుఁగొంచు వేడ్క ము
ప్పిరిగొన నేఁగె నాత్మపుటభేదన విస్ఫుటమార్గ వర్తియై. 790

వ. ఇట్లు సని చని బ్రహ్మావర్తదేశంబునందు. 791

సీ. ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూ
కరమూర్తిఁ గైకొని సరభసముగ
నొడలు జాడించినఁ బుడమిపైఁ రాలిన
రోమజాలంబులు రుచిర[5]హరిత
వర్ణమై పొలుపారువర[6]కుశ[7]కాశమ
యంబును యజ్ఞక్రియాకలాప
యోగ్యంబునై చాల నొప్పారి [8]బర్హిస్సు
సంభవించిన దాన సకలఋషులుఁ

తే. గ్రతువులొనరించి తద్విఘ్నకారులైన
యసురులందుంచి రట్ల స్వాయంభువుండు
విష్ణుపరముగ మఖముగావించి రుచిర
మేధ సెలువొంద వచ్చి యాత్మీయపురము. 792

క. డాయం జనఁ బురజనము [9]లు
పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నుతుల్
సేయఁగ మంగళతూర్యము
లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్. 793

1 చుబుకము = గడ్డము. 2 సిక్త = తడుపబడిన. 3 వీచి = తరంగము
4 ఆకలితము = కూడుకొనినది. 5 హరితవర్ణము = పచ్చరంగు. 6 కుశ = దర్భ
7 కాశ = రెల్లు. 8 బర్హిస్సు = దర్భ. 9 ఉపాయనము = కానుక.

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్రమిత్ర కళత్ర సుహృద్బాంధవసహితుండై పరమానందంబున. 794

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరి [1]వ్యాసంగుఁడై మాధ[2]వాంకితగంధర్వవిపంచికాకలిత సంగీత ప్రబంధానుమోదితుఁడై యిష్ట[3]విభూతులందు ననురక్తిం బొంద కేపార్చు న చ్యుతసేవైక పరాయణుం డగుచు [4]నస్తోకప్రభావోన్నతిన్. 795

మ. హరిపాదాంబు రుహద్వయార్పిత[5]తుల స్యామోదముం గొంచుఁ ద చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచుఁ వించుఁ ద త్పరిచర్యావ్యతిరిక్త [6]సంసరణ సద్ధర్మార్థకామంబులం [7]బరిభూతంబులు నేసి మోక్షపద సంప్రాప్తిక్రియారంభుఁడై. 796

క. నిగమార్థగోచరుం డనఁ
దగు హరిచరిత ప్రసంగ తత్పరచిత్తుం
డగు నతనికి స్వాంతరగము
లగుయామము లొగి [8]నయాతయామము లయ్యెన్. 797

సీ. వెండియు నమ్మేటి విష్ణుమంగళకథా
కర్ణనధ్యానానుగాననుతులు
సలుపుచు స్వస్వప్న జాగ్ర[9]త్సుషుప్తులఁ
దలఁగించి యాపుణ్య తముఁడు దాను
జక్రిదాసుఁడు గాన శారీరమానస
[10]దివ్యమానుష భౌతికవ్యథలను
దగులక సన్మనీంద్ర శ్రేణికిం దగఁ
దనరువర్ణాశ్రమ ధర్మగతులు

తే. దప్పకుండంగ నడపుచుఁ దగిలి సర్వ
భూతహితవృత్తి నతుల విఖ్యాతలీల

---

1 వ్యాసంగుఁడు = ఆసక్తిగలవాఁడు. 2 అంకిత = గుర్తుగాఁగల. 3 విభూతి= ఐశ్వర్యము. 4 అస్తోకము = అధికము. 5 తులస్యామోదము = తులసియొక్క వాసన. 6 సంసరణము = సంసారము. 7 పరిభూతము=తిరస్కారము. 8 అయాత=గతించని. 9 సుషుప్తి = నిద్ర. 10 దివ్య = దేవతాసంబంధమైన.

నేకసప్తతియుగము లస్తోకచరితుఁ
డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల. 798

క. అని యమ్మనుచరితమువిదు,రునకమ్మైత్రేయమునివరుఁడుదయతోఁదగ
వినిపించి కర్దమునికథ, దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁబలికెన్.

—♦ కర్దమప్రజాపతి యోగభావంబుచే విమానంబు గల్పించి
భార్యతోఁ గూడ తాను విహరించుట. ♦—

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబు సేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి [1]భవునికి [2]భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియ తనకు [3]నేడు గడయుంగా నెఱింగి యమ్మునీంద్రుని చిత్తవృత్తిక్రోలఁది దినదినంబునకు భక్తితాత్పర్యస్నేహంబులు రెట్టింపం బ్రియశుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామక్రోధదంభలోభాది గుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతురసౌహార్దస్నేహంబులుగలిగి పతియ దైవంబుగా భావించి మృదుమధుర వచనరచనయై పతిభక్తి యేమఱక వర్తింప దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుం డైనకర్దముండు నిజసేవాయాసకృశీభూత దేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె. 800

ఉ. మానితధర్మమార్గ మహిమస్ఫుట [4]భూరి తపస్సమాధివి
ద్యా[5]నిభృతాత్మయోగ [6]సముపార్జితవిష్ణు కటాక్షలబ్ధ శో
భానఘదివ్యభోగ బహు భద్రవితానము లస్మదీయ సే
వానిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్. 801

తే. నెలఁత తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ
గానవచ్చు విలోకింపు కమలపత్త్రి
నయనుభ్రూమముడి మాత్రన నాశమందు
నితరమగుతుచ్ఛభోగంబు లేమి సెప్ప. 80?

---

1 భవునికి = శివునికి. 2 భవాని = పార్వతి. 3 ఏడుగడ=రక్షకుఁడు. 4 భూరి= ప్పు. 5 నిభృత = తీర్చఁబడిన. 6 సముపార్జిత = సంపాదింపబడిన.

సీ. అనుపమరాజ్య దర్పాంధ [1]చేతస్కులై
పాపవర్తనులైన పార్థివులకు
ధృతిఁ బొంద రాని యీదివ్యభోగంబులు
నీదు పాతివ్రత్యనిష్ఠఁ జేసి
సంప్రాప్తములు నయ్యె సమత భోగింపుము
కార్యసిద్ధియు నగుఁగాక నీకు
ననుటయు నతివయు ననుపమయోగ మా
యావిచక్షణవిభుం డైన కర్ద

తే. మునిఁ గనుంగొని [2]విగతాధియును నపాంగ
కలిత లజ్జానతాస్య పంకజయు నగుచు
వినయ సౌహార్దములఁ జేసి విహ్వలంబు
లయినపలుకులఁ బలికె నిట్లనియెఁ బ్రీతి. 803

వ. అనఘా[3]యమోఘయోగమాయా విభుండవు సమర్థుండవు నయిన నీయందు నీయనుపమదివ్య భోగంబులుగలుగుట నిక్కంబని యెఱుంగుదు[4]భవత్సంగతి నన్నియు నాకుం గలుగు నయినను దేవా నీ వాన తిచ్చినసంతానపర్యంతం బైన శరీరసంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవ దంగ సంగమంబుఁ గృపసేసి మన్నింపుము భవదీయ సం యోగవాంఛా[5]పరతం గృశీభూతంబయిన యీ దేహం బేవిధంబున [6]మజ్జనభోజనపాన సుఖంబులం బరితుష్టిం బొందు నట్టి మన్మనోర థంబుఁదీర్ప రతిరహస్యప్రకాశకంబగు కామశాస్త్రప్రకారం బుప శిక్షించి యందులకు నుచితంబు లయిన వివిధాంబరాభరణ [7] మాల్యా[8]నులేపన మందిరా[9]రామప్రముఖ నిఖిలవస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన నమ్మహాత్ముండు నిజయోగమా యాబలంబునం దత్క్షణంబ. 804

సీ. దివ్యమణిస్తంభదీప్తిఁ జెన్నొందుచు
మరకతస్థలముల మహిమ దనర

---

1 చేతస్కులు = మనస్సుగలవారు. 2 విగతాధి = దుఃఖములుపోయినది. 3 అమోఘ = వ్యర్థముకాని. 4 భవత్సంగతిన్ = నీస్నేహమున 5 పరత = ఆసక్తి. 6 మజ్జనము = స్నానము. 7 మాల్యము. = దండలు 8 అనులేపనము=పూతద్రవ్యము. 9 ఆరామము = తోట.

వరవజ్ర [1]కుడ్యక వాటశోభితములై
[2]విద్రుమ దేహళీ వీథు లమరఁ
గోపు రొప్ప నవశాత కుంభకుంభములపై
హరినీల శకల విస్ఫురణ మెఱయఁ
దగఁ బద్మరాగంపు [3]మొగడలఁ జెలువొందు
వైదూర్య [4]వలభులు వన్నెఁ జూపఁ
తే. దరళతరధూత కేతుపతాక లోలయు
మంజుశింజత్సమంచిత మధుపకలిత
సురుచి [5]రాలంబమాన ప్రసూనరాజి
మాలికల నొప్పు వివిధగృహాళి దనరె. 805

క. మఱియును దుకూలచీనాం, బరకౌశేయాది వివిధ పట పరివృతమం
దిర సుభగాకారంబై, యరుదార విచిత్ర పట్టికాలంకృతమై. 806

మ. లలితోద్యాన వనాంతసంచరణలీలాలోలహంసాళికో
కిల [6]పారావత చక్రవాకశుక కేకివ్యూహ మంచ త్సము
త్కలికం గృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుహూ
హాళిమై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణవ్యాప్తులన్.

వ. వెండియు. 808

క. ఘనసౌధాంతర శయ్యా, సన కేళీగేహ [7]కృతక జగతీధర శో
భన చంద్రకాంత చారుభ,వన ఫలభరితావనీజ వంతము లగుచున్.

క. సకల ర్తుశోభితంబును, సకలశుభావహము సకలసంపత్కరమున్
సకలోపభోగయోగ్యము, సకలేప్సిత [8]కామదంబు సదలంకృతమున్.

వ. అగుచు నొప్పుదివ్యవిమానంబుఁ గల్పించి తదీయసుషమావిశేష విచిత్రంబులు నిర్మించిన తానునుం దెలియం జాలని యద్భుతకర్మంబులైన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముద్దియ సంతసింప కుండుట యెఱింగి సర్వభూతాంత రాశయాభిజ్ఞుండును సంతుష్టాంతరంగుండును నై నకర్దముం డి ట్లనియె. 811

1 కుడ్యము = గోడ. 2 విద్రుమదేహళి = పవడపుగడప. 3 మొగడు = ఇంటి నడికొప్పు 4 వలభి = ముంజూరు. 5 ఆలంబమాన=వ్రేలాడుచున్న. 6 పారావతము= పావురము 7 కృతకజగతీధరము = కృత్రిమపర్వతము. 8 కామదము = కోరికల

తే. అతివ భగవత్కృతంబును సకలమంగ
ళాకరంబును నగు నీ జలాశయమునఁ
దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ
గామ్యఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు. 812

క. ఇజ్జలముల నతిభక్తిని, మజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్
లజ్జావతి యెక్కవె యని,బుజ్జవమొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్.

వ. విని యాకువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు వేణీభూత శిరోజయు ధూళిధూసరితాతికృశీభూతాంగయు శబలస్తనయు నై భర్తృ నియోగంబున సరస్వతీసలిల[1]సంభూత జలచరాశ్రియం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకు లిడుసమయం బునఁ దద్వాఃపూరమధ్యంబున రుచిరసూక్ష్మాం[2]శుకధారిణులుఁ [3]కిశోరవయఃపరిపాకశోభితలు నుత్పలగంధులు నగు కన్యాసహస్రం బులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి. 814

క. తరుణీ [4]సంచితధర్మా, చరణల మగుమేము నీకు సదమలభక్తిం
బరిచర్య సేయ నేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్.

సీ. అని పల్కి డాసి యయ్యతివకు [5]సభ్యంజ
నోద్వర్తనములు పెంపొనరఁ జేసి
[6]మలయజ కర్పూర మహిత వాసితహేమ
కలశోదకంబుల జలక మార్చి
ధవళ వస్త్రంబులఁ దడి యొత్తి సర్వాంగ
ధూపంబు లొసఁగి కస్తూరి యలఁది
మంజు [7]శింజ న్మణి మంజీర కింకిణీ
కలరావ కలిత మేఖలలు రత్న

తే. ఖచితతాటంకముద్రికా కంకణాది
సముచి తానర్ఘ్య హేమ భూషణము లొసఁగి

---

1 సలిలము=నీరు. 2 అంశుకము = వస్త్రము. 3 కిశోరవయస్సు = బాల్యము.
4 సంచిత=కూర్పఁబడిన. 5 అభ్యంజనము=తలంటుట. 6 మలయజము = మంచిగంధము.
7 శింజత్ = మ్రోగుచున్న.

భవ్య మాల్యానులేపనాంబరము లిచ్చి
షడ్రసోపేత వివిధాన్నసమితిఁ బసిఁడి. 816

వ. మఱియుం గనక పాత్రరచితంబు లయిన కర్పూర నీరాజనంబు[1] లిచ్చి రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు[2] సేతి కిచ్చినం దత్ప్రతిఫలిత నిజదేహంబుఁ గనుంగొని కర్దముని పనుపునం దలంచిన నతండునుం గన్యకా సహస్రంబును దక్షిణంబునఁ దన సన్నిధి నుండుటఁ జూచి నిజభర్తృ యోగమాయా ప్రభావంబునకు నద్భుతంబు నొందె, నంతఁ గర్దముండునుం గృతస్నానయైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నేచందంబునం దనరుచుండె నాచందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుండై భార్యా సహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుండై తారాగణ[3]పరివృతరోహిణీయుక్తుం డగు[4]సుధాకరుండునుం బోలె నొప్పుచుఁ దదనంతరంబ. 817

చ. చిర శుభమూర్తి యమ్ముని యశేష[5]దిగీశ విహారయోగ్యముల్
సురుచిర మందగంధవహశోభితముల్ నికటప్రధాతు ని
ర్ఝర సరి దంబుశీతల[6]తుషారము నై తనరారు మేరు[7]కం
దరమున కేఁగి దేవవనితాయుతుఁ డైన కుబేరుచాడ్పునన్. 818

వ. మఱియును. 819

మ. అమరోద్యాన వనప్రదేశములు నవ్యారామభూముల్ దళ
[8]త్కుముదాంభోజ విభాసి మానస సరఃకూలంబులున్ మంజు[9]కుం
జములుం [10]జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబునం జూచె నె
య్యమునం గర్దమయోగి [11]గామగ విమానారూఢుఁ డై చెచ్చెరన్.

వ. ఇవ్విధంబున సమస్త భూభాగంబును వాయువేగంబునం గలయం గ్రుమ్మరి నిఖల వైమానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె. మోక్షదాయకుండుఁ దీర్థపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి

---

1 నీరాజనము = హారతి. 2 దర్పణము = అద్దము. 3 పరివృత = చుట్టుకొనఁబడిన. 4 సుధాకరుఁడు = చంద్రుఁడు. 5 దిగీశులు = దిక్పాలకులు. 6 తుషారము = మంచు. 7 కందరము = గుహ. 8 కుముదము = కలువ. 9 కుంజములు = పొదరిండ్లు 10 చైత్రరథము = కుబేరుని యుద్యానము 11 కామగము = కోరినచోటికిఁబోవునది.

సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులుగలవే. ఇట్లు కర్దముండు దేవహూతికి నిఖిల ధరాచక్రంబుం బ్రియము జూపి మరల నిజ నివాసంబునకుం జనుదెంచి కామకేళీ వినోదాత్మకమై యున్న భార్య [1]నుపలక్షించి రతిప్రసంగ వ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్క ముహూర్తంబుగా జరపుచు నన్యోన్య సరసావలోకనంబుల సముచితాలింగన సంభాషణంబులం గాలనిరూపణంబు సేయనేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ. 821

క. మునివరుఁ డోకనాఁడిమ్ములఁ, దననిజదేహంబు నవవిధంబులు గావిం
చి నయంబునఁ దద్వీర్యముఁ, దనసతిగర్భమున నవవిధంబుగ నిలిపెన్.

క. అది కారణంబుగాఁ బెం,పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతుల్
ముదమునఁగనెఁ దొమ్మండ్రకు,ముదితయుమదిసంతసించెమునివరుఁడంతన్.

తే. సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి
యాత్మఁ బొడమిన సంతాప [2]మగ్గలింపఁ
జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయి సేర్చి
పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి. 824

సీ. అనఘ సంతాన పర్యంతంబు ననుఁగూడి
వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి
కూఁతుల నిచ్చితి కొమరారు నిప్పుడీ
తరుణులు పతులను దమకుఁ దార
యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ
గావున నీపుత్రికలకుఁ దగిన
వరుల సంపాదించి పరిణయంబులు సేసి
తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

తే. సుతునిఁ గృప సేసి ననుఁ గావు సుజనవినుత
యర్థి సంసారదుఃఖంబు [3]నపనయింప

---

1 ఉపలక్షించి = చూచి. 2 అగ్గలింపన్ = అధికముగ. 3 అపనయింప తీసివేయ.

సర్వేశుఁడవు నీవ కావె మోహమున నింత
కాల మూరక పోయె నేగతియు లేక. 825

చ. ఉపరతి వుట్టె నైహిక సుఖోపగతానుభవంబులందు ముక్
జపలతఁ గామభోగరతి సంగముఁ గోరి మహాత్మ నిన్ను న
చ్చపుఁదలఁ పొప్పఁగాఁ దెలియఁ జాలక యే వరియించుటల్ భవ
త్కృప ఫలియించె ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁ గల్గదే. 826

వ. అదియునుం గాక. 827

చ. సమమతి నొప్పు సత్పురుష సఖ్యము సద్గతి కారణంబు నీ
చ మతి విలోల దుష్పురుష సఖ్యము దుర్గతి హేతువంచుఁ జి
త్తమునఁదలంచి యోగిజనతానుత విమ్ము భజింతుఁ బ్రాణిసం
గమమునఁ బుణ్యపాపములు గైకొని పొందవె యెట్టివారలన్. 828

క. అనియిట్లు వేదనాభర, మున మునుకుచుఁబలుకఁగర్దముఁడుమనుపుత్త్రిం
గనుఁగొనిసరసిజనయనువ, చనములు మదిసంస్మరించి సతికిట్లనియెన్.

క. మనుసుత నీమదిదుఃఖం, బునుబొందకు [1]మచిరకాలమున భగవంతుం
డనఘుం డక్షరుఁడు జనా, ర్దనుఁడు భవద్గర్భమందుఁదగవసియించున్.

క. వరనియమవ్రతనిష్ఠా, చరణనియుక్తాంతరంగ సముధికవై సం
భరితతపోధనదాన, స్ఫురితశ్రద్ధానుభక్తి పూర్వము గాఁగన్. 831

మ. హరి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు త
త్పురుషశ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజానుసంప్రీతుఁడై
కరమర్థిం దరుణీశిరోమణి భవద్గర్భస్థుఁడై యుండి తాఁ
గరుణంజేయు భవన్మనోజనిత సంకా[2]గ్రంథి విచ్ఛేదమున్. 832

—♦ దేవహూతి గర్భంబున విష్ణుండు కపిలాచార్యుండుగాఁ బుట్టుట. ♦—

చ. అనవుడు దేవహూతి హృదయంబున నంతసమంది యమ్మునీం
ద్రునివచనక్రమంబునఁ బరుక్ భగవంతు ననంతుఁ బద్మలో
చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్ని [3]యబ్దముల్
చనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ [4]గార్దమ మైన తేజమున్. 833

---

1 అచిరకాలము = స్వల్పకాలము. 2 గ్రంథివిచ్ఛేదము = ముడినిఛేదించుట.
3 అబ్దములు = సంవత్సరములు. 4 కార్దమము = కర్దమసంబంధ మైనది.

క. ధరియించి యమ్మునీంద్రుని, [illegible] శమితా
తరు[1]కోటరమున నైశ్వా, [illegible] సియించెన్.

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ
తూర్య ఘోషంబులు [2]తుములమయ్యె
[3]నందిత దేవతా బృందంబు లందంద
కురిసిరి మందార కుసుమవృష్టి
గంధర్వకిన్నర గానంబు వీతెంచె
నప్సరోగణముల యాట యొప్పె
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను
దవిలి వార్ధులకలంకలును మాన

తే. సాధుజనముల మనములు సంతసిల్లె
హోమవహ్నులు ప్రభలఁ జెన్నొందె వెలిఁగెఁ
గుసుమఫలభారము లనొప్పెఁ [4]గుజములెల్ల
సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన. 835

వ. ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించు కొఱకుఁ దదీయ గర్భంబున నుదయించిన పరబ్రహ్మస్వరూపుండైన నారాయణుని దర్శించుకొఱకు మరీచిప్రముఖ మునిగణ సమేతుండై [5]చతుర్ముఖుండు సనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమ దేవహూతులం గనుంగొని యిట్లనియె 836

క. నతచరితులార మీరలు, కృతకృత్యులు విష్ణుపూజఁ గేవలభక్తిన్
మతి నిష్కపటులరై చే, సితిరి తదర్చన ఫలంబు సేకుఱె మీకున్. 837

క. [6]శ్రితభయహరణుఁడు మునిజన, నుతచరితుఁడు పరుఁడు మీమనోరథసిద్ధిన్
వితతంబుగఁ గావించుటఁ, జతురత మీ జన్మ మిఁక సఫలతఁ బొందెన్.

క. వినుఁడు సకాములునై హరి, సనుపమభక్తిన్ భజించునవె ముక్తికిఁ జా
లును మీపుణ్యం బేమని, కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా.

వ. అని వెండియుం గర్దమునిం గనుంగొని యిట్లను భవదీయ [7]తనూభవలం బ్రకటశీల వ్రతాచారసంపన్నలైన మునివరేణ్యులకుం

1 కోటరము = చెట్టుతొఱ్ఱ. 2 తుములము = అధికము. 3 నందిత = సంతోషింపఁబడిన. 4 కుజములు=చెట్లు. 5 చతుర్ముఖుఁడు=బ్రహ్మ. 6 శ్రితభయహరణుఁడు= ఆశ్రయించినవారియొక్క భయమును దీసివేయువాఁడు. 7 తనూభవలు = కుమార్తెలు.

బెండ్లి సేయు మట్లయిన వారివలనం బ్రజాసృష్టి బహువిధంబుల
వృద్ధిం బొందునని చెప్పి మఱియు నిట్లనియె. 840

చ. అనఘ భవత్సుతుండు సముదంచితతేజుఁడునై నయిమ్మహా
త్మునిఁ బరమేశు నీశు నజితున్ నలినాక్షు నమేయు నచ్యుతున్
ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగాఁ దలంపు మీ
ఘనుఁడు సమస్తచేతననికాయ [1]హృదీప్సితదాయి గావునన్. 841

సీ. మానితజ్ఞాన విజ్ఞానయోగంబులు
ననుపాయంబుల నొనరఁజేసి
యలవుమైఁ గర్మజీవుల నుద్ధరించుట
కొఱకు నమ్మహితాత్మకుఁడు సమగ్ర
[2]హాటక రుచిజటా జూటుండు సత్ఫుల్ల
పంకజనేత్రుండు పద్మవజ్ర
[3]హలకులిశాంకుశ లలితరే [4]ఖాంకిత
చరణతలుండును సత్త్వగుణుఁడు

తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి నీదు
గర్భమం దుదయించును ఘనుఁడు నీకుఁ
దత్త్వబోధంబుఁ గావించుఁ దావకీన
హృదయసంగత సంశయ మెల్లఁ బాపు. 842

వ. మఱియును. 843

క. నుతికెక్కి సిద్ధగణసే, వితుఁడై ఘనసాంఖ్యయోగ విలసితతత్త్వ
స్థితినిరతుఁ డగుచుఁ గపిలా, ఖ్యతఁ దనరి చరించు నీజగత్త్రయ మెల్లన్.

క. అని పలికి యమ్మరీచిం, గని [5]యుద్వాహార్థ మునిచి కమలజుఁ డంతం
దసనందను లగునారద, సనకాదులఁ గూడి యాత్మసదనమున కరిగెన్.

వ. అంత నాకర్దముండు కమలసంభవ [6]చోదితుం డగుచు యథోచితం
బుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయందలంచి మరీచికిం
గళ యనుకన్యకను నత్రికి ననసూయను నంగిరసునకు శ్రద్ధను బులస్త్య

1 హృదీప్సితదాయి = హృదయములోనుండు కోరికలనిచ్చువాఁడు. 2 హాటక= బంగారము. 3 హలము =నాగలి. 4 అంకితము=గుర్తు. 5 ఉద్వాహము = వివాహము 6 చోదితుఁడు = ప్రేరేపింపఁబడినవాఁడు. 7 దుహిత = కుమార్తె.

నకు హవిర్భువును బులహునకు గతిని గ్రతువునకుఁ గ్రియను భృగు
నకు ఖ్యాతిని వసిష్ఠునకు నరుంధతిని నథర్వునకు శాంతినింగా నిజ
కులాచారసరణిం బరిణయంబు గావించిన వారును గృతదార పరిగ్ర
హులును గర్దమ కృతసంభావనాసంభావితులును నగుచు నతని
చేత ననుజ్ఞాతులై జాయాసహితులగుచు నిజాశ్రమభూములకుం జని
రిట్లు వర్తింప యుగత్రయంబు సనుటయుం గర్దముండు దేవోత్త
ముండగు విష్ణుండు దనమందిరంబున నవతరించి వసించి యుంటం
దనచిత్తంబున నెఱింగి [1]వివిక్తస్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి
వందనంబాచరించి యిట్లనియె. 846

సీ. చతురాత్మ వినుమాత్మకృతము లైనట్టి య
మంగళభూత కర్మంబులనెడి
దావాగ్ని శిఖలచే [2]దందహ్యమానులై
నట్టిజీవులు దుదముట్ట లేక
పాయక సంసారబద్ధులై యుందురు
*తద్భవ హేతుభూతంబులయిన
సకలదేవతలుఁ బ్రసన్నులు నగుదురు
బహుజన్మ పరిచిత ప్రాప్తయోగ

తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త
దేశముల యోగిజనములు [3]ధృతుల నే మ
హానుభావు విలోకింతు రట్టిదివ్య
పురుషరత్నంబ నాయింటఁ బుట్టితీవు. 847

వ. మఱియు సంసారచక్ర [4]పరిభ్రామ్యమాణుల మగుచు [5]గ్రామ్యుల
మయిన మా వర్తనంబులును గణింపక మదీయగృహంబునం బూర్వం
బునం [6]బ్రతిశ్రుతంబులైన భవదీయవాక్యంబులు దప్పకుండ నను
గ్రహింప నుదయించితని వెండియు నిట్లనియె. 848

---

1 వివిక్తస్థలము = ఏకాంతప్రదేశము. 2 దందహ్యమానులు = కాల్పఁబడినవారు.
* బహుళకాలం బిట్లు వఱలుచుండ - అని పాఠాంతరము.
3 ధృతి = ధైర్యము. 4 పరిభ్రామ్యమాణులు = తిరుగుచున్నవారు. 5 గ్రామ్యులు = పామరులు. 6 ప్రతిశ్రుతములు = వినఁబడినవి.

క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్తచతుర్భుజాది భవదవతారం
బులు నీ[1]కనురూపములై, పొలుపొందుంగాదె పరమపురుషమహాత్మా.
వ. అదియునుంగాక 850
క. [2]అనయము భవదీయాశ్రిత, జనసంరక్షణముకొఱకు సమ్మతితోఁదా
ల్చినమానవరూపంబులు, ననురూపములయ్యెఁ గాదె హరి నీ కెపుడున్.
క. సుమహితతత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా
రము లొలిఁ జేయుపదపీ, ఠము గలనినుఁ బొగడ వశమె తవణిల్లంగన్.
సీ. సమధికషడ్గుణైశ్వర్య కారణుఁడవు
పరమేశ్వరుండవు ప్రకృతిపురుష
మహదహంకారతన్మాత్రతత్త్వోభక
హేతుకాలాత్మ విఖ్యాతధృతివి
జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి [3]నాత్మీయ
జఠరనిక్షిప్తవిశ్వప్రపంచ
ముసు గలసర్వజ్ఞమూర్తివి స్వచ్ఛంద
శక్తియుక్తుండవు సర్వసాక్షి
తే. వగుచుఁగపిలాఖ్యఁదనరారు నట్టి నీకు
ననఘ మ్రొక్కెదఁ బుత్రుండవగుచు నీవు
నాకుఁ బుట్టినకతన [4]ఋణత్రయంబు
వలనఁ బాసితి నీక భక్తవరద నేను. 853
తే. మానితప్రతయోగసమాధి నియతిఁ
జెంది భవదీయ పాదారవిందయుగము
డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి
సంచరించెద సంచితస్థలములందు. 854
క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁడైనకర్దమునివచనంబుల్
విని భగవంతుండగున, య్యనఘుఁడు కపిలుండు వలికె నర్మిలి దోఁపన్.
సీ. నాచేతఁ బూర్వంబునం బ్రతిశ్రుతమైన
వచనముల్ దప్పక వరమునీంద్ర

1 అనురూపము = తగినది. 2 అనయము = నిత్యము. 3 ఆత్మీయజఠరనిక్షిప్త=

సీ. యింటఁ బుట్టితి నిర్హేతుకస్థితి
భూరిదయాగుణంబున [1]నవాప్త
సకలకాముఁడ నేను సన్న్యాసివేషంబు
ధరియించుటెల్ల నాకొఱకుఁగాదు
విను మహాత్మకులైన మునులకుఁ బరమాత్మ
గురు సద్వివేకంబు నరసిచూపు
తే. తత్త్వబోధంబుకొఱకును దాల్పఁబడిన
యంచిత వ్యక్తమార్గమైనట్టి దేహ
మని తలంపుము మత్పదధ్యానభక్తి
[2]ధీపరాయణమహిమంబు దేజరిల్ల. 856

క. సమధికనిష్ఠం గృతయో, గమునకు[3]సన్న్యస్తసకలకర్ముఁడవై మో
హముఁ బాసిభక్తిచే మో, క్షముకై భజియింపుననువికారరహితుఁడై.

క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ
తనికాయ[4]గుహాశయునా, త్మని[5]న జు[6]నాద్యంతశూన్యుదురితవిదూరున్

క. తిరముగ భవదీయాంతః, కరణసరోజాత కర్ణికాతలమున సు
స్థిరుఁ జేసియింద్రియంబుల, నిరసించి[7]మనోంబకమున నెఱిఁగనుమనఘా.

వ. అని. 860

క. తనరిన మోక్షమునొందెద, వని పలికినఁ గర్దముండు నమ్మునికుల చం
ద్రునివలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుకమలరన్.

క. మునిగణసేవితమగువన, మునకుంజని యందు మౌనమున నిస్సంగుం
డునువహ్నిరహితుఁ[8]డని కే, తనుఁడై యాత్మైకశరణ[9]తత్పరుఁడగుచున్

వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునంజేసి సకలభూతంబులందు సమత్వంబు భజియించి శాంత[10]శేముషీగరిష్ఠుం డగుచు నిస్తరంగం బగు వార్ధి చందంబున ధీరుం డై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుఁగాఁ

---

1 అవాప్త = పొందబడిన. 2 ధీ = బుద్ధి. 3 సన్న్యస్త = వదలిపెట్టబడిన 4 గుహాశయు = గుహలందుశయనించువాని. 5 అజు = పుట్టుకలేనివాని. 6 ఆద్యంతశూన్యున్ = మొదలు చివరలేనివాని. 7 మనోంబకము = మనస్సను కన్ను. 8 అని కేతనుఁడు = నివాసస్థలములేనివాడు. 9 తత్పరుఁడు = ఆసక్తిగలవాడు. 10 శేముషీగరిష్ఠుఁడు = బుద్ధిచేగొప్పవాఁడు.

దలంచుచు భక్తియోగంబున భాగవతగతిం బొందె నని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనినయనంతరంబ మాతృవత్సలుం డయినకపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గప్రదర్శకుం డయిన సుతునింగనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు ని ట్లనియె.

—♦ దేవహూతి పుత్త్రుం డైనకపిలునిచేఁ దత్త్వజ్ఞానంబు వడయుట ♦—

క. [1]అసదింద్రియఘర్షణమున, వసుమతి [2]నిర్విణ్ణ నగుచు వనరెడినా కీ యసదృశ మోహతమో[3]విని, రసనంబనఘాత్మ యే [4]తెరవునఘటించున్.

క. [5]పటుఘనసీరంధ్రతమః, పటలపరీవృతజగత్ప్రపంచమునకు [6]నె క్కటిలోచనమైమహితో,త్కటరుచివెలుఁగుదువుభానుకై వడిననఘా.

ఉ. భూరిమదీయమోహతమముం బెడఁ బాప సమర్థు లన్య లె వ్వారలు నీవ కాక నిరవద్య నిరంజన నిర్వికార సం సారలతా[7]లవిత్ర బుధసత్తమ సర్వశరణ్య ధర్మవి స్తారక సర్వలోకశుభదాయక నిత్యవిభూతినాయకా. 866

చ. నిను శరణంబు జొచ్చెద ననింద్యతపోనిధి నన్నుఁ గావవే యని తను దేవహూతి వినయంబున సన్నుతి సేసి వేఁడఁగా ననుపమసత్కృపాకలితుఁడై కపిలుం డనురాగ మొప్ప స జ్జన[8]నిచ[9]యాపవర్గఫల సాధన మై తగుతల్లి వాక్యమున్. 867

క. వినిమందస్మితలలితా, ననకమలుం డగుచునెమ్మనమునఁ బ్రమోదం బనయంబుఁగడలుకొననిజ, జననికినిట్లనియెఁబరమశాంతుం డగుచున్.

క. విను జీవునిచిత్తము దా, ఘనభవబంధాపవర్గ కారణ మది యే చినఁ [10]ద్రిగుణాసక్తంబయి,నను సంసృతిబంధకారణంబగు మఱియున్.

తే. అదియు నారాయణాసక్త మయ్యెనేని మోక్షకారణ మగు నని మునికులాబ్ధి

---

1 అసదింద్రియ ఘర్షణము = అసత్యమైన యింద్రియములయొరిపిడి. 2 నిర్విణ్ణము = దుఃఖము. 3 వినిరసనము = తిరస్కారము. 4 తెరవు = ఉపాయము. 5 పటుప్రపంచము = సమగ్రమైనట్టియు, గొప్పదియు, దట్టమైనదియునగు చీకటియొక్క సముదాయముచే చుట్టుకొనఁబడిన లోకమునంతను. 6 ఎక్కటిలోచనము = ఒకటేకన్ను. 7 లవిత్రము = కొడవలి. 8 నిచయము = సముదాయము. 9 అపవర్గము = మోక్షము. 10 త్రిగుణాసక్తము = సత్త్వ, రజ, స్తమో గుణములతోఁ గూడుకొనునది.

చంద్రుఁడన నొప్పు కపిలుండు జననితోడ
నర్థి వినఁజెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి. 870

వ. మఱియుఁ జిత్తం బహంకారమమకార రూపాభిమాన[1]జాతంబులగు కామలోభాది కలుషవాతంబులచేత నెప్పుడు [2]విముక్తంబై పరిశుద్ధంబగు నప్పుడు సుఖదుఃఖ [3]వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతి కంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేదనుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును నితరవస్త్వంత[4]రాపరిచ్ఛిన్నుండును [5]నుదాసీనుండును నైన పరమాత్మునిం దన్మయంబును [6]హతౌజస్కంబునైన ప్రపంచంబును జ్ఞాన వైరాగ్యభక్తి యుక్తం బగు మనంబుచేఁ బొడగాంచి యోగిజనులు పరతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు [7]నియుజ్యమానం బయిన భక్తి భావంబువలన నుదయించి మార్గంబునకు నితరమార్గంబులు సరిగావండ్రు విద్వాంసులు [8]సంగంబింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపంబడి జీవునకు [9]నశిథిలంబగు బంధంబునకుఁ గారణంబగుననియు నదియె సద్విషయం బైన నంతఃకరణ [10]సంయమన హేతుభూతంబగుచు సాధుజనులకు [11]ననర్గళ మోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు సహనశీలురు సమస్తశరీరధారులకు సుహృత్తులును బరమశాంతులును గారుణికులునునై [12]పరిత్యక్తకర్మ ఫలస్వభావులును [13]విసృష్ట స్వజనబంధుజనులునునై మత్పదాశ్రయులును మద్గుణధ్యాన పారీణులును మత్కథాప్రసంగ [14]సంభరితశ్రవణానందులును నగుచు మదీయకథల నొడువుచు వినుచు నుండుపరమభాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింపఁ జేయం జాల దట్టిసర్వసంగవివర్జితులగు పరమభాగవతజనుల సంగం [15]బపేక్షణీయం బది సకలదోష నివారకం బగు నట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణరసాయ

1 జాతము = పుట్టినది. 2 విముక్తము = విడువఁబడినది 3 వివర్జితము = వదిలి పెట్టఁబడినది 4 అపరిచ్ఛిన్నుఁడు=ఛేదింపఁబడనివాఁడు. 5 ఉదాసీనుఁడు=తగులనివాఁడు. 6 హతౌజస్కము = కాంతిచే కొట్టఁబడినది. 7 నియుజ్యమానము=నియోగింపఁబడినది. 8 సంగము = కూడిక. 9 అశిథిలము = నశింపనిది. 10 సంయమనము = అణచునది. 11 అనర్గళము = అడ్డులేనిది. 12 పరిత్యక్తము = వదిలిపెట్టఁబడినది. 13 విసృష్ట=విడువఁబడిన. 14 సంభరిత = నిండిన 15 అపేక్షణీయము = కోరందగినది.

నంబు లగు మదీయకథాప్రసంగంబులు గలుగు మద్గుణా[1]కర్ణ
నంబునం జేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్యమార్గదంబు లగు
శ్రద్దాభక్తు లుదయించు నదియునుంగాక యేపురుషుం డైననేమి
మద్విరచిత [2]జగత్కల్పనాది విహారచింతచే నుదయించిన భక్తిం జేసి
యింద్రియ సుఖంబులవలనను [3]దృష్టశ్రుతంబు లైన యైహికా
ముష్మికంబుల వలనను విముక్తుం డగుచుఁ జిత్తగ్రహణార్థంబు
ఋజువు లైన యోగమార్గంబులచే సంయుక్తుం డగు నట్టి యోగి
ప్రకృతిగుణ సేవనంబుచేత వైరాగ్యగుణ విజృంభితంబైన జ్ఞాన
యోగంబుచేతను మదర్పిత భక్తియోగంబుచేతను [4]ప్రత్యగాత్మ
కుండ నైన నన్ను నంతఃకరణనియుక్తునిం గావించునని చెప్పిన విని
దేవహూతి గపిలున కిట్లనియె. 871

క. ఏభక్తి భవద్గుణపర, మై[5]భవపాపప్రణాశమై ముక్తిశ్రీ
లాభము[6]రయమునఁ జేయునొ, యాభక్తివిధంబుఁ దెలియ నానతియీవే

వ. అదియునుంగాక [7]భవదురితం బయిన యోగంబును దదంగంబులును
దద్గతతత్త్వావబోధంబును [8]ససాకల్యంబుగ మందబుద్ధి నైన నాకుస్ఫుటం
బుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె. 873

సీ. జనయిత్రి వినుమఱి సకలపదార్థప
రిజ్ఞానతత్త్వ పారీణమైన
[9]యామ్నాయ విహిత కర్మాచారములు గల్గి
[10]తివుటమై వర్తింప దేవగణము
పూని నైసర్గికం బైన నిర్హేతుక
మగు భగవత్సేవ మిగుల ముక్తి
కంటె [11]గరిష్ఠంబు గావున నదియు భు
క్తాన్నంబు జీర్ణంబు నందఁ జేయు

---

1 ఆకర్ణనము = వినుట. 2 జగత్కల్పనము = లోకము సృష్టించుట. 3 దృష్టశ్రుతంబులు = చూచినవి, వినినవి. 4 ప్రత్యగాత్మకుండు = పరమాత్మ. 5 భవపాపప్రణాశము = సంసారపాపములను నశింపచేయునది. 6 రయమున = శీఘ్రమున. 7 భవదురితము = నీవలనఁ బుట్టినది. 8 సాకల్యముగ = పూర్తిగా. 9 ఆమ్నాయవిహితము = వేదసమ్మతము. 10 తివుటమై = పూనికతో. 11 గరిష్ఠము = శ్రేష్ఠము.

తే. దీప్త జఠరాగ్నిగతి లింగ దేహనాశ
కంబు గావించు నదియును గాక విష్ణు
భక్తివై భవములఁ దేట పఱుతు వినుము
సద్గుణవ్రాత యోగలక్షణ[1]సమేత. 874

చ. అమలినభక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణారవిందయు
గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరానులా
పముల మదీయదివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో
క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పితసర్వకర్ములై. 875

సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్
ఘనత కెక్కినపురాతనము లైన
చారుప్రసన్న [2]వక్త్రారుణలోచన
ములు గల్గి వరదానకలితములుగఁ
దనరుమద్దివ్యావతార వైభవములు
మది నొప్పఁ దమయోగమహిమఁ జేసి
యనుభవించుచుఁ దదీయాలాపములు సన్ను
తించుచుఁ దివుటఁ దద్దివ్యవిలస

తే. దవయవోదారసుందరనవవిలాస
మందహాసమనోహరమధురవచన
రచనచే నపహృతమనఃప్రాణు లగుచు
నెలమి నుందురు [3]నిశ్శ్రేయసేచ్ఛ లేక. 876

మ. కడఁకన్ వారలు వెండి మోక్ష [4]నిరపేక్షస్వాంతులై యుండి తా
[5]నణిమాద్యష్టవిభూతిసేవితము నిత్యానందసంధాయియున్
గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వల
క్షణయుక్తంబును నైన మోక్షపదవిం గైకొందు రత్యున్నతిన్. 877

వ. ఇట్లు పొంది. 878

---

1 సమేత = కూడుకొనిన. 2 వక్త్రము = ముఖము. 3 నిశ్శ్రేయసేచ్ఛ=ముక్తికోరిక.
4 నిరపేక్ష స్వాంతులు = కోరని మనస్సుకలవారు. 5 అణిమాద్యష్టవిభూతి సేవితులు=

క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి మదీయకాలచక్ర [1]గ్రసనం
బును నొందక నిత్యంబగు, ననుపమ సుఖవృత్తినుందురది యెట్లన్నన్.

మ. సముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి
త్వము జాలన్ హితవృత్తిచేతను [2]సుహృత్త్వంబున్ సుమంత్రోపదే
శముచేతన్ నిజ [3]దేశికుండనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌనిష్టదై
వమునై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్.

వ. అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె. 881

చ. విను మదిగాక యీభువి దివిం బలుమాఱుఁ జరించునాత్మ దా
ధనపశుపుత్రమిత్రవనితాతతిపైఁ [4]దగులంబు మాని న
న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా
నిని ఘనమృత్యురూపభవ [5]నీరధి నేఁ దరియింపఁ జేయుదున్. 882

సీ. రూఢిఁ బ్రధానపూరుష నాయకుండను
భగవంతుఁడను జగత్ప్రభుఁడనైన
నాకంటె నన్యులఁ గైకొన దగిలిన
యాత్ములు భవభయం బందుదు రది
గావున నాయాజ్ఞఁ గడవంగ నోడుటఁ
జేసి వాయువు వీచు [6]శిఖి వెలుంగు
[7]ఇనుఁడు దపించుఁ దా నింద్రుండు వర్షించు
భయమంది మృత్యువు పరువు వెట్టుఁ

తే. గాన విజ్ఞానవైరాగ్య కలితమైన
భక్తియోగంబునం జేసి పరమపదము
గోఱకు నయ్యోగివరులు మచ్చరణభజను
లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ములగుచు. 883

క. గురుభక్తిం జిత్తము మత్పరమై విలసిల్లునంత పర్యంతము స
త్పురుషులకిహలోకంబునఁ, జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్.

---

1 గ్రసనము = మ్రింగుట. 2 సుహృత్త్వంబు = స్నేహితము. 3 దేశికుఁడు = గురువు. 4 దగులము = ఎక్కువయాసక్తి. 5 నీరధి = సముద్రము. 6 శిఖి = అగ్ని 7 ఇనుఁడు = సూర్యుఁడు.

క. అనియిట్లు సన్నుతించు ప్రీడు, జననికి హరిభక్తియోగ సంగతి నెల్లన్
వినిపించుచు వెండియు ని,ట్లనియెన్ సమాహ్లాదచిత్తుఁడగుచుఁ గడంకన్.

వ. అవ్వా యివ్విధంబున భక్తియోగ ప్రకారంబు సెప్పితి నింకఁ దత్త్వ లక్షణంబు వేఱువేఱ యెఱింగింతు నే తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబులవలన విముక్తు లగుదురు హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శన రూపంబునగు నాజ్ఞానం బాత్మ నిఃశ్రేయ సకారణంబు గావున దాని నెఱింగింతు నందు నాత్మస్వరూపం బెట్టి దనిన ననాదియుఁ బురుషుండును సత్త్వాది గుణశూన్యుండును బ్రకృతి గుణ విలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును మఱియు నెవ్వనితోడ నీవిశ్వంబు [1]సమన్వితంబగు నతండు గుణత్రయాత్మకత్వంబున వ్యక్తంబును భగవత్సంబంధియునగు ప్రకృతి యందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణ త్రయ మయంబైన రూపంబయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుం గొని యప్పుడు మోహితుండయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకంబయిన ప్రకృ[2]త్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసార బద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండుఁ గర్తృత్వశూన్యుం డగు నీశ్వరుండు సాక్షియగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వం బులు ప్రకృత్యధీనంబులనియు సుఖదుఃఖ భోక్తత్వంబులు ప్రకృతి విలక్షణుండయిన పురుషునివనియు నెఱుంగుదురని చెప్పిన విని దేవ హూతి గపిలున కిట్లనియెఁ బురుషోత్తమా! ప్రకృతిపురుషులు సద సదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వానిలక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్మనిన భగవంతుం డిట్లనియె.

క. క్రమమునఁ ద్రిగుణము నవ్య
క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా
నము ననఁగాఁ బ్రకృతివిశే
షము లదియు విశిష్టమనిరి సద్విదు లెలమిన్.

వ. అందుఁ బ్రకృతి [1]చతుర్వింశతితత్త్వాత్మకంబై యుండు నది యెట్లనినం
బంచమహాభూతంబులును [2]బంచతన్మాత్రలును జ్ఞానకర్మాత్మకంబు
లయిన [3]త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులు వాక్పాణి పాద
పాయూపస్థంబులు నను దశేంద్రియంబులును మనోబుద్ధి చిత్తా
హంకారంబు లను నంతఃకరణ చతుష్టయంబును నను చతుర్వింశతి
తత్త్వాత్మకంబైన సగుణ బ్రహ్మసంస్థానంబు సెప్పితి నిటమీఁదఁ
గాలంబను పంచవింశకతత్త్వంబు సెప్పెద నది గొందఱు పురుష
శబ్దవాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు గాలశబ్దంబునఁ జెప్పం
బడు నందు రందు నహంకార మోహితుండై ప్రకృతి నొందు జీవుండు
భయంబుఁ జెందుఁ బ్రకృతి గుణసామ్యంబునం జేసి వర్తించి నిర్వి
శేషుండగు భగవంతుని చేష్టావిశేషంబు దేనివలన [4]నుత్పన్నం బగు
నదియ కాలంబని చెప్పంబడు నదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి
పురుషుండనియు వాని బహిర్భాగ వ్యాప్తిం జేసి కాలంబనియుఁ
జెప్పంబడు నాత్మమాయం జేసి తత్త్వాంతర్గతుండయిన జీవునివలన
[5]క్షుభితంబయి జగత్కారణంబగు ప్రకృతియందుఁ బరమపురుషుండు
దనవీర్యంబు వెట్టిన నా ప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబు
పుట్టించె నంత సకలప్రపంచ బీజభూతుండును లయవిక్షేపశూన్యుం
డును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబునందు నాత్మగతం
బైన మహదాది ప్రపంచంబుల వెలింగించుచు స్వతేజో విపత్తిం జేసి
యాత్మ [6]ప్రస్వాపనంబు సేయునట్టి తమంబును గ్రసించెనని చెప్పి
వెండియు నిట్లనియె. 888

క. దివ్యమగు వాసుదేవాది వ్యూహచతుష్టయంబు త్రిజగములందున్
సేవ్యంబని చెప్పంబడు, భవ్యగుణా దాని నెఱుఁగఁ బలికెద నీకున్. 889

సీ. సత్త్వప్రధానమై స్వచ్ఛమై శాంతమై
[7]యూర్మిషట్కంబుల నోసరించి

---

1 చతుర్వింశతి = యిరువదినాలు, 2 పంచతన్మాత్రలు = శబ్దస్పర్శరసరూప గంధములు, 3 త్వక్ = చర్మము, 4 ఉత్పన్నము = పుట్టినది. 5 క్షుభితము = కలఁతపెట్టఁబడినది. 6 ప్రస్వాపనము = తీసివేయుట. 7 ఊర్మిషట్కము = ఆకలి, దాహము, శోకము, మోహము, ముసలితనము, మరణము.

సురుచిర [1]షాడ్గుణ్య పరిపూర్ణమై నిత్య
మై భక్తజనసేవ్యమై తనర్చి
వలనొప్పుచుండు నవ్వాసుదేవవ్యూహ
మంతమహత్తత్త్వమందు నోలి
రూఢిఁ గ్రియాశక్తిరూపంబు గల్గు న
హంకార ముత్పన్న మయ్యె నదియు

తే. సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ
సంబు నా మూఁడు దెఱఁగుల జరగు నందుఁ
దనరు వైకారికము మనస్సునకు నింద్రి
యములకును గగనముఖభూతముల కరయ. 890

వ. అది దేవతారూపంబున నుండుఁ దైజసాహంకారంబు బుద్ధిప్రాణం
బులుం గలిగి యుండుఁ దామసాహంకారం బింద్రియ మేళనంబున
నర్థమాత్రంబై యుండు మఱియును. 891

సీ. అట్టి యహంకారమం దధిష్ఠించి సా
హస్ర ఫణామండ లాభిరాముఁ
డై తనరారు ననంతుఁడు సంకర్ష
ణుం డనఁ దగు పురుషుండు ఘనుఁడు
మహితభూతేంద్రియ మానసమయుఁడు నై
కర్తృత్వకార్యత్వ కారణత్వ
ప్రకట శాంతత్వ ఘోరత్వమూఢత్వాది
లక్షణ లక్షితోల్లాసి యగుచు

తే. నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ
ఘనవికారంబుఁ బొందు వైకారికంబు
వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె
మఱియు వైకారికంబును మాత వినుము. 892

వ. అది యెట్టు లంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననందగు
సంకల్ప వికల్పంబులం జేసి కామ సంభవం బనంబడు నెద్ది యని

---

1. షాడ్గుణ్యములు — ఐశ్వర్యము, వీర్యము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము.

రుద్రాఖ్యం బయిన వ్యూహం బదియు [1]హృషీకంబులకు నధీశ్వరంబయి సకల యోగీంద్ర సేవ్యం బగుచు శరదిందీవర శ్యామం బయి యుండు వెండియుం దైజసంబువలన బుద్ధితత్త్వంబు వుట్టె దానిలక్షణంబులు ద్రవ్యప్రకాశకంబైన జ్ఞానంబును నింద్రియానుగ్రహంబును సంశయం బును మిథ్యాజ్ఞానంబును నిద్రయు నిశ్చయంబును స్మృతియు ననందగి యుండు మఱియుఁ దైజసాహంకారంబువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రి యంబులును గ్రియాజ్ఞానసాధనంబులును గలిగి యుండుఁ బ్రాణంబు నకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటం జేసి యింద్రియంబు లకుఁ దైజసత్వంబు గలిగి యుండు భగవ ద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబువలన శబ్దతన్మాత్రంబు వుట్టె దానివలన నాకా శంబును నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె శబ్దం బర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞాన జనకం బయ్యె మఱియు శబ్దతన్మాత్రంబువలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు నాత్మప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండుఁ గాలగతిచే వికారంబు నొందు శబ్ద తన్మాత్ర లక్షణం బగు [2]నభంబువలన స్పర్శంబును స్పర్శంబు వలన వాయువును వాయువుచే స్పర్శగ్రాహియై త్వగింద్రియంబును బుట్టె మృదుత్వంబును గఠినత్వంబును శైత్యంబును నుష్ణత్వంబును నను నివి స్పర్శంబునకు స్పర్శత్వం బని చెప్పంబడు మఱియు వాయువునకుఁ [3]జాలనంబును పరస్పర విభాగకరణంబును ద[4]న్మేళనంబును ద్రవ్యశబ్ద [5]నేతృత్వంబును నగు నందు గంధవంతం బగు ద్రవ్యంబును ఘ్రాణేం ద్రియంబు నొందించుట ద్రవ్య నేతృత్వంబు దూరస్థం బగు శబ్దంబును శ్రోత్రేంద్రియగ్రాహ్య మగు నట్లొనరించుట శబ్దనేతృత్వంబు నక్వేంద్రియాత్మకత్వంబు నను నవి లక్షణంబులై యుండు దైవ ప్రేరితంబై స్పర్శతన్మాత్రగుణకం బగు వాయువువలన రూపంబును దానివలనఁ దేజంబును బుట్టె రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం

1 హృషీకము = ఇంద్రియము. 2 నభము=ఆకాశము. 3 చాలనము=కదలుట. 4 మేళనము = కూడిక. 5 నేతృత్వము = ప్రేరకత్వము.

బయ్యె నేత్రగతం బయిన రూపంబునకు [1]నుపలంభకత్వంబును ద్రవ్యాకార సమత్వంబును ద్రవ్యంబునకు [2]నుపసర్జనం బగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడుఁ దైజసంబునకు సాధారణంబు లగు ధర్మంబులు ద్యోతంబనం బ్రకాశంబు [3]పచనం బనఁ దండులాదుల పాకంబు పిపాసానిమిత్తంబైన పానంబు క్షున్నిమిత్తకం బైన [4]యోదనంబు హిమమర్దనం బగు శోషణంబు నను నివి వృత్తులై యుండు రూపతన్మాత్రంబువలన దైవ[5]చోదితంబై వికారంబు నొందు తేజస్సువలన రసతన్మాత్రంబు పుట్టె రసతన్మాత్రంబు వలన జలంబు పుట్టె జిహ్వాయను రసనేంద్రియంబు రసగ్రాహకంబయ్యె నారసం బేకంబై యుండియు భూతవికారంబునం జేసి కషాయ [6]తిక్త క[7]ట్వామ్ల మధురాది భేదంబుల ననేక విధంబయ్యె వెండియు సాంసర్గిక ద్రవ్యవికారంబునంజేసి [8]యార్ద్రం బగుటయు ముద్దగట్టుటయుఁ దృప్తిదాతృత్వంబును జీవనంబును దద్వైక్లబ్య నివర్తనంబును మృదూకరణంబును దాపనివారణంబును గూపగతం బయిన జలంబు దివియు మఱియు నుద్గమించుటయు ననునివి జలవృత్తు లనంబడు రసతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబువలన గంధతన్మాత్రంబు పుట్టె దాని వలనం బృథ్వియుఁగలిగె ఘ్రాణంబు గంధగ్రాహకం బయ్యె నందు గంధం బేకం బయ్యు వ్యంజనాదిగతం బయి హింగ్వాది నిమిత్తం బయిన మిశ్రగంధం బను కరంభంబును గృంజనాదిగతం బయిన పూతి గంధంబును ఘనసారాదినిమిత్తం బైనసుగంధంబును శతపత్త్రాది గతంబగు శాంతగంధంబును లశునాదిగతం బైన యుగ్రగంధంబును [9]బర్యుషితచిత్రాన్నాదిగతం బయిన యామ్లగంధంబును ద్రవ్యావయవవైషమ్యంబునంజేసి యనేక విధంబై యుండు నదియునుంగాక ప్రతిమాదిరూపంబులంజేసి సాకారతాపాదనంబగు భావనంబును జలాదివిలక్షణ క్రియాంతరనిరపేక్షం బయినస్థితియు జలాద్యాధారత

---

1 ఉపలంభకత్వము = అనుభవము, 2 ఉపసర్జనము = అప్రధానము, 3 పచనము = వండుట, 4 ఓదనము = అన్నము, 5 చోదితము = ప్రేరేపితము, 6 తిక్త = చేదు, 7 ఆమ్లము = పులుపు, 8 ఆర్ద్రము = తడుపబడినది, 9 పర్యుషితము = చలిది.

యను ధారణంబును నాకాశాద్యవచ్ఛేదకత్వంబును సకలప్రాణిపుం స్త్వాభివ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు నని చెప్పి వెండియు నిట్లనియె నభోసాధారణ గుణశబ్దవిశేష గ్రాహకంబు శ్రోత్రంబును వాయ్వసాధారణగుణవిశేషగ్రాహకంబు స్పర్శంబును దేజోసాధారణగుణవిశేషగ్రాహకంబు చక్షురింద్రియంబును నంభో సాధారణ గుణవిశేషగ్రాహకంబు రసనేంద్రియంబును భూమ్య సాధారణగుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును నాకాశాది గుణంబు లగుచు శబ్దాది కార్యంబు లగు వాయ్వాదులందుఁ గారణా న్వయంబున నన్నిటికిం బృథ్వీసంబంధంబు గలుగుటం జేసి భూమి యందు శబ్దస్పర్శరూప రసగంధంబులు గలుగుట మహదాది పృథి వ్యంతంబు లగు నీయేడుతత్త్వంబులు పరస్పరమిళితంబులై భోగా యతనం బగు పురుషునింగల్పింప సమర్థంబులై యున్నం జూచి కాలాదృష్టసత్త్వాదులంగూడి జగత్కారణుండును దైవగుణ్యవిశిష్టుం డును నశేషనియామకుండును నిరంజనాకారుండును నగు సర్వేశ్వ రుండందుఁ బ్రవేశించునంత నన్యోన్యక్షుభితంబులై మిళితంబులైన మహదాదులవలన నధిష్ఠాతృచేతనరహితంబగు నొక యండంబు పుట్టె నందు. 893

సీ. గురుశక్తియగు విరాట్పురుషుండు సంభవం
  బయ్యె నయ్యండంబు నర్థిఁబొడవి
యంబుముఖావరణంబు లొక్కొక్కటికి
  దశగుణితంబులై తవిలి యావ
రణములై యుండును గ్రమమున లోకంబు
  లకు మేలుకట్టుపోలికఁ దనర్చి
పంకజోదరునిరూపము విలసించును
  లోలత జలములోఁ దేలుచున్న

తే. హేమమయమైన యండంబులో మహాను
  భావుఁడభవుండు హరి దేవదేవుఁ డఖిల
జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు
  విష్ణుపదభేదనంబు గావించి యుండు. 894

సీ. కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు
నా విరాట్పురుషుని యాననంబు
వలనను వాణియు వాణితో వహ్నియు
నాసంబువలనఁ బ్రాణములఁగూడి
ఘ్రాణేంద్రియంబయ్యె ఘ్రాణంబువలనను
వాయువులును బ్రాణ వాయువులును
నందు నక్షులు చక్షువందు సూర్యుండును
నం దభిధ్యానంబు నర్థిఁజేయఁ

తే. గర్ణములు జాతమయ్యెఁ దత్కర్ణసమితి
వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ
ద్వక్కుచే శ్మశ్రురోమ వితానకములు
నోషధివ్రాతమును భవమొందె మఱియు. 895

తే. దానివలనను మేఢ్రంబు గానఁబడియెఁ
బరఁగ రేతంబువలన నాపంబు వుట్టె
గుదమువలన నపానంబు నుదయమయ్యె
దానివలనను మృత్యువు దగజనించె. 896

క. కరములవలనను బలమును, నిరవుగ నారెంటివలన నిందుఁడుఁ బాదాం
బురుహంబులవలనగతియు,నరుదుగనారెంటివలనహరియును గలిగెన్.

క. ఘననాడీపుంజమువల, నను రక్తము దానివలన నదులును జఠరం
బున నాఁకలియును దప్పియు,ననయము నారెంటివలన నబ్ధులువుట్టెన్.

క. విను హృదయమువలనను మన
మును మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ జిత్తం
బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుం
డును గలిగిరి యవ్విరాజుఁడుం బూరుమతేన్. 899

వ. మఱియు విరాట్పురుషునం దుద యించిన వ్యష్టిరూపంబు లగు నాకా శాదిభూతంబులును శబ్దంబు మొద లగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియజాతంబును దదధిదేవతలును దమంతన సమష్టిరూపుం డగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తిప్రవర్తకుం జేయ ననమర్థంబు లయ్యె నె టనిన దేవాధిష్ఠితంబు లగు నింద్రియంబులు దాము వేఱ్ఱేర

యయ్యీశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయ నోపక క్రమంబునం ద త్త దధిష్ఠానాదుల నొందె నందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యం బగు వ్యష్టిశరీరజాతం బనుత్పన్నంబయ్యె నంతనాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిదయయ్యె. నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రం బుల నొందిన వృథాభూతంబయ్యె. దిగ్దేవతాకంబగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యం బయ్యె. నోషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ జెంద విఫలం బయ్యె. నద్దైవంబగు మేఢ్రంబు రేతంబునొందినఁ దత్కార్యకరణా దక్షంబయ్యెఁ. బదంపడిగుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబునొందె. విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁగూడిన ననీశ్వరంబులయ్యెఁ. బాణీంద్రియంబు లింద్రదైవ తంబులగుచు బలంబునొందిన శక్తిహీనంబులయ్యె. మరియు నాడులు ననదీకంబులై లోహితంబునొందిన నిరర్థకంబులయ్యె. నుదరంబు సింధువులతోడం జేరి క్షుత్పిపాసలంబొందిన వ్యర్థంబయ్యె. హృద యంబు మనంబుతోడం జంద్రునొందిన నూరకయుండె. బుద్ధి బ్రహ్మాధి దైవతంబై హృదయంబునొందిన నిష్ఫలంబయ్యెఁ. జిత్తం బభిమా నంబుతో రుద్రునింజెందిన విరాట్కార్యజాతం బనుద్భూతంబయ్యె. నంతఁ జైత్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబునొంది చిత్తం బుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిలకార్యభూత బ్రహ్మాం డంబునొంది [1]ప్రవృత్త్యున్ముఖుండయ్యె. సుప్తుండగు పురుషునిం బ్రాణాదులు దమబలంబుచే భగవత్ప్రేరితంబు లగుచు నుత్థాపనా సమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబు లగు నింద్రియంబులతోడ దేహాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె నని మఱియు నవ్విరాట్పురుషుని ననవరతభక్తిం జేసి విరక్తులై యాత్మలయందు వివేకంబుగల మహాత్ములు చింతింపుదురనియుఁ బ్రకృతిపురుష వివేకంబున మోక్షంబును బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగుననియుఁ జెప్పి మఱియు ని ట్లనియె. 900

---

1 ప్రవృత్త్యున్ముఖులు = ప్రవృత్తికనుగుణము లైనవారు.

సీ. జననుత సత్త్వరజస్తమోగుణ మయ
మైన ప్రాకృతకార్య మగుశరీర
గతుఁడయ్యుఁ బురుషుండు గడఁగి ప్రాకృతములు
నగు సుఖ దుఃఖ మోహములవలనఁ
గర మనురక్తుండు గాఁడు వికారవి
హీనుఁడు త్రిగుణరహితుఁడు నగుచు
బలసి నిర్మలజల ప్రతిబింబితుం డైన
దినకరుభంగి వర్తించునట్టి

తే. యాత్మ ప్రకృతిగుణంబులయందుఁ దగులు
వడి యహంకారమూఢుఁ డై తొడరి యేను
గడఁగి నిఖిలంబునకు నెల్లఁ గర్త నని ప్ర
సంగవశతను బ్రకృతిదోషములఁ బొంది. 901

క. సుర తిర్య ఙ్మనుజ స్థా, వరరూపము లగుచుఁ గర్మవాసనచేతం
బర వైనమిశ్రయోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్.

క. పూని చరించుచువిషయ, ధ్యానంబునఁ జేసి [1]స్వాప్నికార్థాగమసం
ధానమురీతి నసత్పథ, మానసుఁడగుచుఁ భ్రమించు మతిలోలుం డై.

వ. అట్లు గావున. 904

తే. పూని మోక్షార్థి యగువాఁడు దీనిఁ దీవ్ర
భక్తియోగంబుచేత విరక్తిఁ బొంది
మనము వశముగఁ జేసి యమనియమాది
యోగమార్గక్రియాభ్యాస యుక్తిఁ జేసి. 905

సీ. [2]శ్రద్ధాగరిష్ఠుఁ డై సత్యమైనట్టి మ
ద్భావంబు మత్పాద సేవనంబు
వర్ణిత మత్కథావర్ణనంబును సర్వ
భూత సమత్వ[3]మజాతవైర
మును బ్రహ్మచర్యంబు ఘనమౌన మాదిగాఁ
గల నిజధర్మ సంగతులఁ జేసి

---

1 స్వాప్ని...రీతి = నిద్రయందలి ప్రయోజనముల కూడికవలె 2 శ్రద్ధాగరిష్ఠుఁడై = [illegible] గలవాఁడు 3 అజాతవైరము = విరోధములేకపోవుట.

సంతుష్టుఁడును [1]మితాశనుఁడు నేకాంతియు
మననశీలుఁడు [2]వీత మత్సరుండు

తే. నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ
కలిత విజ్ఞానియై [3]బంధకంబులైన
ఘనశరీర పరిగ్రహోత్కంఠయందు
నాగ్రహముసేసి వర్తింప నగును మఱియు. 906

వ. జీవేశ్వరతత్త్వజ్ఞానంబునం జేసి [4]నివృత్తం బయినబుద్ధి దదవస్థానంబునుం గలిగి [5]దూరీభూతేతర దర్శనుండై జీవాత్మజ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించుచందంబున నాత్మనాయకుండయిన శ్రీమన్నారాయణుని దర్శించి [6]నిరుపాధికంబై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానం బగుచుఁ బ్రధానకారణంబునకు [7]నధిష్ఠానంబును గార్యంబునకుఁ జక్షువుంబోలెఁ బ్రకాశంబును సమస్తకార్యకార [8]ణానుస్యూతంబును బరిపూర్ణంబును సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబును బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. 907

సీ. విను మాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు
నెఱుఁగంగఁబడు నది యెట్లటన్న
[9]గగనస్థుఁ డగు [10]దినకరుకిరణచ్ఛాయ
జలముల గృహ [11]కుడ్యజాలకముల
వలనఁ దోఁచిన ప్రతిఫలితంబుచేత నూ
హింపంగఁబడినయ [12]య్యినునిపగిది
నర్థి మనోబుద్ధ్యహంకరణత్రయ
నాడీప్రకాశమునను నెఱుంగ

---

1 మితాశనుఁడు = మితముగా భుజించువాఁడు. 2 వీతమత్సరుఁడు = అసూయ లేనివాఁడు. 3 బంధకము = అడ్డు. 4 నివృత్తంబు = మరలింపబడినది. 5 దూరీభూత = దూరముగాఁ జేయఁబడిన. 6 నిరుపాధికము = ధర్మచింతలేనిది. 7 అధిష్ఠానము = ప్రభావము. 8 అనుస్యూతము = ఎడతెగనిది. 9 గగనస్థుఁడు = ఆకాశమునందున్న వాఁడు. 10 దినకరుఁడు = సూర్యుఁడు. 11 కుడ్యజాలకములు=గోడలు, కిటికీలు. 12 ఇనుఁడు= సూర్యుడు.

తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతి గాఁగఁ
జిత్తమునఁ దోఁచు నంచిత శ్రీఁ దనర్చి
యమ్మహామూర్తి [1]సర్వభూతాంతరాత్మఁ
దగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును మఱియు. 908

వ. జీవుండు [2]సుషుప్త్యాద్యవస్థలయందుఁ బరమా [3]త్మానుషక్తుం డైన భూతాదితత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకరణంబులు గాకున్న సుషుప్తిసమయంబునం దాను నిస్తంద్రుండగుచు నితరంబుచేతఁ గప్పంబడనివాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె, 909

సీ. విమలాత్మ యీపృథివికిని గంధమునకు
సలిలంబునకును రసంబునకును
నన్యోన్యమగు [4]నవినాభావసంబంధ
మైనసంగతిఁ బ్రకృత్యాత్మలకును
సతతంబు నన్యోన్యసంబంధమైయుండు
ప్రకృతి దా నయ్యాత్మఁ బాయు టెట్లు
దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత
భవభయంబులనెల్లఁ బాయు టెట్లు

తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది
యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ
గరుణ రక్షింపవే దేవగణసుసేవ్య
భక్తలో[5]కానుగంతవ్య పరమపురుష. 910

వ. అనిన భగవంతుం డిట్లనియె ననివృత్తం బయిన స్వధర్మంబునను నిర్మలాంతఃకరణంబు నను సునిశ్చితంబైన మద్భక్తియోగంబునను సత్కథాశ్రవణసంపాదితంబైన వైరాగ్యంబునను దృష్టప్రకృతిపురుష యాథాత్మ్యం బగుజ్ఞానంబునను బలిష్ఠంబయి [6]కామానభిష్వంగం

1 సకలభూతాంతర్యామి = సకలభూతములలో పలనుండువాడు. 2 సుషుప్తి = నిద్ర. 3 అనుషక్తుఁడు = కూడుకొనినవాడు. 4 అవినాభావసంబంధము = ఎడతెగని సంబంధము. 5 అనుగంతవ్యుఁడు = పొందతగినవాడు. 6 కామానభిష్వంగంబు =

బగువిరక్తివలనఁ దపోయుక్తం బయిన యోగంబునను దీవ్రంబయిన చిత్తైకాగ్రితం జేసి పురుషునిదగు ప్రకృతి [1]దంద హ్యామానంబై తిరోధానంబును బొందు నదియునుంగాక యరణిగతంబైనవహ్ని చే నరణి దహింపఁబడు చందంబున జ్ఞానంబునను దత్త్వదర్శనంబునను జేసి నిరంతరంబు బలవంతంబును దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడువంబడు నని చెప్పి. 911

క. వినుప్రకృతినైజమహిమం, బునఁడనలోనున్నయట్టిపురుషునకు మహే శునకునకుశుభవిస్ఫురణం, బసయముఁగావింపఁజాల దదియెట్లనినన్. 912

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందుసనర్థకముల్ ప్రబోధమం దరయఁగ మిథ్యలై పురుషునందు ఘటింపనికై వడిం బరే శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం బరువడిఁ బొంద నెన్నఁటికిఁ బ్రాకృతదోషము లంగనామణీ. 913

వ. అని వెండియు నిట్లనియె. 914

సీ. అధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జ
　　న్మంబులఁ బెక్కుకాలంబులందు
బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టు
　　సర్వార్థవైరాగ్యశాలి యగుచుఁ
బూని నాభక్తులచే నుపదేశింపఁ
　　బడినవిజ్ఞానసంపత్తిచేతఁ
బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి
　　మత్ప్రసాదప్రాప్తి మతిఁ దనర్చు

తే. నిజపరిజ్ఞానవిచ్ఛిన్న నిఖిలసంచ
యుండు [2]నిర్ముక్తలింగదేహుండు నగుచు
ననఘయోగీంద్రహృద్గేయ మగుమదీయ
దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు. 915

వ. మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు గావున వానియందు [3]విగతసంగుండును మదీయ చరణసరోజస్థిత

---

1 దందహ్యామానము = కాల్పఁబడినది. 2 నిర్ముక్తము = వదలిపెట్టబడినది.
3 విగతసంగుడు = కూడికలేనివాడు.

లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవతనపహసించి మోక్షం
బునొందునని చెప్పి వెండియు యోగలక్షణప్రకారంబు వినిపింతు విను
మని భగవంతుండైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె. 916

క. ధీనిధులయ్యును యోగవిధానంబునఁ జేసి మనము దగ విమలంబై
మానితమగు మత్పదముం బూనుదు రాయోగధర్మముల నెఱిఁగింతున్.

వ. అది యెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబును శాస్త్రవినిషిద్ధధర్మ
కర్మంబులు మానుటయు దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతో
షించుటయు మహాభాగవత శ్రీపాదారవిందార్చనంబును గ్రామ్యధర్మ
నివృత్తియు మోక్షధర్మంబులయందు రతియు మితంబై శుద్ధంబయిన
యాహారంబు సేవయు విజనంబయి నిర్బాధకంబయిన స్థానంబున
నుండుటయు హింసారాహిత్యంబును సత్యంబును [1]నస్తేయంబును దన
కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు బ్రహ్మ
చర్యంబును తపశ్శౌచంబులును స్వాధ్యాయపఠనంబును బరమపురు
షుండైన సర్వేశ్వరుని యర్చనంబును మౌనంబును నాసనజయంబును
స్థైర్యంబును బ్రాణవాయు స్వవశీకరణంబును నింద్రియ నిగ్రహ
రూపంబైన [2]ప్రత్యాహారంబును మనంబుచే నింద్రియంబుల విష
యంబులవలన మరలించి హృదయమందు నిలుపుటయు దేహగతం
బైన మూలాధారాదిస్థానంబులలో నొక్కస్థానంబునందు హృదయ
గతంబయిన మనస్సుతోడం గూడఁ బ్రాణధారణంబును వైకుంఠుం
డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలా చరిత్రధ్యానంబును
మానసైకాగ్రీకరణంబును బరమాత్ముఁడగు పద్మనాభుని సమానా
కారతయును నిదియునుంగాక తక్కిన వ్రతదానాదులం జేసి మనోదుష్టం
బయినయసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోజించి
శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై యభ్యస్తకుశాజినచే
లోత్తరాసనంబైన యాసనంబు సేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును
[3]గుంభక [4]రేచక [5]పూరకంబులం గోశశోధనంబు సేసి కుంభకపూరకంబుల

1 అస్తేయము = దొంగతనములేమి. 2 ప్రత్యాహారము = విషయములవలన నింద్రియములను మరపించుట. 3 కుంభకము = ఊపిరిబిగపట్టుట. 4 రేచకము = ఊపిరి విడుచుట. 5 పూరకము = ఊపిరిని పూరించుట.

చేతం బ్రతికూలంబుగా వించి చంచలంబయిన చిత్తంబును స్థిరంబుగా వించి
తీవ్రంబయిన యమంబును బ్రతిష్టంబయి విగత సమస్తదోషంబగు
[1]చామీకరంబు కరణి విరజంబు సేసి జితమారుతుండగు యోగికిం గ్ర
మ్మఱం బ్రాణాయామంబును పావకుని చేత వాత పిత్త శ్లేష్మంబులను
దోషంబుల భస్మీకరణంబు సేసి ధారణంబు చేతం గిల్బిషంబులను
బ్రత్యాహారంబు చేత సంసర్గంబులను దహనంబు సేసి ధ్యానంబు చేత
రాగంబుల సత్త్వాదిగుణంబులను నివారించి స్వనాసాగ్రావలోక
నంబు సేయుచు. 918

సీ. దర [2]దరవిందసుందరపత్రరుచిరాక్షు
నలలిత శ్రీవత్స కలితవక్షు
నీల [3]నీరదనీల నీలోత్పలశ్యాము
నలికులాకులమాలి కాభిరాముఁ
గౌస్తుభకలిత ముక్తాహారయుతకంఠు
యోగిమానసపంక జోపకంఠు
సతతప్రసన్న స [4]స్మితవదనాంభోజు
దినకరకోటి సందీప్త తేజు

తే. సలలితానర్ఘ్య రత్నకుండలకిరీట
హారకంకణకటక కేయూరముద్రి
కాతులాకోటిభూషు భక్తప్రపోషుఁ
[5]గింకిణీయుత మేఖలా కీర్ణ జఘను. 919

వ. మఱియు. 920

సీ. కంజాతకింజల్క పుంజరంజిత [6]పీత
కౌశేయవాసు జగన్నివాసు
శత్రుభీకరచక్ర శంఖగదాపద్మ
విహిత చతుర్బాహు విగతమోహు
నతభక్తలోక మనోనేత్ర వర్ధిష్ణు
లాలిత సద్గుణాలంకరిష్ణు

---

1 చామీకరము = బంగారము. 2 అరవిందము = పద్మము. 3 నీరదము = మేఘము. 4 స్మితము = చిరునవ్వు. 5 కింకిణీ...జఘను = చిరుగంటలతో కూడు

వరకుమారకవయః పరిపాకు [1]సుశ్లోకు
సుందరాకారు యశోవిహారు

తే. సకలలోక నమస్కృత చరణకమలు
భక్తలోక పరిగ్రహ ప్రకటశీలు
దర్శనీయమనోరథ దాయి గీర్త
నీయతీర్థయశో మహనీయమూర్తి. 921

వ. వెండియు. 922

క. అనుపమగుణసంపూర్ణుని, ననఘుని సుస్థితుని గతుని వాసీను శయా
నుని [2]భక్తహృద్గుహాశయ,నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్

మ. విమలంబై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞానతత్త్వ ప్రబో
ధమతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబుగావించి చి
త్తము సర్వాంగవిమర్శన క్రియలకుం దార్కొల్పి ప్రత్యంగముల్
సుమహాధ్యానము సేయఁగావలయుఁబో శుద్ధాంతరంగంబులన్. 924

వ. అది యెట్టిదనిన 925

సీ. హలకులిశాంకుశ జలజధ్వజచ్ఛత్ర
లాలితలక్షణ లక్షితములు
సలలితనఖచంద్ర చంద్రికా [3]నిర్ధూత
భక్తమానస [4]తమః పటలములును
సురుచి [5]రాంగుష్ఠనిష్ఠ్యూతగంగాతీర్థ
మండితహరజటా మండలములు
నంచితధ్యాన పారాయణ జనభూరి
కలుషపర్వతదీప్త [6]కులిశములును

తే. దాసలోకమనోరథ దాయకములుఁ
జారుయోగి మనఃపద్మ షట్పదములు
ననఁగఁ దనరినహరి చరణాబ్జములను
నిరుపమధ్యానమునమది నిలుపవలయు. 926

---

1 సుశ్లోకుఁడు = కీర్తిగలవాఁడు. 2 భక్త...శయను = భక్తులహృదయమను గుహాయందు శయనించువానిని. 3 నిర్ధూత = ఎగురకొట్టబడిన. 4 తమః = చీకటి. 5 అంగుష్ఠనిష్ఠ్యూతము = బొటనవ్రేలుచే త్రోయబడినది. 6 కులిశము=వజ్రాయుధము

చ. [1]కమలజుమాతయై [2]సురనికాయసమంచిత సేవ్యమానయై
కమలదళాభ నేత్రములు గల్గి హృదీశ్వర భక్తినొప్పు న
[3]క్కమల [4]నిజాంకపీఠమునఁ గైకొని యొత్తు పరేశు [5]జానుయు
గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁ దగున్. 927

ఉ. చారు [6]విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమానసు
శ్రీరుచి నుల్లసిల్లి [7]యతసీకుసుమద్యుతిఁ జాలనొప్పు పం
కేరుహనాభు [8]నూరువు [9]లకిల్బిషభక్తి భజించి మానసాం
భోరుహమందు నిల్పఁదగుఁ బో మునికోటికి నంగనామణీ. 928

క. [10]పరిలంబితమృదు పీతాం,బర [11]కాంచీగుణనినాద భరితంబగు న
ప్పురుషోత్తముని[12]నితంబముఁ,దరుణీభజియింపవలయుఁదద్దయుఁ బ్రీతిన్.

క. విను భువనాధారత్వం,బునఁ దగి విధిజనన హేతుభూతంబగు న
వ్వనజాతముచేఁ గడు మిం,చిన హరినాభీసరస్సుఁ జింతింపఁదగున్. 930

తే. దివ్య మరకతరత్నసందీప్తలలిత
కుచములను మౌక్తికావళిరుచులఁ దనరి
యిందిరాదేవిసదనమై యెసక మెసఁగు
వక్ష మాత్మను దలపోయవలయుఁ జుమ్ము. 931

మ. నిరతంబున్ భజియించుసజ్జనమనోనేత్రాభిరామైకసు
స్థిరదివ్యప్రభ గల్గుకౌస్తుభరుచి శ్లిష్టంబునై యొప్పు నా
వరయోగీశ్వర[13]వంద్యమానుఁ డగు సర్వస్వామి లక్ష్మీశు[14]కం
ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబు సేయం దగున్. 932

క. ఘనమందరగిరిపరివ,ర్తన[15]నికషోజ్జ్వలితకనక[16]రత్నాంగదముల్
దన రార లోకపాలకు, లను గలిగినబహుశాఖలను దలఁపఁ దగున్.

---

1 కమలజుఁడు = బ్రహ్మ. 2 సురనికాయము = దేవతలసమూహము. 3 కమల=లక్ష్మీదేవి. 4 నిజాంకము = తనతొడ. 5 జానుయుగ్మము = మోకాళ్ళజంట. 6 విహంగవల్లభుఁడు = గరుత్మంతుఁడు. 7 అతసీకుసుమద్యుతి = నూనెయవిసెపువ్వుయొక్క కాంతి. 8 ఊరువు = తొడ 9 అకిల్బిషము = దోషముకాని. 10 పరిలంబిత = వ్రేలాడుచున్న. 11 కాంచీగుణనినాదము=మొలనూలిధ్వని. 12 నితంబము= పిరుదు. 13 వంద్యమానుఁడు = నమస్కరింపదగినవాడు. 14 కంధరము = మెడ.

వ. మఱియు [1]విమతజనాసహ్యంబు లైన [2]సహస్రారంబులు గలుగు సుదర్శనంబును సరసిజోదరకరసరోరుహంబందు రాజహంసరుచిరం బయిన [3]పాంచజన్యంబును [4]నరాతిభటశోణితకర్దమలిప్తాంగం బై భగవత్ప్రీతికారిణి యగు [5]కౌమోదకీయును బంధురసుగంధగంధానుబంధమంథరగంధవ [6]హాహూయమానపుష్పంధయ ఝుంకారనినద విరాజితం బైన వైజయంతీవనమాలికయును జీవతత్త్వం బైన కౌస్తుభమణియును బ్రత్యేకంబ ధ్యానంబు సేయం దగు వెండియు భక్తసంరక్షణార్థం బంగీకరించు దివ్యమంగళవిగ్రహంబున కనురూపంబును మకరకుండలమణినిచయమండిత [7]ముకురోపమాననిర్మలగండమండలంబును సంతతశ్రీనివాసలోచన పంకజకలితంబును లాలితభ్రూలతా [8]జుష్టంబును మధుకరసమానరుచి [9]చికురవిరాజితంబును నైన ముఖకమలంబు ధ్యానంబు గావింప వలయు మఱియు శరణాగతుల కభయప్రదంబు లగుచు నెగడుపాణిపంకేరుహంబుల మనంబునం దలంప వలయు. 934

క. గురుఘోరరూపకం బై, పరఁగెడుతాపత్రయం బుపశమింపఁగ శ్రీహరిచేత నిసృష్టములగు,కరుణాలోకములఁదలఁపఁ గాఁ దగు బుద్ధిన్

క. ఘనరుచి గలమందస్మిత,మునకనుగుణమగుప్రసాదమును జిత్తమునన్ మునుకొని ధ్యానము సేయం, జను యోగిజనాళి కెపుడు సౌజన్యనిధీ.

తే. పూని [10]నతశిరు లైనట్టి భూజనముల
శోకబాష్పాంబుజలధి[11]సంశోషకంబు
నత్యుదారతమము హరిహాస మెపుడుఁ
దలఁపఁగావలె నాత్మలోఁదవిలి వినుము. 937

సీ. మునులకు [12]మకరకేతనునకు మోహానం
బైన స్వకీయమాయావిలాస

---

1 విమతజనాసహ్యము = దుష్టజనులకు సహింపరానిది. 2 సహస్రారంబులు = వేయియాకులుగలది. 3 పాంచజన్యము = విష్ణునిశంఖము. 4 అరాతి...అంగంబు = శత్రుభటుల రక్తమను బురదచే పూయఁబడిన శరీరము గలది. 5 కౌమోదకి = గద. 6 ఆహూయహూన=పిలువఁబడిన. 7 ముకురము = అద్దము. 8 జుష్టము = సేవింపఁబడినది. 9 చికురములు = వెంట్రుకలు 10 నత = వంగిన. 11 సంశోషకము = ఎండఁజేయునది. 12 మకరకేతనుఁడు = మన్మథుఁడు.

మున రచితం బైన భ్రూమండలంబును
మునిమనఃకుహర సమ్మోహదమానుఁ
డగునీశ్వరుని మందహాసంబు నవపల్ల
వాధర కాంతిచే నరుణ మైన
మొల్లమొగ్గలకాంతి నుల్లసం బాడెడు
దంతపంక్తిని మదిఁ దలఁప వలయు
తే. వెలయు నీరీతి నన్నియు వేఱువేఱ
సంచితధ్యాననిర్మల స్థానములు గ
మనములోఁ గను మని చెప్పి మఱియుఁ బలికె
దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ. 938

సీ. ఈప్రకారమున సర్వేశ్వరునందును
బ్రతిలబ్ధభావసంపన్నుఁ డగుచుఁ
జిరతరసద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన
యతిమోదమునఁ బులకితశరీరుఁ
డగుచు మహోత్కంఠ నానంద బాష్పముల్
జడిగొనఁబరితోషజలధిఁ గ్రుంకి
భగవత్స్వరూప మై భవగుణగ్రాహక
మగుచు మత్సంబంధ మనుకరించి
తే. సుమహితధ్యానమునఁ బరంజ్యోతియందు
మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు
మోక్షపద మాత్మలోన నపేక్ష సేయు
ననఘవర్తనుఁ డైన మహాత్ముఁ డెప్పుడు. 939

వ. అది గావున ముక్తి నపేక్షించుమహాత్ముం డగు వానిచిత్తంబు విముక్తం బైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతరశూన్యం బై విరక్తిం బొందుటం జేసి పురుషుండు శరీరభావంబుల ననన్యభావం బగు నిర్వాణపదంబు సూక్ష్మం బగు తేజంబు దనకంటె నధికం బగు తేజంబుతోడిసమానాకారంబు నగు చందంబు నిచ్ఛగించు వెండియు. 940

సీ. పురుషుఁడు చరమ మై భువి నన్యవిషయని
వృత్తమై తగ నివర్తించు చిత్త
వృత్త్యాదులను గల్గి వెలయంగ నాత్మీయ
మగుమహిమ సునిష్ఠుఁడై లభించు
సుఖదుఃఖముల మనస్సునఁ దలంపక యహం
కారధర్మంబులుగాఁ దలంచి
యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వము గల్గు
నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు

తే. లతఁడు నేచందమున నుండు ననిన వినుము
తనశరీరంబు నిలుచుటయును జరించు
టయును గూర్చుండుటయు నిఁ కేమియు నెఱుంగ
కర్థి వర్తించు విను తల్లి యతఁడు మఱియు. 941

వ. [1]మదిరాపానంబునం జేసి మత్తుం డగు వాఁడు దనకుఁ [2]బరిధానం బగు నంబరంబు మఱచి వర్తించుచందంబునఁ దనశరీరంబు దైవాధీనం బని [3]నశ్వరం బని తలంచి యాత్మతత్త్వనిష్ఠుం డై యుపేక్షించు నదియునుం గాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబు గలవాఁ డయి స్వాప్నికశరీరంబుచందంబున యావత్కర్మఫలానుభవపర్యంతంబు పుత్రదారసమేతం బగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాదిసంబంధంబువలనం బాసి వర్తించు. 942

సీ. సుతదారమిత్రానుజులకంటె మర్త్యుండు
భిన్నుఁడై వర్తించుచున్నరీతి
[4]విస్ఫులింగోల్ముకవిపుల ధూమములచే
[5]హవ్యవాహనుఁడు వే ఱయినరీతి
వల నొప్పు దేహంబువలన నీజీవాత్మ
పరికింప భిన్నరూపమున నుండుఁ

---

1 మదిర = కల్లు. 2 పరిధానము = కట్టుపుట్టము. 3 నశ్వరము = నశించునది. 4 విస్ఫులింగము = నిప్పుకణము. 5 హవ్యవాహనుఁడు = అగ్ని.

దవిలి భూ తేంద్రియాంతఃకరణంబుల
భాసిల్లు చున్న యాప్రకృతిరూప
తే. బ్రహ్మమున కాత్మ దా[1]బృథగ్భావ మగుచు
ద్రష్ట యయి బ్రహ్మసంజ్ఞచేఁ దనరు చుండు
నఖిలభూరిప్రపంచంబు లందుఁ దన్నుఁ
దవిలి తనయందు నఖిల భూతములఁ గనుచు. 943
వ. వెండియు. 944
సీ. వరుస [2]ననన్యభావంబులఁ జేసి భూ
తావళియందుఁ దదాత్మకత్వ
మునఁ జూచు నాత్మీయ ఘనతరోపాదాన
ములయందుఁ దవిలి యిమ్ముల వెలుఁగు
నిట్టి దివ్యజ్యోతి యేక మయ్యును బహు
భావంబులను దోఁచు ప్రకృతి గతుఁడు
నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవతి
ర్యఙ్మనుష్య స్థావ రాది వివిధ
తే. యోనులను భిన్న భావంబు నొందుటయును
జాలఁగల్గు నిజగుణ వైషమ్యమునందును
భిన్నుఁడై వెల్గుఁగావునఁ బేర్చి యదియు
దేహసంబంధి యగుచు వర్తించుచుండు. 945
క. భావింప సదసదాత్మక, మై వెలయుచు దుర్విభావ్యమగుచు స్వకీయం
బై వర్తించుచుఁ బ్రకృతిని, భావమునఁదిరస్కరించుభవ్యస్ఫూర్తిన్.
వ. ఈయాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించు నని కపిలుం డెఱింగిం చిన విని దేవహూతి వెండియు నిట్లనియె మహాత్మా మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితి వింక నీప్రకారంబున సాంఖ్యంబు నందు నిరూపింపంబడునట్టి ప్రకారంబును భక్తియోగమాహాత్మ్యం బును బురుషుండు భక్తియోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగునట్టి

1 పృథగ్భావము = వేరుభావము. 2 అనన్యభావము = ఇతరములందు లేని

యోగంబును బ్రాణిలోకంబునకు సంసారం బనేకవిధం బయి యుండుఁ గావునఁ బరాపరుండవై కాలస్వరూపివై నసీస్వరూపంబును నేనీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుండుదురు మిథ్యాభూతం బైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తం బైనబుద్ధిం జేసి విభ్రాంతుం డగుచు సంసారస్వరూపం బగు మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుం డైనజనునిఁ [1]బ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతియ్య వలయు ననిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె. 947

—♦ కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియఁజేయుట. ♦—

క. నలినాయతాక్షి విను జనములఫలసంకల్పభేదమునఁ జేసి మదిం
గలభక్తియోగమహిమం, బలవడఁగ ననేకవిధములనఁదగునవియున్.

వ. వివరించెదఁ దామసరాజససాత్త్వికాదిభేదంబులం ద్రివిధంబై యుండు నందుఁ దామసభక్తి ప్రకారం బెట్టి దనిన. 949

తే. సతతహింసాతిదంభమాత్సర్యరోష
తమములను జేయుచును భేదదర్శియగుచుఁ
బరఁగనాయందుఁగావించుభక్తిదలఁప
దామసం బనఁదగు వాఁడు తామసుండు. 950

క. ఘనవిషయప్రావీణ్యము, లను సుమహైశ్వర్యయశములను బూజాద్య
ర్చాని నను నర్థి భజించుట, చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ.

చ. అనుపమపాపకర్మ పరిహారముకై భజనీయుఁడైన శో
భనచరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితరయోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్. 952

చ. మనుసుత మద్గుణశ్రవణ మాత్రలభించినయట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడన్ బరమేశ్వరుండనై

---

1 ప్రబోధించు = మేలుకొలుపు.

తనరిన నన్నుఁ జెందిన [1]యుదాత్తమనోగతు లవ్యయంబులై
వననిధి[2]గాము లైన[3]సురవాహినిఁ బోలె ఫలించు నిమ్ములన్. 953

క. హేయగుణరహితుఁడనఁగల, నాయందులభక్తిలక్షణముఁ దెలిపితినక్
బాయక నిర్హేతుకముగఁ, జేయు మదీయవ్రతైక చిరతరభక్తిన్.

వ. నిష్కామము లయిన మదీయభక్తులకు నట్టిభక్తియోగంబు సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబుగావున మహాత్ములగు వారు నిజమనోరథఫలదాయకంబు లయిన మదీయ సేవావిరహితంబు లయిన యితరకర్మంబు లాచరింప నొల్లరు దీని నాత్యంతిక భక్తియోగంబని చెప్పుదురు సత్త్వరజస్తమో గుణ విహీనుండయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని చెప్పి మఱియు నిట్లనియె. 955

సీ. నిత్యనైమిత్తిక నిజధర్మమున [4]గురు
శ్రద్ధాగరిష్ఠతఁ జతురపాంచ
రా [5]త్రోక్తహరిసమారాధనక్రియలను
నిష్కామనంబున నెఱి మదీయ
విగ్రహదర్శనవినుతిపూజావంద
నధ్యానసంశ్రవణములఁ గర్మ
సంగి గాకుండుట సజ్జనప్రకరాభి
మానంబు నొందుట హీనులందుఁ

తే. జాల [6]ననుకంపసేయుట సములయందు
మైత్రి నెఱపుట యమనియమక్రియాది
యైనయోగంబుచేత నాధ్యాత్మికాధి
భౌతికాదులఁ దెలియుట పలుకుటయును. 956

వ. మఱియును. 957

క. హరిగుణమంగళకీర్తన, పరుఁడై తగ [7]నార్జవమున భగవత్పరులం
గరమనురక్తి భజించుట, నిరహంకారముననుంట నిశ్చలుఁడగుటన్.

---

1 ఉదాత్తము = అధికము. 2 గామి = పోవునది. 3 సురవాహిని = గంగ. 4 గురుశ్రద్ధ = అధికశ్రద్ధ. 5 ఉక్తము = చెప్పఁబడినది. 6 అనుకంప = దయ. 7 ఆర్జవము = ఋజుమార్గము.

క. ఇవి మొదలు గాఁగఁ గలుగుభ, గవదుద్దేశస్వధర్మకలితుం డై వీ
నివలనఁ బరిశుద్ధగతిఁ, దవిలినమది గలుగుపుణ్యతముఁ డెయ్యెడలన్.

తే. గురుతరానేకకల్యాణగుణవిశిష్టుఁ
డనఁగ నొప్పిన నన్నుఁ బొందు నండ గొనక
పవనవశమునఁ బుష్పలపరిమళంబు
ఘ్రాణమున నావరించినకరణి మెఱసి. 960

చ. అనిశము సర్వభూతహృదయాంబుజవర్తి యనం దనర్చునీ
శు నను [1]నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁ డేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్.

సీ. అబ్జాక్షి నిఖలభూతాంతరాత్ముఁడనైన
నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి [2]మాయావులై సతతంబుఁ
బాయక వైరానుబంధ నిరతు
లగువారి మనములఁ దగులదు శాంతి యొ
న్నటికైన నేను నా కుటిలజనుల
మానక యెపుడు సామాన్యాధికద్రవ్య
సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థి నాచిత్తమున [3]ముదం బందకుండు
ననుచు నెఱింగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలితసద్గుణజటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ
దల్లితోడ గుణవతీమతల్లితోడ. 962

సీ. తరళాక్షి విను మచేతన దేహములకంటెఁ
[4]జేతన దేహముల్ శ్రేష్ఠ మందుఁ
బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు
గలుగు చైతన్య వృక్షములకంటె
ఘనరస జ్ఞాన సంకలిత చేతను లుత్త
ములు రసజ్ఞానంబు గలుగువాని

1 అవజ్ఞ = నిర్లక్ష్యము. 2 మాయావులు = కపటులు. 3 ముదము = సంతోషము.

కంటె గంధజ్ఞాన కలితభృంగంబులు
గడు శ్రేష్ఠములు వానికంటె శబ్ద
తే. వేది లగుదురు శ్రేష్ఠులై వెలయుశబ్ద
విదులకంటెను సద్రూప [1]వేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్ వానికంటె
వరుస [2]బహుపాదు లుత్తముల్ వారికంటె. 963

క. తలఁపఁ జతుష్పదు లధికులు, బలకొనిమఱి వారికంటెఁ బాదద్వయముం
గలమనుజు[3]లలఘుతము లి,మ్ముల వారలయందువర్ణములునాల్గరయన్.

వ. అందు. 965

సీ. తలఁప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను
వేదవేత్తలు వేదవిదులకంటె
విలసిత వేదార్థవిధులు వారలకంటె
సమధిక శాస్త్రసంశయము మాన్పు
మీమాంసకులు మఱి మీమాంసకులకంటె
నిజధర్మవిజ్ఞాన[4]నిపుణు లరయ
వారికంటెను[5]సంగవర్జితచిత్తులు
దగ వారికంటె సద్ధర్మపరులు
తే. ధార్మికులకంటె నుత్తమోత్తములు వినుము
మత్సమర్పిత సకలధర్మ స్వభావ
మహిమములు గల్గి యితరధర్మములు విడిచి
సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు. 966

వ. అట్టివాని. 967

క. కని సకలభూతగణములు, మనమున నానందజలధిమగ్నములగుచున్
ఘనబహుమాన[6]పురస్సర, మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్.

వ. అంత నీశ్వరుండు జీవస్వరూ[7]పానుప్రవిష్టుండై యుండు నట్టి భగ
వంతుం జూచి భక్తియోగంబున నేని యోగంబున నేనిఁ బురుషుండు

---

1 వేదులు = తెలిసికొనునవి. 2 బహుపాదులు = అనేకపాదములుకలవి.
3 అలఘులు = గొప్పవారు. 4 నిపుణులు = సమర్థులు. 5 సంగవర్జితచిత్తులు= సంన్యసించిన మనస్సుగలవారు. 6 పురస్సరము = ముందుకొనుట. 7 అనుప్రవిష్టుఁడు= ప్రవేశించినవాఁడు.

పరమాత్మంబొందుఁ బ్రకృతిపురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైనదైవంబు నై కర్మవిచేష్టితం బగుచు నుండు నదియు భగవద్రూపం బిట్టి భగవద్రూపంబు భేదాస్పదంబగుచు నద్భుతప్రభావంబు గలకాలం బనియుఁ జెప్పంబడు నట్టి కాలంబు మహదాది తత్త్వంబులకును మహత్తత్త్వాభిమానులగు జీవులకును [1]భయావహం బగుటం జేసి సకలభూతంబులకు నాశ్రయంబగుచు సంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రహించుచు యజ్ఞఫలప్రదాత గావున [2]వశీకృతభూతుండై ప్రభుత్వంబు భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు నతనికి మిత్రుండును శత్రుండును బంధుండును లేఁ డట్టి విష్ణుండు సకలజనంబులయం దావేశించి యప్రమత్తుండై [3]ప్రమత్తు లయిన జనంబులకు సంహారకుండై యుండు నతనివలని భయంబునం జేసి వాయువు వీచు సూర్యుండు దపియించు నింద్రుండు వర్షించు నక్షత్రగణంబు వెలుంగుఁ జంద్రుండు ప్రకాశించుఁ దత్తత్కాలంబుల వృక్షలతాదు లోషధులతోడం గూడి పుష్పఫలభరితంబు లగు [4]సరిత్తులు ప్రవహించు సముద్రంబులు మేరలుదప్పక యుండు నగ్ని ప్రజ్వలించు భూమి గిరులతోఁగూడ బరువునఁ గ్రుంగ వెఱచు నాకాశంబు సకలజనంబులకు నవకాశం బిచ్చు మహత్తత్త్వంబు జగత్తునకు నంకురస్వరూపంబు గావున సప్తావరణావృతంబగు లోకంబును స్వదేహంబు విస్తరింపంజేయు గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు నియోగింపంబడి ప్రతిదినంబు నయ్యయిసర్గంబు సేయ నప్రమత్తులై యుండుదురు పితరులు పుత్రోత్పత్తిఁ జేయుదురు [5]కాలుండు మృత్యుసహాయుండై [6]మారకుండై యుండుఁ జరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనంబై యుండునని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె. 969

క. నెఱి నిట్టినిఖిలలోకే, శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె వ్వరికిని గలుగదు మేఘము, [7]గరువలివిక్రమముఁ దెలియఁగాలేనిగతిన్.

---

1 భయావహము = భయముగలుగఁజేయునది. 2 వశీకృతభూతుఁడు = వశ్యము చేసికొనబడినవాఁడు. 3 ప్రమత్తుఁడు = శరీరము మఱచినవాఁడు. 4 సరిత్తులు = నదులు. 5 కాలుఁడు = యముఁడు. 6 మారకుఁడు = చంపువాఁడు. 7 కరువలి = గాలి.

క. మగువా విను సుఖహేతుక, మగునర్థము దొరకమికి మహాదుఃఖము సం
దగులుదు రిది యంతయు నా, భగవంతుని యాజ్ఞఁ జేసి ప్రాణులు మఱియున్.

సీ. పూని యసత్యంబులైన గృహక్షేత్ర
పశు ధన సుత వధూ బాంధవాది
వివిధవస్తువులను ధ్రువముగా మది నమ్మి
వఱలు దుర్మతియగు వాఁడు జంతు
సంఘాతమగు దేహ సంబంధమున నిల్చి,
యర్థి నన్యోన్యయోనులందుఁ జొరఁగ
ననుగమించును వానియందు విరక్తుండు
గాక యుండును నరకస్థుఁడైన

తే. దేహి యాత్మీయదేహంబు దివిరి వదల
లేక తనకది పరమ సౌఖ్యాకరంబు
గాఁగ వర్తించు నదియును గాక యతఁడు
దేవమాయావిమోహిత భావుఁడగుచు. 972

క. ఘనముగఁ బుత్రవధూపశు, ధనగృహరక్షణమునందుఁ దత్క్రియలన్
మనమునఁ దలపోయుచు దిన, దినముం దందహ్యమాన దేహుండగుచున్.

క. అతిమూఢహృదయుఁడగుచు దు, రితకర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ
కృతగోప్యభాషణములను, సుతలాలనభాషణములఁ జొక్కుచు మఱియున్.

క. విను మింద్రియపరవశుఁడై, మును కొని తత్కూటధర్మములు గల దుఃఖం
బనయము సుఖరూపంబుగ, మనమునఁ దలపోసి తదభిమానుండగుచున్.

క. సతతముఁ దమతమసంపా, దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు
త్సితమతి హింసలు సేయుచు, నతిమూఢమనస్కుఁ డగుచు నాత్మజనములన్.

తే. పూని రక్షించుచును వారి భుక్తశేష
మనుభవించుచు నంత జీవనము వోవఁ
గడఁగి మఱి మఱి యపరార్థకాముఁ డగుచు
సత్త్వ మెడలి కుటుంబపోషణమునందు. 977

సీ. బలిమిసాలక మందభాగ్యుఁడై [1]కుమతియై
పూని యప్పుడు క్రియాహీనుఁ డగుచుఁ

1 కుమతి = దురాత్ముడు.

దవిలి వృథా ప్రియత్నంబులు సేయుచు
మూఢుఁ డై [1]కార్పణ్యమునఁ జరించు
నట్టి[2]యకించనుఁ డగువానిఁ జూచి త
ద్దారసుతాదు లాత్మలను వీఁడు
గడు నశక్తుఁడు పోషింపఁగాఁ జాలఁ డితఁ డని
[3]సెగ్గింతు రర్థిఁ గృషీవలుండు
తే. [4]బడుగు ముసలెద్దు రోసిన పగిది నంత
నతఁడు నేవెంటలను సుఖం బంద లేక
తాను బోషించుజనులు దగ్గ దనరఁ బోవ
బ్రిదుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప. 978

క. [5]వెడరూపుఁదాల్చి బాంధవు,[6]లడలఁగని ర్యాణమునకు నభిముఖుఁ డై యి
ల్వెడలఁగఁ జాలక శునకము,వడువునఁగుడుచుచును మేను వడవడవడఁకన్.

సీ. అతిరోగపీడితుఁ డై మందమగు జఠ
రాగ్నిచే మిగుల [7]నల్పాశి యగుచు
మొఱసి వాయువుచేత మీఁదికి నెగసిన
కన్నులు కఫమునఁ గప్పఁబడిన
నాళంబులను గంఠనాళంబునను ఘుర
ఘురమను శబ్దంబు దొరయ బంధు
జనులమధ్యంబున శయనించి బహువిధ
ములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక
తే. చటులతర కాలపాశ వశంగ తాత్ముఁ
డగుచుబిడ్డలఁ బెండ్లాము నరసిపోషించు
చింతవికలములైన [8]హృషీకములును
గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁడగుచు. 980

వ. అంత మరణావస్థం బొందు సమయంబున నతి భయంకరాకారులు
సరభసేక్షణులునగు యమదూత లిద్దఱు దనముందఱ నిలిచినంజూచి

---

1 కార్పణ్యము = లోభము. 2 అకించనుఁడు = దరిద్రుఁడు. 3 సెగ్గింతురు = అసహ్యించుకొందురు. 4 బడుగు = అశక్తుఁడు. 5 వెడరూపు = పిచ్చిరూపము. 6 అడలగ = భయపడగ. 7 అల్పాశి = కొంచెము భుజించువాడు. 8 హృషీకములు =

[1]త్రస్తహృదయుండై [2]శకృన్మూత్రంబులు విడుచుచు యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనా శరీరంబు నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమంబగు మార్గంబును బొంది రాజభటులచే [3]నీయమానుండగుచు దండనంబున కభిముఖుండై చను నపరాధి చందంబునం జనుచుండి, 981

చ. అనయము మూర్ఛనొందు శునకావళిచేతను భక్ష్యమానుఁడై
యనుపమ కాలకింకర భయంకరతర్జన గర్జనంబులన్
మనము గలంగ దేహము సమస్తముఁ గంపము వొందఁగాఁ బురా
తన భవపాపకర్మ సముదాయముఁ జిత్తములోఁ దలంచుచున్. 982

సీ. అనుపమ క్షుత్తృష్ణ [4]లంతర్వ్యథలఁ జేయ
ఝంఝా[5]నిలజ్వాల[6]జ్వలనచండ
భానుప్రదీప్తి తప్తంబైన [7]వాలుకా
మార్గానుగత[8]తప్యమానగాత్రుఁ
డై వీఁపుఁ [9]గశలచే నడువంగ వికలాంగుఁ
డగుచు మార్గమునందు నచట నచటఁ
జాల మూర్ఛిల్లి యాశ్రయశూన్యమగు నీళ్ల
మునుఁగుచు లేచుచు మొనసి పాప

తే. రూప మయిన తమముచే నిరూఢుఁ డగుచు
వెలయఁ దొంబది తొమ్మిది వేలయోజ
నములదూరంబు గల యమనగరమునకుఁ
బూని యమభటుల్ గొంపోవఁ బోవునంత. 983

వ. ఇట్లు మహాపాపాత్ముం డైన వాఁడు ముహూర్తత్రయకాలంబునను సామాన్యదోషి యగువాఁడు ముహూర్తద్వయంబునను నేఁగి యాతనం బొందు నందు. 984

క. పట్టుదురు కొఱవులను వడిఁ, బెట్టుదు[10]రసిపత్త్రికలను బెనుమంటల యం
దొట్టుదు రొడళ్లు నలియఁగ, మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్.

---

1 త్రస్త = భయపడిన. 2 శకృత్తు = మలము. 3 నీయమానుఁడు = తీసికొనిపోఁబడినవాఁడు. 4 అంతర్వ్యథలు = లోపలిబాధలు. 5 అనిలము = గాలి, 6 జ్వలనము = అగ్ని. 7 వాలుక = ఇసుక. 8 తప్యమానము = తపింపఁబడినది. 9 కశ =

ఉ. ముంతురు [1]తప్తతోయముల ముంచుదు రుగ్రగదాసిధారలం
జెంతురు పొట్టవ్రేవులు వధింతురు మీఁద [2]నిభేంద్రపంక్తి [3]త్రొ
ప్పింతురు ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు మీఁద గుండ్లు దినిపింతురు దేహముఁ గోసి కండలన్.

వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుం
డై భూతద్రోహంబున నతిపాపుం డై నిరయంబునుం బొంది నిజధనం
బులు గోలుపడి మొఱవెట్టు నాపన్నునిచందంబునం బరస్పరసంబంధం
బునఁ గల్పింపంబడిన తమిస్రాంధతామిస్ర రౌరవాదులగు నరకంబు
లంబడి తీవ్రంబులయిన బహు యాతనల ననుభవించి క్షీణపాపుం
డై పునర్నరత్వంబునుం బొందునని చెప్పి వెండియు నిట్లనియె. 987

—♦ కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమంబుఁ దెలుపుట. ♦—

సీ. కైకొని మఱి పూర్వ కర్మానుగుణమున
శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు
[4]ఘటకుండుగావునఁ గ్రమ్మఱజీవుండు
దేహసంబంధంబుఁ దివిరి తాల్ప
దొరఁకొని పురుష రేతోబిందుసంబంధి
యై వధూగర్భంబునందుఁ జొచ్చి
కైకొని యొకరాత్రిఁ [5]గలిలంబు పంచరా
త్రముల [6]బుద్బుదమును దశమదివస

తే. మందుఁ [7]గర్కంధు వంతయా నంతమీఁదఁ
[8]బేశియగు నంతమీఁదటఁ బేర్చియుండ
కల్పమగు నొక్క నెల మస్తకమును మాస
[9]యుమళ మైనను గరచర ణములుఁబొడము. 988

వ. మఱియు మాసత్రయంబున నఖరోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రం
బులును గలిగి నాలవమాసంబున సప్తధాతువులును బంచమమాసం

1 తప్తతోయము = వేడినీరు. 2 ఇభేంద్రపంక్తి = ఉత్తమములగు ఏనుగుల
సముదాయము. 3 త్రొప్పింతురు = త్రొక్కింతురు. 4 ఘటకుఁడు = చేయువాడు.
5 కలిలము = ఎరుంగరానిది. 6 బుద్బుదము = బుడగ. 7 కర్కంధువు = రేగుపండు.

బున క్షుత్తృష్ణలనుగలిగి షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లి కుక్షిని దక్షిణభాగమునం దిరుగుచు మాతృ భుక్తాన్నపానంబులవలనఁ దృప్తింబొందుచు నేధమాన ధాతువులుగల్గి జంతుసంకీర్ణంబగు విణ్మూత్ర గర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణలవణక్షారామ్లా[1]ద్యుల్బణంబులై నరసంబులచేతఁ బరితప్తాంగుం డగుచు జరాయువునఁ గప్పంబడి బహిఃప్రదేశంబునందు [2]నాంత్రంబులచేత బద్ధుండై కుక్షియందు శిరంబు మోపికొని [3]భుగ్నం బైన పృష్ఠ గ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుండగుచుఁ బంజరంబునం దుండు శకుంతంబు చందంబుననుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వజన్మ దుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించు నంత నేడవ నెలయందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి [5]విట్క్రిమిసోదరుండై యొక్కదిక్కున నుండక సంచరించుచుం బ్రసూతిమారుతంబులచేత నతివేపితుం డగుచు యాచమానుండు దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండు నగుచు బంధన భూతంబగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలిపుటుండు దీనవదనుండునై జీవుండు దానెవ్వనిచే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు. 989

—♦ గర్భస్థుం డగుజీవుండు భగవంతుని స్తుతియించుట ♦—

క. అనయమును భువనరక్షణ, మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడివి
ష్ణుని భయవిరహితమగుపద, వనజయుగం బర్థిఁ గొల్తు వారనిభక్తిన్

వ. అదియునుం గాక పంచభూతవిరహితుఁ డయ్యుం బంచభూతవిరచితంబైనశరీరంబునందుఁ గప్పంబడి యింద్రియగుణార్థ చిదాభాసజ్ఞానుండైన నేను. 991

సీ. ఎవ్వఁడు నిఖలభూతేంద్రియమయ మగు
మా [6]యావలంబనమహితకర్మ

1 ఉల్బణము = పొంగు. 2 ఆంత్రము = ప్రేగు. 3 భుగ్నము = వంగినది.

బద్ధుఁడై వర్తించుపగిది దండహ్యామా
సం బగు జీవచింతనమునందు
సవికారమై శుద్ధమై యఖండజ్ఞాన
మున నుండు వానికి ముఖ్యచరితు
నకు నకుంఠితశౌర్యునకుఁ బరంజ్యోతికి
సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ
తే. గడఁగియుఁ బ్రకృతిపురుషులకంటెఁ బరముఁ
డయినవానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్రభీకరగర్భనరక
వేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు. 992

సీ. అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ
మహితాత్మ యెవ్వని మహిమచేత
ఘనమోహాత్ములై గుణకర్మనిమిత్తసాం
సారికమార్గసంచారములను
[1]ధృతి సెడి యలసి యేదిక్కు నెఱుంగక
హరిపదధ్యానంబు నాత్మ మఱచి
యుండువారలకు నేయుక్తియు నమ్మహా
పురుషుననుగ్రహబుద్ధి లేక
తే. తద్గుణధ్యాన తన్మూర్తి దర్శనములు
గోచరించుట యెట్లు నాకును బ్రబోధ
కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలుఁ డనియె
నంబతోడను సుగుణ[2]కదంబతోడ. 993

వ. అట్టి యీశ్వరుండు గాలత్రయంబునందును జంగమస్థావరాంతర్యామి యగుటం జేసి జీవకర్మమార్గంబులం బ్రవర్తించువారు తాపత్రయ నివారణంబుకొఱకు భజియింతు రని చెప్పి మఱియు నిట్లనియె. 994

క. జనయిత్రి గర్భమందును
ఘనకృమివిణ్మూత్రరక్తగర్తములోనఁ

1 ధృతి — ధైర్యము. 2 కదంబము = సమూహము.

ముసుఁగుచు జఠరాగ్నిని దిన
దినమును దంతప్యమాన దేహుండగుచున్. 995

ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు
వలన నిర్గమింపఁ దలఁచి చనిన
నెలల నెన్నికొనుచు నెలకొనిగర్భంబు
వలన వెడలఁ ద్రోయువారు గలరె. 996

వ. అని తలంచుచు దీనరక్షకుం డయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునింజేయ నమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయ లేమికి నంజలిమాత్రంబు సేయందగునట్టి జీవుండనైన నేను శమదమాదియుక్తంబైన శరీరంబునందు విజ్ఞాన దీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతు నని మఱియు నిట్లనియె. 997

సీ. నెలకొని బహుదుఃఖములకు నాలయ మైన
యీగర్భనరకము నేను వెడలఁ
జాల బహిఃప్రదేశమునకు వచ్చిన
ననుపమ దేవ మాయా విమోహి
తాత్ముండనై ఘోరమైనట్టి సంసార
చక్రమందును బరిభ్రమణశీలి
నై యుండ వలయుఁ దానది గాక గర్భంబు
నం దుండు శోకంబు [1]నపనయించి

తే. యాత్మ కనయంబు సారథి యైనయట్టి
రుచిర విజ్ఞానమునఁ దమోరూప మైన
భూరిసంసారసాగరోత్తారణంబు
సేసి యీయాత్మనరసి రక్షించుకొందు. 998

వ. మఱియును. 999

చ. పరఁగుచు నున్నదుర్వ్యసన [2]భాజనమై ఘనదుఃఖమూల మై
యరయఁగఁ బెక్కుతూంట్లుగలదై క్రిమిసంభవ మైనయట్టి దు
స్తరబహుగర్భవాసములసంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరిభవసాగర [3]తారక పాదపద్మముల్. 1000

---

1 అపనయించి=తీసివేసి. 2 భాజనము=మూలము. 3 తారకము = దాటించునది.

క. అని కృతనిశ్చయుఁడయి యేఁచినవిమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం
బున వెడల నొల్లకుండం, జనియెడు నవమాసములును జననీ యంతన్.

వ. దశమమాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాసనిశ్వా
సంబులు లేక ఘనదుఃఖభాజనుండును విగతజ్ఞానుండును [1]రక్తదిగ్ధాం
గుండునై విష్ఠాస్థకిమియుంబోలె నేలం బడి యేడ్చుచు జ్ఞాన
హీనుండై జడుండునుంబోలె నుండి యంత నిజభావానభిజ్ఞు లగు
నితరులవలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం జెప్పనేరక
యనేకకీటసంకులం బయిన పర్యంకంబునందు శయానుండై యవ
యవంబులు [2]గండూయమానంబులైనఁ గోఁక నేరక [3]యాసనో
త్థానగమనంబుల నశక్తుండై తన శరీరచర్మంబు మశకమత్కుణ
మక్షికాదులు వొడువఁ గ్రిములచే వ్యథంబడు క్రిమియుంబోలె
దోధూయమానుండై రోదనంబు సేయుచు విగతజ్ఞానుండై మెలం
గుచు శైశవంబునం దత్తత్క్రియానుభవంబుఁగావించి పౌగండ
వయస్సునఁ దదనురూపంబు లగునధ్యయనాది దుఃఖంబు లనుభవించి
తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన నభిమతార్థఫల ప్రాప్తికి
సాహస పూర్వంబు లగు వృథాగ్రహంబులు సేయుచుఁ బంచ
మహాభూతారబ్ధం బగు దేహంబందుఁ బెక్కుమాఱు లహంకార
మమకారంబులం జేయుచుఁ దదర్థంబులైన కర్మంబు లాచరించుచు
సంసారబద్ధుం డగుచు దుష్పురుషసంగమంబున శిశ్నోదరపరాయ
ణుండై వర్తించుచు నజ్ఞానంబునంజేసి [4]వర్ధిష్యమాణ రోషుం
డగుచుఁ దత్ఫలంబులగు దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై
నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తించుచుండు
మఱియును. 1002

సీ. జనయిత్రి సత్యంబు శౌచంబు దయయును
ధృతియు మానంబు బుద్ధియును సిగ్గు
క్షమయును యశమును శమమును దమమును
మొదలుగాఁగల గుణంబులు నశించు

---

1 రక్తదిగ్ధాంగుఁడు = రక్తముచేఁబూయఁబడిన శరీరముకలవాఁడు. 2 కండూయ
మానములు = దురదకలవి. 3 ఆసనో...గమనములు - కూర్చుండుట, లేచుట, నడచుట.
4 వర్ధిష్యమాణము = వృద్ధిపొందుచున్న.

జనుల క[1]సత్సంగమున నని యెఱిఁగించి
　　　　వెండియు నిట్లను వినుము మూఢ
హృదయులు శాంతివిహీనులు దేహాత్మ
　　　　బుద్ధులు సంగనా మోహపాశ
తే. బద్ధకేళీమృగంబుల పగిదిఁ దగిలి
పరవశస్వాంతముల [2]శోచ్యభావులైన
వారిసంగతి విడువంగవలయు నందు
నంగనా సంగమము దోష మండ్రు గాన. 1003

వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దనకూఁతురయిన భారతి [3]మృగీరూపధారిణియై యుండంజూచి తదీయ రూపరేఖావిలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుం డును విగత[4]త్రపుండును నై తాను మృగరూపంబునొంది [5]తదను ధావనంబు [6]హేయంబని తలంపక ప్రవర్తించెం గావున నంగనా సంగమంబు వలవ దస్మదీయ నాభీకమలసంజాత చతుర్ముఖనిర్మిత మరీచాద్యు[7]ద్భూత కశ్యపాదికల్పిత దేవమనుష్యాదులందు మాయా బలంబునం గామినీజనమధ్యంబున [8] విఖండితమనస్కుండు గాకుండ బుండరీకాక్షుండైన నారాయణఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదని వెండియు నిట్లనియె. 1004

తే. రూఢి నామాయ గామినీ రూపమునను
బురుషులకు నెల్ల మోహంబుఁ బొందఁజేయుఁ
గాన పురుషులు సతుల సంగంబుమాని
యోగవృత్తిఁ జరించుచు నుండవలయు. 1005

క. ధీరతతో మత్పదసర, సీరుహ సేవానురక్తిఁ జెందినవారల్
నారీసంగము [9] నిరయ, ద్వారముగామనములందుఁదలఁపుదు రెందున్
క. హరిమాయావిరచితమై, తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్విన[10]బం
ధురతృణపరివృతకూపము,కరణినదియుమృత్యురూపకంబగుమఱియున్.

---

1 అసత్సంగము=దుష్టసహవాసము. 2 శోచ్యము=శోకింపఁదగినది. 3 మృగీ= ఆడలేడి. 4 త్రప = సిగ్గు. 5 అనుధావనము = అనుసరించి పరుగెత్తుట. 6 హేయము= నీచము. 7 ఉద్భూతము = పుట్టినది, 8 విఖండితము = ఛేదింపఁబడినది. 9 నిరయము =

చ. ధనపశుమిత్రపుత్ర వనితా గృహకారణభూత మైన యీ
తనువున నున్న జీవుఁడు పదంపడి యట్టిశరీర మెత్తి తా
[1]ననుగతమైన కర్మఫల మందక పోవఁగ రాదు మింటఁ బో
యిన భువిఁ దూఱినన్ దిశల కేఁగిన నెచ్చటనైన డాఁగినన్. 1008

వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీసంగంబుచే [2]విత్తాపత్యగృహాదిప్రదం బగు స్త్రీత్వంబు నొందు నీ క్రమంబున నంగనారూపుం డగు జీవుండు మన్మాయచేఁ బురుషరూపంబు నొంది ధనాదిప్రదుం డగు భర్తను నాత్మబంధకారణం బగు మృత్యువునుగ నెఱుంగ వలయు మఱియు [3] జీవోపాధిభూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబుననుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవించుచు మరలం గర్మాదులం దాసక్తుఁడగుచు మృగయుండు గాననంబున ననుకూల సుఖ[4]ప్రదుండై నను మృగంబునకు మృత్యువగు చందంబున జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగియుండు నట్టిదేహ[5]నిరోధంబె మరణంబు [6]నావిర్భావంబె జన్మంబునుం గాన సకలవస్తువిషయజ్ఞానంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షు రింద్రియం బగు [7]ద్రష్టృదర్శనీయ యోగ్యతాప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవుగావున భయకార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై [8]ముక్తసంగుం డగుచు యోగవైరాగ్యయుక్తం బైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితం బైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయు నని చెప్పి వెండియు నిట్లనియె. 1009

సీ. గృహమందు వర్తించు [9]గృహమేధులగువారు
మహితధర్మార్థకామములకొఱకు

---

1 అనుగత = తగిన. 2 విత్తాపత్యములు = ధనసంతానములు. 3 ఉపాధి = కర్మచింత. 4 ప్రదుఁడు = ఇచ్చువాఁడు. 5 నిరోధము = అడ్డుబాటు. 6 ఆవిర్భావము = పుట్టుట. 7 ద్రష్ట = చూచువాఁడు. 8 ముక్తసంగుఁడు = సర్వము వదిలినవాఁడు. 9 గృహమేధులు = గృహస్థులు.

సంప్రీతు లగుచుఁ దత్సాధనా[1]నుష్ఠాన
నిరతులై వేదనిర్ణీత భూరి
భగవ త్సుధర్మ త ద్భక్తి[2]పరాఙ్ముఖు
లై దేవగణముల ననుదినంబు
భజియించుచును భక్తిఁ [3]బైతృకకర్మముల్
సేయుచు నెప్పుడు శిష్టచరితు
తే. లగుచుఁ దగ దేవపితృసువ్రతాఢ్యులయిన
కామ్యచిత్తులు ధూమాది గతులఁ జంద్ర
లోకమును జెంది పుణ్యంబు [4]లుప్తమయిన
మరలి వత్తురు భువికి జన్మంబునొంద, 1010

వ. అదియునుం గాక. 1011

తే. పరివిమలానంత [5]భోగితల్పంబునందు
యోగనిద్రాళువై హరియున్న వేళ
నఖిలలోకంబులును నిలయంబునొందు
నట్టిసర్వేశ్వరునిఁగూర్చి యలఘుమతులు. 1012

మ. పరికింపన్ నిజభక్తి యుక్తిగరిమం బాటిల్లు బంకేరుహో
దర [6]విన్యస్త సమస్తధర్ములు శాంతస్వాంతు లై సంగముం
[7]బరివర్జించి విశుద్ధచిత్తులగుచుం బంకేజపత్రేక్షణో
త్తరధర్మైకనివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్. 1013

సీ॥ మఱియు నహంకార మమకారశూన్యులై
యర్థి వర్తించుచు [8]నర్చిరాది
మార్గగతుండును మహనీయచరితుండు
విశ్వతోముఖుఁడును విమలయశుఁడు
జగదుద్భవస్థాన సంహారకారణుం
డవ్యయుం డజుఁడుఁ బరాపరుండుఁ
బురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండు
నైన సర్వేశ్వరునందుఁ బొంది

---

1 అనుష్ఠాన నిరతులు = కర్మలయందాసక్తిగలవారు. 2 పరాఙ్ముఖులు=అయిష్టులు. 3 పైతృకకర్మలు = పితృకర్మలు. 4 లుప్తము=లోపించినది. 5 భోగి=సర్పము.

తే. మాని[1]తా పునరావృత్తి మార్గమయిన
పరివిమలానంద తేజోవిరాజమాన
దివ్యపదమున సుఖియించు ధీరమతులు
మరలి రారెన్నటికిని జన్మములఁబొంద. 1014

వ మఱియుఁ బరమేశ్వరదృష్టిచే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున ద్విపరార్థావసానం బగు ప్రళయంబుదనుకఁ బరుఁడగు చతురాననుం బరమాత్మరూపంబున ధ్యానంబు సేయుచు నుండి పృథివ్యప్తేజో వాయ్వాకాశ మాన సేంద్రియ శబ్దాదిభూతాదుల తోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకల సంహర్తయగు సమయంబున గతాభిమానంబులఁగల్గి బ్రహ్మలోకవాసు లగు నాత్మలు బ్రహ్మతోడంగూడి పరమానందరూపుండును సర్వోత్కృష్టుండును నగు పురాణపురుషుం బొందుదురు గావున నీవు సర్వభూత హృదయ పద్మనివాసుండును శ్రుతానుభావుండును నిష్కళంకుండును నిరంజనుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు నొందు మని చెప్పి మఱియు నిట్లనియె. 1015

మ. సకలస్థావరజంగమ ప్రతతికిం జర్చింపఁ దా[2]నాఢ్యుఁడై
యకలంక [3]శ్రుతిగర్భుఁడుం బరముఁడు నై నట్టి యీశుండు సే
వక యోగీంద్ర కుమారసిద్ధముని దేవశ్రేణి యోగ ప్రవ
ర్తకమై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్. 1016

సీ. అట్టి సర్వేశ్వరుం డయ్యయికాలంబు
లందును దద్గుణవ్యతికరమున
జనియించు చుండు నీచాడ్పున ఋషిదేవ
గణములు దమతమకర్మ నిర్మి
తైశ్వర్య పారమేష్ఠ్యములందుఁ బురుషత్వ
మునఁబొంది యధికారములు వహించి
వర్తించి క్రమ్మఱ వత్తురు మఱి కొంద
ఱారూఢకర్మానుసార మైన

1 అపునరావృత్తి = తిరిగిరాని. 2 ఆఢ్యుఁడు=సంపన్నుఁడు. 3 శ్రుతి=వేదము.

తే. మనములను జాలఁ గలిగి ధర్మములయందు
శ్రద్ధతోఁ గూడి [1]యప్రతిషిద్ధ మైన
నిత్యనైమిత్తికాచారనిపుణు లగుచుఁ
దగి రజోగుణకలిత చిత్తములు గలిగి. 1017

వ. సకాములై యింద్రియజయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజించుచు గృహంబులయందు వర్తించి హరిపరాఙ్ముఖు లగువారు త్రైవర్గికపురుషులని చెప్పంబడుదురు. 1018

* చ. వినుతగుణోత్తరుండు నురువిక్రముఁ డైన హరిన్ భజించి త
న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముద మందుచుందురు వివేకవిహీనత నూరఁబంది యా
త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము కేఁగుచాడ్పునన్.

చ. అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం
బొలిసినవారు దొంటితమ పుత్రులకుం దగఁ దాము పుట్టి వి
హ్వలమతి గర్భగోళపత నాదిపరేత ధరాక్రియాంతమై
వెలసిన కర్మమిం దనుభవింతురు గావున నీవు భామినీ. 1020

క. విను సర్వభావములఁ బర,ముని ననఘు ననంతు నీశుఁ బురుషోత్తముస
న్మనమున భజియింపుము ముద, మునఁ బునరావృత్తి లేని ముక్తి లభించున్.

వ. అని చెప్పి వెండియు నిట్లనియె భగవంతుండగు వాసుదేవునియందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కారసాధనంబు లగు వైరాగ్యజ్ఞానంబులం జేయునట్టి భగవద్భక్తియుక్తం బైనచిత్తం బింద్రియవృత్తులచే సమంబులగు [2]నర్థంబులందు వైషమ్యంబును బ్రియాప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయో[3]పాదేయవిరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మచే

---

* చ. వినుతగుణోత్తరుండు నురువిక్రముఁడు న్నగునట్టి విష్ణుకీ, ర్తన రుచిరామృతంబు ప్రమదంబునఁ గ్రోలుట మాని దుష్కథల్, విని ముద మందువారలు వివేకవిహీనత నూరఁ బంది యా, త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము మెక్కుచాడ్పునన్.—అని పాఠాంతరము.

1 అప్రతిషిద్ధలు=నిషేధింపబడినవి. 2 అర్థములు=వస్తువులు. 3 ఉపాధేయము=
గ్రహింపదగినది

జూచుచుండు జ్ఞానపురుషుండును బరబ్రహ్మంబును బరమాత్ముం డును నీశ్వరుండు ననగు పరమపురుషుం డేకరూపంబు గలిగియుండియు దృశ్యద్రష్ట్ర కరణంబులచేతం [1]బృథగ్భావంబును బొందుచుండు నిదియ యోగికి సమగ్రంబగు యోగంబునం జేసి ప్రాప్యంబగు ఫలంబుగావున విషయవిముఖంబులగు నిద్రియంబులచేత జ్ఞాన రూపంబును హేయగుణరహితంబును నగు బ్రహ్మంబు మనో విభ్రాంతిం జేసి శబ్దాదిధర్మం బగునర్థరూపంబునం దోఁచునది యెట్టు లర్థాకారంబునం దోఁచు నని యడిగితివేని నహంకా రంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును భూతరూపంబునం బంచ విధంబును నింద్రియరూపంబున నేకాదశ విధంబును నై యుండు జీవరూపుం డగు విరాట్పురుషుండు జీవవిగ్రహం బైన యండం బగుజగంబునం దోఁచు చుండు దీని శ్రద్ధాయుక్తం బయినభక్తిచేత యోగాభ్యాసంబునం జేసి [2]సమాహితమనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండై నవాఁడు వాఁడగను చుండు నది యంతయు [3]బుధజనపూజ నీయచరిత్రవు గావున నీకుం జెప్పితి సర్వయోగసంప్రాప్యుం డగు నిర్గుణుండు భగవంతుం డని చెప్పిన జ్ఞానయోగంబును మదీయభక్తి యోగంబును నను రెండు నొక్కటియ యింద్రియంబులు భిన్నరూపం బులు గావున నేకరూపం బయిన యర్థం బనేక విధంబు లగు న ట్లేకం బగు బ్రహ్మం బనేకవిధంబులుగఁ దోఁచు మఱియును. 1022

సీ. అంబ నారాయణుం డఖిలశాస్త్రములను
 సమధికానుష్ఠిత [4]సవనతీర్థ
దర్శనజప తపోధ్యయనయోగ క్రియా
 దానకర్మంబులఁ గానఁబడక
యేచినమనము బాహ్యేంద్రియంబుల గెల్చి
 సకల కర్మ త్యాగ సరణినొప్పి
తలకొని యాత్మ తత్త్వజ్ఞానమున మించి
 యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి

1 పృథగ్భావము = వేరువిధము. 2 సమాహితము = చక్కగానుంచఁబడినది. 3బుధులు = పండితులు. 4 సవనము = యజ్ఞము.

తే. మహితఫల సంగరహిత ధర్మమునఁ దనరు
నట్టిపురుషుండు దలపోయ నఖిలహేయ
గుణములనుబాసి కల్యాణ గుణవిశిష్టుఁ
డైన హరి నొందుఁ బరమాత్మ ననఘుఁడగుచు. 1023

వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగప్రకారంబుఁ దేటపడ నెఱింగించితి నదియునుంగాక కాలరూపయగు మదీయగతి జంతువులయందు నుత్పత్తివినాశరూపంబులనుండు నవిద్యా కర్మనిర్మితంబులైన జీవునిగతు లనేక ప్రకారంబులై యుండు నదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతి యిట్టిదని యెఱుంగక యుండు ననిచెప్పి మఱియు నిట్లనియె నిట్టి యతిరహస్యంబగు సాంఖ్య యోగ ప్రకారంబు ఖలునకు నవినీతునకు [1]జడునకు దురాచారునకు డాంబికునకు నింద్రియలోలునకుఁ బుత్రదారాగారాద్యత్యంతాసక్త చిత్తునకు భగవద్భక్తిహీనునకు విష్ణుదాసులయందు ద్వేషపడువానికి నుపదేశింప వలవదు శ్రద్ధాసంపన్నుండును భక్తుండును వినీతుండును ననసూయారహితుండును సర్వభూతమిత్రుండును [2]శుశ్రూషాభిరతుండును బాహ్యార్థజాత విరక్తుండును శాంతచిత్తుండును నిర్మత్సరుండును శుద్ధాత్ముండును మద్భక్తులయందుఁ బ్రేమగలవాఁడును నన్యకాంతావిముఖుండును నిష్కాముండును నగు నధికారికి నుపదేశింప నర్హంబగు నీ యుపాఖ్యానం బేపురుషుండేనిఁ బతివ్రతయగు నుత్తమాంగనయేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పిత చిత్తంబునఁ వినఁ బఠియించు నట్టిపుణ్యాత్ములు మదీయదివ్యస్వరూపంబుఁ బ్రాపింతు రని చెప్పె నని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె నీ ప్రకారంబునం గర్దమునిదయిత యైన దేవహూతి గపిలుని వచనంబులు విని నిర్ముక్తమోహపటల యగుచు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి తత్త్వవిషయాంకితసాంఖ్యజ్ఞానప్రవర్తకం బగు స్తోత్రంబు సేయ నుపక్రమించి కపిలున కి ట్లనియె. 1024

---

1 జడుఁడు = మందబుద్ధి. 2 శుశ్రూషాభిరతుఁడు = సేవచేయుటయందాసక్తి

సీ. అనయంబు విను మింద్రియార్థమనోమయం
బును భూతచయమయంబును నశేష
భూరిజగద్బీజభూతంబును గుణప్ర
వాహకారణమును వలను మెఱయు
నారాయణాభిఖ్య నాఁ గల భవదీయ
దివ్యమంగళమూర్తి దేజరిల్లు
చారు భవద్గర్భ సంజాతుఁ డగునట్టి
కమలగర్భుండు సాక్షాత్కరింప
తే. లేక మనమునఁ గనియె నసేకశక్తి
వర్గములు గల్గి సుగుణప్రవాహరూప
మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి
కలితుఁ డై సర్వకార్యముల్ గలుగఁ జేయు. 1025
వ. అంత. 1026
తే. అతులభూరియుగాంతంబు నందుఁ గపట
శిశువ వై యొంటి [1]కుక్షినిక్షిప్త నిఖిల
భువననిలయుండవై మహాంభోధినడుమఁ
జారువటపత్త్రి తల్ప సంస్థాయి వగుచు. 1027
తే. లీల నాత్మీయపాదాంగుళీవినిర్గ
తామృతము గ్రోలినట్టి మహాత్మ నీవు
గడఁగి నాపూర్వభాగ్యంబు కతన నిపుడు
పూని నాగర్భమున నేఁడు పుట్టితయ్య. 1028
వ. అట్టి పరమాత్ముండవయిన నీవు. 1029
సీ. వరుస విగ్రహపారవశ్యంబుసనుజేసి
రఘురామ కృష్ణ వరాహ నార
సింహాది మూర్తు లంచితలీల ధరియించి
దుష్టనిగ్రహమును శిష్టపాల
నమును గావించుచు నయమున సద్ధర్మ
నిరతచిత్తులకు వర్ణింపఁదగిన

చతురాత్మతత్త్వ విజ్ఞానపరిదుఁడవై
వర్తింతు వనఘ భవన్మహత్త్వ

తే. మజునకయినను వాక్రువ్వ నలవిగాదు
²నిగమజాతంబు లయిన వర్ణింపలేవ
యెఱిఁగి సంస్తుతి సేయు నే నెంతదాన
వినుతగుణశీల మాటలు వేయునేల. 1030

వ. అదియునుంగాక. 1031

క. ధీమహిత! భవన్మంగళ, నామస్మరణానుకీర్తనము గల హీనుల్
శ్రీమంతు లగుదు ³రగ్నిష్టోమాదిక్రు దాళికంటె శుద్ధులు దలఁపన్.

వ. అదియునుంగాక. 1033

క. నీనామస్తుతి ⁴శ్వపచుం, డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికిసరి భూసురుఁడుం, గానేరఁడు చిత్రమిది జగంబులనరయన్.

ఉ. ఈవిధ మాత్మలందెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావన మైన నీగుణ కథామృత మాత్మలఁ గ్రోలి సర్వతీ
ర్థావళిఁ గ్రుంకినట్టిఫల మందుదు రంచు సమస్తవేదముల్
వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్.

వ. అది గావునఁ బరబ్రహ్మంబవును బరమపురుషుండవును బ్రత్యఙ్మనో
వి⁵భావ్యుండవును సమస్తజనపాపనివారక స్వయంప్రకాశుండవును
వేదగర్భుండవును శ్రీమహావిష్ణుండవును నగు నీకు వందనంబు లాచ
రించెద నని స్తుతియించినం బరమపురుషుండును మాతృవత్సలుండును
నగు కపిలుండు గరుణారసార్ద్రహృదయకమలుం డై జనని కిట్లనియె.

తే. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు
నైన యీయోగమార్గ మే నంబ నీకు
నెఱుఁగ వివరించి చెప్పితి నిది దృఢంబు
గాఁగ భక్తి ⁷ననుష్ఠింపు కమలనయన. 1037

---

2 నిగమజాతము = వేదసమూహము. 3 అగ్నిష్టోమము = ఇది ఒకయజ్ఞము.
4 శ్వపచుఁడు = చండాలుఁడు. 5 భావ్యుండు = భావింపబడువాడు.

క. జీవన్ముక్తి లభించుం, గావున నేమఱక తలఁపు కైకొని దీనిన్
వావిరి నొల్లని వారికిఁ, దావలమగు మృత్యుభయము, దవ్వగుసుఖమున్.

క. అని యిట్లు దేవహూతికి, మనమలరఁగఁ గపిలుఁ డాత్మమార్గం బెల్లన్
వినిపించి చనియె నని విను, రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్.

వ. అట్లు కపిలుం డేఁగిన పిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటి యైన కర్దమునిం దనయుం డైన కపిలునిం బాసి [1]నష్టవత్స యగు గోవు చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమతప స్సామర్థ్యంబున నైనయట్టి. 1040

ఉ. మానిత సౌరభ ప్రసవ మంజుల పక్వఫల [2]ప్రవాళ భా
రానత[3][4]చూతపోతవిట పాగ్రని కేతన రాజకీర స
మ్మాని సుఖానులాప పరిమండిత కర్దమ తాపసాశ్రమో
ద్యానవన ప్రదేశ కమలాకర తీర నికుంజ పుంజముల్. 1041

వ. వెండియు. 1042

సీ. అంచిత స్ఫటికమయ స్తంభదీప్తిచేఁ
గొమరారు మరకత కుడ్యములను
సజ్జాతివజ్రాలసజ్జాలరుచులచే
భాసిల్లు నీల సోపానములను
దీపించు చంద్రకాంతో[5]పల[6]వేదుల
విద్రుమ గేహాళీ విలసితముల
హాటకరత్న కవాట శోభితముల
నలరిన సౌధశాలాంగణముల

తే. వరపయః ఫేనపటల పాండుర కరీంద్ర
దంతనిర్మిత [7]ఖట్వాతి ధవళపట్ట
రచితశయ్యాళులను జతురంతయాన
కనకపీఠాదివస్తు సంఘముల నెల్ల. 1043

---

1 నష్టవత్స = దూడపోయినది. 2 ప్రవాళము = చిగురుటాకు. 3 నత = వంగిన. 4 చూతము = మామిడిచెట్టు. 5 ఉపలము = ఱాయి. 6 వేది = అరుఁగు. 7 ఖట్వము=

వ. మఱియు వికచకమలకుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధిగంధవహ శోభితంబును నరవింద [1]నిష్యందకందళిత మరందరసపానమదవదిందిందిర సందోహ ఝుంకారసంకులంబునునై చెలువారు బావులు గలిగి పురందరసుందరీనందితంబైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులైన [2]కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీ బిందుసరోవరంబులం [3]ద్రిషవణస్నానంబు గావించుచు నుగ్రతపోభారంబునం గృశీభూతశరీరయై నిజకుమారుండును బ్రసన్నవదనుండును గపిలనామధేయుండును నగు నారాయణుని సమస్తన్యస్త చింతలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపంబైన భక్తియోగంబునను నధిక వైరాగ్యంబునను యుక్తానుష్ఠానజాతంబై బ్రహ్మత్వాపాదకం బగు జ్ఞానంబునను విశుద్ధమనంబును గలిగి. 1044

సీ. అనయంబు నాత్మ నాయకుఁడును విశ్వతో
ముఖుఁ డనంతుఁడు పరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర
మహిమ [4]నిరస్త సమస్తభూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁడగు
నాపరబ్రహ్మంబునం దవిరత
బద్ధతత్త్వజ్ఞాన పరతచే నిర్ముక్త
జీవభావమున విశిష్టయోగ

తే. భవ్యసంప్రాప్తనిర్మల బ్రహ్మభావ
ములను గలిగి సమాధిచే నెలమి దనరు
నపునరావృత్తమగు త్రిగుణప్రధాన
తత్త్వములనొప్పి సంతతోదారనియతి. 1045

తే. కలలఁ దోఁచినవస్తు సంఘముల మేలు
కని కనుంగొనఁగా లేని మనుజు పోల్కిఁ
బొలఁతి దనయాత్మమఱచి యిమ్మల సధూమ
మైన [5]పావకుగతి నుండె నంతలోన. 1046

1 నిష్యందకందళిత = స్రవించుచున్నట్టియు, వికసించినట్టియు. 2 కుంతలము = వెండ్రుక. 3 త్రిషవణస్నానము = మూడుసంధ్యల స్నానముచేయుట. 4 నిరస్తము = తీసివేయఁబడినది. 5 పావకుఁడు = అగ్ని.

క. గురుయోగశక్తిచే నం, బరతలమున కెగసి సత్కృపామయుఁడగు నా
పరవాసుదేవుచరణాం, బురుహయుగన్యస్తచిత్తమును గల దగుచున్.

వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె నయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు సిద్ధపదంబను పేరంబరఁగి ప్రసిద్ధి వహించె నంత నక్కడఁ గపిలుండు దల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధచారణ గంధర్వాప్సరోముని నివహ [1]సంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణ పూజానికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగు యోగంబు నవలంబించి లోక త్రయశాంతికొఱకు సమాహితుండై స్వపితాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయ మహాముని విదురున కిట్లనియెఁ దండ్రీ యీ యుపాఖ్యానంబు నాకు గోచరించినరీతి నీకుం జెప్పితి నిది కపిల దేవహూతి సంవాదం బత్యంత పావనంబు గపిల ప్రణీతంబు నయిన యోగంబు దీనిం బరమభక్తి యుక్తుండై యెవ్వాండు పఠించు నెవ్వాండు విను నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడధ్వజుండైన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదు రని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదిమహా మునులకు నీకథావృత్తాంతంబు సెప్పిన విని సప్రహృష్టహృదయులై మునికులోత్తమా భవద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలు చుండ మామనంబులు దనివోవ దింకను దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు. 1048

చ. జనకసుతామనోవిమల సారస కోమల [2]చంచరీక చం
దన శరదిందు కుంద హార తార మరాళ పటీర చంద్రికా
వినుత యశోవిశాల రఘువీర దర స్మితపద్మపత్త్ర లో
చన [3]నిటలాంబక ప్రకటచాప విఖండన వంశమండనా. 1049

---

1 సంస్తూయమానుఁడు = స్తుతింపఁబడినవాఁడు. 2 చంచరీకము = తుమ్మెద.
3 నిటలాంబకుఁడు = శివుఁడు.

తరలము. పరమపావన విశ్వభావన బాంధవ ప్రకరావనా
శరధిశోషణ సత్యభాషణ సత్కృపామయభూషణా
దురితతారణ సృష్టికారణ దుష్టలోకవిదారణా
ధరణిపాలన ధర్మశీలన దైత్యమర్దనఖేలనా. 1050

మాలిని. దివిజగణశరణ్యా దీపితానంతపుణ్యా
ప్రవిమలగుణజాలా భక్తలోకానుపాలా
భవతిమిరదినేశా భానుకోటిప్రకాశా
కువలయహితకారీ ఘోరదైత్యప్రహారీ. 1051

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు విదురనీతియు విదురుని తీర్థాగమనంబును యుద్ధవ సందర్శనంబును గౌరవ యాదవ కృష్ణాది నిర్యాణంబును గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు విదుర మైత్రేయసంవాదంబును జగదుత్పత్తిలక్షణంబును మహదాదుల సంభవప్రకారంబును మహదాదులు నారాయణు నభినందించుటయు విరాడ్విగ్రహప్రకారంబును శ్రీమహాభాగవతభక్తికారణంబగు పద్మసంభవు జన్మప్రకారంబును బ్రహ్మతపంబును బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు బ్రహ్మకృతంబైన విష్ణుస్తోత్రంబును గమలసంభవుని మానససర్గంబును బరమాణువుల పుట్టువును భూర్భువస్సువరాదిలోక విస్తారంబును గాల దివస మాస వత్సరాది నిర్ణయంబును నాయుఃపరిమాణంబును జతుర్యుగ పరిమాణంబును బద్మసంభవుసృష్టిభేదనంబును సనకాదుల జన్మంబును స్వాయంభువ మనువు జన్మంబును శ్రీహరివరాహావతారంబును భూమ్యుద్ధరణంబును సూకరాకారుండైన హరిని విధాత స్తుతియించుటయు దితికశ్యపసంవాదంబును గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయుఁ గశ్యపు వలన దితి గర్భంబు ధరియించుటయుఁ దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు సనకాదులు వైకుంఠంబున కరుగుటయు నందు జయవిజయుల కలిగి సనకాదులుశపించుటయు శ్రీహరి దర్శనంబును

బ్రాహ్మణప్రశంసయు సనకాదులు హరిని నుతించుటయు హిరణ్య కశిపుహిరణ్యాక్షులజన్మ ప్రకారంబును హిరణ్యాక్షుని దిగ్విజయంబును సవనవరాహహిరణ్యాక్షులయుద్ధంబును బ్రహ్మస్తవంబును హిరణ్యాక్షు వధయు నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు హరి వరాహావతార విసర్జనంబు సేయుటయును దేవతిర్యఙ్మనుష్యాదులసంభవంబును గర్దమమహామునితపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ గర్దముండు స్వాయంభువమనుపుత్రి యైన దేవహూతిం బరిణయం బగుటయు దేవహూతిపరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజ యోగకలితం బగు విమానంబునందు నిలిచి సహస్రదాసీపరివృత యైన దేవహూతిం గూడి భారతాదివర్షంబులు గలయం గ్రుమ్మరుటయు దేవహూతి గర్దమునివలనఁ గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ దత్కన్యకా వివాహంబులును గర్దమునితపోయాత్రయు గపిల దేవహూతిసంవాదంబును శబ్దాదిపంచతన్మాత్రల జన్మ ప్రకారంబును బ్రహ్మాండోత్పత్తియు విరాట్పురుషకర్మేంద్రియపరమాత్మ ప్రకారంబును బ్రకృతి పురుషవివేకంబును నారాయణుని సర్వాంగ స్తోత్రంబును సాంఖ్యయోగంబును భక్తియోగంబును జీవున కైన గర్భసంభవ ప్రకారంబును జంద్రసూర్యమార్గంబును బితృమార్గంబును దేవహూతినిర్యాణంబును గపిల మహాముని దపంబునకుం జనుటయు నను కథలం గల తృతీయస్కంధము. 1052

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

శ్రీమదాంధ్ర

# భాగవతము

బమ్మెర పోతనామాత్య విరచితము

## అష్టమ స్కంధము

లఘుటీక


శ్రీ కవిశేఖర అబ్బరాజు
హనుమంతరాయశర్మ పాకయాజిగారు


పీఠిక


శ్రీ శేషాద్రి రమణ కవులు
శతావధానులు, హనుమకొండ.



వాణీనికేతనము
గాంధీనగరం — బెజవాడ.

1940


ఇతరులకు రు 1-0-0. సభ్యులకు స్కంధము 1 కి రు 0-9-0

# పీఠిక



శ్రీ కైవల్యముఁ గోరి భాగవతముం జిత్రోక్తి బద్ధంబుగా
లోకప్రీతి మెయిన్ రచించితివి నీలోనున్న విజ్ఞానముం
మా కర్పించితి వద్వితీయకవితా మాధుర్యధారాసుధా
సేకంబుం బొనరించి; నిశ్చలతపస్వీ పోతరాజాగ్రణీ.

పోతనామాత్యుని భాగవతభాగములలోఁ గవితాపరిణతి నొందినది అష్టమ స్కంధము. ఇందలి గజేంద్రమోక్షణము వామనచరిత్రము ఆంధ్రసోదరుల రసనాంచలమునఁ దాండవించుచున్నవి. గజేంద్రుని యాక్రందనము, బలిచక్రవర్తి మహాత్యాగశీలము, వామనుని యమాయిక జీవితనటనము, విశ్వరూపవిజృంభణము ఆంధ్ర వాఙ్మయమున నితరమహాకవులెవ్వరు చూపని చూపింపఁజాలని పవిత్రదృశ్యములు. ఈ స్కంధమునందు శ్రీపోతరాజు కవితాప్రవాహము ఆంధ్రవాఙ్మయవీరక్షేత్రమున నెట్లు ప్రవహించినదియు మూలమునలేని క్రొమ్మెఱుంగులు తెలుఁగుకయితచెలికి నెటు లలవరించినదియుఁ దెలిసికొనుట ప్రకృతము గాకపోదు.

శ్రీశుకులతోఁ బరీక్షిన్మహారాజు సప్తమస్కంధపరిమితమగు భాగవతకథలు జెప్పిన పిమ్మటఁ దనివినొందక యిట్లు ప్రశ్నించెను 'దేశికోత్తమా! నాకు స్వాయంభువ మనువు వంశమును బూర్తిగా నెఱింగించితివి, వర్ణాశ్రమధర్మముల తెఱంగు నివేదించితివి. మిగిలిన మనువుల చరిత్రముల వివరింపుము. భగవానుఁ డగు శ్రీహరి యేయే మన్వంతరములలో నేయేయవతారములు ధరించి ధర్మోద్ధరణము లోకోద్ధరణము నొనరించెనో ప్రకృత మేమి చేయుచున్నాఁడో ముం దేమి చేయనున్నాఁడో యాజ్ఞయిమ్మని కోరెను. అందులకు బ్రహ్మవిదగ్రగణ్యుఁ డగు శుకమహర్షి యిట్లు చెప్పెను. ఇంతకు మున్ను స్వాయంభువమనువును గూర్చి వివరించితిని గదయ్యా! స్వాయంభువునకు దేవహూతియందుఁ గపిలుఁ డుదయించినకథ వినిపించితిని. ఆకూతియందు యజ్ఞుఁ డను పేర శ్రీహరి యుదయించిన యంశము జెప్పుదును. మొదటి మనువు స్వాయంభువుఁడు. రెండవమనువు స్వారోచిషుఁడు. మూఁడవ మనువు ఉత్తముఁడు, నాలుగవ మనువు తామసుఁడు. అపుడె హరిమేధునకు హరిణియందు శ్రీహరి జనించి "గ్రాహబద్ధుఁడైన గజరాజు విడిపించి ప్రాణభయమువలనఁ బాపి కాచె" ఇట్లు శ్రీశుకులు చెప్పఁగా గజేంద్రమోక్షణకథ పరీక్షిత్తు వివరింపఁ గోరెను. ఇదియ అష్టమస్కంధము నందలి కథాంశమున కారంభము. సంగ్రహరూపముగాఁ దక్కిన మనుష్యులవృత్తాంతములతోఁ గూడఁ బదునాలుగురు మనుష్యుల వృత్తాంతములు అష్టమస్కంధములో సభివర్ణితము లయ్యెను. అష్టమస్కంధములో ముఖ్యములగు ఘట్టములు మూఁడు. మొదటిది గజేంద్రమోక్షణము, రెండవది క్షీరసాగరమథనము. మూఁడవది మత్స్యావతారకథనము. సంస్కృతమున ఇరువదినాలుఁగుసర్గములతో నున్న అష్టమస్కంధమును రసవత్తరముగాఁ బెంచఁదగినచోటులఁ బెంచి 745 పద్యములలోఁ గవికులమూర్ధన్యుఁ

దగు శ్రీబమ్మెరపోతరాజు సులలితముగాఁ దెలిఁగించెను. ఇందు ఉత్తపూరణములు ప్రక్షిప్తములు నంతగా లేవు.

పోతనామాత్యుఁడు గజేంద్రుఁడు విహరించిన యరణ్యమును వర్ణించుటలోఁ గొంతస్వాతంత్ర్యము జూపినాఁడు. మూలములోఁ ద్రికూటపర్వతపు లోయయగు ఋతుమంతమను వరుణుని యుద్యానవనము కథాస్థానము. పోతనామాత్యుఁడో త్రికూటమునే కథారంగముగాఁ గైకొని తనవర్ణనావైచిత్రిచే శైలారణ్యముల నుద్యానవనములకంటెఁ జక్కఁగఁ దిద్దినాఁడు. కిన్నరకింపురుషాదుల సంగీతములచే గుహలు మాఱుమ్రోగుచుండఁ బరసింహధ్వనులుగా భావించి యచటిసింగములు దిశలుమాఱుమ్రోగునట్లు గర్జించుచుండెనని (౨-౬) మూలమునుండె సింహసంకులదేశములు గజవిహారరంగములుగా నుంట స్వభావవిరుద్ధమని దానినివిడిచి పోతనఔచితి కాపాడినాఁడు. వనవర్ణనమునందు మూలములోని యలఁతిపలుకుల నొక్కొక దీర్ఘసమాసములో విశదీకరించి ప్రకృతిసిద్ధసౌభాగ్యపరంపరల నందు నించి మృదుమధురరచనాచాతుర్యముచే భయంకరారణ్యమును గజరాజములక్రీడోద్యానముగాఁ బోతన మార్చివేసినాఁడు.

యూథనాయకుఁడగు గజేంద్రుని వనవిహారము, మధుకరముల శృంగారవిచేష్టితములు వనగజముల జలక్రీడావిహారములు మకరివిజృంభణము వ్యాససృష్టిలో లేని యపూర్వకల్పనములు. గజేంద్రునకును మకరికిని జరిగిన సంగ్రామము గజేంద్రుని ప్రతిఘటనప్రయత్నము మకరివిజృంభణము వర్ణించుటలోఁ బోతనామాత్యుఁడు మూలము లేని స్వతంత్రరచనము నెంతయొ యలరించి తనకవితానైపుణ్యము నొక్కమాఱు తుదముట్టునట్లు చూపించినాఁడు. కాననే గజేంద్రమోక్షణము మూలముకంటె రమణీయతరము. విపులము.

గజేంద్రుని యార్తపరిదేవనమునందలి స్తోత్రము సర్వమతములవారికిని ననుసంధింపదగు వేదాంతార్థప్రతిపాదకము. భక్తిపారవశ్యమునఁ బోతన మూలముకంటె రసవంతముగ మనోజ్ఞముగఁ గరుణభూయిష్ఠముగ దానినిఁ దెలిఁగించినాఁడు.

“ తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య ... ... ...”

అను మూలమును దీసికొని పోతరాజు తన హృదయమున నాఁటిభగవల్లీలావిలాసాదికములు వైకుంఠధామమునందలి లక్ష్మీనారాయణుల శృంగారక్రీడాదికములు నూహించి

“ అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

యను పద్యము మొదలుకొని గజేంద్రరక్షణమువఱకును గల రసవత్తరఘట్టము నంతయు నపూర్వరచనాచాతుర్యముతో అనన్యసామాన్యప్రసంగసన్నివేశములతో నత్యద్భుతముగాఁ బెంచి పోతన తనకవితాపాటవమును విజృంభింపఁ జేసినాఁడు.

" అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దాపల " అను వఱకుఁ బోతరాజు లిఖించి యావలి భాగము వ్రాయుటకుఁ దోఁచక యెందేనేగి కొంతతడవునకు వచ్చి మిగిలినభాగము పూర్తి సేయఁబోవ నంతకుమున్నె యది పూర్తి చేయఁ బడి యుండెను. ఎవ రిది పూర్తి చేసిరని యాశ్చర్యావిష్టుఁడై పోతన తనపుత్రిక నడుగఁ దండ్రీ! ఇంతకుమున్నె గదా! మీరువచ్చి లిఖించి పోయినది. అని ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు పోతరాజు పుత్రికను జూచి తల్లీ! ఇంతకుముందుఁ బద్యభాగమును రచించినది నేను గాదు. భగవానుఁడే నావేషమున వచ్చి పద్యము ముగించి పోయి నాఁడు. అజ్ఞానినగుటచే నాకీశ్వరసందర్శనభాగ్యము కలుగలేదు. నీవే ధన్యురాల వని పుత్రిని గొండాడెను. మూలములో లేని యాపద్యముల కల్పనము భగవద్రచిత మని యాంధ్రలోకమునందు నేఁటికిని ఆస్తికసత్తములు విశ్వసించుచున్నారు.

శ్రీహరి గజేంద్రరక్షణమునకు సంరంభమున "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడు " తానొంటిగ బయలువెడలెనని పోతన రచింప శ్రీనాథుఁడు పరిహసించుటయుఁ బోతరాజు ప్రతిక్రియారూపమున భగవంతునకుఁగల యార్తావన సంరంభము వెల్లడించుటయు నాంధ్రసోదరులు పరంపరగా నేఁటికిఁ జెప్పుకొందురు

ఈఘట్టమునందుఁ గలపద్యములన్నియు నమూల్యరత్నములు. గజరాజు విహ రించు సరోవరమును అర్థాలంకారముచేఁ గుసుమకోమలినిగాఁ బోతన మార్చినాడు. (చూ 50 వచనము) పంకజాకరమును శ్లేషానుప్రాణితముగ విచిత్రభంగి నభివర్ణించి నాఁడు. అంతియగాదు లక్ష్మీదేవి శ్రీవిష్ణుని ప్రయాణసంరంభము తిలకించి పడినతొట్రు పాటు మనోజ్ఞతరము.

" క. అడిగెదనని కడువడిజను
   నడిగిన దనుమగుడ నుడువడని నడ యుడుగున్
   వెడ వెడ సిడిముడి తడఁబడ
   నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు వెడలన్."

ఇందు లక్ష్మీదేవి సహజముగ్ధలక్షణము లభివర్ణితములు. అంతియెగాదు. వృత్త్యనుప్రాసము. అందు సర్వలఘుకందము. ఇటులె పోతన భావప్రచురణమునకుఁ జిత్రకవితాకౌశలమునకు రసవత్తరములగు ఘట్టములలోఁ దావెసంగి " నేనందఱ మెప్పింతుఁ గృతుల నయ్యెయెడలన్ " అను ప్రతిజ్ఞను గల్పనమునఁ బరవశుఁడయ్యును మఱువలేదు.

అష్టమస్కంధములో మోహినీవర్ణనము, దేవాసురసంగ్రామము, ఈశ్వరుని మోహింపఁజేయు మోహినిశృంగారలీలలు, " అబలా పోకుము పోకుమేయనుచు "

డగు శ్రీబమ్మెరపోతరాజు సులలితముగాఁ దెలిఁగించెను. ఇందు ఉపస్తారణములు ప్రక్షిప్తములు నంతగాలేవు.

పోతనామాత్యుఁడు గజేంద్రుఁడు విహరించిన యరణ్యమును వర్ణించుటలోఁ గొంతస్వాతంత్ర్యము జూపినాఁడు. మూలములోఁ ద్రికూటపర్వతపు లోయయగు ఋతుమంతమన వరుణుని యుద్యానవనము కథాస్థానము. పోతనామాత్యుఁడో త్రికూటమునే కథారంగముగాఁ గైకొని తనవర్ణనావైచిత్రిచే శైలారణ్యముల నుద్యానవనములకంటెఁ జక్కఁగఁ దిద్దినాఁడు. కిన్నరకింపురుషాదుల సంగీతములచే గుహలు మాఱుమ్రోగుచుండఁ బరసింహధ్వనులుగాభావించి యచటిసింగములు దిశలుమాఱుమ్రోగునట్లు గర్జించుచుండెనని (౨-౬) మూలమునను౦డ సింహసంకులదేశములు గజవిహారరంగములుగా నుంట స్వభావవిరుద్ధమని దానినివిడిచి పోతనఔచితి కాపాడినాఁడు. వనవర్ణనమునందు మూలములోని యలఁతిపలుకుల నొక్కొకదీర్ఘసమాసములో విశదీకరించి ప్రకృతిసిద్ధసౌభాగ్యపరంపరల నందు నించి మృదుమధురరచనాచాతుర్యముచే భయంకరారణ్యమును గజరాజములక్రీడోద్యానముగాఁ బోతన మార్చివేసినాఁడు.

యూథనాయకుఁడగు గజేంద్రుని వనవిహారము, మధుకరముల శృంగారవిచేష్టితములు వనగజముల జలక్రీడావిహారములు మకరివిజృంభణము వ్యాసస్పష్టిలో లేని యపూర్వకల్పనములు. గజేంద్రునకును మకరికిని జరగిన సంగ్రామము గజేంద్రుని ప్రతిఘటనప్రయత్నము మకరివిజృంభణము వర్ణించుటలోఁ బోతనామాత్యుఁడు మూలము లేని స్వతంత్రరచనము నెంతయొ యలరించి తనకవితానైపుణ్యము నొక్కమాఱు తుదముట్టునట్లు చూపించినాఁడు. కావనే గజేంద్రమోక్షణము మూలముకంటె రమణీయతరము. విపులము.

గజేంద్రుని యార్తపరిదేవనమునందలి స్తోత్రము సర్వమతములవారికిని ననుసంధింపదగు వేదాంతార్థప్రతిపాదకము. భక్తిపారవశ్యమునఁ బోతన మూలముకంటె రసవంతముగ మనోజ్ఞముగఁ గరుణభూయిష్ఠముగ దానినిఁ దెలిఁగించినాఁడు.

> " తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః
> స్తోత్రం నిశమ్య ... ... ..."

అను మూలమును దీసికొని పోతరాజు తన హృదమున నాఁటిభగవల్లీలావిలాసాదికములు వైకుంఠధామమునందలి లక్ష్మీనారాయణుల శృంగారక్రీడాదికములు నూహించి

> " అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
> పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
> త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
> హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

యను పద్యము మొదలుకొని గజేంద్రరక్షణము వఱకును గల రసవత్తరఘట్టము నంతయు నపూర్వవచనాచాతుర్యముతో అనన్యసామాన్యప్రసంగసన్నివేశములతో నత్యద్భుతముగాఁ బెంచి పోతన తనకవితాపాటవమును విజృంభింపఁ జేసినాఁడు.

" అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దాపల " అను వఱకుఁ బోతరాజు లిఖించి యాపలి భాగము వ్రాయుటకుఁ దోఁచక యెండసోఁగి కొంతతడవునకు వచ్చి మిగిలినభాగము పూర్తిసేయఁబోవ నంతకుమున్నె యది పూర్తిచేయఁ బడి యుండెను. ఎవరిది పూర్తిచేసిరని యాశ్చర్యావిష్టుఁడై పోతన తనపుత్రిక నడుగఁ దండ్రీ! ఇంతకుమున్నె గదా! మీరువచ్చి లిఖించి పోయినది. అని ప్రత్యుత్తర మిచ్చెను. అపుడు పోతరాజు పుత్రికను జూచి తల్లీ! ఇంతకుముందుఁ బద్యభాగమును రచించినది నేను గాదు. భగవానుఁడే నావేషమున వచ్చి పద్యము ముగించి పోయినాఁడు. అజ్ఞానినగుటచే నాకీశ్వరసందర్శనభాగ్యము కలుగలేదు. నీవే ధన్యురాల వని పుత్రిని గొండాడెను. మూలములో లేని యాపద్యముల కల్పనము భగవద్రచిత మని యాంధ్రలోకమునందు నేఁటికిని ఆస్తికసత్తములు విశ్వసించుచున్నారు.

శ్రీహరి గజేంద్రరక్షణమునకు సంరంభమునఁ "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి బంధింపఁడు " తానొంటిగ బయలువెడలెనని పోతన రచింప శ్రీనాథుఁడు పరిహసించుటయుఁ బోతరాజు ప్రతిక్రియారూపమున భగవంతునకుఁగల యార్తావన సంరంభము వెల్లడించుటయు నాంధ్రసోదరులు పరంపరగా నేఁటికిఁ జెప్పుకొందురు

ఈఘట్టమునందుఁ గలపద్యములన్నియు నమూల్యరత్నములు. గజరాజు విహరించు సరోవరమును అర్థాలంకారముచేఁ గుసుమకోమలినిగాఁ బోతన మార్చినాడు. (చూ 50 వచనము) పంకజాకరమును శ్లేషానుప్రాణితముగ విచిత్రభంగి నభివర్ణించినాఁడు. అంతియగాదు లక్ష్మీదేవి శ్రీవిష్ణుని ప్రయాణసంరంభము తిలకించి పడినతొట్రుపాటు మనోజ్ఞతరము.

" క. అడిగెదనని కడువడిజను
  నడిగిన దనుమగుడ నుడువడని నడ యుడుగున్
  వెడవెడ సిడిముడి తడఁబడ
  నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు వెడలన్."

ఇందు లక్ష్మీదేవి సహజముగ్ధలక్షణము లభివర్ణితములు. అంతియెగాదు. వృత్త్యనుప్రాసము. అందు సర్వలఘుకందము. ఇటులె పోతన భావప్రచురణమునకుఁ జిత్రకవితాకౌశలమునకు రసవత్తరములగు ఘట్టములలోఁ దాఁ బ్రసంగి " నేనందఱ మెప్పింతుఁ గృతుల నయ్యెయెడలన్" అను ప్రతిజ్ఞను గల్పనమునఁ బరవశుఁడయ్యును మఱువలేదు.

అష్టమస్కంధములో మోహినీవర్ణనము, దేవాసురసంగ్రామము, ఈశ్వరుని మోహింపఁజేయు మోహినిశృంగారలీలలు, " అబలా పోకుము పోకువేయనుచు "

మోహిని వెంటఁబడు శివుని ప్రాకృతచేష్టాదికములు, అమరావతి వర్ణనములు కావ్యదృష్టితోఁ జూచిన నెంతేని విలువగలఘట్టములు. పోతరాజు సర్వజ్ఞత్వమునకు సర్వతంత్రస్వతంత్రత్వమునకు అత్యద్భుతకవితాకల్పనాశక్తికిఁ దార్కాణములు. 264, 266, 267 పద్యములు అచ్చతెనుఁగుకూర్పులతో సలరి మోహినిసౌందర్యమునకు మెఱుఁగుఁ బెట్టుచున్నవి. ఇవి మూలమునఁ గానరాని తెలుఁగు వెలుఁగులు.

వామనచరిత్రము దాదాపు ౨౯౦ పద్యములు గల యద్భుత కావ్యము. సర్వరస నిలయము. ఆంధ్రకవులలో నెవరియందును గానరాని యద్భుతప్రతిభ — అనన్యసాధ్యమగు సంభావనవైఖరి. అపూర్వమగు వర్ణనసంపత్తి యిందుఁ బ్రతిపద్యమున గోచరించును. మూలము నొక్కమాఱు చదివి లోన జీర్ణించుకొని పోతరాజీభాగమును స్వతంత్రకావ్యముగా నాటకఫక్కిగా వివిధపాత్రముల యద్భుతసన్నివేశములతో లోకోత్తరముగా వామనచరిత్రమును రచించినాఁడు. ఇందలి నాయికా నాయకులు తదితర పాత్రములు పోతన యద్భుతకవితామృతసంసిక్తులై వాఙ్మయ మున్నంతవఱకు సజీవులై యుండఁగల ధన్యాత్ములు.

వామనుఁడు కపటమెఱుఁగని ముగ్ధబాలుఁడు. బలి స్వాత్మనాశనమునకు జంకని త్యాగవీరుఁడు. తత్పత్నియగు వింధ్యావళి పత్యనుజ్ఞాతత్పరయగు ఉత్తమసాధ్వి. శుక్రుఁడు రాజనీతివేత్త. వివిధభావములుగల యిన్నిపాత్రముల నొకచో సమావేశపఱచి సంగ్రహరూపముగఁ గల్పింపబడిన మూలగ్రంథములోని కథ పోతరాజు మనోహరముగాఁ బెంచినాఁడు. బలిచక్రవర్తి నుడువులు అనర్ఘరత్నములు. కవితాగుణముచేఁ గూడ అనర్ఘరత్నములు. ప్రతిపద్యము హృద్యము. రసాస్పదము. శుక్రుఁడు బలిచక్రవర్తితో "వల దీదానము గీనము అన్నాఁడు. బలిచక్రవర్తి శుక్రునితో "రాజ్యము గీజ్యముఁ సతతమే" అన్నాఁడు "కారే రాజులు" "మీఁదై నాకరంబుంట మేల్గాదే" "ఈ చిన్నిపాపని త్రోసిపుచ్చఁగఁ జిత్త మొప్పదు" అను పద్యములలో బలిచక్రవర్తి పవిత్రజీవితము ప్రతిబింబించుచున్నది.

పురాణములందును గీతలయందును గావ్యములందును ఇతిహాసములందును విశ్వరూపవర్ణనము గలదుగాని పోతరాజువలె రసవత్తరముగా విస్మయకరముగా వ్రాసినవారు లేరు. విశ్వరూపవర్ణనములోని ఈ క్రింది పద్యములు తెలుగునందేగాదు మాతృభాషయందుఁగూడఁ గమనింపని యపూర్వభావభరితములు. అనన్యసామాన్యములు.

"ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

"రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై

ఛవిమత్కాంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్."

అ. 27

పోతనామాత్యుని కవితలో ముఖ్యముగా గోచరించు సుగుణములు. నిరర్గళమగు విచిత్రకవితాధార-పదలాలిత్యము-ప్రసాదసంపద-అంతియగాదు పాత్రముల కనువగు భాషయు వ్రాయుటలో నీతఁ డద్వితీయప్రతిభాశాలి. అంత్యనియమములు, శబ్దాలంకారచిత్రములు, మృదుమధుర సమాసములు గూర్చి యా యా ఘట్టములలో శృంగారాదిరసములకుఁ దావొసంగి కథాభాగములు రసప్రవాహములుగాఁ జేసి యాంధ్రక్షేత్రమును బవిత్రమొనర్చిన యీ కవి ధన్యుఁడు. ఇటులె యీతనికవితాసుగుణముల నెంతేని చెప్పవలసియున్నదిగాని మా స్వల్పశక్తి యీ కృషి కనువైనది కాదు.

వాణీనికేతనము ప్రచురణాధికారులు పోతనచిత్రపటముప్రచురించిన తరువాత యొకవిమర్శనము వెలువడ ప్రత్యుత్తరముతో నాగినది. పోతనామాత్యుని వర్ధంతి భాగ్యనగరవాసులు అపూర్వభక్తిశ్రద్ధలతో నొనర్చిరి. తెలుఁగుతల్లి యీ కార్యక్రమము ననుసరించిన వాఙ్మయమంతయుఁ బ్రచురించినది. పోతన నివాసస్థలచర్చ యంతరించి ఓరుగల్లువాదము నిల్చినది. "ఆలర్కాంశమమివ సర్వతః ప్రవృత్తం" అన్నట్లు మఱల భోగినీదండకము పోతనరచితము కాదని యీమధ్య నొకనిందాగర్భితవ్యాసము ప్రచురింపఁ బడినది. నిస్సారమగు నీ వ్యాసమునకు వాఙ్మయమునఁ దావేలేదు. పోతన భోగినీదండకము రచించెననుటకు మామిత్రుని యంతరాత్మ యంగీకరించుటలేదఁట. వాఙ్మయ సేవకులగు మహామహులందఱి యంతరాత్మ యంగీకరించినది. పోతరాజు సర్వజ్ఞ సింగనశమకాలికులు. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి" అను పోతనపద్యము పూర్వమాతనికి రాజులకు నింతయో యంతయో సంబంధము గలదని తెలుపుచున్నది. సర్వవిధముల భోగినీ దండకము పోతన రచితమనుటకు విశ్వసింపఁదగు పరిస్థితు లేర్పడినవి. గ్రంథాంతరమున అన్నమ యనియు దండకమున పోచమయనియు నేలయుండవలెనని విమర్శకుల వెక్కిరింపు. ఇది నామాంతరము కాఁగూడదా యని సమాధానము. దీనికి రేచెర్లవారి వంశములోఁ బూర్వులగు పురుషులకు నామాంతరములు గలవు గాని స్త్రీల కున్నవాయని విమర్శనము. ఏలయుండఁగూడదనియే సమాధానము. ఈ చర్చ సర్వథా త్యజింపఁదగినది. ఏదోమిషతో సుప్రసిద్ధులగు వీరేశలింగము పంతులువారి వ్రాఁతను అవల తన్ని వేయుచున్నానని పోతన శైవమతమవలంబింపలేదని వాదించి మఱిమెప్పింతును ఖబర్దార్ అని పేరుగల వారి నిందించి "యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవత్" అని తలంచి వివాదములోదిగు విమర్శకసోదరుని వ్రాఁతలను ఉపేక్షాదృష్టితో విడిచిపెట్టి పూర్వమువలె భోగినీదండకము పోతనకృతమనియే విశ్వసించుచున్నారము.

కవితా విలాసము,
విక్రమ సం॥ వైశాఖ
శు ౧౦ లు

ఇట్లు భాషాసేవకులు,
**శేషాద్రి రమణకవులు,**
శతావధానులు.

# విషయసూచిక



## అష్టమస్కంధము



## ఇందు చిత్రపటములు

శ్రీరస్తు

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# భాగవతము

## అష్టమస్కంధము

—o—



1మన్నామ 2పయోద
శ్యామ 3ధరాభృల్లలామ ! 4జగదభిరామా
5రామా జనకామ 6మహో
ద్దామ గుణస్తోమ ధామ ! 7దశరథరామా. 1

వ. 8మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు 9నిఖిల పురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుం డైన సూతుం డిట్లనియె నట్లు10 ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. వినఁబడియెను స్వాయంభువ మనువంశము వర్ణధర్మకర్మమర్యాదలతో
మనుజుల11దనుజుల వేల్పులజననంబులు స్రష్ట లెల్లజనియించుటయున్.

---

1 శ్రీమత్+నామ=మంగళకరమైన పేరుగలవాఁడా! 2 పయోదశ్యామ=వానమబ్బువంటి కాంతి గలవాఁడా! (రాముఁడ!) 3 ధరాభృల్లలామ=భూమిని భరించిన రాజులలో శ్రేష్ఠుఁడ! 4 జగదభిరామ = లోకమున కంతటికిఁ జక్కనయినవాఁడ! 5 రామాజనకామ=స్త్రీలోకమునకుమన్మథునివంటివాఁడా! 6మహో......ధామ=ప్రకాశించు గుణస్తోమమునకు నివాసమైనవాఁడా! 7 దశరథరామా = దశరథుని కొమరుఁడవైన రాముఁడా! 8 మహ......లు=గొప్పగుణములచేత శ్రేష్ఠమైనవారు. 9 నిఖిల...వైఖరి=అన్ని పురాణములను, వానియందలి కథలను విరివిగాఁ దెలియునట్లు యర్థమును విశదముగాఁ బలుకు విధము. 10 ప్రాయోపవిష్టుఁడు=తూర్పుకొనలుగల దర్భలపై నిలచి పుణ్యకథలు వించుఁ జావనున్నవాఁడు. 11 దనుజులు=దనువనువాని కులమునఁ బుట్టినవారు రక్కసులు.

ఉ. ఏమనుకాలమం దుహరి యీశ్వరుఁ డేటికి సంభవించె నే
మేమి యొనర్చె నమ్మనువు లేరతఁ డేక్రియఁ జేయుచున్నవాఁ
డేమి నటించు మీఁదగత మెయ్యది సజ్జనులైనవారు ము
న్నేమని చెప్పుచుందురు మునీశ్వర నాకెఱిఁగింపవే దయన్. 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

క. ఈ[1]కల్పంబున మనువులు ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో
లోకములజనులపుట్టువు[2]లాకథితములయ్యె వరుస నఖిలములు నృపా.

వ. ప్రథమమనువైన స్వాయంభువునకు నాకూతి దేవహూతులను నిరువురుఁ గూఁతులుగలరు. వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధంబు సేయుకొఱకు హరి పుత్త్రత్వంబు నొందె నందుఁ గపిలుని చరిత్రంబు మున్నఁ జెప్పంబడియె, యజ్ఞునిచరిత్రంబు సెప్పెద వినుము. 7

మ. [3]శతరూపాపతి గామభోగవిరతిన్ [4]సంత్యక్తభూభారుఁడై
సతియుం దానును గానకేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
[5]వ్రతియై [6]యేకపదస్థుఁడై నియతుఁడై [7]వాచంయమస్ఫూర్తితో
గతదోషుండు తపంబుసేసె భువనఖ్యాతంబుగా భూస్థలిన్. 8

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు తన మనంబులోన.

సీ. సృష్టిచే నెవ్వఁడు [8]చేతనపడకుండు
సృష్టి [9]యెవ్వనిచేతఁ జేజనించు
[10]జగములు నిద్రింప జాగరూకతనొంది
యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు

---

1 కల్పము=బ్రహ్మదేవుని పగటికాలము. 2 ఆకథితములు=విశదముగాఁ బలుకంబడినవి. 3 శతరూపాపతి=శతరూప పెనిమిటి (స్వాయంభువమనువు) 4 సంత్యక్తభూభారుఁడు=బొత్తిగా విడిచిన రాజ్యమువలని బరువు. 5 వ్రతి=తపోవ్రతమును బూనినవాఁడు. 6 ఏకపదస్థుఁడు=ఒంటికాలిమీఁద నిలిచినవాఁడు. 7 వాచంయమస్ఫూర్తి = మౌనుల యొక్క స్వరూపస్వభావములతో నిండినవాఁడు. 8 చేతనపడకుండు=కదలింపఁబడఁడు, లేక తెలియబడకుండు. 9 ఎవ్వనిచేత=ఏదేవుని ప్రకృతివికారకార్యము. 10 జగ ... ...చుండు = లోకములు నశింపఁగా సాక్షియై యే దేవుఁ డంతయుం దెలియునో.

నాత్మకాధారంబు ♦ నఖిలంబు 1నెవ్వఁడే
నెవ్వని నిజధనం ♦ బిందవట్టుఁ
బొడగానరాకుండుఁ ♦ బొడఁగను నెవ్వఁడే
నెవ్వనిదృష్టికి ♦ నెఱుకలేదు

ఆ. జననవృద్ధి విలయ ♦ సంగతిఁ బొందక
యెవ్వఁ డెడపకుండు ♦ నెల్లయెడలఁ
దన్మహాత్మతత్త్వ ♦ సంజ్ఞ నెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ ♦ విస్తరిల్లు. 10

వ. అని మఱియు 2నిరహంకృతుండును నిర్గతబుద్ధుండును 3నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును 4నృశిక్షాపరుండును నిజమార్గసంస్థితుండును నిఖిల ధర్మ భావనుండును నైన పరమేశ్వరునకు నమస్కరించెద నని 5యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. 11

క. రక్కసులు దినఁగఁ గడఁగిన వెక్కసముగ యజ్ఞనామ ♦ విష్ణుఁడు వారిం జక్కడిచెఁ 6జక్రధారల మిక్కుటముగ వేల్పు లెల్ల ♦ మేలనిపొగడన్.

వ. ఇది ప్రథమమన్వంతరం బింక ద్వితీయమన్వంతరంబు వినుము. 13

సీ. స్వారోచిషుం డన ♦ 7సప్తార్చిబిడ్డఁడు
మనువు వానికి నాద్యు ♦ మత్సుషేణ
రోచిష్మదాదు లా ♦ రూఢపుత్త్రులు ధాత్రి
నేలిరి రోచనుఁ ♦ డింద్రుఁ డయ్యె
నధికులు తుషితాదు ♦ లమరులూర్జస్తంబ
ముఖ్యు లాధ్యులు సప్త ♦ మునులు నాఁడు

1 ఎవ్వఁడేను=ఏ దేవుఁ డహంశబ్దవాచ్యుఁడో ? 2 నిర్ + అహంకృతుఁడు=అహంకారముఁ జెందనివాఁడు. 3 నిర్ + ఆశి=తన కేయాధారము లేనివాడు, 4 నృశిక్షాపరుఁడు=నరుల శిక్షించుటయందుఁ గోరికగలవాఁడు(జనార్దనుఁడు), 5 ఉపనిషత్ + అర్థములు=జీవునకు సంసారమునుండి విడుదల గలిగించి తానే బ్రహ్మము అను నిశ్చయము గలిగించెడి మాటలయందలి అభిప్రాయములు, 6 చక్రధారలు=చక్రము యొక్క పదనైన అంచులు, 7 సప్తార్చి బిడ్డడు = (యేడునాలుకలు గల) అగ్నికొడుకు.

వేదశిరుం డను । విప్రుని దయితకుఁ
దుషితకుఁ బుత్త్రుఁడై । తోయజాక్షుఁ
ఆ. డవతరించెను విభుఁడన నశీత్యష్టస
హస్రమునులు నధికు । లయినవారు
ఘను లనుగ్రహింపఁ । [1]కౌమారకబ్రహ్మ
చారి యగుచు నతఁడు । సలిపె వ్రతము. 14

వ. తదనంతరంబ.

సీ. మనువు మూఁడవవాఁడు । మనుజేంద్రయుత్తముం
డనఁ బ్రియవ్రతునకు । నాత్మజుండు
పాలించె నిలయెల్లఁ । బవనసృంజయయజ్ఞ
హోత్రాదు లాతని । పుత్త్రు లధిక
గుణులు వసిష్ఠుని । కొడుకులు ప్రమథాదు
లైరి సప్తర్షులు । నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు । సత్యభద్రాద్యులు
సురలు ధర్మునికిని । సూనృతకును
ఆ. బుట్టి సత్యనియతిఁ । బురుషోత్తముఁడు సత్య
సేనుఁ డనఁగ దుష్ట।శీలయుతుల
దనుజయక్షపతుల । దండించె సత్యజి
న్మిత్రుఁ డగుచు జగము । మే లనంగ. 16

## గజేంద్రమోక్షణ కథాప్రారంభము

వ. చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద. 17

సీ. మానవాధీశ్వర । మనువు నాలవవాఁడు
తామసుం డనఁగ ను।త్తముని భ్రాత
పృథ్వీపతులు కేతు । వృషనరఖ్యాత్యాదు
లతని పుత్త్రులు పదుగు । రధిక బలులు
సత్యకహరివీర । సంజ్ఞులు వేల్పులు
త్రిశిఖనామమువాఁడు । దేవ విభుఁడు

1 కౌమారక బ్రహ్మచారి=(కుమారదశ) పిల్లనడుగు కుఱ్ఱఁడు.

మునులు జ్యోతిరోమ్యామ ॥ ముఖ్యులు హరిపుట్టె
హరిమేధునకుఁ బ్రీతి॥హరిణియందు

ఆ. గ్రాహబద్ధుఁ డయిన ॥ గజరాజు విడిపించి
ప్రాణభయమువలనఁ ॥ బాపి కాచె
హరి దయాసముద్రుఁ ॥ డఖిలలోకేశ్వరుఁ
డనిన శుకునిఁ జూచి ॥ యవనివిభుఁడు. 18

క. 1నీరాటవనాటములకుఁ బోరాటం బెట్లు కలిగెఁ॥బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను ఘోరాటవిలోనిభ బ్రదర్యకుంజరమునకున్.

క. మునినాథ యీకథాస్థితి
వినిపింపుము వినఁగఁ నాకు ॥ వేడుకపుట్టెన్
వినియెదఁ గర్ణేంద్రియముల
బెనుఁబండువుసేయ మనముఁ ॥ బ్రీతింబొందన్. 20

క. ఏకథలయందుఁ బుణ్యశ్లోకుఁడు హరి సెప్పఁబడును॥ సూరిజనముచే
నాకథలు పుణ్యకథ లని యాకర్ణింపుదురు పెద్ద॥లతి హర్షమునన్.

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు బాద రాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె నట్లు శుకుండు రాజున కిట్లనియె.

సీ. రాజేంద్ర విను సుధా॥రాశిలో నొకపర్వ
తము త్రికూటం బనఁ ॥ దనరు చుండు
యోజనాయుత మగు ॥ నున్నతత్వంబును
నంతియ వెడలుపు॥నతిశయిల్లుఁ
2గాంచనాయస్సార ॥ కలధౌతమయములై
మూఁడుశృంగంబులు ॥ మొనసియుండుఁ

1 నీర్ + అట + వన + అటములన్=నీట దిరుగుడు, మొసలి, అడవి దిరుగుడులు, ఏనుగులు, 2 కాంచన + అయస్సార + కలధౌతమయములు=బంగారు, ఇనుము, ౦డిచే నిండినవి.

1దటశృంగబహురత్న ధాతుచిత్రితములై
దిశలు 2భూనభములఁ దేజరిల్లు

తే. 3భూరిభూజలతాకుంజ పుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరిగి తిరిగెడు దివ్యవిమానములును
జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి. 23

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశుపాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికా మతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును 4మణివాలుకానేక విమల5పులినతరంగిణీ సంగత విచిత్రవిద్రుమలతామహోద్యాన శుక పిక నికర నిశిత సముంచిత చంచూపుట నిర్దళిత శాఖి శాఖాంతర పరిపక్వ ఫల రంధ్ర ప్రవర్షిత రసప్రవాహబహుళంబునుఁ గనకమయ సలిల కాసార కాంచన కుముద కల్హార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకారభార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీప సంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధకోలాహల బధిరీభూత

1 తట......తములు = త్రికూటపర్వతము దరిసెత్తములందలి రత్నకాంతుల చేత అలంకరింపఁబడినవి (కర్త భూనభములు) 2 భూనభములు = భూమి ఆకాశము. 3 భూజ......ములు=చెట్లుతీగలు పొదలుయొక్క గుంపులు. 4 మణివాలుక=మణుల యొరపిడివలనఁ గలిగిన యిసుకవంటిపొడి, 5 పులినతరంగిణి=ఇసుక దిన్నెలతోడినది.

భూనభోంతరాళంబునుఁ మహీనకరకాంత మరకత కమలరాగ వజ్ర వైడూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌతమణిమయానేక శిఖర తటదరీవిహరమాణ విద్యాధరవిబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథునసంతత సరస సల్లాప సంగీతప్రసంగ మంగళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగతశమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపంబునందు. **24**

క. [1]భిల్లీ [2]భల్ల[3]లులాయక భల్లుక ఫణి ఖడ్గ గవయ / వలిముఖచమరీ
[4]ఝిల్లీ హరి శరభక [5]కిటిమల్లాద్భుత కాక [6]ఘూక / మయమగు నడవిన్.

శా. అన్యాలోకనభీకరంబులు [7]జితా/శానేక పానీకముల్
వన్యేభంబులు గొన్ని యుత్తతనులై / [8]వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున [9]భూరిభూధరదరీ/ద్వారంబులం దుండి సా
జన్యక్రీడల నీరుగాలి పడి కా/సారావగాహార్థమై. **26**

ఆ. అంధకార మెల్ల / నద్రిగుహాంతర
వీథులందుఁ బగలు / వెఱచి డాఁగి
యెడరు వేచి సంధ్య / నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ / గుహలు వెడలెఁ గరులు. **27**

క. తలఁగవు కొండల కైనను
మలఁగవు సింగముల కైన / మార్కొను కడిమిం
దలఁగవు పిడుగుల కైనను
నిల బలసంపన్నవృత్తి / నేనుఁగుగున్నల్. **28**

---

1 భిల్లీ=బోయత, 2 భిల్ల=బోయవాఁడు, 3 లులాయక=దున్నపోతు, 4 ఝిల్లీ=మిడుత, 5 కిటిమల్ల=అడవిపంది గున్న, 6 ఘూక=గుడ్లగూబ, 7 జిత + ఆశ + అనేకప + అనీకముల్=దిక్కులయందలి యేనుఁగు గుంపులం గెలిచినవి, 8 వ్రజ్యా... త్వంబునన్=గుంపుగట్టి తిరుగుటవలన గలిగిన దప్పిచేత, 9 భూరి...రంబు=పెద్దకొండ నడిమిదారులు.

సీ. పులుల మొత్తంబులు ♦ పొదరిండ్లలోఁ దూఱు
ఘోరభల్లూకముల్ ♦ గుహలుసొచ్చు
[1]భూదారములు నేల ♦ బొఱియలలోఁ డాఁగు
[2]హరిదంతములకేఁగు ♦ హరిణచయము
మహిషముల్ పొదలు ♦ మహిషసంఘంబులు
గండశైలంబులఁ ♦ గపులుప్రాఁకు
వల్మీకములు సొచ్చు ♦ [3]వనభుజంగంబులు
[4]నీలకంఠంబులు ♦ నింగికెగయు
తే. వెఱచి చమరీమృగంబులు ♦ విసరువాల
చామరంబుల విహరణ ♦ శ్రమము వాయ
భయదపరిహేల విహరించు ♦ భద్రకరుల
గాలి వాఱినమాత్రాన ♦ జాలిఁ బొందె. 29

క. మదగజదానామోదముఁ
గదలనితమకములఁ దాగి ♦ కడుపులునిండం
బొదలుచుఁ దుమ్మెదకొదముల
కదుపులు ఝుంఝు మ్మటంచు ♦ గానము సేసెన్. 30

క. తేఁటి యొకటి యొరుప్రియకును
మాటికి మాటికిని నాఁగ ♦ మదజలగంధం
బేటి కని తన్నుఁ బొందెడి
బోటికి నందిచ్చు నిండు ♦ బోఁటుదనమునన్. 31

క. అంగీకృతరంగన్మా
తంగీమదగంధ మగుచు ♦ దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల
[5]భృంగీగణ మొప్పె మ్రాని ♦ పెట్టెడిమాడ్కిన్. 32

---

1 భూదారములు=అడవిపందులు, 2 హరిత్+అంతములు = దిక్కుల చివరలు, 3 వనభుజంగములు= అడవిపాములు, 4 నీలకంఠంబులు=నల్లని మెడలుగల నెమిళ్లు, 4 రంగగంధము=ప్రకాశించెడు ఆడు ఏనుగు మదజలవాసన, 5 భృంగీగణము=ఆడు తుమ్మెదగుంపు,



శ్రీ మహావిష్ణువు గజేంద్రుని రక్షింప నేతెంచుట.

క. వల్లభలు గాజ మునుపడ
వల్లభ మని మునరి రేని గ [1]వారణదానం
బొల్లక మధుకరవల్లభు
లుల్లంబులఁ బొందిరెల్ల గ యుల్లాసంబుల్. 33

వ. అప్పుడు. 34

మ. [2]కలభంబుల్ సెరలాడు[3]బల్వలము లా గ ఘ్రాణించిమట్టాడుచున్
ఫలభూజంబులు రాయుచుం జివురుజొంపంబుల్ వడిన్ మేయుచుం
బులులం గాజనుపోతులన్ మృగములం గ బోనీక శిక్షించుచుం
గొలఁకుల్ సొచ్చి కలంచుచున్ [4]గిరులపైఁ గొబ్బిళ్లు గోరాడుచున్.

క. తుండంబుల మదజలవృత
గండంబులఁ గుంభములను గ ఘట్టన సేయం
గొండలు దలకిందై పడు
బెండుపడున్ దిశలు సూచి గ బెగడున్ జగముల్. 36

క. ఎక్కడఁ జూచిన లెక్కకు
నెక్కువయై యడవి నడచు గ నిభయూథములో
నొక్కకరినాథుఁ డెడ తెగి
చిక్కొ నొకకరేణుకోటి గ సేవింపంగన్. 37

వ. ఇట్లు వెనుక ముంగట నుభయపార్శ్వంబుల తృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగుగములం గానక తెఱంగు దప్పి తొలంగుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటం జేసి తానును దనకరేణుసముదయంబును నొక్కతెరువై పోవుచు. 38

సీ. పల్వలంబుల లేఁత గ పచ్చిక మచ్చికఁ
జెలుల కందిచ్చు న గ చ్చికము లేక
నివురుజొంపములఁ ద్రెం గ చ్చి యు పూఁగొమ్మలఁ
ప్రాణవల్లభలకుఁ గ బాలువెట్టు
ఘనదానశీతల గ కర్ణతాళంబుల
దయితల చెమటార్చుఁ గ [5]దనువు లరసి

1 వారణదానము=ఏనుగు లిచ్చెడు మదజలధారలు, 2 కలభంబుల్=ఈతువచ్చిన ఆడుఏనుగులు, 3 పల్వలములు=చిన్నమడుగులు, 4 గిరులు=కొండలు, 5 తనువులు=

మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు
నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు
తే. పిఱుఁదు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు
[1]వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు
మత్తమాతంగమల్లంబు మహిమతోడ. 39
సీ. తనకుంభములపూర్ణతకు డిగ్గి యువతుల
కుచములు పయ్యెద కొంగులీఁగఁ
దనయానగంభీరతకుఁ జాలకబలల
యానంబు లందెల సండగొనఁగఁ
దనకరశ్రీఁ గని తలఁకి బాలలచిఱు
దొడలు [2]మేఖలదీప్తిఁ దోడుపిలువఁ
దనదంతరుచి కోటి తరుణులనగవులు
ముఖచంద్రదీప్తుల ముసుఁగుదిగువఁ
తే. దనదు లావణ్యరూపంబుఁ దలఁచి చూడ
నంజనాభ్రము కపిలాది [3]హరిదిభేంద్ర
దయితలందఱుఁ దన వెంటఁ దగిలి నడవఁ
గుంభివిభుఁ డొప్పె నొప్పుల కుప్పవోలె. 40
వ. మఱియు నానాగహనవిహరణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి పిపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జనిచని. 41
మ. అటఁ గాంచెం గరిణీవిభుండు [4]నవఫుల్లాంభోజకహ్లారముఁ
[5]నటదిందీవరవారముం గమఠమీనగ్రాహదుర్వారముం
వట హింతాల రసాల సాల సుమనోవల్లీకుటీతీరముం
జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్. 42
వ. ఇట్లనన్యపురుషసంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడఁగని. 43

---

1 వెద=ఋతుకాలము (సమయము), 2 మేఖల=గజ్జలయొడ్డాణము, 3 హరిత్ + ఇభ + ఇంద్ర=దిక్కుల యేనుగురాజులు, 4 నవ.....రముఁ=క్రొత్తగా విచ్చిన తామరపువ్వుల కొలను, 5 నటత్ + ఇందీవర + వారము=కదలుచున్న నల్లకలువల గుంపు.

సీ. తోయజగంధంబుఁ దోఁగిన చల్లని
మెల్లనిగాడ్పుల మేనులలరఁ
గమలనాళాహార విమలవాక్కలహంస
రవములు సెవులపండువులు సేయ
[1]ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు
ఘ్రాణరంధ్రంబుల గారవింప
[2]నిర్మలకల్లోల నిర్గతాసారంబు
వదనగహ్వరముల వాడు దీర్పఁ
తే. త్రిజగదభినవసౌభాగ్యదీప్తమైన
విభవ వీక్షణములకును విందు సేయ
సరిగి పంచేంద్రియవ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుఁగు సొచ్చె. 44
క. తుండంబులఁ బూరించుచు
గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు
నిండఁగ వేదండకోటి నీటిం ద్రావెన్. 45
వ. అప్పుడు. 46
[4]మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి [3]చం
డభమార్గంబున కెత్తి నిక్కి వడి నుద్దాడించి పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్
నభమందాడెడు మీనకర్కటముల న్బట్టెన్ సురల్ మ్రాన్పడన్.
వ. మఱియు నగ్గజేంద్రంబు [5]నిర్గళవిహారంబున. 48
సీ. [6]కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి
సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు

---

1 ఫుల్ల...మోదంబు=బాగుగా విచ్చిన నల్లకలువపూల వాసనలు, 2 నిర్మ..... సారంబు=తేటలైన యలలనుండి కాఱిన నీటితుంపురులు, 3 చండ+భ+మార్గంబునకు=భయంకర నక్షత్రముల దారికి, 4 ఇభ...మ్రాన్పడన్—దీని తాత్పర్యము,

తా. ఏనుఁగుల ఱేఁడు తొండము బెజ్జాలగుండ నీరు నిండించి ఆకాశమునకుఁ జిమ్మివేయఁగా, ఆనీటితో వచ్చిన పెద్దచేపలు మొసళ్ళు, అక్కడనుండిన మీన, మకర రాశులను బాధింపగా దేవతలు చూచి వెరగందిరి.

1హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల
2వేయిగన్నులవాని ॱ వెరపు సూపుఁ
గలభ  తీర్ణ ॱ కహ్లారరజమునఁ
గనకాచలేంద్రంబు ॱ ఘనతఁ దాల్చుఁ
గుంజరీ ... చిత ॱ కుముదకాండంబుల
ఫణిరాజమండన ॱ ప్రభ వహించు

ఆ. మదకరేణుముక్త ॱ మౌక్తికశుక్తుల
మెఱుఁగు మొగిలుతోడ ॱ మేలమాడు
నెదురు లేనిగరిమ ॱ నిభరాజమల్లంబు
5వనజగేహకేళి ॱ వ్రాలునపుడు. 49

వ. మఱియు నా6సరోవరలక్ష్మి 7మదగజేంద్రవివిధవిహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై 8యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధ పరికంపిత శరీరాలంకార యగు కుసుమకోమలియునుం బోలె 9వ్యాకీర్ణచికురమత్తమధుకర నికరయు 10విగతరసవదనకమలయు 11నిజస్థానచలితకుచరథాంగయుగళయు 12లంపటితజఘనపులినతలయు నైయుండె నంత. 50

సీ. 13భుగభుగాయిత భూరిబుద్బుదచ్ఛటలతోఁ
ॱ గదలుచు దివికి భంగంబు లెగయ
భువన భయంకర ॱ 14ఫూత్కారరవమున
ఘోరనక్రగ్రాహ ॱ కోటి బెగడ

---

1 హస్తి...బులన్=ఆడేనుగులచే నుంచబడిన తామరలచేత, 2 వేయి...వాఁడు=ఇంద్రుడు (వీనికి గౌతమ శాపముచేత వేయిగన్నులుగా శరీరమున యోనులు ప్రకాశించెను.) 3కల......మునన్=ఆడేనుగులచే దేబడిన యెఱ్ఱదామర పుప్పొడిచేత, 4 కుంజ......బులన్=ఆడేనుగులచే నుంచబడిన కలువకాడలచేత, 5 వనజగేహకేళి=తామర కొలనులో దిరుగుట, 6 సరోవరలక్ష్మి=కొలను కలిమిచేడె, 7 మద......విభవ=పొగరెక్కిన యేనుగు కేనియొక్క నీటి జల్లులాటవలనఁ గలిగిన కలతవలని కలిమి పెంపుగలదై, 8 అనంగ...బోలె=మన్మథవిద్యాపారీణుడైన కోడెకాని కౌగిలిం జెదరిన మేని యలంకారములుగల పూబోణివలె. 9 వ్యాకీ......గయు=చిక్కువడిన వెండ్రుకలనెడు పొగరెక్కిన తుమ్మెదలు గలదియు, 10 విగత......లయు=ఇరిగిన మొగము తేటగల కమలములుగలదియు, 11 నిజ......ళయు=ఉన్నపట్టు వదలిన చన్నుగవయను జక్కవపిట్ట జంటగలదియు, 12 లంప......తలయు=కదలం జారిన పిఱుదు-చట్టుంపు టిసుకతిన్నెలు గలదియునయ్యె. తా॥ గజరాజుచేత గలతపెట్టబడిన కొలనులక్ష్మి క్రీడల

[1]వాలవిక్షేప దుర్వారఘుంఘుమానిల
వశమున ఘుమఘుమ[2]ఘుమావర్తమడరఁ
[3]గల్లోలజాల సంఘట్టనంబులఁ దటీ
తరుల మూలంబులై ధరణిఁ గూల

తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి
యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు [4]స్వర్భానుపగిది
నాక్ర మకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె. 51

క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు
నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలముల
వడి కడువడిఁ బట్టెఁ బూర్వపద యుగళంబున్. 52

చ. పదములఁబట్టినం దలఁకుపాటొకయింతయు లేక ఘోరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం
జెదరఁగఁజిమ్మె నమ్మకరిచిప్పలు పాదులుఁదప్ప నొప్పఱన్
వదలి జలగ్రహంబు కరివాలము మూలముఁ జీరెఁగోరులన్. 53

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచు గరకరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి
భర మనుచును నతలకుతల భటు లదిరిపడన్. 54

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండ దండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై యన్యోన్యవిజయశ్రీకరంబులై సంక్షోభితకమలాకరంబులై హరిహరియును గిరిగిరియును దాఁకి పిఱుతివియక పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుం గొలంకు గలంకం బొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడక బుడబుడానుకారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్లతో నురువులుఁగట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వ

---

1 వాల...నిల = తోఁక విసరుట గల్గిన పెనుగాలి, 2 ఆవర్తము = సుడితిరుగుట,
3 కల్లో.. కూల — తరగముల తాకిడిచే యొరపిడిచేత ఒడ్డునగల చెట్లు మొదళ్ళు తెగి

రంబుల నప్పళించుచు నిశితనితాంతదురంత దంతకుంతంబుల నిం
తింతలు తునియలయి నప్పళంబునం బునుకఁ జిప్పలుఁ గుదుళ్ళుఁ
దప్పి రక్తంబులుఁ గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం
జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలి
పట్టు వదలక కుప్పరైవర్తించుచు బరిభ్రమణవేగంబున జలంబు
లం దిరుగుచు మకరకమఠకర్కటగండకమండూకాది సలిల నిల
యంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభ
సంబున నిక్కలువడ మ్రిక్కడందొక్కుచు మెండుచెడి బెండుపడి
నాఁచుఁగుల్లసిప్పతండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబు
గా నొడ్డుచు నోలమాసగొనక గెలుపుఁ దలంపులు పెట్టిదంబు
లై రెట్టింప సహోరాత్రంబులుం బోలెఁ గ్రమ క్రమ విజృంభ
మాణంబులై బహుకాల కలహ విహారంబులై నిర్గతనిద్రాహారంబు
లై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున. 55

క. జవమును జలమును బలమును
వివిధములుగఁ బోరు కరటి వీరతకు భువిన్
దివి మకరమీన కర్కట
నివహము లొక్కటన మిత్రు నిలయముఁ బొందెన్. 56

శా. ఆటోపంబునఁ జిమ్మ సొమ్మగల [1]వజ్రాభీల దంతంబులం
దాటించున్ మెడఁ జుట్టి పట్టి హరిదోర్దండాభశుండాహతిన్
నీటం మాటికి మాటికిం దిగువఁగా [2]నీరాటము న్నీటిపోరాట
న్నోటమిపాటుఁ జూపుటకిరణ్యాటంబు వాచాటమై. 57

వ. అప్పుడు. 58

ఆ. మకరితోడఁ బోరు మాతంగ విభుని నా
క్కరుని డించి పోవఁ గాళ్ళు రాక
గోరి చూచుచుండెఁ [4]గుంజరీయూథంబు
మగలు దగులుఁ గారె మగువలకును. 59

---

తా॥ ఏనుఁగు వీరాటోపమునకు భయపడియు జలచరమైన మకరము పోరుచుండఁగా ఆకాశమునందు మకరమీన కర్కటములు సూర్యుని మఱుఁగు జొచ్చినవయ్యెను.

1 వజ్రాభీల దంతంబులు=వజ్రముతో సమానమైన దార్ఢ్యతగల ఏనుగు దంతాలు,

వ. అంత. 60

ఆ. 1జీవనంబు దనకు జీవనంబై యుంట
నలవుఁ జలము నంత కంత కెక్కె
మకర మొప్పె డస్సె 2మత్తేభ మల్లంబు
బహుళపక్ష శీత భాను పగిది. 61

మ. ఉఱుకుం గుంభయుగంబుపై 3హరిక్రియన్ హుమ్మంచుఁ
బాదంబులన్ నెఱయం గంఠము వెన్నుదన్ను నెగయున్ హేలా
గతిన్ వాలమున్ జఱచున్ నుగ్గుగఁ దాఁకు ముంచు మునుఁగున్
శల్యంబులున్ దంతముల్ విఱుఁగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి
కదియున్ వేదండయూధోత్తమున్. 62

మ. పడగానం బడకుండ డాఁగు వెలికిం బోవంగ దానమ్మై
పొడసూపుం జరణంబులం బెనఁగొనుం బోరాక రారాక బె
గ్గడిలం గూలఁగ దాఁచు లేచుతఱి నుద్ఘాటించు లంఘించు బ
ల్విడిఁ జీరుం దగులన్ మలంగు నొడియున్ వేధించుఁ గ్రోధించుచున్.

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయ
జ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుం బోలె
నంతకంతకును త్సాహకలహసన్నాహబహువిధజలావగాహంబయిన
గ్రాహంబు మహాసాహసంబునఁ బోరె మఱియు. 64

శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి 4ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై. 65

ఆ. 5వనగజంబు నెగచు 6వనచారిఁ బొడగని
7వనగజంబుకాన 8వజ్రిగజము
వెల్లనై సురేంద్రు వేచి 9సుధాంధులు
పట్టఁ బట్టనీక బయలువ్రాఁకె.

---

1 జీవనము=నీళ్లు, బ్రతుకు, 2 మత్తేభమల్లము=పొగరెక్కిన యేనుగుగున్న, 3హరి=సింహము, చిలుక, పాము, కప్ప, త్రిమూర్తులు, దిక్పాలకులు,సూర్యచంద్రులు,4నిర్ + ఖేద......గతి=శోక రహితమైన బ్రహ్మపదమునొందు మార్గము, 5 వనగజము=అడవి యేనుగు. 6 వనచారి=నీటదిరుగు మొసలి, 7 వనగజము=తోటయందలి యేనుగు,

ఉ. ఊహ గలంగి జీవనపు  టోలమునం బడి పోరుచున్ మహా
మోహలతానిబద్ధపద  ముఁ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు 1దేహిక్రియ  దీనదశన్ గజముండె 2భీషణ
గ్రాహదురంతదంతపరి  ఘట్టితపాదఖురాగ్రశల్యమై. 67

వ. ఇవ్విధంబున. 68

క. అలయక సొలయక వేసట
నొలయకఁ గరి మకరితోడ  నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు
సలిపెం బో రొక్క వేయి  సంవత్సరముల్. 69

మ. పృథుశక్తిన్ గజ మాజలగ్రహముతోఁ  బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తనలావు వైరిబలముం  జింతించి మిథ్యామనో
రథ మింకేటికి దీని గెల్వ సరి బో  రం జాల రా దంచు న
వ్యథమై యిట్లనుఁ 3బూర్వపుణ్యఫలది  వ్యజ్ఞాన సంపత్తితోన్.

శా. ఏరూపంబున దీనిగెల్తు నిట మీఁ  దేవేల్పుఁ జింతింతు నె
వ్వారిం జీరుదు నెవ్వ రడ్డమిఁక ని  4వ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ రఖిల  వ్యాపారపారాయణుల్
లేరే మ్రొక్కెద దిక్కుమాలిన మొఱా  లింపం బ్రపుణ్యాత్మకుల్.

శా. 5నానానేక పయూథముల్ వనములో  నం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీ  నాథుండనై యుండి 6మ
ద్దానాంభః పరిపుష్ట చందన లతాం  తచ్ఛాయలం దుండ లే
కే నీరాశ కిటేల వచ్చితి భయం  బెట్లోకదే యీశ్వరా. 72

ఉ. ఎవ్వనిచే జనించు జగ  మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు 7డిందుఁ బర  మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం

---

1 దేహి=దేహమును ధరించినవాడు (జీవుడు), 2 భీషణ.....శల్యమై=భయంకరమైన మొసలియొక్క భరింపశక్యముకాని పండ్లయొక్క యొత్తిడి గలిగిన కాలిగిట్టలు గలదై (ఇది ఏనుగునకు విశేషణము), 3 పూర్వ.....సంపత్తితోన్=తొల్లింటి పుట్టువునందు సంపాదించిన పుణ్యఫలము వలన గలిగిన చెడని జ్ఞానసంపదతో, 4 వారిప్రచారోత్తమున్=నీటఁదిరుగు జంతువులలో బలమైనది (మొసలి) 5 నాన+అనేకపయూథముల్=అన్ని యేనుగుగుంపులు (అనేకపము=ఒకటికంటె ఎక్కువ అవయవములతో నీరు త్రాగునది. తొండమునబీల్చి నోట బోసికొనునది.) 6 మద్దాన.....ఛాయలందున్=నా మదజలధారలచేత నిండిన గంధపుజెట్ల పూవునీడలందు, 7 డిందున్=కనుపడకుండబోవు.

డెవ్వఁ డనాదిమధ్యలయుఁ । డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని [1]నాత్మభవు । నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

క. ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు । నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు । నర్థిఁ దలంతున్. 74

[2]క. లోకంబులు లోకేశులు లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు నతని । నే సేవింతున్.

[3]క. నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు । మునులు దివిజులుం
గీర్తింప నేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ రట్టి । వాని నుతింతున్. 76

ఆ. [4]ముక్తసంగులైన । మునులు [5]దిదృక్షులు
సర్వభూతహితులు । సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యు । లై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు । దిక్కు నాకు. 77

సీ. [6]భవము దోషంబు రూ । పంబుఁ గర్మంబు నా
హ్వయములు గుణము నె । వ్వనికి లేక
జగములఁ గలిగించు । సమయించుకొఱకు నై
నిజమాయ నెవ్వఁ డి । న్నియునుఁ దాల్చు
[7]నాపరేశునకు న । [8]నంతశక్తికి బ్రహ్మ
[9]కిద్ధరూపికి [10]రూప । హీనునకును

1 ఆత్మభవు=తనంతట తానే కలిగినవాఁడు. 2 తా॥ లోకములు, వానిని పాలించువారు, జనులు నశించినతరువాత పెద్దచీకటికవతల వెలుఁగుచు ఒక్కఁడైన వానిని గొలిచెదను. 3ఆఁటాఁడువానివలె నన్నివస్తువు లందుండి ఆడుచు, తన నడవడి మునులు దేవతలు కొనియాడలేనంతటి దైయుండఁగా వెలుంగు వానినుతించెద. 4ముక్తసంగులు=విడువంబడిన పెండ్లము కొడుకుల కూడికగలవారు. 5దిదృక్షులు=ఆత్మను జూచు కోర్కులుగలవారు. 6 భవము...గుణములు=పుట్టుక, తప్పు, రూపము, పని, పేరులు, అలవాట్లు. 7 అపరేశుఁడు=ప్రశస్తమైన పరమపదమునకు ప్రభువు, 8 అనంతశక్తి=మేరలేని సామర్థ్యము గలవాఁడు, 9ఇద్ధరూపి=ప్రకాశించురూపము గలవాఁడు, 10 రూపహీనుఁడు=రూపములేనివాఁడు (నిరాకారుఁడు).

[1]చిత్రచారునికి [2]సాక్షికి [3]నాత్మరుచికినిఁ
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటల [4]నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కేనొనర్తు వందనములు. 78

సీ. శాంతున [5]కపవర్గ సౌఖ్యసంవేదికి
[6]నిర్వాణభర్తకు [7]నిర్విశేషు
నకు ఘోరునకు [8]గూఢునకు [9]గుణధర్మికి
సౌమ్యున కధికవిజ్ఞానమయున
[10]కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు [11]బహు
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
[12]మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రి
యజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

ఆ. నెఱి [13]నసత్య మనెడి నీడతో వెలుఁగుచు
నుండు [14]నేకటికి మహోత్తరునకు
నిఖిల కారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 79

క. [15]యోగాగ్ని[16]దగ్ధకర్ములు, యోగీశ్వరు లేమహాత్ము నొందెడుఁ గర్త స

---

1 చిత్రచారు= విచిత్రమైన నడవడికలవాడు. 2 సాక్షి=చూచువాడు, 3ఆత్మరుచి= స్వయంప్రకాశుఁడు. 4. ఎఱుక=పూర్వజ్ఞానము. 5 అపవర్గ......దికి = దుఃఖములేని సుఖమెఱిగిన వానికి, 6 నిర్వాణభర్తకు = దుఃఖముల నశింపజేయు ప్రభువునకు 7 నిర్విశేషునకు=తనకంటె వేరైనది లేనివానికి 8 గూఢునకు=హృదయగుహయందుండువాఁడు. కాన గూఢుఁడు. "గుహాయాం విశ్వమూర్తిషు" అని మంత్ర ప్రమాణము. 9గుణధర్మికి= గుణధర్మములు గలది, కలవాఁడు అనఁగాఁ బ్రకృతి పురుషులు. 10 అఖి.....ద్రష్ట= అన్ని ఇంద్రియాలు చేయుపనులు చూచువాఁడు. 11 బహు.....జ్ఞుఁడు=అన్ని శరీరములందుండి తెలిసికొనువాఁడు. 12మూలప్రకృతి=లోకములకు జన్మాదులకు మొదలు అయినది. (అనఁగా పురుషునం దెప్పుడు ప్రకృతియుండును వాసనవలె కలిసియుండుటచేత వేరుగా చెప్పక ఒక్కటిగా జెప్పినాఁడు. 13 అసత్యమనునీడ=కల్లనీడ(సంసారఛాయ) 14 ఏకటికి=ఒక్కడైనవానికి. 15యోగాగ్ని=యోగమనఁగా మంత్రజపము ద్వారా ఒకదేవతయందు మనస్సు నిల్చుట. అట్లు నిలుకడఁ జెందిన మనస్సువలనఁ గలిగిన వేడిమియే యోగాగ్ని. 16 దగ్ధకర్ములు=ఆయోగాగ్ని చేతఁ దగులఁబెట్టఁబడిన

ద్యోగవిభావిత మనస్కులు, బాగుగ వీక్షింతు రట్టి పరమున్ భజింతున్.

సీ. [1]సర్వాగమామ్నాయ ౹ జలధికి నపవర్గ
మయునికి నుత్తమ ౹ మందిరునకు
[2]సకలగుణారణి ౹ చ్ఛన్న బోధాగ్నికిఁ
దనయంత రాజిల్లు ౹ ధన్యమతికి
[3]గుణలయోద్దీపిత ౹ గురుమానసునకు [4]సం
వర్తితకర్మ ని ౹ ర్వర్తితునకు
దిశ లేని నాబోటి ౹ పశువుల పాపంబు
లడఁచువానికి సమ ౹ స్తాంతరాత్ముఁ

ఆ. [5]డై వెలుంగువాని ౹ కచ్ఛిన్నునకు [6]భగ
వంతునకుఁ దనూజ ౹ పశునివేశ
దారసక్తు లయిన ౹ వారికందఁగ రాని
వాని కాచరింతు ౹ వందనములు. 81

వ. మఱియును. 82

సీ. వరధర్మకామార్థ ౹ వర్జితకాములై
విబుధు లెవ్వాని సే ౹ వించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి ౹ కాంక్షించువారి [7]క
వ్యయదేహమిచ్చు నె ౹ వ్వాఁడు కరుణ
[8]ముక్తాత్ము లెవ్వని ౹ మనమునఁ జింతింతు
రానందవార్ధిమ ౹ గ్నాంతరంగు

---

1 సర్వ+ఆగమ+ఆమ్నాయ+జలధి=సకల పురాణాదివిధాన శాస్త్రములకు వేదములకు స్థానమైనవాఁడు, 2 సకలగుణ+అరణి+ఛన్న+బోధ+అగ్ని=సత్త్వ, రజ, స్తమోగుణము లను జమ్మికొయ్యచేతఁ గప్పఁబడిన గుప్తబోధయనెడు అగ్నిగలవానికి, జ్ఞాపకము:—యజ్ఞములందు జమ్మికొయ్య నరణిగా (ప్రకృతిగాఁ) జేసి యట్టి మఱియొక కొయ్యను (పురుషుఁడుగా) జేసి త్రిప్పగాఁ గలుగునదే, తేజోరూపమైన యగ్ని. అదే దేవుఁడు, 3 గుణ.... నకు=మూఁడు గుణాలు నశించిన వెనుకఁ బ్రకాశించు ఆత్మగలవానికి, 4 సంవ.....నకు=ప్రకృతిచేతం బ్రవర్తింపం జేయఁబడిన కర్మలను సాగనీక అణంచినవానికి, 5 అచ్ఛిన్నునకు=(ఛేదించు) నరకుటకు వీలుగానివానికి, 6 భగవంతునకు=సంపద, ప్రకాశము, ఐశ్వర్యము, సద్గుణములు, అణిమాది సర్వశక్తులు సృష్టి స్థితి సంహార తిరోధాన అనుగ్రహశక్తులు కలవానికి, 7 అవ్యయదేహము=నశిం

1లేకాంతు లెవ్వని ǂ నేమియు గోరక
భద్రచరిత్రంబుఁ ǂ బాడు చుందు
ఆ. రామహేశు నాద్యు ǂ 2నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు ǂ నున్నతాత్ము
బ్రహ్మ మయినవానిఁ ǂ బరుని నతీంద్రియు
నీశు 3దూరు 4సూక్ష్ము ǂ నే భజింతు 83
వ. అని మఱియు నిట్లని వితర్కించె. 84
సీ. 5పావకుం డర్చుల ǂ 6భానుండు దీప్తుల
నెబ్బంగి నిగిడింతు ǂ రెట్లడంతు
రాక్రియ 7నాత్మక ǂ రావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల ǂ నఖిలజంతు
గణముల జగముల ǂ ఘననామరూపభే
దములతో మెఱయించి ǂ తగనడంచు
నెవ్వఁడు మనము బు ǂ ద్ధీంద్రియంబులుఁ దాన
యై గుణసంప్రవా ǂ హంబు నెఱపు
తే. 8స్త్రీనపుంసక పురుషమూ ǂ ర్తియునుఁగాక
9తిర్యగమరనరాది మూ ǂ ర్తియునుఁగాక
కర్మగుణభేద సదసత్ప్ర ǂ కాశిఁగాక
వెనుక 10నన్నియుఁ దా నగు ǂ విభుఁదలంతు. 85

---

1 ఏకాంతులు=తనకంటె వేరువస్తువు లేదని అన్ని వస్తువులందుం దానేకలనసెడి నిశ్చయముతో నెక్కడ నైనను యోగనిష్ఠతో, దనను దాను మఱచి యొడలు దెలియనివారు. 2 అవ్యక్తుని=మనస్సుచేత వాక్కుచేతఁ గార్యములచేత నిట్టివాఁడని యిట్టివస్తువని నిర్ణయింపఁబడుటకు వీలుకాని వానిని; 3 దూరు=ప్రకృతి వ్యాపారముల నన్నిటిని తిరస్కరించువానిని, 4 సూక్ష్ము="అణోరణీయాన్" అను శ్రుతిచేత హృదయ గుహాయందలి ప్రకృతిజ్వాలల చివర భాగమునం దణుస్వరూపమునఁ గోచరించు వానిని, 5 పావకుం డర్చులన్ = అగ్నిదేవుఁడు మంటలను, 6 భానుండు దీప్తులను = సూర్యుఁడు కాంతులను 7 ఆత్మకర+ఆవళి=తన కిరణము లను చేతులచే (బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులను నామరూపభేదములతో ప్రకాశింపఁజేయువాఁడు) 8 స్త్రీ...... గాక=ఆడుది మగవాఁడు పేడివాఁడుగా నుండక, తిర్య......గాక=అడ్డముగా నిలువుగా ఆకాశమున భూమిని వానిమధ్యను దిరుగు జంతువులుగా నుండక, 10 అన్నియు దానగు విభున్=ప్రకృతి వశమున అన్నినామరూపభేదములుగ దోచు ప్రభువగు దేవుని

క. కలఁ డందురు దీనులయెడఁ
  గలఁ డందురు పరమయోగి గణములపాలం
  గలఁ డందు రన్నిదిశలను
  గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో. 86

సీ. కలుగఁడే నాపాలి కలిమిసందేహింపఁ
      గలిమిలేములు లేకఁ గలుగువాఁడు
  నాకడ్డపడరాఁడె సలి ససాధువులచేఁ
      బడినసాధులకడ్డ పడెడువాఁడు
  చూడఁడే నాపాటుఁ [1]జూపులఁ జూడకఁ
      జూచువారలఁ గృపఁ జూచువాఁడు
  లీలతో నామొఱా లింపఁడే మొఱఁగుల
      మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు
తే. యఖిలరూపులుఁ దనరూప మైనవాఁడు
  ఆదిమధ్యాంతములు లేక యలరువాఁడు
  భక్తజనములదీనుల పాలివాఁడు
  వినఁడె చూడఁడె తలఁపడె వేగ రాఁడె. 87

క. విశ్వకరు విశ్వదూరుని
  విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
  శాశ్వతు నజు బ్రహ్మప్రభు
  నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 88

వ. అని పలికి తనమనంబున నగ్గజేంద్రుం డీశ్వరసన్నిధానంబుఁ గల్పించు
  కొని యిట్లనియె. 89

శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
  ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
  నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
  రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా. 90

క. వినుదఁట జీవులమాటలు
  సను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో

---

1 జూపుల.....చూచువాఁడు = ముందుకుఁ జూడక, కనుబొమల నడిమికి

యను దఁట పిలిచిన సర్వముఁ
గను దఁట సందేహమయ్యెఁ గరుణాసార్ద్రా 91

ఉ. ఓకమలాప్త యో వరద యోప్రతిపక్షవిపక్షదూర కు
య్యో కవియోగివంద్య సుగుణోత్తమ యో[1]శరణాగతామరా
నోకహ యో మునీశ్వరమనోహర యోవిమలప్రభావ రా
వే కరుణింపవే తలఁప వేశరణార్థిని నన్నుఁ గావవే. 92

వ. అని పలికి మఱియు [2]నరక్షితరక్షకుం డైన యీశ్వరుం డా పన్నుం డైన నన్నుఁ గాచుఁ గాకయని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయ లాలకించుచు నగ్గజేంద్రుండు మొఱసేయుచున్న సమయంబున. 93

ఆ. [3]విశ్వమయత లేమి వినియు నూరకయుండి
రంబుజాసనాదు లడ్డ పడక
విశ్వమయుఁడు విభుఁడు [4]విష్ణుండు [5]జిష్ణుండు
భక్తియుతున కడ్డ పడఁ దలంచె. 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల[6]మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంకరమా వినోదియగు నా పన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహి యనఁగుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబునుఁ జీరఁ [7]డభ్రగపతిం బన్నింపఁ డా [8]కర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు [9]వివా దప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు [10]గజ ప్రాణావనోత్సాహియై. 96

1 శరణ + ఆగత + అమర + అనోకహ = మరుగుజేర వచ్చినవారికిఁ గల్పవృక్షము వంటివాఁడ, 2 అగ......కుడు = రక్షింపఁబడనివారిని రక్షించువాఁడు. 3 విశ్వమయత = కదలఁ గలవానియందుఁ గదలలేని వానియందు నొకేలాగు నిండియుండుశక్తి 4 విష్ణుండు = అంతటను నిండినవాఁడు, 5 జిష్ణుండు = జయశీలుఁడు, 6 మందార...... వినోది = మందారవనమందు అమృతసరోవరము ప్రక్క చంద్రకాంతశిలయందు నల్లకలువ పూవుల పానుపుమీఁద లక్ష్మీదేవితోఁ గ్రీడించువాఁడు, 7 అభ్రగపతిని = ఆకాశము నందుఁ దిరుగు పక్షిరాజయిన గరుత్మంతుని, 8 కర్ణికా......ల్లము = పూవుమొగ్గల చేత నలంకరింపఁబడిన వెండ్రుకలముడి, 9 వివాద......చలము = క్రీడయందు భార్య లక్ష్మితో దర్కించుచు ఒడిసి పట్టిన ఆమె పైటచెఱఁగు కొన, 10 గజ......

వ. ఇట్లు భక్తజనపాలన పరాయణుండును నిఖిలజంతు హృదయార
విందసదనుండును నగు నారాయణుండు కరికులేంద్ర విజ్ఞాపిత
నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం
దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షా
పరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మఱల నవధరించి గగ
నంబున కుద్గమించి వేంచేయునప్పుడు. 97

మ. తన వెంటన్ సిరి లచ్చివెంట [1]నవరోధవ్రాతము న్దాని వె
న్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు [2]ధ్వజినీకాంతుండు రావచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా [3]రాబాలగోపాలమున్. 98

వ. తదనంతరంబ [4]ముఖారవింద మకరందబిందు సందోహపరిష్యందమానా
నందేందిందిర యగు నయ్యిందిరాదేవి [5]గోవిందకరారవింద సమా
కృష్యమాణ సంవ్యానచేలాంచల యయిపోవుచు. 99

మ. తన వేంచేయు పదంబుఁ జేర్కొనఁడు దీనార్తస్త్రీజనాలాపముల్
వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్.

వ. అని వితర్కించుచు. 101

[6]శా. తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్త కుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్. 102

---

1 అవ......తము=అంతఃపురకాంతా జనసంతానము, 2 ధ్వజినీకాంతుండు=సేనానాయకుఁడైన విష్వక్సేనుఁడు, 3 ఆబాలగోపాలము=పిల్లలు మొదలు భూపతులైన రాజుల వరకు గలవారు, 4 ముఖా......యిందిరాదేవి=మోముదమ్మి పూదేనె చుక్కలగుంపు గ్రోలుటచేతఁ గలిగిన యుల్లాసముతోడి తుమ్మెదలుగల లక్ష్మీదేవి, 5 గోవింద......చలము=గోవులకు ఱేఁడైన కృష్ణుని హస్తపద్మముచేత లాగఁబడినదై వ్రేలాడు పైటచెఱఁగుకొనలు గలది. 6 తా॥ కదలికచే వ్రేలాడు చెవిదుద్దులతో, భుజముపై మెదలియాడు వెండ్రుకలముడితో పైటచెరంగుం దొలంగిన గుబ్బలతో, జారుచున్న గజ్జలయొడ్డాణముతో, చెదరిన మొగముపూతతో, మనోనాయకునిచేత లాగఁబడిన పైటకొంగుతో, పెక్కు చందురుల కాంతితో, స్తనముల బరువుచేఁ మాఁగాడు నడుముతోఁ

క. అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడువఁ డని నడ యుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడు గిడు నడు గిడదు జడిమ నడుగిడు నెడలన్. 103

సీ. 1నిటలాలకము లంట నివురఁ జుంజు మ్మని
ముఖసరోజము నిండ ముసరుఁ దేఁట్లు
సఖులఁ జోపఁగఁ జిల్కు లల్ల నల్లన చేరి
2యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు
శుకములఁ దోలఁ 3జక్షుర్మీనములకు 4మం
దాకినీ పాఠీనలోక మెసఁగు
మీనపంక్తుల దాఁటు మెయిదీఁగతో రాయ
5శంపాలతలు మింట సరణిఁ గట్టు

ఆ. శంపలను జయింపఁ 6జక్రవాకంబులుఁ
గుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుసూపు
మెలఁత 7మొగుల పిఱిఁది మెఱుఁగుఁ దీవయుఁ బోలె
8జలదవర్ణు వెనుకఁ జనెడునపుడు. 104

మ. 9వినువీథిన్ జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ 10సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు11నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు 12రోచిష్ణునిన్. 105

వ. ఇట్లు వొడగని. 106

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం
ఖనినాదం బదె చక్ర మల్లదె 13భుజంగధ్వంసియున్ వాఁడె క్ర

---

1 నిటల + అలకము = మొగము మీఁది ముంగురులు, 2 ఓష్ఠబింబము = పెదవి దొండపండు, 3 చక్షుర్మీనము = కన్నుచేపలు, 4 మందా......కము = గంగానదియందలి ముదిచేపల గుంపు, 5 శంపాలతలు = మెఱుపుతీగెలు, 6 చక్రవాకము = జక్కవపిట్ట, 7 మొగుల......దీవ = వర్షమేఘము వెంబడి మెఱుపుతీగె (పెనిమిటి వెన్నంటిన లక్ష్మి) 8జలదవర్ణుఁడు = వర్షాకాలమేఘమువంటి శరీరము గలవాఁడు (కృష్ణుఁడు). 9వినువీథిన్ = ఆకాశమార్గమున, 10 సురా......ష్ణున్ = రాక్షసుల ప్రాణసంపదను నిరస్కరించిన వాని, 11నవో......పరిచరిష్ణు = పడుచుదైన లక్ష్మీదేవితోఁ దిరుగువాని, 12రోచిష్ణున్ = కాంతి గలవానిని. 13 భుజంగధ్వంసి = పాముల వేటకాఁడు (గరుత్మంతుఁడు.)

స్సన్న తమ్మేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతి ని
స్వనులై మ్రొక్కిరి మింట [1]హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

వ. అయ్యవసరంబునఁ గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమ
స్కారంబు లంగీకరింపక మనస్సమాన సంచారుండై పోయిపోయి,
కొంతదూరంబున శింశుమారచక్రంబునుం బోలె [2]నక్రమకరకుళీర
మీన మిథునంబై కిన్నరేంద్రుని భాండాగారంబునుం బోలె [3]స్వచ్ఛ
మకరకచ్ఛపంబై భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె [4]సరాగ
జీవనంబై వైకుంఠపురంబునుం బోలె [5]శంఖచక్రకమలాలంకృతం
బై సంసారచక్రంబునుం బోలె [6]ద్వంద్వసంకులపంకసంకీర్ణంబై
యొప్పు న[7]ప్పంకజాకరంబుఁ బొడగని. 108

మ. కరుణాసింధుఁడు శౌరి [8]వారిచరముం ఖండింపఁగాఁ బంపె [9]స
త్త్వరితాకంపితభూమిచక్రము [10]మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రముం [11]బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ [12]బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్. 109

వ. ఇట్లు పంచిన. 110

---

1 హస్తి.....వక్రికిన్ = ఏనుఁగు పొందిన దురవస్థను తొలఁగించిన వానికని. 2 మకర కుళీర మీన మిథునంబు = మొసలి ఎండ్రకాయ చేఁపజంటలుగల కమలాకరము ఈ పేరులుగల రాశులుగల శింశుమార చక్రము 3 స్వచ్ఛమకరకచ్ఛపము= పరిశుద్ధమైన మొసళ్లు తాబేళ్లు గల కమలాకరము (మకర కచ్ఛపములను ధనపుకొట్లు గల కుబేర భాండాగారము) 4 సరాగజీవనము=అనురాగముతోఁడి బ్రతుకు గల భాగ్యవంతుని భాగ్యము (తియ్యఁదనముం గలిగించు నీళ్లుగల కమలాకరము) 5 శంఖ.....తము= శంఖము, చక్రము, లక్ష్మీదేవితోఁ గూడినది వైకుంఠము. శంఖములు, చక్రవాకపక్షులు కమలములతో గూడినది కొలను. 6 ద్వంద్వ.....కీర్ణము = (రెండర్థములు) కలిమి లేములు, మేలుకీడులు మొదలైనవాని చేత గలతపడుట యను పాపముతోఁ గూడియుం డునది సంసారచక్రము. జలజంతువుల జంటలచే గలతపడుటయను బురదతో గూడినది, 7పంకజాకరము = కొలను. పైవానికిట్లె యూహించవలెను. 8 వారిచరము = నీటఁ దిరుగు మొసలి. 9 సత్త్వ.....చక్రము=తొందరగాఁ గదలింపఁబడిన భూవలయము. 10మహో...... శుక్రము=మిక్కిలి వెలుఁగునిప్పురవ్వలగుంపుచే నిండిన యాకాశ ప్రకాశము, 11 బహు.....వక్రము=సకలలోకముల మధ్యను వంకరలేకుండ సాగునది. 12 పాలి...... చక్రము=రక్షించంబడిన దేవతాసమూహము (గల చక్రము.)

శా. 1అంభోజాకరమధ్య నూతన నళినీ యాలింగన క్రీడ నా
రంభుండైన 2వెలుంగుఱేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభధ్వానముతోఁ గొలంకువు కలంకం బొందఁగాఁ జొచ్చి 3దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయం బోయి 4హృద్వేగమై.

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర5మాశుక్రియన్
హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్ర సందోహముం
6గామక్రోధనగేహమున్ గరటి రక్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్.

వ. ఇట్లు నిమిషస్పర్శనంబున 7సుదర్శనంబు మకరి తలఁ ద్రుంచు నవసరంబున.

8క. మకర మొకటి రవిఁ జొచ్చెను
మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114

మ. తమముం బాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె 9సం
భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభస్స్నాన విశ్రాంతుఁడై. 115

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
10భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్

---

1 అంభోజా.....రంభుండు = తామరకొలనునందలి నడిమి క్రొత్తతామర పూఁబోడిని కౌఁగిలించుకొనుట యనెడు నాటకు మొదలిడిన వాఁడైన 2 వెలుంగుఱేని చెలువు=కిరణములకుఁ బ్రభువైన సూర్యుని యందము (కలది చక్రము.) 3 దుష్ట+అంభో+వర్తి=చెడ్డదియైన మకరము, 4 హృద్వేగము=మనోవేగము, 5 ఆశుక్రియన్=వేగముగ, 6 కామ.....హము=కోరికకు, కోపమునకు స్థానమైనది, 7 సుదర్శనము=విష్ణుచక్రము, 8 తా॥ మకరరాశి సూర్యుని-మకరమను ధనపుకొట్టు కుబేరుని, మకరాలయమైన కొలనులోని మొసళ్ళు కూర్మరాజును, చక్రమునకు భయపడి వారి మఱుగు జొచ్చెను. 9 సంభ్రమ.....శ్రాంతుఁడై=సంతోషమున దిక్కులఁ మోయు నేనుంగులు తొండములతో జల్లిన అమృతముతో సమానమైన నీటిమునుకలవలన పోయిన శ్రమగలవాఁడు (గజరాజు.) 10 భూరి.....చైతన్యమున్=పెద్దమ్రోఁతవలన కదలి కదల

సారోదారశితప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూతవిపన్న దైన్యమును ని ర్ధూతద్విష త్సైన్యమున్. 116

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్ జలరుహా మోదంబులై వాయువుల్
దిరిఁగెం బుష్పలవానజల్లుఁ గురిసెన్ దేవాంగనాలాస్యముల్
పరఁగెన్ దిక్కులయందు జీవ జయశ బ్దధ్వానముల్ నిండె సా
గరముప్పొంగెఁ దరంగచుంబితనభో గంగాముఖాంభోజమై. 117

క. నిడుద యగు కేల గజమును
మడుపున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్
దుడుచుచు మెల్లనఁ బుడుకుచు
నుడిపెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా. 118

క. శ్రీహరి కరసంస్పర్శను
దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి
మోహనఘీంకారశబ్ద ములతో నొప్పెన్. 119

క. కరముల మెల్లన నివురుచుఁ
గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమునఁ బ్రదికినఁ
గరపీడన మాచరించెఁ గరిణులు మరలన్. 120

సీ. జననాథ దేవల శాపవిముక్తుఁడై
పటుతరగ్రాహరూ పంబుమాని
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁ డప్పుడు
తనతొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితోఁ మ్రొక్కి
తవిలి కీర్తించి గీ తములు పాడి
యాదేవు కృప నొంది యందంద మఱియును
వినత శిరస్కుఁడై వేడ్కతోడ

ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేగు
నపుడు శౌరిఁగేల నంటి తడవ

హాస్తిలోకనాథుఁ । డజ్ఞానరహితుఁడై
విష్ణురూపు[illegible]చు । వెలుఁగుచుండె. 121

మ. అవనీనాథ గజేంద్రుఁ డామకరితో । నాలంబుఁ గావించె ముం
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డిం । ద్రద్యుమ్న నాముండు వై
ష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్ । సర్వాత్ము నారాయణున్
సవిశేషంబుగఁ బూజసేసెను మహా । శైలాగ్రభాగంబునన్. 122

ఉ. ఒకనాఁడా నృపుఁ డచ్యుతున్ మనములో । నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం । డచ్చోటికిన్ రాఁగ లేవక పూజిం
పక యున్న మౌనిఁ గని స । వ్యక్రోధుఁడై మూఢ లు
బ్ధకరీంద్రోత్తమ యోనిఁ బుట్టుమని శా । పంబిచ్చె భూవల్లభా. 123

క. మునిపతి నవమానించిన
ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు । [1]కాంజరయోనిం
జననం బందెను విప్రులఁ
గని యవమానింపఁ తగదు । ఘనపుణ్యులకున్. 124

క. కరినాథుఁ డయ్యె నాతఁడు
కరులైరి భటాదులెల్ల । గజమై యున్నన్
హరిచరణసేవకతమునఁ
గరివరునకు నధికముక్తి । గలిగె మహాత్మా. 125

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ । గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి । నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల । శిథిలమై మెల్లన
ప్రబలమగుచు విష్ణు । భక్తి సెడదు. 126

క. చెడుఁ గరులు హరులు ధనములుఁ
జెడుదురు నిజసతులు సుతులుఁ । జెడు చెనఁటులకుం
జెడక మను నట్టిగుణులకుఁ
జెడని పదార్థములు విష్ణు । సేవానిరతుల్. 127

వ. అప్పుడు జగజ్జనకుం డగు నప్పరమేశ్వరుండు దరహాసితముఖకమల
యగు [2]నకలంకమల కిట్లనియె. 128

క. బాలా నా వెను వెంటను
హేలగ విసువీథి నుండి యేతెంచుచు నీ
[1]చేలాంచలంబుఁ బట్టుటు
కాలో నేమంటి నన్ను సంభోజముఖీ. 129

క. ఎఱుఁగుదు తెఱవా యెప్పుడు
మఱవను సకలంబు నన్ను మరచిననైదలన్
మఱతు నని యెఱ్ఱఁగి యెఱుఁగక
మఱవక యెఱు యిడిరయేని మఱియన్యములన్. 130

వ. అని పలికిన [2]నరవిందమందిర యగు నయ్యిందిరాదేవిశిమందస్మిత చంద్రికాసంపరవదనారవిందయగుచు ముకుందున కిట్లనియె. 131

క. దేవా దేవర యడుగులు
భావంబున నిలిపి కొలుచు పని నాపనిగా
శ్రీవల్లభ యే మనియెద
నీ వెంటన వచ్చుచుంటి నిఖిలాధిపతీ. 132

క. దీనుల కుయ్యాలింపను దీనుల రక్షింపమేలు దీవనఁ బొందన్ దీనావన నీ కొప్పును దీనపరాధీన దేవ దేవమహేశా. 133

వ. అని మఱియును సముచితసంభాషణంబుల నంకించుచున్న యప్పరమ వైష్ణవీ రత్నంబును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబుగావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుండగుచు హరి నిజసదనంబునకుం జనియె నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె. 134

సీ. నరనాథ నీకును నాచేత వివరింపఁ
బడిన యీకృష్ణాను భావ మైన
గజరాజమోక్షణ కథ వినువారికి
యశము లిచ్చును గల్మ పాపహంబు
దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబుఁ
బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి

1 చేలాంచలము=పైటచెఱఁగు, 2 అరవింద మందిర=తామరపువ్వు యిల్లుగాఁగల

నిత్యంబుఁ బఠియించు ౯ నిర్మలాత్మకులైన
విప్రులకును బహు ౯ విభవ మమరు
తే. సంపదలు గల్గుఁ బీడలు ౯ శాంతిఁ బొందు
సుఖము సిద్ధించు వర్ధిల్లు ౯ శోభనములు
మోక్ష మఱచేతిదై యుండు ౯ ముదము సేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁడై ౯ యానతిచ్చె. 135

వ. అని మఱియు నప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె నెవ్వరేని నపర రాత్రాంతంబున మేల్కాంచి సమాహితమనస్కులయి నన్నును నిన్నును నీసరోవరంబును శ్వేతద్వీపంబును నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హేమనగంబును నిగ్గిరికందర కాననంబులను వేత్రకీచకవేణులతాగుల్మసురపాదపంబులను నేనును బ్రహ్మాయు ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడవాసుకి ప్రహ్లాద నారదులను మత్స్య కూర్మ వరాహాద్యవ తారంబులను దదవతారకృతకార్యంబులను సూర్య సోమ పావకు లను బ్రణవంబును ధర్మతపస్సత్యంబులను వేదంబును వేదాంగంబు లను శాస్త్రంబులను గోభూసురసాధుపతివ్రతాజనంబులను జంద్ర కాశ్యపజాయాసముదయంబును గౌరీగంగాసరస్వతీకాళిందీసునందా ప్రముఖ పుణ్యతరంగిణీనిచయంబును నమరులను నమరతరువు లను నైరావతంబును నమృతంబును ధృవుని బ్రహ్మర్షినివహం బును బుణ్యశ్లోకులయిన మానవులను సమాహితచిత్తులై తలంచు వారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామర వందితచరణారవిందుఁడై విహగపరివృఢవాహనుండై వేంచేసె విబు ధానీకంబు సంతోషించె నని చెప్పి శుకుండు రాజున కిట్లనియె. 136

క. గజరాజ మోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి ౯ నియతాత్ములకుం
గజరాజవరదుఁ డిచ్చును
గజతురగ స్యందనములుఁ ౯ గైవల్యంబుం. 137

క. తామసుతమ్ముఁడు రైవత
నామకుఁ డై వెలసె మను వ నలువురమీఁద౯
భూమికిఁ బ్రతివింధ్యార్జున
నామాదులు నృపులు మను వ నందనులు నృపా. 138

సీ. మునులు హిరణ్యరో ముఁడు నూర్ధ్వబాహుండు
వేదశీర్షుం డను వీరు మొదలు
నమరులు భూతర యాదులు శుభ్రిని
పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి
యాయిద్దఱకుఁ బుత్త్రిఁ డై తనకళలతో
వైకుంఠుఁ డనఁ బుట్టి వారిజాక్షు
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ
గల్పించె నెల్ల లో కములు మ్రొక్క
తే. రమయెమరోఁలు సేకొన రాజముఖ్య
తదనుభావంబు గుణములుఁ దలఁపఁదరమె
యీధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁ
గాని రాదయ్య హరిగుణ గణము సంఖ్య. 139

వ. తదనంతరంబ. 140

సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుం డను వీఁడు
డాఱవ మను వయ్యె నవనినాథ
భూమీశ్వరులు పురుః పురుషసుద్యుమ్నాదు
లాతని నందను లమర విభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ డ మర్త్యు లాప్యాదికు
లాహవిష్మద్వీర కాది ఘనులు
మునులందు విభుఁడు సం భూతికి వైరాజు
నకుఁబుట్టి యజితుండు నాఁగ నొప్పె
ఆ. నతఁడ కాఁడె కూర్మ మై మందరాద్రిని
నుదధి జలములోన నుండి మోఁచె
నతఁడ చువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ
ద్రచ్చి యిచ్చె నాసు ధారసంబు. 141

## క్షీరసాగర మథన కథాప్రారంభము.

వ. అని పలికిన నంతఁ బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142

మ. విను మున్నట్టికిఁ బ్రచ్చి పాలకడలిన్ విష్ణుండు కూర్మాకృతిన్
వనధిం జొచ్చి యదెట్లు మోచె బలుకవ్వంబైన శైలంబు దే
వనికాయం బమృతంబు నెట్లు వడసెన్ వారాశి నేమేమి సం
జనితం బయ్యె మునీంద్ర చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే.

క. అప్పటినుండి బుధోత్తమ
చెప్పెడు భాగవతకథా విశేషంబులు నా
కెప్పుడుఁ దనవి జనింపదు
సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలున్. 144

వ. అనిమఱియు నడుగంబడినవాఁడై యతని నభినందించి హరి
ప్రసంగంబు సెప్ప నుపక్రమించె నని సూతుండు ద్విజుల కిట్లనియె
నట్లు శుకుండు రాజుంజూచి. 145

క. కసిమసఁగి యసురవిసరము
లసిలతికల సురల నెగవ నసువులు వెడలం
బసఁ జెడిరి పడిరి కెడసిరి
యసమసమరవిలసనముల నను వెడలి నృపా. 146

క. సురపతివరుణాదులతో
సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై
సురనుతుఁ డగు నజుఁ గని యా
సురదుష్కృతిఁ జెప్పిరపుడు సొలయుచు నతులై. 147

క. దుర్వాసుశాపవశమున
నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై
పర్వతరిపుతోఁ గూడ న
పర్వము లయి యుండె నాతఁడు పర్వావళులై. 148

ఆ. నెలవు వెడలివచ్చి నిస్తేజులైనట్టి
వేల్పుగములఁ జూచి వేల్పుఁ బెద్ద
పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల
పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ. 149

క. ఏనును మీరును గాలము
1మానవతిర్యఙ్నగాద్రిమత్స్వేదజముల్
మానుగ నెవ్వనికళలము
వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా. 150

క. వధ్యుండు రక్షణీయుఁడు
సాధ్యుఁడు మాన్యుఁ డని లేక సర్వాత్మకుఁ డా
వధ్యాదు లొనర్చు సతం
డాద్యంతవిధానమునకు నర్హుఁడు మనకున్. 151

క. వరదునిఁ బరము జగద్గురుఁ
గరుణాపరతంత్రు మనము గనుఁగొన నిఁక సం
జ్వరములు సెడు నని సురలకు
సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్. 152

(బరగఁగఁ బద్మజుఁడు సెప్పి, పరమప్రీతిన్. పాఠాంతరము.)

వ. అంతఁ దానును దేవతాసమూహంబును సత్వరయానంబునం జని వినయంబునఁ గానంబడని యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె. 153

సీ. ఎవ్వనిమాయకు నింతయు మోహించి
దఱిమి యెవ్వనిమాయ దాఁటరాదు
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ
డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు
సర్వభూతములకు సమవృత్తి నెవ్వడు
చరియించుఁ దనచేత జనితమయిన
ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ము
ఖంబు గన్నులు సోమకమలహితులు

తే. చెవులు దిక్కులు రేతంబు సిద్ధజలము
మూఁడు మూర్తులపుట్టిల్లు మొదలి నెలవు
గర్భ మఖిలంబు మూర్ధంబు గగనమగుచు
మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు. 154

వ. మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును ప్రసాదంబున దేవ

---

1 మానవ...జముల్ = మనుజులు పశువులు కొండలు చెట్లు చెమటవలన బుట్టు

తలును గోపంబున రుద్రుండును బరుషంబున విరించియు నింద్రి
యంబులవలన వేదంబులును మునులును మేఢ్రంబునఁ బ్రజాప
తియును వక్షంబున లక్ష్మియు ఛాయ వలనఁ బితృదేవతలును
స్తనంబులవలన ధర్మంబును బృష్ఠంబువలన నధర్మంబును శిరంబు
వలన నాకంబును విహాసంబువలన నప్సరోజనంబులును ముఖంబు
వలన విప్రులును గుహ్యంబున బ్రహ్మంబును భుజంబులవలన
రాజులును బలంబును నూరువులవలన వైశ్యులును నైపుణ్యంబును
బదంబులవలన శూద్రులును నవేదంబును నధరంబున లోభంబును
నుపరి రదచ్ఛదంబువలనఁ బ్రీతియు నాసాపుటంబు వలన
ద్యుతియు స్పర్శంబునఁ గామంబును భ్రూయుగళంబున యమం
బును బక్షంబుఁ గాలంబును సంభవించె నెవ్వని యోగమాయా
నిర్జితంబులు (జనితంబులు, విహితంబులు) ద్రవ్య వయః కర్మ గుణ
విశేషంబులు చతుర్విధసర్గం బెవ్వనియాత్మతంత్రం బెవ్వనివలన
సిద్ధించి లోకంబులును లోకపాలురును బ్రతుకుచుందురు పెరుఁ
గుచుందురు దివిజులకు నాయువు సంఘంబు బలంబునై నగంబులకు
నీశుండై ప్రజలకుఁ బ్రజనుండై ప్రజావనక్రియాకాండనిమిత్త
సంభవుండగు జాతవేదుండై యంతస్సముద్రంబున ధాతుసంఘాతం
బులం బ్రపచించు బ్రహ్మమయుండై ముక్తికి ద్వారంబై యమృ
తమృత్యుస్వరూపుండై చరాచర ప్రాణులకుఁ బ్రాణంబై యోజ
స్సహోబలవాయురూపంబులైన ప్రాణేంద్రియాత్మశరీరకేతుండై
పరమమహావిభూతియగు నప్పరమేశ్వరుండు మాకుఁ బ్రసన్నుండ
గుంగాక యని మఱియును. 155

క. మొదల జలమిడిన భూజము
దుది నడుమను జల్లఁదనము దొరకొనుమాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన
ముద మొందుదు మెల్ల వేల్పు మూకలు నేర్పన్. 156

క. ఆపన్నులగు దిదృక్షుల
కోపుణ్య భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ

ప్రాపింపఁ జేయు సంపద
నో పరమదయానివాస యుజ్జ్వలతేజా. 157

వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేక విధంబులం గీర్తించుచు
నున్న పరమేష్ఠి యందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వ
గర్భుం డావిర్భవించె. 158

మ. ఒకవేయర్కులు గూడి గట్టికవడై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చనుదెంచుమాడ్కి హరి దా నొప్పారె నా వేలుపుల్
వికలాలోకనులై [1]విషణ్ణమతులై విభ్రాంతులై మ్రోలఁ గా
నక శంకించిరి కొంతప్రొద్దు విభుఁ గా నం బోలునే వారికిన్.

వ. అప్పుడు. 160

సీ. హారకిరీట కేయూరకుండలపాద
కటక కాంచీలతాగ్ర కంకణాది
[2]కౌస్తుభోపేతంబుఁ [3]గౌమోదకీశంఖ
చక్ర [4]శరాసన సంయుతంబు
మరకతశ్యామంబు సరసిజనేత్రంబుఁ
గర్ణాభరణకాంతి గండయుగముఁ
గలితకాంచనవర్ణ [5]కౌశేయవస్త్రంబు
శ్రీ[6]వనమాలికా సేవితంబు

ఆ. నై మనోహరంబు నై దివ్యసౌభాగ్య
మైన యతనిరూపు హర్ష మెసఁగఁ
జూచి బ్రహ్మహరుఁడు సురలును దానును
బొంగి సమ్ముఁడగుచుఁ బొగడఁ దొడఁగె. 161

క. జననస్థితి లయదూరుని
మునినుతు నిర్వాణసుఖస ముద్రుని సుగుణుం
దనుతనునిఁ బృథుల పృథులుని
ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 162

---

1 విషణ్ణమతులు=మొద్దుబారిన మనస్సుగలవారు, 2 కౌస్తుభము=విష్ణువు ఱొమ్మున నుండు రత్నము, 3 కౌమోదకి=ఆయన గద, 4 శరాసనము=శార్ఙ్గము ఆయన విల్లు, 5 కౌశేయ వస్త్రము=పట్టువస్త్రము, 6 వనమాలిక=ఆయన మెడయందలి తులసీదళ మాల దండ.

పురుషోత్తమ నీ రూపము
పరమశ్రేయంబు భువన । పంక్తుల కెల్లన్
స్థిరవైదిక యోగంబున
వరుసను మీయందు కాన । వచ్చెను మాకున్. 163

క. మొదలును నీలోఁ దోఁచెను
తుదియును నటఁ దోఁచె నడుము । దోఁచెను నీవే
మొదలు నడుము తుది సృష్టికిఁ
గదియఁగ ఘటమునకు మన్ను । గతియగు మాడ్కిన్. 164

క. నీ మాయచేత విశ్వము
వేమాఱు సృజింతు వనుచు । విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపదవిని
నేమంబున సగుణుఁడైన । నినుఁ గాంతు రొగిన్. 165

ఆ. అన్న మవనియందు । నమృతంబు గోవుల
యందు వహ్ని సమిధ । లందు నమర
యోగవశతఁ బొందు । నోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు । రాత్మవిదులు. 166

మత్తకోకిలము.

పట్టులేక బహుప్రకారవి । పన్నచిత్తుల మైత్రిమే
మెట్టకేలకు నిన్నుఁ గంటి మ । భీప్సితార్థము వచ్చుఁ బె
న్వెట్టయైన దవానలంబున । వేఁగు సేనుఁగు మొత్తముల్
నిట్టవేర్చిన గంగలోపల । నీరుగాంచిన చాడ్పునన్. 167

మత్తకోకిలము.

నీకు నేమని విన్నవింతుము । నీవు సర్వమయుండ వై
లోకమెల్లను నిండియుండఁగ । లోకలోచన నీపదా
లోకనంబు శుభంబు మాకును । లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ ద । నర్చు కేతుతతిక్రియన్. 168

వ. అని కమలసంభవ ప్రముఖులు వినుతి సేసిరని చెప్పి నరేంద్రునకు
శుకుం డిట్లనియె. 169

శా. ఈరీతిం జతురాననాదినుతుఁడై । యేపార జీమూతగం
భీరంబైన రవంబునం బలికె సం । ప్రీతాత్ముఁడై యీశ్వరుం

గలఁగి వెఱవ వలదు ƒ కామరోషంబులు
వస్తుచయమునందు ƒ వలదు చేయ. 175

వ. అని యాదేశించి. 176

క. [1]అంతాదిరహితుఁ [2]డచ్యుతుఁ
డంతర్ధానంబు నొందె ƒ [3]నజఫాలాక్షుల్
సంతోషంబునఁ దమతమ
కాంతాలయములకుఁ జనిరి ƒ గౌరవ మొప్పన్. 177

క. కయ్యంబు సేయ నొల్లక
నెయ్యంబున నతులు వెట్టి ƒ నిర్జరనికరం
బియ్యప్పనములు వెట్టుచుఁ
దియ్యంబునఁ గొల్చె బలిని ƒ దేవద్వేషిన్. 178

క. పస సెడి తనకును వశమై
సుసరముతో గొల్చుచున్న ƒ సురసంఘములన్
గసిమసఁగి చంపఁ బూనిన
నసురుల వారించె బలియు ƒ నతినయయుక్తిన్. 179

వ. అట్లు వారించి [4]వైరోచని రాక్షస సముదయంబున కిట్లనియె. 180

క. పగవారు శరణు చొచ్చిన
మగతనములు నెఱపఁ దగదు ƒ మగవారలకున్
దగు సమయ మెఱుఁగ వలదే
మగటిమిఁ బాటింప వలద ƒ మర్త్యులతోడన్ 181

వ. అని పలికి కొలువు కూటంబున సురనికర పరివృతుండై నిఖిలలోక రాజ్యలక్ష్మీ సహితుండై యఖిలవిబుధవీర విజయాహంకార నిజాలంకారుండై సుఖంబునంగొలువున్న విరోచన నందనుం గని శచీవిభుం డుత్తమ సచివుండునుంబోలె సాంత్వ వచనంబుల శాంతిం బొందించి [5]పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి యరిష్టనేమి ననునయించి త్రిపురవాసులగు దానవుల నొడంబఱిచి జంభునిసమ్మతంబు సేసికొని హయగ్రీవుని

---

1 అంతాదిరహితుఁడు=చివర మొదలు లేనివాఁడు, 2 అచ్యుతుఁడు=చావులేనివాఁడు (హరి) 3 అజఫాలాక్షులు=బ్రహ్మరుద్రులు, 4 వైరోచని=విరోచనుని కొమారుఁడు (బలిచక్రవర్తి), 5 పురుషోత్తమ శిక్షితము=ఉత్తమ పురుషుఁడైన విష్ణువుచేత శిక్షింపబడినది (న్యాయమార్గము).

విగ్రహంబు మాన్పి నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి విప్రచిత్తికిం బొత్తు హత్తించి శకుని విరోచనప్రహేతులకుం బోరామి చూపి మయమాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యొసంగించి కుంభ నికుంభులకు సౌజన్యంబుఁ గైకొలిపి పౌలోమ కాలకేయ నివాతకవచాదులయెడ బాంధవంబు ప్రకటించి వజ్రదంష్ట్రికి నశక్తుండై యితర దానవదైత్య సమూహంబువలన నతి స్నేహంబు సంపాదించి మనకతి నకా నెవియుం బ్రతిబద్ధలకు నొడ్డారంబు లేమిటికి నేకకార్యపరత్వంబున నష్టంబు లేక బ్రదుకుద మన్యోన్యవిరోధంబు లేల తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి మిది మొదలు దనుజ దివిజసముదయంబులకు రాజు విరోచననంద నుండై మనమందఱ మతని పంపు సేయంగలవార ముభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు ననిన యమృతజలధి మథన ప్రారంభకథనంబు దెలియం జెప్పినట్లు సురాసురయూథంబులు బలి [1]బలారాతిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాద నాయత్తచిత్తులై యైకమత్యంబు నొంది యమందగమనంబున మందర నగంబునకుం జని. 182

సీ. [2]వాసవవర్ధకి వాఁడిగాఁ జఱచిన
[3]కుద్దాలముఖములఁ గ్రొత్త ద్రవ్వి
[4]ముసలాగ్రములు సొన్పి మొదలిపాతగలించి
దీర్ఘపాశంబులఁ గ్రిందు సుట్టి
పెకలించి బాహుల బీడించి కదలించి
పెల్లార్చి తమతమ పేరు వాడి
పెఱికి మీఁదికి నెత్తి పృథులహస్తంబులఁ
దలల భుజంబులఁ దరలకుండ

తే. నాని మెల్లన [5]కుఱుతప్పు టడుగు లిడుచు
భార మధికంబు మఱవక పట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చిర మందగతిని
దేవదైత్యులు జలరాశి తెరువుపట్టి. 183

1 బలారాతి=బలుడనువానికి విరోధి (ఇంద్రుడు), 2 వాసవవర్ధకి=ఇంద్రునియొక్క వడ్రంగి (విశ్వకర్మ), 3 కుద్దాలము = గుదలి, 4 ముసల + అగ్రము = రోకలి కొన

క. మందరము మోవనోపమి
నందఱుపైఁ బడియె నదియు నతిచోద్యముగాఁ
గొందఱు నేలం గలిసిరి
కొందఱు నుగ్గయిరి చనిరి కొందఱు భీతిన్. 184

క. ఏలా హరికడ కేఁగితి
మేలా దొరఁగొంటి మనక హేలన శైల
న్మ్రోలనము సేసి తెచ్చితి
మేలా పెక్కండ్రఁ మడిసి రేలా నడుమన్. 185

క. ఏటికి మముఁ బనివంచెను
నేటికి దమబోఁటివారి కింతలు పను లిం
కేటికి రాఁడు రమేశ్వరుఁ
డేటి కుపేక్షించె మఱవ నేటికి మనలన్. 186

వ. అని [1]కులకుధర పతనజన్యంబగు [2]దైన్యంబు సహింపనోపక వల
వించుచున్న దివిజ దితిజుల భయంబు మనంబున నెఱింగి సకల
వ్యాపకుండగు హరి దత్సమీపంబున. 187

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్య సంయుక్తుఁడై
[3]హరికోటిప్రభతో నొహహోవెఱవకుం డంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ నలువొంద గంపుకము మా డ్కిం బట్టి క్రీడించుచు
న్గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్.

క. వారలు గొలువఁగ హరియును
వారాన్నిధి కరుగు మనఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁ గొంచు న
వారితగతిఁ జనియె [4]విహగ వల్లభుఁ డెలుతన్. 189

క. చని జలరాశితటంబున
వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు
[5]వనివిని యెను భక్తి నాత్మ భవనంబునకున్. 190

వ. అప్పుడు. 191

1 కుల .....జన్యము=కులకొండల కూలిన పాటున గలిగిన, 2 దైన్యము=దీనత్వము,
3 హరికోటిప్రభ=కోటిసూర్యప్రకాశము, 4 విహ...భుడు=పక్షిరాజు (గరుడుఁడు),

సీ. భూనాథ విను వారు భోగీంద్రు వాసుకిఁ
బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి
మెల్లన చేతుల మేను నివిరి
నీవ మా కెవ్వారు నేస్తకాఁ డని కియ్య
కొమ్మని యతని త్రాటి కోలు వడసి
¹కవ్వపుఁ గొండ నిష్కంటకంబుగఁ జేసి
ఘట్టించి యతని భోగంబుఁ జుట్టి
ఆ. కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి
త్రచ్చు నవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్రకేశ భారులై యారెండు
గములవారు తరువఁ గదిసి రచట. 192
వ. తదనంతరంబ. 193
క. హరియును దేవానీకము
నురగేంద్రునితలలు పట్ట నుద్యోగింపన్
హరిమాయాపరవశులై
సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్. 194

మత్తకోకిలము.

స్వచ్ఛమైన ఫణంబు మీరలు సక్కఁగఁ బట్టి మథింపఁగాఁ
²బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగఁ బౌరుషత్వము గల్గి మే
³మచ్ఛమైన ⁴తపోబలాధ్యయ నాన్వయంబులవార మై
యిచ్ఛయింతుమె ⁵తుచ్ఛవృత్తికి నిందుమాకు ఫణాగ్రముల్ 195
వ. అని పలుకు దనుజులం జూచి. 196
క. విస్మయముఁ బొంది దానవ
⁶ఘస్మరుఁ డహిఫణము విడువఁ గైకొని యసురుల్
విస్మితముఖులై యార్చి ⁷ర
విస్మితము గొనిరి సురలు వీఁకం దోఁకన్. 197

---

1 కవ్వంపుఁగొండ=మందరపర్వతము, 2పుచ్ఛము=తోఁక, 3 అచ్ఛము=స్వచ్ఛము, 4 తపో+బల+అధ్యయన+అన్వయములు-5తుచ్ఛవృత్తి=నీచవ్యాపారము, 6ఘస్మ

వ. ఇట్లు సమాకర్షణస్థానభాగ నిర్ణయంబు తేర్చుకొని దేవతలు పుచ్ఛంబును బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్తచిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున. 198

క. విడు విడుఁడని ఫణి పలుకఁగఁ
గడుభరమున మొదలఁ గుదురు గలుగమి గెడవై
బుడబుడరవమున నఖిలము
వడవడ వడఁకఁగ మహాద్రి వననిధి మునింగెన్. 199

ఉ. గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింప లేక దో
స్సారవిహీనులై యుభయ సైనికులుం గడుసిగ్గుతో నపా
పారతటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ యె
వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్. 200

క. వననిధిజలములలోపల
మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్
మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని
వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్. 201

## కూర్మావతారకథాప్రారంభము

సీ. సవరనై లక్షయోజనముల వెడలుపై
కడుఁ గఠోరము నైన కర్పరమును
నదనైన బ్రహ్మాండ మైన నాహరించు
ఘనతరం బగు ముఖ గహ్వరంబు
సకలచరాచర జంతురాసుల నెల్ల
మ్రింగి లోఁగొను నట్టి పొట్టికడుపు
విశ్వంబుపై తేఁచు విశ్వంబుపైఁ బడ్డ
నాఁగినఁ గదలని యట్టికాళ్ళు

తే. వెలికి లోనికిఁ జనుదెంచు విపులతుండ
మంబుజంబులఁ బోలెడు నక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి సెలువొంద నొకమహా కూర్మమయ్యె. 202

మ. [1]కమఠంబై జలరాశిఁ జొచ్చి [2]లఘుముక్తాశుక్తి చందంబునన్
సమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో వేలతో
సమరోద్రాదులు తూలికంపములతో నానాఁగ దేవాప్రతే
కమలాక్షా శరణంచు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్.

వ. ఇవ్విధంబున. **204**

క. [3]తరికాండ్రలోన నొకఁ డట
[4]తరిగడవకుఁ గుదురు నాఁక ద్రాఁడట చేరుల్
దరిగవ్వంబును దానఁట
హరిహరి హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. **205**

ఆ. జలధిఁ గడవసేయ శైలంబుఁ గవ్వంబు
సేయ భోగిఁ ద్రాఁడు సేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడుఁ దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె. **206**

ఆ. గొల్లవారి బ్రదుకు గోలఁ దనవచ్చునె
గొల్లరీతిఁ బాలకుప్ప ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
నేటు లేనిమందు సిరియుఁ గనిరి. **207**

వ. ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబు లయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని పుట్టంబులు పిరిచుట్లు సుట్టికొని కరంబులుఁ గరంబుల నప్పళించుచు భుజంబులు భుజంబుల నొరయుచు లెండు లెండు దరువఁ దొడంగుఁ డని యమందగతిం బెరుఁగుఁ ద్రచ్చు మందగొల్లల చందంబున మహార్ణవ మధ్యంబున మంథాయమానమందర మహీధరవిలగ్న భోగిభోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ బెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరం బయి గుబ్బుగుబ్బని యురులు కొండకవ్వంబు గుత్తి జిఱజిఱం దిరుఁగు వేగంబున ఘటచ్ఛటాయమానంబులయి బుగులు బుగుళ్ళను చప్పుళ్లుప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలువడు మిసిమిగల మీఁది మీఁగడ

---

1 కమఠము=తాఁబేలు, 2 లఘుముక్తాశుక్తి=చిన్న ముత్తెపుచిప్ప, 3 తరికాండ్రక=

పాలతేట నిగ్గుఁ దుంపరల పరంపరలవలన నిజకరక్రమక్రమాకర్షణ పరిభ్రాంత ఫణిఫణా గర్భ సముద్భూత నిర్భర విషకీలికీలాజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొంగొని మందగతిం జెందక యకూపార వేలాతట కుటజ కుసుమగుచ్ఛపిచ్ఛిల స్వచ్ఛ మకరందసుగంధిగంధవహంబులం గ్రోలఁ జెమట నీటిపెను వఱద గములొడళ్ళ నిగుర నొండొరులం బరిహసించుచుఁ బేరువాడి విలసించుచు మేలు మేలని యుగ్గడించుచుఁ గాదు కాదని భంగించుచు నిచ్చ మెచ్చని మచ్చరంబులవలన వనధి వలమాన వైశాఖవసుంధరాధర పరివర్తన సముజ్జనిత ఘుమఘుమారావంబును మథనగుణాయమాన మహాహీంద్రముఖ ముహుర్ముహురుచ్చలితభూరి ఘోర ఫూత్కార ఘోషంబును గులకుధరపరిక్షేపణక్షోభిత సముల్లంఘన సమాకులితంబులై వెలిచలిచి గుబురుగుబురులై యొరలు కమఠ కర్కట కాకోదర మకర తిమి తిమింగిల మరాళ చక్రవాక బలాక భేక సారసానీకంబుల మొఱలునుం గూడికొని ముప్పిరిగొని దనుజ దివిజభటాట్టహాస తర్జన గర్జన ధ్వనులు నలుపురియై మొత్తి నట్లైన దిశాదిగంతభిత్తులును బేఁటెత్తి పెల్లగిలం ద్రుళ్లుచుఁ గికురు పొడుచుచు నొకఁడొకనికంటె వడియునుం గడపునుం గలుగఁ ద్రచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబు చింతించుచు నూతనపదార్థంబులకు నెదుళ్ళు సూచుచు నెంతదడవు ద్రచ్చుమని హరి నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురుపు డింపక త్రచ్చు సమయంబున. 208

క. అప్పాల వెల్లిలోపల
నప్పటి కప్పటికి మంద రాగము దిరుగం
జప్పుడు నిండె నజాండము
చెప్పెడిదే మజుని చెవులు చిందఱ గొనియెన్. 209

వ. అంత నప్పయోరాశిమధ్యంబున. 210

క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచు
గుడి నెడమను వెనుకఁ దిరుఁగు కులగిరి గడలిం

గడలెడల సురలు నసురలుఁ
వాడిగొని ఫణిఫణము మొదలుఁ ♦ దుదియును దిగువన్. 211

క. వడిగొని కులగిరిఁ దరువఁగ
జలనిధి ఘగఘగనియెడునత ♦ ఘనఫణిగణముల్
సుడివడెఁ దడఁబడెఁ గెలఁకులఁ
బడు భయపడి నెగసి పడెను ♦ బడు నుడిపడలన్. 212

క. అమరాసురకర విహృతి
భ్రమణ ఘరాఘర వరేంద్ర ♦ భ్రమణంబును దాఁ
గమఠేంద్రు వీపు క్రేలను
శమియింపఁగఁ జాల నయ్యె ♦ జగతీనాథా. 213

వ. తదనంతరంబ. 214

క. ఆలోలజలధిలోపల
నాలో నహి విడిచి సురలు ♦ నసురలుఁ బఱవం
గీలాకోలాహలమై
[1]హాలాహలవిషము పుట్టె ♦ నవనీనాథా. 215

వ. అదియునుం [2]ప్రళయకాలాభీల ఫాలలోచన లోచనానలశతంబు చందంబున నమందంబై విలయదహన సహస్రంబు కైవడి వడియై కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున తిర్యక్సృతంబై తుది రేయి వెలింగిన మొగిలుగములవలనం బడు బలుపిడుగుల వడువున బెడిదంబై పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై భుగభుగాయమానంబులైన పొగలును జిటచిటాయమానంబులైన విస్ఫులింగంబులును ధగధగాయమానంబులైన నెఱమంటలును గలిగి మహార్ణవ మధ్యంబున మందరనగం బమంధరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై నింగికిం బొంగి దిశలకుం గేలుసాచి బయల్లు ప్రబ్బికొని తరిగవ్వంపుఁ గొండ నండగొనక నిగిడి కడలి నలుగడలకుం బఱచి దరుల కుఱికి సురాసుర సముదయంబులం దరికొని గిరివర గుహాగహ్వరంబుల సుడివడక కులశిఖరి శిఖరంబుల నెరగలివడి

---

1హాలాహలము=విష భేదము, 2ప్రళయ...శతము=ప్రళయమందలి భయంకరమైన

గహనంబులఁ దహించి కుంజమంజరీ పుంజంబుల భస్మంబు సేసి జన
పదంబు లేర్చి నదీనదంబు లెరియించి దిక్కుంభి కుంభంబులు
నిక్కలు వడ నిక్కి తరణితారామండలంబులపై మిట్టించి మహ
ర్లోకంబు దరికొని యుపరిలోకంబునకు మాఱు గొనలిడి సుడివడి
ముసరుకొని బ్రహ్మాండగోళంబు సిటిలిపడఁ దాటి పాతాళాది
లోకంబులకు వెల్లివాఱి సర్వలోకాధికంబై శక్యంబుగాక
యెక్కడఁ జూచినం దానయై కురంగంబు క్రియం గ్రెళ్లుఱుకుచు
భుజంగంబు విధంబున నొడియుచు సింగంబు భంగి లంఘించుచు
విహంగంబు పగిది నెగయుచు మాతంగంబు పోలికి నిలువంబడుచు
నిట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయు
చున్న సమయంబున మెలకు సెగల మిడుకంజాలక నీఱైన దేవ
తలును నేలం గూలిన రక్కసులును [1]డుల్లిన తారకలును గీటడంగిన
కిన్నరమిథునంబులును గమరిన గంధర్వవిమానంబులును జీకాకు
పడిన సిద్ధచయంబులును జిక్కువడిన గ్రహంబులును జిందఱ
వందఱలయిన వర్ణాశ్రమంబులును నిగిరిపోయిన నదులును
నింకిన సముద్రంబులును గాలిన కాననంబులును బొగిలిన పురంబు
లును బొనుఁగుపడిన పురుషులును బొక్కిపడిన పుణ్యాంగనా
జనంబులును బగిలిపడిన పర్వతంబులును భస్మంబులైన ప్రాణి
సంఘంబులును వేఁగిన లోకంబులును వివశలైన దిశలును నొడ్డ
గెడవులైన భూజచయంబులును నఱవఱలైన భూములును నై
యకాలవిలయకాలంబై తోఁచుచున్న సమయంబున. 216

క. ఒడ్డారించి విషంబున కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్
గొడ్డేటి ప్రమందిరాలన బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా. 217

వ. అప్పుడు. 218

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యీ
శుని దౌవారికు లడ్డపడ్డఁ దలమంచుం జొచ్చి కుయ్యో మొఱో
విను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపుమంచుం బుజా
సనముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్. 219

క. వారలు దీనతవచ్చుటఁ
గూరిమితో నెఱిఁగి నగప కూఁతురుఁ దానుం
బేరోలగమున నుండి ద
యారతుఁడై [1]చంద్రచూడుఁ డవసర మిచ్చెన్. 220

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి ప్రజాపతిముఖ్యు లిట్లని స్తుతియించిరి. 221

సీ. భూతాత్మ భూతేశ భూతభావనరూప
దేవ మహాదేవ దేవవంద్య
యీలోకములకెల్ల నీశ్వరుండవు నీవ
బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ
గోరి భజింతురు కుశలమతులు
సకలసృష్టిస్థితి సంహారకర్తవై
బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరఁగు దీవు

ఆ. పరమగుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త
మంబు నీవశక్తి మయుఁడ వీవ
[2]శబ్దయోని వీవ జగదంతరాత్మవు
నీవ ప్రాణ మరయ నిఖిలమునకు. 222

క. నీయంద సంభవించును
నీయంద వసించి యుండు నిఖిలజగములున్
నీయంద లయముఁ బొందును
నీయుదరము సర్వభూత నిలయము రుద్రా. 223

సీ. అగ్నిముఖంబు [3]పరాపరాత్మక మాత్మ
కాలంబు గతి రత్న గర్భపదము
[4]శ్వసనంబు నీయూర్పు [5]రసన [6]జలేశుండు
దిశలుఁ గర్ణంబులు దివము నాభి

---

1 చంద్రచూడుఁడు=చంద్రుఁడు జడముడి యందుగలవాఁడు, 2 శబ్దయోనివీవ=శబ్దము బుట్టెడు ఆకాశరూపముగలవాఁడవు నీవే, 3 పరాపరత్మకము=ఇహపరములు గలది, 4 శ్వసనము=వాయువు, 5 రసన=నాలుక, 6 జలేశుఁడు=వరుణుఁడు.

సూర్యుండు గన్నులు శుక్లంబు సలిలంబు
[1]జఠరంబు జలధులు [2]చదలు శిరము
సద్యోషధులు రోమ చయములు శల్యంబు
లద్రులు మానస మమృతకరుఁడు
తే. [3]ఛందములు ధాతువులు ధర్మ సమితి హృదయ
[4]మాస్యపంచక ముపనిష దాహ్వయంబు
నయిన నీరూపు పరతత్త్వ మైనశివాఖ్య
మై స్వయంజ్యోతియై యొప్పు నాద్య మగుచు. 224

క. కొందఱు గలఁ డందురు నినుఁ
గొందఱు లేఁడందు రతఁడు గుణిగాఁ డనుచుం
గొందఱు గలఁ డని లేఁ డని
కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా. 225

సీ. తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్యగుణస్వభా
వుఁడవు కాలక్రతు వులును నీవ
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును
నీవ ముఖ్యుండవు నిఖిలమునకు
ఛందోమయుండవు [5]సత్త్వరజస్తమ
శ్శక్తుండ వై యుందు సర్వరూప
కామపురాధ్వర కాలగరాదిభూ
తద్రోహభయము చో ద్యంబు గాదు
తే. లీల లోచనవహ్నిస్ఫు లింగశిఖల
నంతకాదులఁ గాల్చిన యట్టినీకు
రాజఖండావతంస పు రాణపురుష
దీనరక్షక కరుణాత్మ దేవ దేవ. 226

ఆ. మూఁడుమూర్తులకును మూఁడులోకములకు
మూఁడుకాలములకు మూలమగుచు

---

1 జఠరము=కడుపు, 2 చదలు=ఆకాశము, 3 ఛందములు=వేదములు, 4 ఆస్య పంచకము=ఐదు మొగములు, (ఈశ్వరుని ముఖములు, 1 సద్యోజాతము, 2 వామదేవము, 3 అఘోరము, 4 ఈశానము, 5 తత్పురుషము,) 5 సత్త్వ...శక్తుండవు =

భేద మగుచుండు నది నీ భేదమ్మై యొప్పారు
బ్రహ్మమనఁగ నీవ ఫాలనయన. 227

క. సదస త్తత్త్వపరాపర
సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
వేదములుఁ గదలుప వెఱతురు
వదలక నినుఁ బొగడ నెంతవారము రుద్రా. 228

మత్తకోకిలము.

బాహుశక్తిసురాసురుల్ సని పాలవెల్లిమథింప హా
లాహలంబు జనించె నేరికి లంఘ్యమై భువనంబు కో
లాహలంబుగఁ జేసి చిచ్చును లోకముంగొని ప్రాణిసం
దోహముం బ్రదికింపవే దయ దొంగిలింపఁగ నీశ్వరా 229

క. లంపటము నివారింపను
సంపదఁ గృప సేసి జయము సంపాదింపం
జంపెడివారి వధింపను
సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా 230

క. నీకంటె నొం డెఱుంగము
నీకంటెం బరులు గావ నేరరు జగముల్
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల నిఖిల లోకస్తుత్యా. 231

వ. అని మఱియు నభినందించుచున్న [1]ప్రజాపతిముఖ్యులం గని సకల
భూతసముండగు నద్దేవదేవుండు దనప్రియసతికిట్లనియె. 232

## శివుండు దేవప్రార్థితుండై హాలాహలమును పానము సేయుట

క. కంటే జగములదుఃఖము
వింటే జలజనితవిషము వేఁడిమి ప్రభువై
యుంటకు నార్తులయాపద
గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ. 233

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లం

ప్రాణుల కిత్తురు సాధులు
ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా. 234

క. పరహితము సేయు నెవ్వఁడు
పరమహితుం డగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ. 235

క. హరి మది నానందించిన
హరిణాక్షీ జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ
గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ. 236

క. శిక్షింతు హాలహలమును
భక్షింతును మధురసూక్ష్మఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణికోట్లను
వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ. 237

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ దేవా దేవరచిత్తంబు కొలంది నవధరింతుగాక యనిపలికె నని చెప్పిన నమ్మునీంద్రుం డిట్లనియె.

మ. అమరన్ లోకహితార్థమంచు నభవుం డౌఁగాక యంచాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజగర్భాదులుం
దముఁగావన్ హరలెమ్ము లెమ్మనిరి పో తాఁ జూచి కన్నంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రాగ్నిజ్వాలలన్.

వ. అనిన శుకుం డిట్లనియె. 240

క. మ్రింగెడువాఁడు విభుం డని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో. 241

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘనగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహి హుం పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

వ. అయ్యతిరళ మహాగరళ దహనపాన సమయంబున. 243

మ. కదలం బాఱవు [1]పాఁపపేరు లొడలన్ ఽ ఘర్మాంబు జాలంబు వు
ట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజజూ ఽ టాచంద్రుఁడుం గందఁడున్
వదనాంభోజము వాడదావిషము నాఽహ్వానించుచోఁ డాయుచోఁ
బదిలుండై కడిసేయుచోఁ దిగుచుచోఽభక్షించుచో మ్రింగుచోన్.

క. ఉదరము లోకంబులకును
సదనంబగు టెఱిఁగి శివుఁడు ఽ చటులవిషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ
బదిలంబుగ నిలిపె సూక్ష్మ ఽ ఫలరసముక్రియన్. 245

క. మెచ్చిన మచ్చికఁ గలిగిన
నిచ్చిన నీ వచ్చుఁగాక ఽ యిచ్చ నొరులకుం
జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె
[2]చిచ్చఱరూ పచ్చుపడిన ఽ శివునకుఁ దక్కన్. 246

ఆ. హరుఁడు గళమునందు ఽ హాలాహలము వెట్టఁ
గప్పుఁ గలిగి తొడవు ఽ కరణినొప్పె
సాధురక్షణంబు ఽ సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె ఽ భూవరేంద్ర. 247

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున
హరుఁడు ధరించుటకు మెచ్చి ఽ యహా నౌ ననుచున్
హరియు విరించియు నుమయును
సురనాథుఁడుఁ బొగడి రంత ఽ సుస్థిరమతితోన్. 249

క. హాలాహలభక్షణకథ
హేలాగతి విన్నవ్రాయ ఽ నెలమిఁ బఠింపన్
[3]వ్యాళానలవృశ్చికముల
పాలై చెడ రెట్టిజనులు ఽ భయవిరహితులై. 250

వ. మఱియు నారత్నాకరంబు సురాసురులు ద్రచ్చు నెడ. 251

---

1 పాపపేరులు=పాముల దండలు, 2 చిచ్చఱరూపు=అగ్నిరూపము, (శివుఁ డగ్ని రూపుఁడు, పంచభూతములు వాని వివరణము, 1 బ్రహ్మ=భూమి, 2 విష్ణువు=జలము, 3 రుద్రుఁడు=అగ్ని, 4 జీవుడు=వాయువు, 5ఆత్మ = ఆకాశము) 3 వ్యాళ +

## పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట

క. తెల్లని మేనును నమృతము
జిల్లున జల్లించుపొదుఁగు శితశృంగములుం
బెల్లుగ నర్థులకోర్కులుఁ
వెల్లి గొలుపు మొదవు పాల వెల్లిం బుట్టెన్. 252

ఆ. అగ్నిహోత్రి యనుచు నాసురభిని దేవ
మునులు పుచ్చుకొనిరి మున్నె ఱెంగి
విబుధసంఘములకు వెరవుతో నధ్వర
హావులు వెట్టుకొఱకు నవనినాథ. 253

వ. మఱియు నాజలరాశియందు. 254

క. సచ్చంద్రపాండురంబై
[1]యుచ్చైశ్శ్రవ మనఁగ దురగ మొగి జనియించెం
బుచ్చుకొనియె బలిదైత్యుం
డిచ్చగొనం దయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

క. ఒఱపగుసురమును బిఱుఁదును
నెఱిఁదోఁకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిఁగన్నులుఁ
దఱచగు కందంబుఁ జూడఁ దగు నాహరికిన్. 256

వ. అంత నా పాలకుప్పయందు. 257

క. దంతచతుష్టాహతిశై, లాంతంబులు విఱిగిపడఁగ నవదాత [2]శుభ్ర
తాక్రాంతంబగు నైరావణ, దంతావళ ముద్భవించె ధరణీనాథా.

క. తడలేని నడపు వడిగల
యొడలును బెనునిడుదకరము నురుకుంభములున్
బెడఁగై యువతుల మురిపపు
నడకలకున్ మూలగురువ నన్ గజమొప్పెన్. 259

వ. మఱియు నత్తరంగిణీవల్లభు మథించు నయ్యెడ. 260

ఆ. ఎల్లఋతువులందు నెలరారి పరువమై
యింద్రువిరులతోఁట కేపుదెచ్చి

1 ఉచ్చైశ్శ్రవము=నిక్కించిన చెవులుగల తెల్ల గుఱ్ఱము, 2 శుభ్రతాక్రాంతము =

కోరి వచ్చువారి । కోర్కెల నీనెడు
[1]వేల్పుమ్రాను పాల । వెల్లెఁబుట్టె. 261

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె నంత. 262

క. క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ
గిక్కిరిసిన చన్నుఁగవలుఁ । [2]గ్రిస్సినడుముల్
పిక్కటిలియున్న తుఱుములుఁ
జక్కని చూపులును దివిజ । సతులకు నొప్పెన్. 263

వ. వెండియు నా రత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించు చుండెనంత.

క. తొలుకారు మెఱుఁగు కైవడి
తళతళ మని మేను మెఱవ । ధగధగ మనుచున్
గలుముల నీనెడుచూపులఁ
జెలువంబుల మొదలిటెంకి । సిరిపుట్టె నృపా. 265

సీ. పాలమున్నీటిలో । పలి మీఁది మీఁగడ
మిసిమిజిడ్డునఁ జేసి । మేనుపడసి
క్రొక్కారు మెఱుఁగుల । కోడల క్రొత్తళుకుల
మేనిచే గల నిగ్గు । మెఱుఁగు సేసి
నాఁటినాఁటికిఁ బ్రోది । నవకంపుఁదీవల
నునుఁబోద నెయ్యంబు । నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి । కోలఁకునఁ బ్రొద్దునఁ
బొలసిన వలపులఁ । బ్రోది వెట్టి

తే. పసిఁడిచంపకదామంబు । బాగుఁ గూర్చి
వాలు క్రొన్నెలచెలువున । వాడిఁదీర్చి
జాణతనమునఁ జేతుల । జడ్డు విడిచి
[3]నలువ యాకొమ్మనొగిఁ జేసి । నాఁడు నేఁడు 266

క. కెం పారెడు నధరంబును
జం పారెడి నడుము సతికి । [4]శంపారుచులన్

1 వేల్పుమ్రాను=కల్పవృక్షము, 2 క్రిస్సిన=(క్రియ్యు ధాతువునుండి పుట్టిన విశేషణము) దీని వ్యార్థకము క్రిస్సి=చికి_, 3 నలు + వ=వాలుగు నోళ్లుగలవాఁడు (బ్రహ్మ)

సొంపారు మోముఁ గన్నులుఁ
బెంపారుచు నొప్పు గొప్ప । పిఱుఁదును గుచముల్. 267

వ. అని జనులు వొగడుచుండ. 268

సీ. తరుణికి మంగళ । స్నానంబు సేయింత
మని పెట్టె నింద్రుఁ డ । నర్ఘ్యమైన
మణిమయపీఠంబు । మంగళవతులైన
వేలుపుగరితలు । విమలతోయ
పూర్ణంబులైయున్న । పుణ్యాహకలశంబు
లిడిరి పల్లవముల । నిచ్చె భూమిఁ
గడిమి గోవులు [1]పంచ । గవ్యంబులను నిచ్చె
మలసి వసంతుండు । మధువాసంగ

తే. మునులు గల్పంబుఁ జెప్పిరి । మొగిలుగములు
పణవగోముఖకాహళ । పటహమురజ
శంఖవల్లకీ వేణుని । స్వనము లిచ్చెఁ
బాడి రాడిరి గంధర్వ । పతులు సతులు 269

క. పండితసూక్తులతోఁ డుతఁ
దుండంబులు సాఁచి తీర్థ । తోయము లెల్లం
దుండముల ముంచి దిగ్వే
దండంబులు జలకమార్చెఁ । దరుణీమణికిన్. 270

సీ. కట్టంగఁ బచ్చని । పట్టుఁబుట్టపుదోయి
ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె
[2]మత్తాళినికరంబు । [3]మధ్వాశ మూఁగిన
వైజయంతీమాల । వరుణుఁ డిచ్చెఁ
గాంచన కేయూర । కంకణకింకిణీ
కటకాదులను విశ్వ । కర్మ యిచ్చె
భారతి యొకమంచి । తారహారము నిచ్చెఁ
బాణిపద్మము నిచ్చెఁ । బద్మభవుఁడు

---

1 పంచగవ్యము=ఆవువలనం గలుగు 5 వస్తువులు, (పాలు,పెరుగు,నేయి,పేడ, మూత్రము), 2 మత్త+అళి+నికరము=మత్తాళినికరము=పొగరెక్కిన తుమ్మెదమొత్తము,

ఆ. గుండలో వ్రజంబు గుండలముల నిచ్చె
సవిత్రులు భద్రసైన నుతులు సేసె
నెల్లలోకములకు నేలికసాని వై
బ్రదికె దనుచు దిశలు పలికె నధిప. 271

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు సిలుక నెవ్వానితో
భాషించె వాఁడెపో బ్రహ్మయనఁగ
నెలయించి కేంగేల నెవ్వని వరియించె
వాఁడె లోకములకు వల్లభుండు
మెయిదీఁగె నెవ్వని మేనితోఁ గదియించె
వాఁడెపో పరమసర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెవ్వాని నివసించె నేయింట
నాయిల్లు పరమగు నమృతపదము

ఆ. ఇంతి చూపువాఱె నెచ్చోటి కచ్చోటు
జిష్ణు ధనదధర్మ జీవితంబు
గొమ్మపిన్న నగవు గురుతరసుఖని
వారణంబు సృష్టి కారణంబు. 273

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు
నాటల బొమ్మరి ల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ
దనయింటిలో దొంతు లని తలంచుఁ
బాటించి యొకమాటు బ్రహ్మాదిసురులను
దనయింటిలో బొమ్మ లని తలంచుఁ
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు
నలవడ బొమ్మసీఁ టని తలంచు

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల
నచటిదీపకళిక లని తలంచు
భామ యొక్కమాటు భారతీదుర్గల

వ. తదనంతరంబ. 276

ఆ. చంచరీకనికర ఝుంకారనినదంబు
దనరు నుత్పలముల దండఁ బెట్టి
మేఘకోటినడిమి [1]మెఱుఁగుఁబుత్తడిమాడ్కి
సురలనడుమ నిల్చె సుందరాంగి. 277

క. ఆకన్నులు నాచన్నులు
నాకురు లాపిఱుఁదు నడుము నాముఖ మానన
వ్యాకారముఁ గని వేల్పులు
సీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

వ. అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించి యున్న యక్షరక్షస్సిద్ధ సాధ్య దివిజ గరుడగంధర్వచారణ ప్రముఖ నిఖల యూథంబులం గనుంగొని [2]యప్పూరాణపౌరుష కన్యాకారత్నంబుఁ దన మనంబున నిట్లని వితర్కించె. 279

సీ. ఐదువ నై యుండ సలవడ దొకచోట
నొకచోట సవతితో నొర్వరాదు
తగ నొకచోట సంతత వైభవంబుఁ గా
దొకచోట వేఁడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణాలే దొక్కింత వెదకిన
నొకచోట డగ్గఱి యుండఁ బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ సాలదు
చర్చింప నొకచోట జడతఁ గలదు

ఆ. కొన్నిచోట్ల కామ గుణగరిష్ఠంబులు
క్రోధసంయుతములుఁ గొన్ని యెడలు
గొన్ని మోహ లోభ కుంఠితంబులుఁ గొన్ని
ప్రమదమత్సరాను భావకములు. 280

వ. అని సకల సత్పురుషజనన వర్తనంబులు మానసించి పరిహరించి.

సీ. అమర ముత్తైదువ నై యుండ వచ్చును
వరుసకుసవతు లె వ్వరును లేరు

---

1 మెఱుఁగు పుత్తడి=మెఱసెడి బంగారము, 2 అప్పూరా ..రత్నము=ఆతొల్లింటి పోడ కన్యా మిన్న.

వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు
శృంగారచందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధ కారుణ్యమయమూర్తి
విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడఁ గలవాఁడు
సకల కార్యములందు జడత లేదు

ఆ. సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు
నాథుఁ డయ్యెనేని నడప నోపు
నతఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ
బుష్పదామకమునఁ బూజ సేసె. 282

క. ఇందీవరదామమున ము
కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము
నందంద సలజ్జదృష్టి నాలోకించెన్. 283

ఆ. మోహరుచులవలన ముద్దియ దల యెత్తు
సిగ్గువలన బాల శిరము వంచు
నింతి వెఱపువలన నెత్తదు వంపదు
తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి. 284

క. హరి సూచిన సిరి సూడదు
సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్
హరియును సిరియునుఁ దమలో
సరిఁజూపులఁ జూడ మరుఁడు సందడి వెట్టెన్. 285

చ. జగముల తండ్రి యై తనరు శౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటిభంగి నతి మంగళసాధ్వపతిత్వ సంపదన్
నెగడిన లోకముల్ గని రనేక శుభంబులఁబొంది రత్తఱిన్. 286

వ. అట మున్న యబ్ధిరాజు దనయందున్న యమూల్యంబయిన కౌస్తు
భంబు పేరటి యనర్ఘమణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పిం
చిన దానిం దనవక్షస్స్థలంబున ధరియించె, నప్పు డయ్యాది
లక్ష్మీ యుక్త శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికాతారహారాద్య

లంకృతంబైన పుండరీకాక్షు వక్షస్స్థలంబున వసియించె నయ్యవసరంబున. 287

శా. మ్రోసెన్ శంఖమృదంగ వేణురవముల్ మున్నాడి వెంజీకటుల్
వాసెన్ నర్తనగానలీలలసురల్ భాసిల్లి రార్యుల్ జగ
ద్వాసుల్ విష్ణుని బ్రహ్మరుద్రముఖరుల్ [1]తల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్. 288

క. ఆపాల వెల్లిగూఁతురు
దీపుల చూపులను దోఁగి తిలకింపఁ బ్రజల్
చేపట్టిరి సంపదలనుఁ
బ్రాపించెను మేలు జగము బ్రదికె నరేంద్రా. 289

క. పాలేటి రాచకన్నియ
మే లారెడు చూపులేక మిడుమిడు కంచుం
జాలిం బురపురఁ బొక్కుచుఁ
దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా. 290

క. వారిధిఁ దరువఁగ నంతట
వారుణి యన నొక్కకన్య వచ్చిన నసురుల్
వారిజలోచను సమ్మతి
వారై కైకొనిరి దాని వారిజనేత్రన్. 291

వ. మఱియుం దరువం దరువ నప్పయోరాశియందు. 292

సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు గంబుకం
ధరుఁడు పీతాంబరధారి [2]స్రగ్వి
లాసితభూషణాలంకృతుం డరుణాక్షుఁ
డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచితకేశనివహుండు జలధర
శ్యాముండు మృగరాజసత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు
నంశాంశసంభవుం డమలమూర్తి

ఆ. భూరియాగభాగభోక్త ధన్వంతరి
యనఁగ నమృతకలశహస్తుఁ డగుచు

1 తల్లింగమంత్రంబులన్ = ఆ గుఱుతులుగల మంత్రములచేత, 2 స్రగ్వి = పూలదండల

నిఖిల వైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది
[1]వేల్పు వెజ్జుఁ గడలి వెడలివచ్చె. 293

వ. తదనంతరంబ. 294

ఆ. అతని చేతనున్న యమృతకుంభము సూచి
కెరలువాడిచి సురలఁ గికురువెట్టి
పుచ్చికొనిరి యసుర పుంగవు లెల్లను
మాఱులేని బలిమి మానవేంద్ర. 295

వ. వెండియు. 296

ఆ. చావులేని మందు చక్కఁగ మనకబ్బె
ననుచుఁ గడవ నసురు లాఁచికొనిన
వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా
పూర్ణఘటము పోయెఁ బోయెననుచు. 297

## శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట

వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజన[2]కామదుండగు నప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింప వలవ దేను నామాయాబలంబునం జేసి మీయర్థంబు మరల సాధించెద నని పలికెఁ దత్సమయంబున నయ్యమృతపూరంబు నేమ త్రావుదు మనితమకించు దైత్యదానవ జనంబుల లోపల నమంగళం బగుకలి సంభవించిన కతంబునఁ బ్రబలు లగు రక్కసుల విలోకించి సత్త్రయాగంబునందు నడచు చందంబునఁ దుల్యప్రయాసహేతువులగు సురలను సుధాభాగంబున కర్హులగుదురు గావునఁ బంచికుడుచుట కర్తవ్యంబిది సనాతనం బగుధర్మం బగుటం జేసి యయ్యమృతకుంభంబు విడువుండని దుర్బలులగు నిశాచరుల జాతమత్సరులై ప్రబలులైన తమవారల వారించుచున్న సమయంబున. 298

ఆ. ఒకనిచేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై
పుచ్చికొనిన వానిఁ బోదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తి
కొంచుఁ బాఱెఁ బరులుఁ గుయ్యిడంగ. 299

వ. అంత. 300

సీ. మెత్తనియడుగుల మెఱుఁగారుజానువు
లరఁటికంబములదో డైనతొడలు
ఘన మగు జఘనంబుఁ గడు లేఁతనడుమును
బల్లవారుణకాంతి పాణియుగము
గమదొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును
[1]బింబాధరముఁ జంద్ర బింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నలికుంతలంబులు
బాలేందుసన్నిభ ఫాలతలము

తే. సమరఁ గుండలకేయూర హారకంక
ణాదు లేపార మంజీర నాద మొప్ప
నల్లనవ్వులఁ బద్మద ళాక్షుఁ డసుర
పతుల నడంగింప నాఁడురూ పంబుఁ దాల్చె. 301

వ. అయ్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు
జాఱించి మెల్లన జక్కనొత్తు
దళ్కు దళ్కను గండ ఫలకంబు లొలయించు
నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడుమెఱుఁగులు వాఱు కడకన్ను లల్లార్చు
నల్లార్చి తెప్పల నండఁగొలుపు
నవరసదరహాస చంద్రికఁ జిలికించుఁ
జిలికించి కెమ్మోవిఁ జిక్కుపఱచు

తే. దళితధమ్మిల్ల కుసుమగం ధమ్ము నెఱపుఁ
గంకణాది ఝణంకృతుల్ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టులే కులుకఁ బాఱు
సన్నవలిపంపుఁ బయ్యెద సోకళింప. 303

వ. ఇవ్విధంబున వక్కపట యువతీరత్నంబు జగన్మోహనదేవతయునుం బోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటిమొత్తంబులన్ గెలిచి చిగురుజొంపంబుల నెడగలుగ జడియుచు ముఱియుచుండ రాక్షస

సీ. అవుఁగదే లావణ్య మవుఁగదే మాధుర్య
మవుఁగదే సతి నవ యౌవనాంగి
యెటనుండి వచ్చితి వేమి యిచ్ఛించెదు
నీనామ మెయ్యది నీరజాక్షి
యమర గంధర్వ సిద్ధాసురచారణ
మనుజకన్యలకు నీ మహిమ గలదె
ప్రాణచిత్తేంద్రియ పరిణామదాయివై
నిర్మించెఁ బో విధి నిన్ను గరుణ

తే. వనితగశ్యపు సంతతి వార మేము
భ్రాతలము సురలకు నిద్ధ పౌరుషులము
జ్ఞాతులకు మాకు [1]నేకార్థ సంగతులకుఁ
బాలుదీఱని యర్థంబు పంచియిమ్ము. 305

క. సభయైయుండెద మిందఱ
మభయంబున వచ్చుకొలఁది నమృతంబును నీ
విభరాజగమన తప్పక
విభజింపు విపక్షపక్ష విరహితమతివై. 306

వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతీరూపుండగు హరి తనవాఁడి వాలుజూపుటంపఱలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె. 307

క. సుందరులగు పురుషులఁ గని
పొందెడు నాయందు నిజము పుట్టునె మీకున్
బృందారక రిపులారా
చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308

క. పలుకులు మధురస ధారలు
దలఁపులు నానాప్రకార దావానలముల్
చెలుములు [2]సాలావృకములు
చెలువల నమ్మాటలు వేద సిద్ధాంతములే. 309

క. నా నేర్చుకొలఁది మీకును
మానుగ విభజించి యిత్తు మానుఁడు శంకం

గానిం డనపుడు నిచ్చిరి
దానవు లమృతంపుఁ గడవఁ దరుణీమణికిన్. 310

క. ఆశాంతాలోకనకులు
నాశీతలభాషణములు నాలాలితముల్
రాశిపరంపర లగుచుం
బాశములై వారినోళ్లు బంధించె నృపా. 311

వ. ఇట్లు సుధాకలశంబు కేల నందికొని మందస్మితభాషణంబుల సుందరీరూపుం డగు ముకుందుండు మేలుఁగీ డనక యేనుఁ బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం బనవుడు నగుం గాక యని సురాసురదైత్యదానవసమూహం బుపవసించి కృతస్నాను లై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాదిదానంబులు సేసి తదాశీఃప్రవచనంబులు గైకొని ధవళపరిధాను లై గంధమాల్యధూపదీపాలంకృతం బగు కనకరత్నశాలా మధ్యంబునఁ [1]ప్రాగగ్రకుశపీఠంబులం బూర్వదిశాభిముఖు లై పంక్తులుఁగొని యున్న సమయంబున. 312

క. శ్రోణీభర కుచయుగభర
వేణీభరములను డస్సి వివిధాభరణ
శ్రేణి యయి యువిద వచ్చెను
బాణిసరోజమున నమృతభాండముఁ గొంచున్. 313

క. భాసురకుండలభాసిత
నాసాముఖకర్ణగండ నయనాంచల యై
శ్రీసతి యగు సతిఁ గని దే
వాసురయూథంబు మోహ మందె నరేంద్రా. 314

వ. అప్పుడు. 315

క. అసురుల కమృతము వోయుట
వాసఁగదు పాములకుఁ బాలువోసిన మాడ్కిన్
దోసఁ గగు నంచును వేఱొక
దెసఁ గూర్చుండఁగఁ బెట్టె దేవాహితులన్. 316

వ. ఇట్లు రెండుపంక్తులుగా నేర్పరచి. 317

సీ. వేగిర పడకుండీ ౯ వినుండు దానవులార
తడవు సేయకవత్తు ౯ దైత్యులార
యటుప్రకటం గూర్చుండుం ౯ డని కన్ను లల్లార్చి
చనుగవపయ్యెద ౯ జాఱందిగిచి
వదినె మఱందుల ౯ వావులు కల్పించి
మర్మంబు లెడలించి ౯ మఱుంగుసేసి
మెల్లనినగవుల ౯ మేనులు మఱపించి
కడుజాణమాటలం ౯ గాకుపఱచి

ఆ. యసురవరుల నెల్ల ౯ నడకించి సురలను
దడవు సేయవలదు ౯ దా్రివుం డనుచు
వచ్చుకొలందిఁ నమృత ♦ వారి విభాగించెఁ
దరుణి దివిజులెల్లం ౯ దనిసిపోగఁ. 318

వ. అయ్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును ♦ మందట లేకుండఁ
బంచి పెట్టెదనని ౯ పడంతి పూనెఁ
దా నేలతప్పును ౯ తప్పదుతరళాక్షి
గాక రమ్మనుచు వే ౯ గంబ చీర
మఱుమాట లాడదో ♦ మఱిచూడ కుండునో
చనుగవం గప్పునో ౯ చాలుననుచు
నొండాడం గలుగుచు ౯ యొక్కింత సొలయునో
మనయెడం గందునో ౯ మగువ యనుచు

ఆ. నెలతం జూడ్కిగముల ౯ నీరై కరంగుచుం
బ్రణయభంగభీతి ౯ బద్ధులగుచు
నూరకుండ్రుగాని ౯ యువిద తే తెమ్మని
యడుంగ జాలరైరి ౯ యసురవరులు. 320

వ. అప్పుడు. 321

మ. అమరవాి్రితములోనం జొచ్చి దివిజుం ౯ డై రాహువు పీయూషపా
నము సేయంగని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం

డమరారాతిశిరంబు చక్రిహతిఁ దునిన్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధముఁ దదన్యాంగంబు నేలంబడెన్.
ఆ. అజుఁడు వానిశిరము ◆ నంబరవీథిని,
గ్రహముసేసిపెట్టెఁగారవించె
వాఁడు పర్వములను ◆ వైరంబు దప్పక
భానుచంద్రములను ◆ బట్టుచుండు. 323
క. ఒకబొట్టుఁ జిక్కకుండఁగ
సకలసుధారసము నమర ◆ సంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన
సుకరాకృతిఁ దాల్చె నసుర ◆ శూరులు బెగడన్. 324
మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పులైరి యమరుల్ ◆ సంశ్రేయముం బొంది ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా ◆ మత్యంతదోర్గర్వులై
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ ◆ కల్యాణసంయుక్తులే. 325

## దే వా సు ర యు ద్ధ ము

క. దానవు లమృతము ద్రావం
బూని పయోరాశిఁ ద్రచ్చి ◆ పొగిలిన మాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖు లగు
హీనులు వొందంగఁ జాల ◆ రిష్టార్థంబుల్. 326
క. శోధించి జలధినమృతము
సాధించి నిలింపవైరి ◆ చతుర్గతులన్
రోధించి సురల కడి హరి
భోధించి ఖగేంద్రు నెక్కి ◆ పోయె నరేంద్రా. 327
క. శుద్ధముగ సురల కమృతము
సిద్ధించిన నసురవరులు ◆ సిడిముడిపడుచుం
గ్రుద్ధులు నానాయుధస
న్నద్ధులు నయి యుద్ధమునకు ◆ నడచిరి బలిమిన్. 328
క. ధన్యులు వైరోచనిశత

సనోన్యన్యరణము బాహా
సిన్యాసంబులను జేర్చి ॥ చేసిరి కడిమిన్. 329

మ. అరుదై కామగమై మయాసురకృతం ॥ బై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్రసమేతమై తరళమై ॥ [1]వైహాయసంబై మహా
సురయోధాన్వితమైన యానమున సంక్షోభిల్లెఁ బూర్ణేందుసు
స్థిరకాంతిన్ బలిచామరధ్వజచయాదిప్రస్థితిన్ ముందటన్. 330

వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభా
యోముఖ ప్రహేతి హేతి భూతసంతాప హయగ్రీవ కపిలేల్వ
లోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచన
వజ్రదంష్ట్ర తారకారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరఃప్రము
ఖులును బౌలోమకాలకేయులును నివాతకవచప్రభృతులును దక్కిన
దండయోధులునుం గూడికొని యరదంబులం దురగంబుల మాతం
గంబుల హరిణంబుల హరి కిరి శరభ మహిష గవయ ఖడ్గ గండభే
రుండ చమరీ జంబుక శార్దూల గోవృషాది మృగంబులను గంక గృధ్ర
కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను దిమి తిమింగి
లాది జలచరంబులను నరులను నసురసురనికరవికృతవిగ్రహ
రూపంబులగు జంతువులను నారోహించి తమకు నడియాలంబు
లగు గొడుగులు పడగలుజోడుఁ గైదువులు పక్కెరలు బొమిడి
కంబులు మొదలగు పోటుముట్లాయితంబుగఁ గైకొని వేఱువేఱ
మొనలై విరోచన నందనుండగు బలిముందట నిలువంబడిరి. దేవేం
ద్రుండును నైరావతారూఢుండై వైశ్వానర వరుణ వాయు దండ
ధరాద్యనేక నిర్జరవాహినీ సందోహంబునుఁ దానును నెదురుపడి
పిఱుతివియక మోహరించినట్లు సంరంభ సన్నాహ సముత్సా
హంబుల రెండుదెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు
మాటల సందడించుచున్న సమయంబున. 331

సీ. వజ్రదంష్ట్రాంచిత ॥ [2]వ్యజనంబులును బర్హ
చామరంబులు సిత ॥ ఛత్త్రములును
చిత్రవర్ణధ్వజ ॥ చేలంబులును వాత
చలితోత్తరోష్ణీష ॥ జాలములును

జప్పాళ్ళ నెసఁగు భూ । షణ కంకణంబులుఁ
జండాంశురోచుల । శస్త్రములును
వివిధఖేటకములు । వీరమాలికలును
బాణపూర్ణములైన । [1]తూణములును
ఆ. నిండి పెచ్చురేఁగి । నిర్జరాసురవీర
సైన్యయుగ్మకంబు । సాలనొప్పె
గ్రాహతతులతోడఁ । గలహంబునకు వచ్చు
సాగరములభంగి । జనవరేణ్య. 332

క. భేరీభాంకారంబులు
[2]వారణఘీంకారములును । వర[3]హరిహేషల్
భూరిరథ[4]నేమిరవములు
ఘోరములై పెల్లగించెఁ । గులశైలములన్. 333

వ. ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుండును దారకునితో గుహుండును హేతితో వరుణుండును ప్రహేతితో మిత్రుండును గాలనాభునితో యముండును మయునితో విశ్వకర్మయు శంబరునితోఁ ద్వష్టయు విరోచనితో సవితయు నముచితోఁ బరాజితుండును వృషపర్వునితో నశ్వి దేవతలును బలిసుతబాణాది పుత్త్రశతంబులతో సూర్యుండును రాహువుతో సోముండును బులోమునితో ననిలుండును శుంభనిశుంభులతో భద్రకాళీదేవియు జంభునితో వృషాకపియును మహిషునితో విభావసుండును నిల్వలవాతాపులతో బ్రహ్మపుత్త్రులును దుర్మర్షణునితోఁ గామదేవుండును నుత్కలునితో మాతృకాగణంబును శుక్రునితో బృహస్పతియు నరకునితో శనైశ్చరుండును నివాతకవచులతో మరుత్తులును గాలేయులతో వసువులు నమరులును పౌలోములతో విశ్వేదేవగణంబును క్రోధవశులతో రుద్రులును నివ్విధంబునం గలిసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను పదాతులు పదాతులను వాహనారూఢులు వాహనారూఢులనుం దాఁకి సింహనాదంబులు సేయుచు నట్టహా

సంబులిచ్చుచు నాహ్వానంబులొసంగుచు నన్యోన్యాతిరస్కారంబులు సేయుచు బాహునాదంబుల విజృంభించుచుఁ బెనుబొబ్బల నుబ్బి రేఁగుచు హుంకరించుచు నహంకరించుచు ధనుర్గుణంబులఁ డంకరించుచు శరంబుల నాటించుచుఁ బరశువుల నఱకుచుఁ జక్రంబులం జెక్కుచు శక్తులం దునుముచుఁ గశలం బెట్టుచుఁ గుఠారంబులఁ బొడుచుచు గదల నడుచుచుఁ గరంబులఁ బొడుచుచుఁ గరవాలంబుల వ్రేయుచుఁ బట్టిసంబుల నొంచుచుఁ బ్రాసంబులం ద్రెంచుచుఁ బాశంబులం గట్టుచుఁ బరిఘంబుల మొత్తుచు ముసలంబుల మోఁదుచు ముద్గరంబులఁ ఝళిపించుచు [1]ముష్టివలయంబుల ఘట్టించుచుఁ దోమరంబుల నుఱుముచు శూలంబులఁ జిమ్ముచు నఖంబులం జీరుచుఁ దరుశైలంబుల ఱువ్వుచు నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహావిహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును విచ్ఛిన్నంబులైన కపాలంబులును వికలంబులైన కపోలంబులును జిక్కువడిన కేశబంధంబులును భగ్నంబులైన దంతంబులును గృత్తంబులైన భుజంబులును ఖండితంబులైన కరంబులును విదళితంబులైన మధ్యంబులును వికృతంబులైన వదనబింబంబులును వికలంబులైన నయనంబులును [2]వికీర్ణంబులయిన కర్ణంబులును [3]విశీర్ణంబులైన నాసికలును విఱిగిపడిన యూరుదేశంబులును విసంధులయిన పదంబులునుఁ జిరిఁగిన కంకటంబులును రాలిన భూషణంబులును వ్రాలిన కేతనంబులును గూలిన ఛత్రంబులును మ్రగ్గిన గజంబులును నుగ్గయిన రథంబులును నుఱుమైన హయంబులునుఁ జిందఱవందఱలైన భటసమూహంబులును నొఱలెడు కొఱప్రాణంబులును బొఱలెడు మేనులును నుబ్బియాడెడు భూతంబులును బాఱెడు రక్తప్రవాహంబులును గట్టలుగొన్న మాంసంబులును నెగసి తిరిగెడి కబంధంబులునుఁ గలకలంబులుసేయు కంకగృధ్రాదివిహంగంబులు నయి యొప్పు నప్పోరు అతి ఘోరంబయ్యె నప్పుడు.

శా. నారాచీశుఁ బదింట మూఁట గజమున్ నాల్గింట గుఱ్ఱంబులన్
ఏకాస్త్రంబున సారథిం జొనిపె దైత్యేంద్రుండు దా నాక స

1 ముష్టివలయములు=పిడికిలి చుట్లు, 2 వికీర్ణము=చెదరినది, 3 విశీర్ణము=వదలినది,

లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోర్దర్పోన్నిభల్లంబులన్
రాకుండన్ రిపువర్గముం దునిమె [1]గీర్వాణారి యాగ్రింపఁగన్. 335

సీ. తన తూపులన్నియుఁ దరమిడి శక్రుండు
నఱికిన జోదు విశస్త్రనువు మెఱసి
బలి మహాశక్తిచేఁ బట్టెను నదియును
నతఁడు ఖండించె నత్యద్భుతముగ
మఱి ప్రాశశూలతో మరములు గైకొన్న
దోర్దండ నవియును దునిమివైచె
సంతటఁ బోక మొనయ్యది వాఁడు సాగించెఁ
దొడరి తా నదియును దునుముసేసె

ఆ. నసురభర్త విరథుఁడై తన పగఱకుఁ
నాఁపఁబడక వివిధ కపటవృత్తి
నేర్పు మెఱసి మాయ నిర్మించె [2]మింటను
వేల్పుగములు సూచి వెఱఁగుపడఁగ. 336

వ. ఇట్లు దానవేంద్రనిర్మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడిసె దావాగ్నిదందహ్యమానతరువర్షంబులు గురిసె సటంకశిఖరనికరశిలాసారంబులు గప్పె మహోరగదందశూకంబులు గఱచె వృశ్చికంబులు మీటె, వరాహవ్యాఘ్రసింహంబులు గదిసి విదళింపన్ దొరకొనియె వనగజంబులు మట్టిమల్లాడం జొచ్చె శూలహస్తులు దిగంబరులు నై రండు రండని బలుకకొసులుశతసహస్రసంఖ్యలు ఛేదనచ్ఛేదనభాషణంబులాడం దొడంగిరి విస్ఫృతవదనులు గదాదండధారులు [3]నాలంబితకేశభారులు విపాశులు నై యనేక రాక్షసవీరులు పోనీకు పోనీకుఁడు తునుము తునుముం డని వెనుతగిలిరి పరుష గంభీరనిర్ఘాతసమేతంబులయిన జీమూతసంఘాతంబులు వాతాహతంబులై యుప్పతిల్లిన నిప్పుల కుప్పలు మంటలు ప్రోవులుం గురిసె మహాపవనవిజృంభితం బైన కార్చిచ్చు ప్రళయానలంబుచందంబునం దరికొనియెఁ [4]ప్రచండ

---

1 గీర్వాణారి=దేవవిరోధి, 2 మింటను=ఆకాశమందు, 3 ఆలం...భారులు=వ్రేలు జెంద్రుకల బరువు గలవారు, 4 ప్రచండ...భీషణంబు=చురుకైన గొప్పగాలిచే, గద

ఝంఝానిలప్రేరితసముత్తుంగతరంగావర్తభీషణంబయిన మహార్ణ
వంబు సెలియలికట్టు దాఁటి వెల్లివిరిసిన ట్లమేయంబయి యుండె
నాసమయంబునం బ్రళయకాలంబునుంబోలె [1]మిన్నుమన్నును
రేయింబగలు నెఱుంగ రాదయ్యె నయ్యవసరంబున. 337

క. ఆ యసురేంద్రుని బహుతర
మాయాజాలంబులకును మా ఱెఱుఁగక [2]వ
జ్రాయుధముఖరాదిత్యు ల
పాయంబున బొంది చిక్కు వడిరి నరేంద్రా. 338

వ. అప్పుడు. 339

క. ఇ య్యసురులచేఁ జిక్కితి
మెయ్యది దెరు వెందుఁ జొత్తుఁ మిటు వాలయఁగదే
యయ్యా దేవ [3]జనార్దన
కుయ్యో కుయ్యో యటంచుఁ గూయిడి రమరుల్. 340

వ. అని మొఱయిడు నవసరంబున. 341

మ. విహగేంద్రాశ్వనిరూఢుఁడై [4]మణిరమా విభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్రమహాభుజాకలితుఁడై భాస్వత్కిరీటాదిదు
స్సహుఁడై సవ్యపిశంగచేలధరుఁడై సంఫుల్లపద్మాక్షుఁడై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్.

చ. అసురుల మాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చి నంతటన్
గసిబిసిమై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను నిద్రనొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పు లందఱుం
బససెడకే లయుండు హరి పాదపరిష్కృతి సేయ నాపదల్.

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి
తార్క్ష్యశిరము శూలధారఁ బొడువ
నతని పోటుముట్టు హరి గేల నంకించి
దానఁ జావఁ బొడిచె దైత్యవరుని. 345

---

1 మిన్నుమన్ను=ఆకాశము భూమి, 2 వజ్రా...త్యులు=వజ్రధరుఁడైన యింద్రుఁడు మొదలైన దేవతలు, 3 జనార్దనుఁడు=ప్రళయకాలమున దుష్టజనుల బాధించి చంపు వాఁడు (విష్ణువు), 4 మణి...స్కుఁడు=కౌస్తుభము లక్ష్మితోఁగూడిన ఱొమ్ముభాగము

క. పదపడి మాలి సుమాలులు
బెదరించినఁ దలలుఁ దుంచెఁ [1]బృథుచక్రహతిన్
గదఁ గొని గరుడుని ఱెక్కలు
చెదరించిన మాల్యవంతు శిరమున్ వ్రేసెన్. 346

వ. ఇట్లు పరమపురుషుండగు హరికరుణాపరత్వంబునం బ్రత్యుపలబ్ధ మనస్కులైన వరుణ వాయు వాసవప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు వారు వారలం దలపడి నొప్పించి రయ్యవసరంబున. 347

క. బాహుబలంబున నింద్రుఁడు
సాహసమున బలిని గెలువ సమకట్టి సము
త్సాహమున వజ్ర మెత్తిన
హాహానినదంబు సేసి రఖిలజనములున్. 348

వ. ఇట్లు సముద్యతభిదురహస్తుండై యింద్రుండు దనపురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందను నుపలక్షించి యిట్లనియె.

మ. జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె ధైర్యంబె తా
మగవాఁడయ్యును దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగనేని మెయి సూపం జాలఁడేనిం గటా
నగరే బంధులు దిట్టరే బుధులుఁ గన్నెల్ గూర్తురే దానవా.

శా. మాయల్ సేయఁగ రాదు పో నగవులేమాత్రోడిపోరాటముల్
డాయం జిక్కితి వ్రక్కలించెద వడిన్ [2]దంభోళిధారాహతిన్
నీయిష్టార్థములెల్లఁ జూడుము వెసన్ నీవారలం గూడుకో
నీయాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁడాజిలో దుర్మతీ.

వ. అని యుపాలంభించిన విని విరోచన నందనుం డిట్లనియె. 352

శా. నీవే పోటరివే సురేంద్ర తెగడన్ నీకేల గెల్పోటముల్
లేవే యెవ్వరిపాలఁ బోయినవి మే లీడుల్ [3]విరించ్యాదులుం
ద్రోవంజాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింపనా
దైవం బేమి కరస్థలామలకమే దర్పోక్తులుం బాడియే. 353

ఆ. జయము లపజయములు సంపదలాపద
[4]లనిలచలిత దీపికాంచలములు

---

1 బృదులహస్తుఁడు=వజ్రము చేతియందు గలవాఁడు, 2 దంభోళి ధార=వజ్రాయుధము

చంద్రకళలు మేఘ ʃ చయములు దరఁగలు
మెఱుఁగు లమరవర్య ʃ మిట్టిపడకు. 354

వ. అని యిట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవనాథుఁడు
నారసముల నింద్రు మేన ʃ నాటించి మహా
ఘోరాయుధకల్పము లగు
శూరాలాపములు సెవులఁ ʃ జొనిపెన్ మరలన్. 356

వ. ఇట్లు తథ్యవాదియైన బలిచే నిరాకృతుండై. 357

క. శత్రువు నాక్షేపంబునఁ
[1]తోత్రాహతగజముభంగిఁ ʃ ద్రుళ్లుచు బలి నా
[2]వృత్రారి వీచివైచిన
[3]గోత్రాకృతి నతఁడు నేలఁ ʃ గూలె సురేంద్రా. 358

క. చెలికాని పాటుఁగనుఁగొని
బలిసఖుఁడగు జంభుఁ డతుల ʃ బాహాశక్తిం
జెలితనము సాలనెఱపుచు
నిలు నిలుమని వీఁకఁ దాఁకె ʃ నిర్జరనాథున్. 359

క. పంచాననవాహనుఁడై
చంచద్గద జంభుఁడెత్తి ʃ శైలారిని దాఁ
కించి సురేభంబును నొ
ప్పించి విజృంభించి యార్చి ʃ నేర్చెం గడిమిన్. 360

క. వీఁక నెడి ఘనగదాహతిఁ
దోఁకయు గదలింపలేక ʃ దుస్సహాపీడన్
వ్రోఁకరిలఁ బడియె నేలను
సోఁ కోర్వక దిగ్గజంబు ʃ సుడివడి గొంచున్. 361

వ. అయ్యెడ. 362

క. సారథి వేయిహయంబుల
తేరాయితపరచి తేర ʃ దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁడు
దారత మాతలిని శూల ʃ ధారం బొడిచెన్. 363

ఆ. శూలనిహతి నొంది ॥ క్రుక్కి యార్చిన
సూతు వెఱవకంచు ॥ సురవిభుండు
వానిశిరముఁ గూలిచె ॥ వజ్రఘాతంబున
దైత్యసేనలెల్ల ॥ దల్లడిల్ల. 364

చ. చని సురనాథుచేఁ గలన ॥ జంభుఁడు సచ్చుట నారదుండు సె
ప్పిన విని వానిభ్రాతలు గ ॥ భీర బలాఢ్యులు జంభుండు పా
క నముచు లాపురందరునిఁ ॥ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచుఁ
ఘనజలధారలన్ నగముఁ ॥ గప్పిన చాడ్పునఁ గప్పిరమ్ములన్. 365

సీ. విబుధలోకేంద్రుని ॥ వేయుగుఱ్ఱంబుల
నన్ని కోలల బలుఁ ॥ డదర నేసె
నిన్నూటమాతలి ॥ నిన్నూటరథమును
నారీతి నింద్రు ప్ర ॥ త్యంగకమును
వేధించెఁ బాకుండు ॥ వింటవాఁ డస్త్రంబు
లేయుటఁ దొడుగుట ॥ యెఱుఁగరాక
కనకపుంఖంబుల ॥ కాండంబు లొక పది
యేనింట నముచియు ॥ నేసి యార్చె

ఆ. బలిమి నిట్లు ముగురు ॥ పగవాని రథసూత
సహితు ముంచి రస్త్ర ॥ జాలములను
వనజలోకసఖుని ॥ వానకాలంబున
మొగిలుగములు మునుఁగ ॥ ముంచునట్లు. 366

వ. అయ్యవసరంబున. 367

మ. అమరారాతులబాణజాలముల పా ॥ లైపోయితే చెల్లరే
యమరాధీశ్వర యంచు ఖిన్నతరులై ॥ యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబులక్రియన్ ॥ దైత్యాధిప వ్యూహమ
ధ్యమునం జిక్కిరి వేల్పులందఱు విప ॥ ద్ధ్వానంబులం జేయుచున్

శా. ఓహో దేవతలార శక్యుఁడకుఁ డే ॥ నున్నాఁడ నంచుం బుభృ
ద్వ్యూహంబుం దాశరబద్ధపంజరము నం ॥ తం జించి తేజంబునన్
నాహో పేతరథంబుతోడ వెలికిన్ ॥ వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా ॥ మార్తాండుచందంబునన్

వ. ఇట్లు వెలువడి. 370

చ. విఱిగిన సేనఁ గాంచి సుర । వీరుఁ డహాహో యని బిట్టుచీరి క్రొ
మ్మెఱుఁ బురికొల్పి పాకబల । మస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసినతీక్ష్ణవజ్రమున । నేలకు వ్రాల్చెను వానిచుట్టముల్
వెఱచిరి తచ్చమూపతులు । విహ్వలులై చెడి పాఱి రార్తితోన్.

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. తనచుట్టంబులఁ జంపె నీఁడనుచు ను । ద్యత్క్రోధశోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయముం । ఘంటాసమేతంబు నై
జనదృగ్దుస్సహ మైన శూలము నొగిన్ । సారించి వైచెన్ సురేం
ద్రునిపై దీన హతుండవౌదని మృగేంద్రుంబోలి గర్జించుచున్.

శా. ఆకాశంబున వచ్చుశూలమును జం । భారాతి ఖండించి నా
నాకాండంబుల వానికంఠము దెగన్ । దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం । త్రుంపంగ లేదయ్యె వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్.

వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం
బగుటకు శంకించి బలభేది దనమనంబున. 375

సీ. కొండలఱెక్కలు । ఖండించి వైచుచో
వజ్ర మెన్నఁడు నింత । వాఁడి చెడదు
వృత్రాసురాదుల । విదళించుచో నిది
దిరుగ దెన్నఁడు పనిఁ । దీర్చి కాని
యింద్రుండఁ గానొకో । యేను దంభోళియుఁ
గాదొకో యిది ప్రయో । గంబు చెడెనొ
దనుజాధముఁడు మొన । దాఁకుఁ దప్పించెనో
భిదురంబు నేఁ డేల । బెండువడియె

ఆ. ననుచు వజ్రివగవ । నార్ద్రశుష్కంబులఁ
జావకుండఁ దపము । సలిపె నీతఁ
డితర మెద్ది యైన । నింద్రప్రయోగింపు
వైళ మనుచు [1]దివ్యవాణి పలికె. 376

వ. ఇట్లాదేశించిన దివ్యవాణిపలుకు లాకర్ణించి పురందరుండు. 377

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి - యార్ద్రంబు శుష్కంబు
గాని సాధనంబు - ఫేన మనుచు
నది యమర్చి దాన - నమరులు మెచ్చంగ
నముచిశిరముఁ ద్రుంచె - నాకవిభుఁడు. 378

వ. అయ్యవసరంబున. 379

సీ. పురుహూతు నగ్గించి - పుష్పాంజలులు సేసి
మునులు దీవించిరి - ముదముతోడ
గంధర్వముఖ్యులు - ఘనులు విశ్వావసుఁ
డును బరావసుఁడు నిం - పెనయఁ బాడి
రమరాంగనాజను - లాడిరి దేవతా
దుందుభులును మ్రోసె - దురములోన
వాయువహ్నికృతాంత - వరుణాదులును బ్రతి
ద్వంద్వులఁ గెల్చి రు - ద్దండవృత్తి

తే. నల్పమృగముల సింహంబు - లట్లుతోలి
రమరవర్యులు దనుజుల - నదటువాయ
నజుఁడు పుత్తెర నారదుఁ - డరుగుఁ దెంచె
దైత్యహరణంబు వారింప - ధరణినాథ. 380

వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె. 381

శా. సిద్ధించెన్ సురలార మీకమృతముల్ - శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును వి - ద్వేషుల్ మృతిం బొందిరీ
యుద్ధం బేటికి నింకఁ జాలుఁ బనిలే - దోహో పురే యంచు సం
బద్ధాలాపములాడి మాన్చె సురలం - బాండవ్యవంశాగ్రణీ.

వ. ఇట్లు నారదవచన నియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకలదేవముఖ్యులును ద్రివిష్టపంబునకుం జనిరి. హతశేషులైన దైత్యదానవులు విషణ్ణుండైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరంబుఁ జేరిరి. విధ్వంసమానకంధరులై వినష్టదేహులగు [1]యామినీచరులనెల్లను శుక్రుండు మృతసంజీవని యైన తన విద్య పెంపునం జేసి బ్రదికించె. బలియును భార్గవానుగ్రహంబున విగత

శరీరవేదనుండై పరాజితుండయ్యును లోకకాలవిచక్షణుం డగు
టం జేసి దుఃఖపడక యుండెనని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె

సీ. కైలాసగిరిమీఁద ♦ ఖండేందుభూషణుం
డొకనాఁడు గొలువున ♦ నున్నవేళ
నంగనయై విష్ణుఁ ♦ డసురుల వంచించి
సురలకు నమృతంబు ♦ సూఱ లిడుట
విని దేవియును దాను ♦ వృషభేంద్రగమనుఁడై
కడువేడ్కభూతసం ♦ ఘములు గొలువ
మధుసూదనుం డున్న ♦ మందిరంబున కేగి
పురుషోత్తముని చేతఁ ♦ బూజవడసి

తే. తానుఁ గూర్చుండి పూజించె ♦ దనుజవైరిఁ
గుశలమేమీకు మాకును ♦ గుశలమంచు
మధురభాషల హరిమీఁద ♦ మైత్రి నెఱపి
హరుఁడు పద్మాక్షుఁజూచి యి ♦ ట్లనియె బ్రీతి. 384

సీ. దేవ జగన్మయ ♦ దేవేశ జగదీశ
కాలజగద్వ్యాప ♦ కస్వరూప
యఖిలభావములకు ♦ నాత్మయు హేతువు
నైన యీశ్వరుఁడ వా ♦ ద్యంతములకు
మధ్యంబు బహియును ♦ మఱిలోపలయు లేక
పూర్ణమై యమృతమై ♦ భూరిసత్య
మానంద చిన్మాత్ర ♦ మవికార మాద్య మ
నన్య మశోకంబు ♦ నగుణ మఖిల

తే. సంభవస్థితిలయముల ♦ దంభకంబు
నైన బ్రహ్మంబు నీవ నీ ♦ యంఘ్రియుగము
నుభయసంగవిసృష్టులై ♦ యున్నమునులు
గోరి కైవల్యకాములై కొల్తురెపుడు. 385

సీ. భావించి కొందఱు ♦ బ్రహ్మంబు నీవని
తలపోసి కొందఱు ♦ ధర్మమనియుఁ
దర్కించి కొందఱు ♦ సదసదీశ్వరుఁడని
పరవిఁ గొందఱు శక్తి ♦ సహితుఁడనియుఁ

జింతించి కొందఱు ✿ చిరతరుం డవ్యయుఁ
డాత్మతంత్రుఁడు పరుం ✿ డధికుఁ డనియుఁ
బొడరి యూహింతురు ✿ తుది నన్వయ వ్యయ
సనసద్విశిష్ట సం ✿ శ్రయుఁడ వీవు

తే. తలఁప నొక్కింత వస్తుభే ✿ దంబుఁ గలదె
కంకణాదులు బసిఁడి యై ✿ కాటియగాదె
కడలు పైనైన నార్ద్ర మై ✿ కలిగియగాదె
భేదమంచును నిను విక ✿ ల్పింపవలదె. 386

సీ. యద్విలాసము మరి ✿ చ్యావను లెఱుంగరు
నిత్యుఁడవై యున్న ✿ నేను నెఱుఁగ
యన్నామ్నాయసంఘులై ✿ యమరాసురాదులు
వనరెద రఁటయున్న ✿ వార లెంత
యేరూపమునఁ బొంద ✿ కేపారుదువు నీవు
రూపివై సకలంబు ✿ రూపుసేయ
రక్షింపఁ జెఱుపఁ గా ✿ రణమైన సచరాచ
రాఖ్యమై విలసిల్లు ✿ దంబరమున

తే. ననిలుఁ డేరీతి విహరించు ✿ నట్లనీవు
గలసి వర్తింతు సర్వాత్మ ✿ కత్వమొప్ప
జగములకు నెల్లబంధ మో ✿ క్షములు నీవ
నీవ సర్వంబుఁ దలపోయ ✿ నీరజాక్ష. 387

మ. ఘనతన్ నీమగపోఁడుముల్ పలుమఱుం ✿ గన్నారఁ గన్నార మే
నిన్ను విన్నారము చూడ మెన్నఁడును మున్ ✿ నీయూఁడుఁ
జందంబు మోహిని వై దైత్యులఁ గన్నుఁ బ్రామియమృతం ✿
బింద్రాది దేవాళి కిచ్చిననీరూపముఁ జూపుమా కుతుకముం ✿
జిత్తంబునం బుట్టెడిన్. 388

క. మగవాఁడ వయ్యు జగములఁ
దగిలించి చిక్కులను బెట్టు ✿ దంటకు నీకున్
మగువతనంబున జగములఁ
దగులము బొందింప నెంత ✿ దడవు ముకుందా. 389

వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుండై విష్ణుండు భావగం
భీరంబగు నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవున కిట్లనియె. 390

శా. శ్రీకంఠా నిను నీవ యేమఱకుమీ ♦ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాఁగురించుటకు నై ♦ నాఁ డేను గైకొన్నకాం
తాకారంబు [1]జగన్నిమజ్జనము నీ ♦ కై జూచెదేఁ జూపెదం
వైకోనర్హములంద్రు కాముకులు సం ♦ కల్ప ప్రభావంబులన్ 391

**హరి దన మోహినీరూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట**

వ. అని పలికి కమలలోచనుం డంతర్హితుం డయ్యె న య్యుమాస
హితుం డయిన భవుండు విష్ణు డెట్టు వోయెనో యెందుఁ జొచ్చెనో
యని దశదిశలం గలయనవలోకించుచుండం దనపురోభాగంబున.

సీ. ఒకమెలదోఁటలో ♦ నొకవీథి నొకనీడఁ
గుచకుంభములమీఁది ♦ కొంగుదలఁగఁ
గబరికాబంధంబుఁ ♦ గంపింప నుదుటిపైఁ
జికురజాలంబులు ♦ సిక్కుపడఁగ
ననుమాన మై మధ్య ♦ మల్లాడఁ జెక్కులఁ
గర్ణకుండలకాంతి ♦ గంతులిడఁగ
నారోహభరమున ♦ నడుగులుఁ దడఁబడ
దృగ్దీప్తిసంఘంబు ♦ దిశలఁ గప్ప

తే. వామకరమున జాఱిన ♦ వలువఁ బట్టి
కనకనూపురయుగళంబు ♦ గల్లనంగఁ
గంకణంబుల ఝణఝణత్కార మెసఁగ
బంతిచేనాడు ప్రాయంపు ♦ టింతిఁ గనియె. 393

వ. కని మున్ను [2]మగువ మఱగి సగమయిన మగవాఁ డమ్మగువ
వయోరూపగుణ విలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్ప
వేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున 394

శా. ఈకాంతాజనరత్న మెవ్వరిదొకో ♦ యీయాఁడురూపంబు మున్నే
కల్పంబులయందుఁ గాన మజుఁ డీ ♦ యింతిన్ సృజింపంగఁ దా

---

1 జగత్+నిమజ్జనము, 2 మగువ......వాఁడు=పార్వతియందలి ప్రేమచే నర్ధ
శరీరమునిచ్చి తానర్ధనారీశుఁడని పేరుపొందిన వాఁడు.

లేకుం జెల్ల నిజంబు వల్లభత నీ కే లీలావతిం జేరఁగా
నే కాంతుండుఁ గలండో క్రీడలకు నా కే కీయింతి సిద్ధించునే. 395

వ. అని మఱియుం జెఱకువిలుతుని మెఱవడిఁ దరపిన నెఱబిరుదు
వెఱంగుపడం దెఱవ దుఱిమికొనిన తుఱుముబిగిముడి వదలి కదలి
భుజముల మెడల నొడలనదిరి చెదరిన కురులు నొసలి మృగమద
తిలకంపుటసలు మసల విసవిస నగుమొగము మెఱుంగులు దశది
శలం బసలుకొలుపఁ జిఱునగవు మెఱయఁ నునుఁ జెమటం దడం
బడి పులకరములు గులకరములు గొన హృదయానందకందం బగు
కందుకంబు గరారవిందంబునం దమర్చి యక్కునం జేర్చి చెక్కున
హత్తించి [1]చుబుకంబు మోపి[2]చూచుకంబులం గదియించి నఖంబుల
మీటుచు మెల్ల మెల్లన గెల్లాడు కరకమలంబులంఁ గనకమణి
వలయంబులు ఝుణఝుణ యనం గుచకలశంబు లొండొంటి
నొరయ నెడమఁ గుడిం దడంబడఁ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు
నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్ని పన్నిదంబులు సేసికొని
బడుగు నడుము వెడఁకి వడ వడ వడంక నఱితి సరులుఁ గలయం
బడఁ దిరుగుచు తిరుఁగు నెడఁ బెనఁకువలుగొనఁ జెవులతొడవుల
రుచులు [3]గటముల నటనములు సలుపఁ బవిరితిరిగి యొడియుచు
నొడిసి కెలంకులన్ జడియుచు జడిసి జడనుపడక వలువ నెలవు
వదలి దిగంబడం గటిస్థలంబునఁ[4]గాంచీకనకమణికింకిణులు మొరయఁ
ఝరణకటకమ్ములు గల్లు గల్లు మనం గరకంకణమణిగణములు
మెఱయ వెనుకొని యుఱికి పట్టుచుఁ బట్టి పుడమిం బడవైచి పాటు
వెంటన మింటికెగసి గెంటక కరంబునం గరంబు దిరంబయి పలు
మఱు నెగయనడుచుచు నెగయు నెడం దిగంబడుతఱిని నీలంపు
మెఱుంగునిగ్గు సోగపగ్గంబుల వలలు వైచి రాఁదిగిచినపగిది వెను
కొనంగ విలోకనజాలంబులు నిగిడించుచు మగిడించుచుఁ గరలాఘ
వంబున నొకటి పది నూఱు వేయి సేసి నేర్పులు వాటించుచు
నరుణచరణకమలరుచుల నుదయశిఖరశిఖరతరణికరణి సేయుచు
ముఖచంద్రచంద్రికలఁ జంద్రమండలంబులు గావించు నెడ నెడ

1 చుబుకము=గడ్డము, 2 చూచుకములు = చన్నుమొనలు, 3 కటములు=చెక్కిళ్లు,
4 కాంచీ......ణులు = గజ్జెల యొడ్డాణముయొక్క, బంగారు గంటల చప్పుడు

నురోజదుర్గనిర్గతచేలాంచలంబుఁ జక్కనొత్తుచుఁ [1]గపోలఫలకాలోల ఘర్మజల బిందుబృందంబుల నఖాంకురంబుల నోసరించుచు నధర బింబారుణసంభ్రాంతసమాగతరాజకీరంబులం జోపుచు ముఖసరోజ పరిమళాసక్తమత్తమధుకరంబుల నివారించుచు మందగమనాభ్యాస కుతూహలాయత్తమరాళయుగ్మంబులకుం దలంగుచు విలాసవీక్షణా నందిత[2]మయూరమిథునంబులకు నెడగలుగుచుఁ బొదరిండ్లయొఱ ములకుం బోకమలంగుచు సరసకిసలయాస్వాదకాముక [3]కలకంఠదం పతులకుఁ రాదూరమగుచు దీఁగయుయ్యేలల నూఁగుచు [4]మాధవీ మండపంబు లెక్కుచుఁ గుసుమరేణుపటలంబుల గుబ్బళ్ళ వ్రాఁకుచు మకరందస్యందబిందుబృందంబు నుత్తరించుచుఁ గృతకశైలంబుల నారోహించుచుఁ బల్లవపీఠంబులం బథిశ్రమంబు పుచ్చుచు లతా సౌధభాగంబులఁ బొడసూపుచు నున్నతకేతకీస్తంభంబుల నొర గుచుఁ[5]బుష్పదళఖచితవాతాయనంబులందొంగిచూచుచుఁ గమల కాండపాలికల నాలంబించుచుఁ జంపకగేహాళీమధ్యంబుల నిలువం బడుచుఁ గదళికాపత్త్రికవాటంబుల నుద్ఘాటించుచుఁ బరాగనిర్మిత సాలభంజికానివహంబుల నాదరించుచు మణికుట్టిమంబుల జరి యుచుఁ జంద్రకాంతవేదికల నొలయుచు రత్నపంజరశారికానివ హంబులకుం జదువులు సెప్పుచుఁ గోరినక్రియం జూచుచుఁ జూచిన క్రియ మెచ్చుచు మెచ్చినక్రియ వెఱఁగుపడుచు వెఱఁగుపడిన క్రియ మఱచుచు మఱువక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంతవిభ్రమంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమ యంబున. 396

ఆ. వాలుఁగంటివాఁడి  వాలారుఁ జూపులఁ
శూలి ధైర్య మెల్లఁ  గోలుపోయి
తఱలి యెఱుక లేక  మఱచె గుణంబుల
నాలి మఱచె నిజగ  ణాలి మఱచె. 397

వ. అప్పుడు 398

---

1 కపోలఫలకము=చెక్కిలి పలక, 2 మయూరమిథునము = నెమిళ్లజంట, 3 కలకంఠదంపతులు=కోవెల యాలుమగలు, 4 మాధవి=వనలక్ష్మి, కల్లు, తేనె. 5 పుష్ప

ఆ. ఎగుర వైచి పట్టు । నెడ లేమిఁ జేదప్పి
ప్రాలుబంతి గొనఁగ । వచ్చునెడను
బడఁతి వలువ వీడి । పడియె మారుతహతి
జంద్రధరుని మనము । సంచలింప. 399

మ. [1]రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ । రోమాంచవిభ్రాజితం
గుచభారానమితం [2]గరద్వయపుటీ । గూఢీకృతాంగిం జల
త్కచబంధం గని మన్మథాతురత నా । కంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత సూడఁ గదిసెం । జంద్రాస్య కేల్దమ్మికిన్.

ఆ. పదము సేర వచ్చు । ఫాలాక్షుఁ బొడగని
చీర వీడి పడిన । సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరుల । మాటున డాఁగెను
వేల్పుఱేఁడుఁ నబల । వెంటఁ బడియె. 401

మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమిం । పన్ వచ్చులీలన్ శివుం
డబలా పోకుము పోకుమీ యనుచు డా । యంబాఱికెం గేలఁ ద
త్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁ । గౌఁగిళ్ళనోలార్చె నం
తబహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం । దద్భావహృత్కర్మకర్తయై. 402

సీ. వీడి వెన్నున నాడు । వేణీభరంబుతో
జఘనభారాగత । శ్రాంతితోడ
మాయావధూటికై । మరలి చూచుచుఁ బాఱుఁ
విష్ణు నద్భుతకర్ము । వెంటఁదగిలి
యీశాను మరల జ । యించె మరుం డనఁ
గరిణి వెన్కను కరి । కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ । గొలఁకులు వనములు
దాఁటి శంభుఁడు సనం । దన్మహాత్ము

తే. నిర్మలామోఘవీర్యంబు । నేలమీఁదఁ
బడినచో వెల్ల వెండియుఁ । బైడియయ్యె
ధరణి వీర్యంబువడఁ దన్నుఁ । దానెఱింగి
దేవమాయాజడత్వంబు । దెలిసె హరుఁడు. 403

1 రుచిరాపాంగి=కాంతిచే మించిన క్రీగంటిచూపు గలది, 2 కర .....తాంగిన్=

క. జగదాత్మకుఁ డగు శంభుఁడు
మగిడెనుహరి నెఱిఁగి తనదు ౯ మాహాత్మ్యమునన్
[1]విగతత్రపుఁ డై నిలిచెను
మగువతనం బుడిగి హరియు ౯ మగవాఁ డయ్యెన్. 404

ఆ. కాము గెలువవచ్చుఁ ౯ గాలారిగావచ్చు
మృత్యుజయమునుఁ గలిగి ౯ మెరయవచ్చు
నాఁడువారి[2]చూపు ౯ టంపఱ గెలువంగ
వశముగాదు త్రిపుర ౯ వైరి కైన. 405

వ. ఇట్లు పురుషాకారంబు వహించినహరి హరునకిట్లనియె. 406

సీ. నిఖిలదేవో త్తమ ౯ నీవుక రుఁడుఁదక్క
నెవ్వఁడు నామాయ ౯ నెఱుఁగ నేర్చు
మానిని యైన నా ౯ మాయచే మునుఁగక
ధృతి మోహితుండ వై ౯ తెలిసి తీవు
కాలరూపంబునఁ ౯ గాలంబుతోడ నా
యందును నీమాయ ౯ యధివసించు
నీమాయ నన్ను జ ౯ యింపనేరదు నిజ
[3]మకృతాత్ములకు నెల్ల ౯ ననుపలభ్య

తే. మిపుడు నీనిష్ఠ పెంపున ౯ నెఱిఁగి తనుచు
సత్కరించిన సఖ్యంబు ౯ సాల నెఱిపి
దక్షతనయగణంబులుఁ ౯ దన్నుఁగొలువ
భవుఁడు విచ్చేసెఁ దననిజ ౯ భవనమునకు. 407

శా. పారావారము ద్రచ్చుచో గిరిసము ౯ ద్యద్భార మై కచ్ఛపా
కారుం డైన రమేశువ ర్తనము నా ౯ కర్ణింపఁగీ ర్తింప సం
సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ ౯ సంత్రేయముం బొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా. 408

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం ౯ జక్కన్ విభాగించి ని

1 విగతత్రపుఁడు=విడిచిన సిగ్గుగలవాఁడు, 2 చూపు + టు + అంపఱ=చూపులను

పద్మలరేఖల్ విలసిల్లు శ్రీవిభుని దయనాస్మదీయాఘఘోరూపముం
దలఁతున్ ముకుందు నాత్మలోన [1]దురిత | ధ్వాంతార్కరూపంబుగన్.

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 410

తే. నరవరాధీశ యిప్పుడు | నడచు చున్న
వాఁడు సప్తమమనువు [2]వై | వస్వతుండు
[3]శ్రాద్ధదేవుండనందగు | జనవరేణ్య
పదురు నందను లతనికిఁ | బ్రకటబలులు. 411

వ. వార లిక్ష్వాకుండును నభంగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యంతుండును నాభాగుండును దిష్టుండును గరూశకుండును బృషధ్రుండును వసుమంతుండును ననువారు పదుగురురాజులు పురందరుండను వాఁ డింద్రుం డాదిత్యమరుదశ్వివసు రుద్రసంజ్ఞలుఁ గలవారు దేవతలు గౌతమకశ్యపాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠు లనువారు సప్తర్షులయి యున్నవా రందుఁ గశ్యపున కదితి గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి [4]యింద్రావరజుండయ్యె నిప్పుడేడు మన్వంతరంబులు సెప్పంబడియె రాఁగల మన్వంతరంబులును శ్రీహరి పరాక్రమంబునుం జెప్పెద [5]దత్తావధానుండ వై విను మని శుకుం డిట్లనియె. 412

సీ. జననాథ సంజ్ఞయు | ఛాయయు ననువారు
గల రర్కునకు విశ్వ | కర్మ తనయ
లిరువురు వల్లభ | లిట మున్న చెప్పితిఁ
బరఁగు దృతీయయు | బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును | శ్రాద్ధదేవుండును
[6]యమునయుఁ బుట్టిరి | హర్ష మెసఁగ

---

1 దురిత.....రూపంబుగన్=పాపమనెడి చీఁకటికి సూర్యుఁడుగా నెంచుకొని. 2 వైవస్వతుఁడు=వివస్వంతుని కొడుకు, 3 శ్రాద్ధదేవుఁడు=శ్రద్ధతో విధిని నెరవేర్చువేలుపు—యముఁడు. 4 ఇంద్ర+అవరజుఁడు=ఇంద్రుని తమ్ముఁడు (వామనుఁడు లేక విష్ణువు), 5 దత్త+అవధానుఁడు=పొందనైన హెచ్చరిక గలవాఁడు. 6 యమున =

ఛాయకుఁ [1]దపతియు | సావర్ణియును శనై
శ్చరుఁడునుఁ గలిగిరి | సంవరణుఁడు

తే. దపతి నాలిఁగఁ గైకొనెఁ | దా వరించి
యశ్వియుగళంబు బడబకు | నవతరించె
వచ్చు నష్టమవసువు సా | వర్ణి వాఁడు
తపము సేయుచు నున్నాఁడు | ధరణినాథ. 413

క. ఒకపరి సూచిన వెండియు
నొకపరి సూడంగ లేక | యుండు సిరులకై
యొకనొకని చేటు వేళకు
నొకఁ డొక్కఁడు మనువుఁ గాంచి | యుండు నరేంద్రా. 414

వ. సూర్యసావర్ణిమన్వంతరంబున నతనితనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును సుతపోవిరజోమృతప్రభులనువారు దేవతలును గాఁ గలరు గాలవుండును దీప్తిమంతుండును బరశురాముండును ద్రోణపుత్త్రుఁ డగు నశ్వత్థామయుఁ గృపుండును మజ్జనకుం డగు బాదరాయణుండును ఋష్యశృంగుండును సప్తర్షు లయ్యెదరు వారలిప్పుడు దమతమయోగబలంబుల నిజాశ్రమమండలంబులఁ జరియించుచున్నవారు విరోచననందనుం డగు బలి యింద్రుం డయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె. 415

సీ. బలి మున్ను నాకంబు | బలిమి మైఁ జేకొన్న
వామనుం డై హరి | వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి | భగవన్నిబద్ధుఁ డై
సురమందిరముకంటె | సుభగ మైన
సుతలలోకంబున | సుస్థితి నున్నాఁడు
వెత లేక యటమీఁద | వేదగుహికి
నాసరస్వతికిఁ దా | నట సార్వభౌముండు
నాఁ బ్రభు వయి హరి | నాకవిభునిఁ

---

1 తపతి—పశ్చిమవాహిని (నదములు)—స్త్రీరూపమును వహించి వివాహములాడు మర్యాద కలదు. జ్ఞాపకము—(యమునకే కాళిందియని పేరు. ఈమె కృష్ణుని వరించెను. తపతి సంవరణుని వరించె. నర్మద పురుకుత్సుని వరించె. 1 కాళిందీ పరిణయము. 2తపతీ

ఆ. బలవిహీనుఁ జేసి బలిఁ దెచ్చి నిలుపును
బలియు నిర్జరేంద్రపదము నొందు
నింద్రపదము వానికి నిచ్చినకతమున
దానఫలము సెడదు ధరణినాథ. 416

వ. అట మీఁదటికాలంబున వరుణనందనుం డగు దక్షసావర్ణి నవమ మనువయ్యెడు నతని కొడుకులు ధృతకేతు దీప్తకేతుప్రముఖులు రాజులును బరమరీచిగర్గాదులు నిర్జరులును నద్భుతుం డను వాఁ డింద్రుండును ద్యుతిమత్ప్రభృతులగు వారలు ఋషులును నయ్యెద రంత. 417

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు
నకు జనించి రక్షణంబు సేయు
మూఁడులోకములను మోదంబుతో నేలు
నద్భుతాఖ్య నొప్పు నమరవిభుఁడు. 418

వ. మఱియు నుపశ్లోకసుతుం డగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడి దత్పుత్త్రులు భూరిషేణాదులు భూపతులును హవిష్మత్ప్రముఖులు మునులును శంభుండను వాఁ డింద్రుండును విబుద్ధాద్యులు నిర్జరులును నయ్యెదరందు 419

ఆ. విశ్వసృజునియింట విభుఁడు విషూచికి
సంభవించు నంశ సహితుఁ డగుచుఁ
జెలిమి శంభుతోడఁ జేయు [1]విష్వక్సేనుఁ
డనఁగ జగముఁగాచు నవనినాథ. 420

వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మనువయ్యెడి మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణీపతులును విహంగమ కామగమన నిర్వాణరుచులను వారు సురలును వైధృతుఁ డనువాఁ డింద్రుండును నరుణాదులు ఋషులును నయ్యెద రందు. 421

ఆ. అంబుజాతనేత్రుఁ డాసూర్యసూనుఁ డై
ధర్మసేతు వనఁగఁ దగ జనించి

---

1 విష్వక్సేనుఁడు=విష్ణు సేనానాయకుఁడు.

వైభవాఢ్యుఁడగుచు వైధృతుఁ డలరంగఁ
గరుణఁ ద్రిజగములనుఁ గావఁ గలఁడు. 422

వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి సంద్రెండవ మను వయ్యెడి నతని నందనులు దేవవనుసదేవ దేవజ్యేష్ఠాదులు వసుధాధిపతులును ఋతుధాముం డను వాఁ డింద్రుండును హరితాదులు వేల్పులును దపోమూర్తి తపస్విత్రగాదులు ఋషులును నయ్యెద రంటు. 423

ఆ. జలజలోచనుండు సత్యతపసూనృ
తలకు సంభవించుఁ దనయుఁడగుచు
ధరణిఁ గాచు నంచి తస్వధామాఖ్యుఁ డై
మనువు సంతసింప మానవేంద్ర. 424

వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుం డగు దేవసావర్ణి పదుమూఁడవ మను వయ్యెడి మనుకుమారకులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులును సుకర్మసుత్రామ సంజ్ఞలు గలవారు బృందారకులును దివస్పతి యనువాఁ డింద్రుండును నిర్మోహతత్త్వదర్శాద్యులు ఋషులును నయ్యెద రండు. 425

ఆ. ధరణిదేవహోత్ర దయితకు బృహతికి
యోగవిభుఁడు నాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డా ది వస్పతి కెంతయు
సౌఖ్యమాచరించు జగతినాథ. 426

వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాలవ మను వయ్యెడి మను నందనులు గంభీరవసాద్యులు రాజులును బవిత్ర చాక్షుషు లనువారు దేవగణంబులును శుచి యనువాఁ డింద్రుం డును నగ్ని బాహు శుచి శుక్రమాగధాదులు ఋషులును నయ్యెద రండు. 427

తే. తనర సత్రాయణునకు వితానయందు
భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుఁ గ్రియాతంతు విసరములను
నాకవాసులు ముద మంద నతవరేణ్య. 428

క. [1]జగతీశ త్రికాలములనుఁ
బొగడొందు మనుప్రకారములు సెప్పఁ బడెం
దగఁ బదునలువురు మనువులుఁ
దెగ యుగములు వేయు నడవ దివ సమజున కగున్. 429

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430

ఆ. ఈపదంబు లందు నీమనుప్రముఖుల
నెవ్వరనుచు వార లేమికతన
నధికవిభవులైరి వారి యేల జనియించె
నెఱుఁగఁ బలుకు నాకు సిద్ధచరిత. 431

వ. అనినం బారాశర్యకుమారుం డిట్లనియె. 432

సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు
నమరులు హరియాజ్ఞ నడఁగువారు
యాజ్ఞాదు లంశలు హరిపౌరుషాకృతు
లామనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు రొగి నాల్గుయుగముల
కడపటఁ గాలసంగ్రస్తమైన
నిగమచయంబును నిజ తపోబలముల
మరలఁ గాంతురు ఋషివరులు దొంటి

తే. పగిది ధర్మంబు నాలుగు పాదములనుఁ
గలిగి వర్తిల్లు మనువులు గమలనేత్రు
నాజ్ఞఁ దిరుగుదు రేలుదు రవనిపతులు
జగతి భాగించి తమతమ సమయములను. 433

వ. మఱియుం బ్రాప్తులయినవారల నింద్రపదంబులను బహుప్రకారం బుల దేవపదంబులను హరి ప్రతిష్ఠించుచుండు వారలు విహిత కర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు లోకంబులు సువృష్టులై యుండు. 434

---

1 తా॥ జరిగిన, జరుగుచున్న, జరుగనున్న మూఁడు కాలములందలి పదునలువురు మనువుల విషయము చెప్పంబడినది. మనువులు పదునలువురు వేయియుగముల పరిమాణకాలములో నొకరివెన్క నొకరు నడుతురు, అది బ్రహ్మకొకనాటి పగటికాలము.

సీ. యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు
మౌనిరూపమునఁ గర్మంబుఁ దాల్చి
సర్గంబు సేయుఁ బ్రజాపతి రూపుఁడై
యింద్రుఁడై దైత్యుల నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ
గాలరూపమునఁ బాకంబు సేయు
నానావిధాకార నామరూపంబులఁ
గర్మలోచనులకుఁ గానఁబడఁడు

ఆ. చనిన రూపములను జనురూపముల నింక
జనఁగ నున్న రూప చయము నతఁడు
వివిధుఁడై యనేక వృత్తుల వెలిఁగించు
విష్ణుఁ డవ్యయుండు విమల చరిత. 435

## వామన చరిత్ర కథా ప్రారంభము

వ. అనిన భూవరుం డిట్లనియె. 436

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె ని
శ్చలుఁడున్ బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁడై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను వినంగౌతూహలం బయ్యెడిన్.

వ. అనిన శుకుం డిట్లనియె. 438

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే
బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబు రాఁగొల్చి శిష్యుఁడై వర్తింప
వారు నాతనిభక్తి వలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప
భవ్యకాంచన పట్ట బద్ధరథము
నరుణ[1]వాజులఁ బోలు [2]హరులుఁ [3]గంఠీరవ
ధ్వజము మహాదివ్య ధనువుఁ బూర్ణ

తే. 1తూణయుగళంబుఁ గవచంబుఁ ౹ దొలుత హయము
పావకుండిచ్చె 2నమ్లాన ౹ పద్మమాలఁ
గలుష హరుఁడగు తనతాత ౹ కరుణ నొసఁగె
సోమసంకాశశంఖంబు ౹ శుక్రుఁడిచ్చె. 439

వ. ఇవ్విధంబున. 440

క. పాణియు 3రథియుఁ గృపాణియుఁ
4తూణియు 5ధన్వియును స్రగ్వి ౹ తురగియు దేహ
త్రాణియు ధిక్కృతవిమత
ప్రాణియు 6మణికనకవలయ ౹ పాణియు నగుచున్. 441

మ. పలుదానంబుల విప్రులం దనిపి తద్భద్రోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి సి
ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁడై ౹ రాజద్రథారూఢుఁడై
వెలిఁగెన్ దానవభర్త 7శైలశిఖరో ౹ ద్వేల్లద్దవాగ్నిప్రభన్. 442

క. 8దండిత మృత్యుకృతాంతులు
ఖండిత సురసిద్ధసాధ్య ౹ గంధర్వాదుల్
పిండితదిశు లమరాహిత
దండాధీశ్వరులు సములు ౹ దన్నుం గొలువన్. 443

క. చూపుల గగనము మ్రింగుచు
నేపున దివి భువియు నాత ౹ లీతల సేయన్
రూపించుచు దనుజేంద్రుఁడు
ప్రాపించెను దివిజనగర ౹ పథము నరేంద్రా. 444

వ. ఇట్లు బలవంతుఁడగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమ
నంబుసేసి నిడుదపయనంబులం జని చని. 445

---

1 తూణము=అంబులపొది, 2 అమ్లానపద్మమాల=వాడని తామరపూలదండ, 3రథి=రథము గలవాఁడు, 4 తూణి=అంబులపొది గలవాఁడు, 5 ధన్వి=ధనస్సు గలవాఁడు, 6 మణి... ..పాణి=మణులచేత బంగారుచేతఁ జేయఁబడిన కడియముల చేయి గలవాఁడు, 7 శైల......ప్రభన్=కొండ నెత్తముఁనం జెట్లరాయిడివలన గలిగిన పెద్దమంట



వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట.

క. సురలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్.

మ. కనియెం బుణ్య[1]జనౌకముఁ [2]విగతరోగస్వప్నపీడాన్నఖా
దన సంశోకముఁ బుష్పపల్లవ ఫలోద్ధామ [3]ద్రుమానీకముఁ
[4]స్వనితోద్ధూతపతాకముం బ్రవిచరద్దైవ్యమానికానీకముఁ
ఘన గంగాసలిలైకముఁ [5]మఘవయుక్తశ్రీకముఁ [6]నాకముఁ.

వ. కని రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పు గల వేల్పుల నెలవు
దఱియం జొచ్చి చెచ్చెరముందఱికిం జని చని ముందట నెడపడక
మొన మోపి యిగురుచు చిగురు తలిరాకుజొంపంబున [7]నన
మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ
పండు గెలకతండంబుల వ్రేగులాఁగ లేక మూఁగి వీఁగి వ్రేఁకలగు
మ్రాఁకుల ప్రోకలకుఁ బేఁట లగు పెందోఁటలును దోఁటల
గాటంబులై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు వివ్వక
కసిమసలు గలిగి ముసరి కొసరి పూని పోని తేనియలాని విసరు
గలిగి మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని జుమ్ముజుమ్మనుచు జంజా
టించు తేఁటిదాఁటులును దాఁటువడక నాఁటుకొని పూవిడుచు
కూడి జోడువీడక క్రొమ్మావులకమ్మనికొమ్మల నిమ్మల ముసరి
పసిమిగల కిసలయమ్ములు వోసంగ మెసంగి కిసరుపడక కసరు
నెడి బిట్టురట్టడి తనంబు లలమి మించి కరాళించు కోయిలల
మొత్తంబులును మొత్తంబులై చిత్తంబుల మత్తంబులుగఁ దత్తఱం
బునం దియ్యనితండ్లకుఁ గయ్యంబులు సేసి చయ్యన నేసరేఁగి
పేసంబులు గాసంబులు గొని వాసికెక్కి పలుబాస లాడుచు
బహుప్రకారంబు లగు కీరంబులునుఁ గీరంబులకు సరిఁగడచి
మింట నంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టుచనక నెట్టుకొని నెల
వుల వ్రాలుచు నింపుఁగలరవమ్ములుఁ గలుఁగు [8]కలరవమ్ములును

---

1 జనౌకము=జన సముదాయము, 2 విగత.....శోకము=విడువంబడిన రోగములు, కలలు, పీడలు, తినుటలు, దుఃఖములు లేనిది, 3 ద్రుమానీకము=చెట్లగుంపు, 4 స్వనితో......పతాకము=తనయందలి హుంకారముచేత ఎగురగొట్టఁబడిన శత్రువుల రథముల టెక్కెములు గలది, 5 మఘ.....శ్రీకముఁ=నూరు యజ్ఞాలు చేసినట్టి యింద్రుని వైభవముతో గూడినది, 6 నాకము=క=సుఖము. అది కానిది అకము అనగా దుఃఖము అది లేనిది న+అకము (నాకము)=సుఖము. 7 నన= పువ్వు, 8 కలరవము = మంచి

గలరవమ్ము లలరం దోలంకుల కోలంకుల కెలంకులఁ గింజల్కలం
బ్రియల నిడుకొని క్రమ్మి ద్రొమ్మి సేసి యెలదమ్మితూఁడుల
వాఁడులగు 1చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం
బడుచు నలబలంబులు సేయు కలహంసంబులను హాససహిత జనిత
వికసనముల వికవిక నగుచుం బసఁగలిగి మిసమిస మెఱుఁగు పసిఁడి
కెంపమ్ము లిందిరా మందిరమ్ముల చందమ్ములుగ సందమ్ము లగు
కొలంకులును కొలంకుల కరత్నఁబడసి వడవడ వహించుచు నల్లి
బిల్లులు గొనిసాఁగిన తీగెయిండ్లగండ్ల యూఁగాడుముల వారసులు
సెడి పలువిరుల కమ్మవలపుల క్రేఁగునం దూఱలేక యూఁడిగిలం
బడుగాడ్పులును గాడ్పులవలన నెగసి గగనమున నిరిసి పలువ
న్నెలం జెన్నగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున పట్టంబులయిన
కుసుమ2పరాగంబులును బరాగంబుల3సరాగంబులగు వాఁగు వ్రంతల
చెంతల గుంపులు గొనిగఱికెజొంపంబుల 4లంపులు దిని మంపులు
గొని పెల్లునెమర్లు వెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గడల వాఁడల
వాడల జాడలం బరుగు లిడు దూడల క్రీడల వేడుకలం గూడు
కొని యిండ్ల వాకిండ్లకుం జేరి పౌరులకోరికల కనుసారిక లగుచు
నమృతంబుఁగురియు కామధేనువులును గామధేనువులకు నిలువ
నీడలగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁబంచు కల్ప
తరువులును కల్పతరువుల పల్లవముం జరులఁ గుంజరులకు విఱిచి
యిచ్చుచు మచ్చికలకలిమి నిచ్చ మెచ్చుచుఁ బ్రకృతకగిరుల దఱుల
సిరులనడరు పడఁతులనడలకు గురువు లగుచు మెఱయు మరువుల
నొత్తరించు మత్తేభంబులును నిభంబుల సరస నొరసికొని వరుసఁ
బరుసఁదనము లెడలి సుకరము లగు మకరతోరణస్తంభంబులునుఁ
తోరణస్తంభంబుల చేరువ నిలిచి చెఱకువిలుతుం డొఱనెఱికిన
బెడిదము లగు నవకంపు మెఱుఁగుం జిగురుటడిదముల తెఱంగున
నిలుకడ సంపదలు గలుగు రంభల సొంపునం గరచరణాది శాఖలు
గల చంద్రరేఖలపోఁడిమిని వాహినిగల మోహినీవిద్యల క్రొద్దనఁ
జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు

1 చంచువు = పక్షిముక్కు, 2 పరాగము = పుప్పొడి 3 సరాగము = కోరిక

యుగళంబులు గలిగి యునయానంబు లగు విమానంబు లెక్కి వచ్చి
వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోడ్కొని
పోవు రంభాది[1]కుంభికుంభ కుచల కలకలంబులునుం గలహంస
కారండవ కోకసారసబృంద సుందరసుందరియు [2]నిందీవరారవింద
నందదిందిందిరయు [3]నభంగయు [4]సభంగయునగు [5]గంగనింగికింబొం
గనోయుని మిగుల దిగులుపడం బొగడ్త కెక్కిన యగడ్తలును నగ
డ్తల కమిన్నేటి తేటనీటనీటులీనుపాటి సూటిచల్లులాటల మేటికూటు
లాడుచు నేచిన ఖేచరకన్యకావారంబులును వారవనితా
సుభ్రాజిత విభాజిత దేహాళి పాటసంబులగు గోపురకనకకవాటంబు
లును గవాటవేదికాఘటిత మణిగణకిరణోదారంబులగు నింద్ర
నీల స్తంభగంభీరతలును గంభీర విమల కమల రాగపాలికామాలి
కాలంకారంబు లగు చతుర్ద్వారంబులును ద్వారదేశంబుల చావిళ్ళం
గావ ఖ్యుండి ప్రొద్దుపోక పెద్దరక్కసుల వేల్పుల కయ్యంబులు
సెవస్యంబులం జెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులు శూరులు
నయిన మహాద్వారపాలకవీరులును [6]వీరరసజలధి వేలోదారంబు
లయి శుద్ధస్ఫటిక బద్ధ మహాహాత్తానంబులగు సోపాన సుభగాకా
రంబులును సుభగాకార ప్రదీపంబులగు వజ్రమహారజత [7]వప్రంబు
లును వప్రోపరి[8]వజ్రకుడ్య శిరోభాగ చంద్రకాంత తరుణ హిమకర
కిరణముఖరంబులగు [9]సాలశిఖరంబులును [10]శిఖరస్తోమధామనికృత్త
తారకంబులును దారకారమణి శిలాకరోరంబు లగుచు మిగుల
గరిత యగు నగరిసిరి మీఱినమరు మొగులు వాడగని నిలుకడ
లకు నలువ నడిగికొని పడసిన పసిండి తెరలవలువల బెడంగునం
దోరంబులగు ప్రాకారంబులునుం బ్రాకారకాంచనాంచిత యుద్ధ
సన్నద్ధ మహాఖర్వగంధర్వవాహినీపాలకంబులగు మరకత[11]ట్టాల

---

1 కుంభికుంభకుచలు = ఏనుఁగు మూఁపురమునంటి గుబ్బచన్నులు గలవారు (ఆడువారు) 2 ఇందీవ......దిందిందిర=కలువతామరపూలచేత సంతోషించుతుమ్మెదలు, 3 అభంగ=చెడనిది, 4 సభంగ=అలలతోఁ గూడినది, 5 మిన్ను + ఏటి=ఆకాశగంగ, 6 వీర......దారంబు=వీరులకుం గలుగు ఆవేశమను సముద్రపుఁ జెల్లెలికట్టవెంపు, 7 వప్రము=కోటచుట్టుగోడ, 8 వజ్రకుడ్యము=వజ్రమణితోఁ గట్టిన గోడ, 9 సాలము=ప్రాకారము, 10 శిఖర......బులు=కోట బురుజులయందలి యిండ్లచే వేరుచేయఁబడిన

కంబులును నట్టాలకోత్తుంగవజ్రమయ స్తంభోదంచనంబులునుఁ
బరభటప్రాణవంచనంబులు సముదంచనంబులునగు దంచనంబులును
దంచనంబుల తుదలు రథంబులయిరుసులు నొరసికొనం గోటయియా
వళియావలి తివియనిదివియలకరణి రుచిరమై లసుచుఁ బచరించు
నహిమకర హిమకరమండలంబులను హిమకరమండలంబు నిద్దంపు
టద్దంబని మూఁగి తొంగిచూచుచు నకఫలకంబులఁ గులకములఁ
గొను నలకములం దరపి తిలకములం దెఱంగు పఱచుకొను సమ
యముల వెనుక నొడిఁగి కదిసి ముకురంబులం బ్రతిఫలితు లైనపతు
లితరసతుల రతులకనుమతులని కనుకని౯ మరలినీడ తలంగిన గలంగి
చని కాంతులు వోలయు నలయు ముగుదలకు నేకాంతంబులై గగన
సముత్సేధంబులైనరాజసౌధంబులును సౌధంబుల సీమల ముత్తి
యంపుసరులతోడి నిబ్బరపుగుబ్బ చన్నులచెన్నులం బ్రక్కలం
జక్కలపదువులుండ మండిత సౌధశిఖరంబులకు శృంగారంబుల
యిన భృంగారంబులును భృంగారశయనజాలకడోలికా 1నిశ్రేణి
కాది విశేషరమ్యంబు లయిన హర్మ్యంబులును హర్మ్యకనక
గవాక్షరంధ్రనిర్గత కర్పూరకుంకుమాగరుధూప ధూమంబులును
ధూమంబులు జీమూతస్తోమంబు లని ప్రేమంబు లుబ్బ గొబ్బునం
డబ్బాటు పబ్బంబు లబ్బె నని మరులుఁగొని పురులవన్నియల
సిరులు సరులుగొనం గుటవిటములఁ దటపెట నటించుచుఁ బలు
కులుఱ విరిసి కికురువెట్టుచు 2వలజేని మఱువుఁ జదువుల టీక లనం
గేక లిడు నెమిళ్ళను నెమిళ్ళ పురులనారలు నారు లగు రతనంపు
విండ్ల నినదములను తలంపుల దోఁకలు జడిసి వీఁకలు మెఱసి
మూఁకలుఁ గొని దివి కెగరి రవికిం గవిసిన రాహువుక్రియం దివిఁ
దడంబడు పడగలును బడగలును గొడుగుల్లును దమకు నాలంబు
లకు నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు
మెఱసి బెబ్బులుల గబ్బునం గరుల సిరుల సింగంబుల భంగుల
శరభంబుల రభసంబుల ధూమకేతువులరీతుల వైరింజీరికిం గొనక
శంకలుడిగి అంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్క

సుల చక్కటి యెక్కటికయ్యముల దయ్యము లెఱుంగందిరుగు వీరభట [1]కదంబులును గదంబకరవాలశూలాదుల మెఱుంగులు మెఱపుల తెఱంగులం దిశల చెఱంగులం దుఱంగలింప నేమి నినదంబులు దలములగు నుఱుములుగ నడమొగిళ్ళ పెల్లునం బ్రవర్షిత రథికమనోరథంబులగు రథంబులగములును గములుఁ గొని గమన వేగంబువలన హరిహరుల నగి గాలిం జాలింబడం గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును తంగదుత్తుంగ విశదమదకలకరటి కటతటజనిత మదసలిల కణ గణ విగళిత దశశతనయన భుజసరళ మిళిత లలిత నిఖిలదిగధిపతి శుభకర కనకకటక ఘటిత మణి సముదయసముదిత రేణువర్గదుర్గమంబులయిన నిర్వక్రమార్గంబులును మార్గస్థలోపరిగతాగతశతశతాయుతానేక గణనాతీత రోహణాచల తట విరాజమానంబులగు విమానంబులును విమానవిహారమాణ సుందర సుందరీ సందోహ సంవాదిత భూరిభేరీవీణా పణవ మృదంగ కాహళ శంఖాదివాదనానూన గాన సాహిత్య నృత్యవిశేషంబులును విశేషరత్నసంఘటిత శృంగార శృంగాటకవాటికా దేహదేహళీ ప్రదీపంబులును దీపాయమానమానిత సభామండప ఖచిత రుచిర చింతారత్నంబులునుం గలిగి రత్నాకరంబునుం బోలె ననిమిష కౌశిక వాహినీ విశ్రుతంబయి [2]శ్రుతి వాక్యంబునుంబోలె సకల్మష సువర్ణ ప్రభూతంబయి భూతపతికంఠంబునుం బోలె [3]భోగిరాజ కాంతంబయి కాంతాకుచంబునుం బోలె [4]సువృత్తంబయి వృత్తజాతంబునుం బోలె సదా గురులఘు నియమాభిరామం బయి రామచంద్రుని తేజంబునుం బోలె ఖరదూషణాది [5]దోషాచరానుపలబ్ధం బయి లబ్ధవర్ణు చరిత్రంబునుం బోలె విమలాంతరంగ ద్యోతమానం బయి మానధనుని నడవడియునుంబోలె [6]సన్మార్గ భాతి సుందరంబయి సుందరోద్యానంబునుం

---

1 కదంబము = సముదాయము లేక కడిమిచెట్టు, ఆయుధ విశేషము. 2 శ్రుతి = వినఁబడిన భగవానుని వాక్యములు (వేదము), 3 భోగిరాజకాంతము=భోగమనుభవించు రాజులచేత మనోహరమైనది, పాముల రేనిచేత మనోజ్ఞమైనది, 4 సువృత్తము=బాగుగా గుండ్రనైనది, మంచినడవడికతో గూడినది, 5దోషాచరులు=రాక్షసులు, 6సన్మార్గము=మంచిదారి లేక ఆకాశము.

బోలె [1]రంభాంచితాశోక [2]పున్నాగంబయి పున్నాగంబునుం బోలె సురభీసుమనోవిశేషంబయి శేషాహిమస్తకంబునుం బోలె సమున్నత క్షమావిశారదంబయి [3]శారద సముదయంబునుం బోలె ధవళ[4]జీమూత ప్రకాశితంబయి సితేతరాజిన దానంబునుం బోలె సరస్వతీలోత్తమంబయి యుత్తమపురుషవచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షంబై వర్షాదియుగంబునుం బోలె నుల్లసదింద్రగోపంబయి [5]గోపతిమూర్తిపురంబునుం బోలె విచక్షు[6]రార్యాలంకృతంబయి కృతార్థంబయిన యమరావతీనామ నగరంబు చేరం జని కోటచుట్టునుం బట్టుగల బలంబులఁ జలంబున విడియించి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱకయుండె నంత. 447

క. మాయురు నగవులకును గను
మాయురుకాలంబుకతన । మందియుఫలులన్
డాయరు పుణ్యజనంబులఁ
బాయరు సురరాజువీటి । ప్రముదాజనముల్. 448

వ. అప్పుడు. 449

క. దుర్భరదానవశంఖావిర్భూత ధ్వనులు నిండి । విబుధేంద్ర వధూగర్భములు పగిలి లోపలి యర్భకతతు లావు రనుచు । నాక్రోశించెన్.

వ. అంత. 451

సీ. బలి వచ్చి విడియుట । బలభేది వీక్షించి
గట్టిగాఁ గోటకుఁ । గాపు పెట్టి
దేవవీరులఁ దాను । దేవతామంత్రిని
రప్పించి సురవైరి । రాకఁ జెప్పి
ప్రళయానలునిభంగి । భాసిల్లుచున్నాఁడు
ఘోరరాక్షసులను । గూడినాఁడు
మన కోడి చని నేఁడు । మరలవీఁడేతెంచె
నేతపంబున వీని । కింత వచ్చె

---

1 రంభ=దేవకాంత, అరఁటిచెట్టు, 2 పున్నాగము = ఏనుఁగు, మగపాము, ఒక చెట్టు, 3 శారద=శరత్కాలము, సరస్వతి, 4 జీమూతము=చీఁకటి, మేఘము, 5 గోపతి= వృషభము, శివుఁడు, 6 ఆర్యాలంకృతము = పార్వతిచేత పెద్దలచేతఁ బ్రకాశించునది. అయిన

ఆ. నీదురాత్మకునకు ‡ నెవ్వఁడు దోఁడయ్యె
నింక వీని గెల్వ ‡ నేది త్రోవ
యేమి సేయువార ‡ మెక్కడఁ జొత్తుము
నెదురు మోహరింప ‡ నెవ్వఁడోపు. 452

క. మ్రింగెడు నాకాశంబునఁ
బొంగెడు నమరాద్రికంబెఁ ‡ బొత్తై పెక్కన్
మ్రింగెడుఁ గాలాంతకు క్రియ
భంగించును మరలఁబడ్డఁ ‡ బంకెనగర్వ్వన్. 453

క. ఈరాదు రాజ్య మొల్లనఁ
బోరాదు రణంబు సేయఁ ‡ బోయితి మేనిన్
రారాదు దనుజుచేతను
[1]జారా దిటమీఁద నేమి ‡ జాడ మహాత్మా. 454

వ. అనిన సురరాజునకు సురాచార్యుం డిట్లనియె. 455

సీ. వినవయ్య దేవేంద్ర ‡ వీనికి సంపద
బ్రహ్మవాదులు భృగు ‡ ప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు ‡ నెదురను నిలువంగ
హరి యీశ్వరుఁడు దక్క ‡ నన్యజనులు
నీవును నీసముల్ ‡ నీకంటె నధికులుఁ
జాలరు రాజ్యంబు ‡ చాలు నీకు
విడిచి పోవుట నీతి ‡ విబుధనివాసంబు
విప్రతులు నలఁగెడు ‡ వేళ చూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట ‡ సమ్మతంబు
విప్రబలమున వీనికి ‡ వృద్ధివచ్చె
వారిఁగైకొనమిట మీఁద ‡ నాఁడె చెడునుఁ
దలఁగు మందాఁకరిపుఁ జేసి ‡ దలఁపవలదు. 456

క. పరు గెలువ వలయు నొండెను
సరి పోరఁగవలయు నొండె ‡ జావలెనొండెన్

---

1 చారాదు=వచ్చు ధాతువు. దాని రూపములు చావు, చా వాని వ్యతిరేక మధ్యమోత్తమపురుషుల రూపము చారాదు=చావలేను. ఎందుచేత ననఁగా వారు అమరులు=

సరి గెలుపు మృతియు దొరకమి
సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్. 463

వ. అనినఁ గార్యకాలప్రదర్శి యగు బృహస్పతివచనంబు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమతమ పొందుపట్లకుం జనిరి బలియునుం బ్రతిభట వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగత్త్రియంబునుం దన వశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబుసేయుచుండ శిష్యవత్సలు లగు భృగ్వాదులతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి తత్కాలంబున. 458

శా. అర్థుల్ వేఁడరు దాతలుం జెడరు సత్కార్యారంభముల్ పండుఁబ్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వ్రాల్చుఁబూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వమసురేంద్రాధీశు రాజ్యంబునన్. 459

వ. అంత. 460

సీ. తనతనూజులప్రోలు దనుజులు గొనుటయు
వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది
వగ ననాథాకృతి వనరుచుండ
నాయమ్మ పెనిమిటి యగుకశ్యపబ్రహ్మ
మఱి యొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్న ధామమునకు నేగి
నాతిచే విహితార్చనములువడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడినయిల్లాలి
వదన వారిజంబు వడువుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చిబుకంబు పుడుకుచు
వారిజాక్షి యేల వగచె దనుచు. 461

వ. అమ్మహాత్ముం డిట్లనియె. 462

మ. తెలవాఁ విప్రులు పూర్ణులే చెలఁగునే దేవార్చనాచారముల్
తఱితో వేలుతురే గృహస్థులు సుతుల్ ధర్మానుసంధానులే
నెఱి నభ్యాగతకోటి కన్నమిడుదే నీరంబునుం బోయుదే

ఆ. అన్నమైనఁ దక్ర ǂ మైనఁ దోయంబైన
శాకమైనఁ దనకుఁ ǂ జరగుకాలఁది
నతిథిజనుల కడ్డ ǂ మాడక యిడరేని
లేమవారు కలిగి ǂ లేనివారు. 464

వ. మఱియు. 465

ఆ. నెలఁత విష్ణునకును ǂ నిఖిలదేవాత్మున
[1]కాననంబు శిఖియు ǂ నవని సురులు
వారు దనియఁ దనియు ǂ వనజాతలోచనుఁ
డతఁడుఁ దనియ జగము ǂ లన్నిఁదనియు. 466

క. బిడ్డలు వెఱతురె నీకఱ గొడ్డంబులు సేయ కెల్ల ǂ కోడండ్రును మా
ఱొడ్డారింపక నడతురె యొడ్డము గాకున్న దేమృ ǂ గేక్షణ యింటన్.

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

ఉ. ప్రేమ యొకింత లేక దితి ǂ బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తనదు ǂ బిడ్డల నందఱఁదోలి సాహసా
క్రామితవైరు లయ్యు నమ ǂ రావతి నేలుచు నున్నవారు నీ
కేమని విన్నవింతు హృద ǂ యేశ్వర మేలుఁదలంచి చూడవే.

క. అక్కా చెల్లెండ్రయ్యును
దక్కరు నాతోడిపోరుఁ ǂ దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ
నక్కట వల దనదు చూచు ǂ నౌనౌ ననుచున్. 470

సీ. ఎండ కన్నెఱుఁగని ǂ యింతిని యిల్లాలు
పలుపంచలును జాలిఁ ǂ బడియె నేఁడు
త్రిభువన సామ్రాజ్య ǂ విభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ ǂ దిరిఁగె నేఁడు
కలిమి గారాబు బి ǂ డ్డలు జయంతాదులు
[2]శబరార్భకుల వెంటఁ ǂ జనిరి నేఁడు

---

1 ఆననం......సురులు=విష్ణుమూర్తి ముఖము, అగ్నిహోత్రుఁడు, బ్రాహ్మణులని. "అగ్నిర్ముఖమ్ బ్రాహ్మణోస్య ముఖమాసీత్" (అని శ్రుతి.) 2 శబరార్భకులు =ఎఱుకలవాండ్ర పిల్లలు.

సమరుల కాధార । మగు నమరావతి
యసురుల కాటప । ట్టయ్యె నేఁడు

ఆ. బలి జగముల నెల్ల । బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు । వాసవునకు
యాగ భాగ మెల్ల । నతఁ డాహరించునుఁ
గడఁగి సురల కొక్క । కబళ మీఁడు. 471

క. ప్రజలకు నెల్లను సముఁడవు
ప్రజలను గడుపారఁగన్న । బ్రహ్మవు నయ్యుం
బ్రజలందు దుష్టమతులను
నిజముగ శిక్షింపవలదె । నీవు మహాత్మా. 472

మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ । శోకంబువారించి ని
ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ । శాసింప సత్కార్యమే
వెర వేరీతి ఘటిల్లునట్టి క్రమమున్ । వేగంబ చింతింపవే
కరుణాలోకసుధాఝరిం దనుపవే । కళ్యాణసంధాయకా. 473

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్త మాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె. 474

మ. [1]జనకుం డెవ్వఁడు [2]జాతుఁ డెవ్వఁడు [3]జనిస్థానంబు లెచ్చోటు సం
జననం బెయ్యది మేను లేకాలఁదిఁ సంసారంబు లేరూపముల్
వినుమాయింతయు విష్ణుమాయ దలఁపన్ । వేఱేమియున్ లేదు మో
హ నిబంధంబు నిధాన మింతటికి [4]జాయా విన్నఁబో నేటికిన్. 475

వ. అగు నయిననుం గాలోచితకార్యంబు సెప్పెద. 476

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపా । పారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరిసేవసేయు మతఁడున్ । సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థములెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహు । సౌభాగ్యంబులం బ్రేయసీ.

వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె. 478

క. నారాయణుఁ బరమేశ్వరు
నేరీతిఁ దలంతు మంత్ర । మెయ్యది విహితా

---

1 జనకుఁడు=తండ్రి, 2 జాతుఁడు = పుట్టినవాఁడు, 3 జనిస్థానము = పుట్టుకచోటు
4 జాయ=భార్య.

చారంబు లే ప్రకారము
లారాధన కాలమెద్ది ? యానతి యీవే. 479

వ. అనిన గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతం బుపదేశించి తత్కాలంబునుఁ దన్మంత్రంబును దద్విధానంబును దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించిన నదితియును ఫాల్గుణమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమ దివసంబునన్ దొరకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి వ్రతాంతంబున నియతయై యున్న యెడఁ జతుర్బాహుండునుఁ 1పీతవాసుండును శంఖచక్ర గదాధరుండునునై నేత్రంబుల కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480

క. కన్నుల సంతోషాశ్రులు
చన్నులపైఁ బఱవఁ బులక ? జాలము లెసఁగన్
2సన్నతులును సన్నుతులును
నున్నతరుచిఁ జేసి 3నిటల ? యుక్తాంజలియై 481

క. చూపుల శ్రీపతిరూపము
నాపోవక త్రావి త్రావి ? హర్షోద్ధతయై
వాపుచ్చి మందమధురా
లాపంబులఁ బొగడె నదితి ? లక్ష్మీనాథున్. 482

సీ. యజ్ఞేశ విశ్వంభ ? రాచ్యుతశ్రవణ మం
గళ నామధేయ లో ? కస్వరూప
యాపన్నభక్తజ ? నార్తివి ఖండన
దీనలోకాధార ? 4తీర్థపాద
విశ్వోద్భవ స్థితి ? విలయకారణ భూత
సంతతానంద శ ? శ్వద్విలాస
యాయువు దేహంబు ? ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ద్రి ? వర్గములును

---

1 పీతవాసుఁడు=పచ్చని పట్టుబువ్వలున గలవాఁడు (నారాయణుఁడు) 2 సత్ + నతులు = సన్నతులు = మేలైన నమస్కారములు, సన్నుతులు = మేలైనస్తోత్రములు, 3 నిట... ..జలి=మొగము సగమునకెత్తిన దోసిలి (గలది) 4 తీర్థపాద= గంగాదేవి

తే. [1]వైదికజ్ఞానమును ముక్తి । వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు । నెఱయఁగలదె
వినుతమందార గుణహార । వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష । పరమపురుష. 483

ఆ. అసురవరులు సురల । నదలించి బెదరించి
నాకమేలు చున్న । నాఁటనుండి
కన్నకడుపుఁగాన । కంటఁ గూరుకు రాదు
కడుపుఁబొక్కుమాన్పి । కావవయ్య. 484

వ. అనిన విని దరహసిత వదనుం డయి యాశ్రితకామధేనువైన యప్పమేశ్వరుం డిట్లనియె. 485

శా. నీకోడండ్రును నీకుమారవరులున్ । నీనాథుఁడున్ నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల స।మ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమునఁ దే।జోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీసుతుఁడనై । నర్తించి వర్తింపఁగాన్. 486

మ. బలిమిన్ దైత్యులఁ జంప రాదు వినయో।పాయంబునం గాని సం
చలనం బొందకు నేను నీనియతికిన్ । సద్భక్తికిన్ మెచ్చితిన్
బలివిద్వేషియు నా [2]నిలింపగణముం । [3]పౌలోమియున్ మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి ని।త్తున్ దుఃఖ మింకేటికిన్.

క. నీరమణుని సేవింపుము
నారూపము [4]మానసించి । నలి నీ[5]గర్భా
గారంబు వచ్చి చొచ్చెద
గారామునఁ బెంప వమ్మ । కరుణన్ నన్నున్. 488

క. పాలింతు దివము సురలనుఁ
బాలింతు మహేంద్రయువతి । భాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని
ర్మూలింతు రిపుప్రియాంగ।ముల భూషణముల్. 489

వ. అని యిట్లు భక్తజనపరతంత్రుం డగు [6]పురాణపురుషుం డానతిచ్చి

1 వైదికజ్ఞానము=వేదవిహిత కర్మలను జేయవలయునను జ్ఞానము (తెలివి), 2 నిలింపగణము=దేవతాసమూహము, 3 పౌలోమి = పులోముని కూతురు శచి (ఇంద్రుని పెండ్లము) 4 మానసించి=మనమున నిలిపి. 5 గర్భాగారము=కడుపను ఇలు.

తిరోహితుం డయ్యె నయ్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దనమనోవల్లభుం డగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె నంత నొక్క దివసంబున. 490

. ఘనసమాధినుండి ✽ కశ్యపుఁ డచ్యుతు
నంశ మాత్మ నొలయ ✽ నదితియందుఁ
దనదువీర్య మధిక ✽ తరము సేర్చెను గాలి
శిఖిని దారువందుఁ ✽ జేర్చినట్లు. 491

వ. ఇట్లు [1]కశ్యప చిరతర తపస్సంభృత వీర్య ప్రతిష్ఠగర్భయై [2]సురల తల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె నంత. 492

క. చలచల నై పిదపిద నై
గలలం బై కరుడు గట్టి ✽ గళనాళముతోఁ
దల యేర్పడి గర్భం బై
నెలమసలం [3]జీరచిక్కె ✽ నెలఁతకు నధిపా. 493

క. నెలఁతకుఁ జూలై నెల రె
న్నెల లై మఱి మూఁడు నాల్గు ✽ నెల లై వరుసన్
నెల లంత కంత కెక్కఁగ
నెలలును డగ్గఱియె నసుర ✽ నిర్మూలతకున్ 494

క. [4]మహితతర మేఘమాలా
పిహితాయుతచండ ✽ భానుబింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు
గృహిణీగర్భమున శిశువుఁ ✽ గ్రీడించె నృపా. 495

క. తనకడుపున నొక యిఱువునఁ
వనరుహగర్భాండభాండ ✽ [5]వనధిచయంబుల్.
గొనకొని జగములు నిడుకొని
దనుగతిఁ గడు నడఁగి మడిఁగి ✽ తనరెడు బెడఁగై. 496

వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

---

1 కశ్యప.....గర్భ = కశ్యపుఁడు ఎంతకాలమునుండియో చేసిన తపస్సు వలన గూడిన వీర్యము చేత నిలిచిన కడుపుగలది, 2 సురలతల్లి=దేవతల తల్లి అదితి, 3 చీర చిక్కు=గర్భమగుట, 4 మహిత.....ప్రభతో=గొప్పవైన మబ్బులవరుస చేత గప్పిన

మ. నిలిపెన్ వేల్పుల [1]బృంహితమ్ [2]విశదిమన్ ఽ నేత్రంబులం జూచుకం
బుల నా[3]కాళిమ [4]మేఖలం బ్రథిమ నెఽమ్మోమ్మునం గాంతి [5]పాండిమ
న్వలిమిం జన్నుల [6]శ్రోణిపాళి గరిమ ఽ న్మధ్యంబునన్ [7]బృంహిమ
న్వలితాత్మన్ [8]లఘిమన్ మహా[9]మహిమ మేఽనన్ గర్భదుర్వారయై.

క. పెట్టుమరు నుదట భూతిని
బొట్టిడుదురు మేనఁ బట్టుఁ ఽ బుట్టపుఁబోయిం
బెట్టుదురు వేల్పులమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడఁతి ఽ గర్భంబునకున్. 499

వ. ఇవ్విధంబున. 500

తే. [10]విశ్వగర్భుఁడు దనగర్భ ఽ వివరమందు
బూటపూటకుఁ బూర్ణుఁడై ఽ పొటకరింప
వేఁక జూలాలితనమున ఽ వేల్పుఁ బెద్ద
పొలఁతి కంతట నీళ్లాడు ఽ ప్రొద్దులయ్యె. 501

వ. తదనంతరంబునం [11]జతురాననుండును దెంచి యదితి గర్భపరిభ్రమ
విభ్రముండగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 502

సీ. త్రిభువన జయరూఢ ఽ దేవ త్రివిక్రమ
పృథులాత్మ [12]శిపివిష్ట ఽ [13]పృశ్నిగర్భ
ప్రీత [14]త్రినాభ [15]త్రి ఽ పృష్ఠ జగంబుల
కాద్యంత మధ్యంబు ఽ లరయ నీవ
జంగమస్థావర ఽ జననాది హేతువు
నీవ కాలంబవై ఽ నిఖిల మాత్మ
లోపల ధరియింతు ఽ లోనిజంతుల నెల్ల
[16]స్రోతంబులోఁ గొని ఽ సుందరతను

---

1 బృంహిమ=అలసత్వము, కదలిక లేకుంట, 2 విశదిమ = స్వచ్ఛమైన ధావళ్యము, 3 కాళిమ=నల్లదనము, 4 మేఖలం బ్రథిమ=గజ్జలయొడ్డాణమున గట్టితనము, 5 పాండిమ =తెల్లఁదనము, 6 శ్రోణి...గరిమ=పిఱుఁదు వైపున బలిసినతనము, 7 బృంహిమ=ఎక్కువతనము, లావు, 8 లఘిమ=కొద్దితనము, 9 మహిమ=గొప్పతనము, 10 విశ్వగర్భుఁడు= లోకమంతయుఁ దనలోపల నిమిడ్చికొనినవాఁడు, 11 చతుః + ఆననుఁడు = నాలుగు మొగములు గలవాఁడు, చతుర + ఆననుఁడు=చమత్కారమైన వాక్కుతోఁగూడిన ముఖము గలవాఁడు, 12 శిపివిష్ట=జీవులం దుండువాఁడు, 13 పృశ్ని=అదితిదేవి పూర్వ

తే. బ్రహ్మలకు నెల్ల సంభవ । భవన మీవ
దివమునకుఁ బాసి దుర్దశ । దిక్కు లేక
శోకవార్ధి మునింగిన । సురలకెల్లఁ
దేల నాధార మగుచున్న । తెప్పవీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము
చెచ్చెర వెలువడి మహాత్మ । చిరకాలంబున్
విచ్చలవిడి లేకములు
ముచ్చటపడి యున్నవారు । ముదమందింపన్. 504

**వామనమూర్త్యవిర్భావము**

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు నయ్యవసరంబున. 505

మ. రవిమధ్యాహ్నమునం జరింప గ్రహతా । రాచంద్రభద్రస్థితిన్
[1]శ్రవణద్వాదశినాఁడు [2]శ్రోణనభిజి । త్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం । బుణ్యావ్రతోపేతకున్
దివిజాధీశ్వరుమాతకుం బరమపా । తివ్రత్య విఖ్యాతకున్. 506

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమల కలితచతుర్భుజుండునుఁ బిశంగవర్ణ వస్త్రుండును మకరకుండల మండితగండభాగుండును శ్రీవత్సవక్షుండును [3]నలినచక్షుండును [4]నిరంతర శ్రీవిరాజితరోలంబకదంబవిలంబిత వనమాలికా పరిష్కృతుండును మణికనకాంచిత కాంచీవలయాంగద కిరీటహార[5]నూపురాలంకృతుండునుఁ గమనీయ కంఠ కౌస్తుభాభరణుండును నిఖిలజనమనోహరణుండును నై యవతరించిన సమయంబున. 507

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్య సుమన । స్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్య చారణ మునీశ । బ్రహ్మ విద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు రం । గద్గీత వాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ [6]గింపురుషులున్ । గంధర్వులుం గిన్నరుల్.

---

1 శ్రవణద్వాదశి=శ్రవణానక్షత్రముతోఁ గూడిన ద్వాదశి, 2. శ్రోణ......బునన్=అభిజిత్తను పేరుగల లగ్నము (రెండుజాములవేళ) 3 నలినచక్షుఁడు = తామరపూవు రేకులవంటి కన్నులు గలవాఁడు, 4 నిరంతర......పరిష్కృతుండు=ఎప్పుడు కాంతి వలనఁ బ్రకాశించు తుమ్మెదలగుంపుచేత వ్రేలాడునైన తులసీవనమాలికచేతం జుట్టంబడిన వాఁడు, 5 నూపురము=అందె, 6 కింపురుషులు, కిన్నరులు=అశ్వముఖులు.

క. దిక్కులకావిరి వాసెను
నెక్కువ నిర్మలత నొందె నేఁడు పయోధుల్
నిక్కమెయి నిలిచె ధరణియుఁ
జుక్కలతో వియును విప్రసురసేవ్యములై. 509

క. ముంపుఁగొని విరులవానల
జొంపంబులు గురియు సురలు సుమనోమధుపుల్
తుంపర లెగయఁ బరాగపు
రొంపుల భూభాగమతి నిరూపిత మయ్యెన్. 510

వ. తదనంతరంబ. 511

ఆ. ఈ మహానుభావుఁ డెట్లింతకాలంబు
నుదరమందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగుపడియె నానందజయశబ్ద
ములను గశ్యపుండు మ్రొగి నుతించె. 512

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారం బగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుచందంబున నుపనయన వయస్కుండైన వామనబాలకుండై తల్లిముందటఁ గుమార సముచితాలాపంబు లాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుం దనయవిలోకన పరిణామపారవశ్యంబున. 513

ఆ. నన్నుఁ గన్నతండ్రి నాపాలి దైవమ
నాతపఃఫలంబ నాకుమార
నాదుచిన్నివడుగ నాకులదీపక
రాఁగ దయ్య భాగ్యరాశి వగుచు. 514

క. అన్నా రమ్మని డగ్గఱఁ
జన్నులపాలేఱువాఱ సంశ్లేషిణియై
చిన్నారి మొగము నివురుచుఁ
గన్నారం జూచెఁ గన్ను గడుపై యుండన్. 515

క. పురుడీబోటికి నిందిర
పురుడంబిక గాక యొరులు పురుడే యనుచుం
బురుటాలికిఁ బదిదినముల

వ. అంత సబ్బాలునకు సంతసంబున మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచి[1]తోపనయన కర్మకలాపంబులు సేయించిరి సవిత సావిత్రి నుపదేశించె బృహస్పతి యజ్ఞోపవీతంబునుఁ గశ్యపుండు ముంజియుఁ గౌపీనం బదితియు ధరణి కృష్ణాజినంబును దండంబు వనస్పతి యగు సోముండును గగనాధిష్ఠాన దేవత ఛత్త్రంబునుఁ గమండలువు బ్రహ్మయు సరస్వతి యక్షమాలికయు సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి మఱియును. 517

క. భిక్షాపాత్రిక నిచ్చెను
యక్షేశుఁడు వామనునకు నక్షయ మనుచుం
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణ భిక్ష నరేంద్రా. 518

క. శుద్ధ బ్రహ్మర్షి సమా
రాద్ధంబై విహితమంత్ర రాజిఁ జమరం
బ్రోద్ధంబగు ననలంబున
వృద్ధాచారమున వటుఁడు వేల్చెన్ గడఁకన్. 519

## బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట

వ. ఇట్లు కృతకృత్యుండైన [2]మాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 520

క. వత్తురె విప్రులు వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద
లిత్తఱిఁ గల దానపరుఁ డెవ్వఁడొ సెప్పుఁడా. 521

వ. అనిన సకలదేశీయులగు భూసురు లిట్లనిరి. 522

మ. కలరుం దాతలు నిత్తురుం ధనములుం గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేనెంతురుగాని యీవిని బలింబోలన్ వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె సధ్వరశతంబా భార్గవానుజ్ఞచే
బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా.

---

[1] ఉప, నయనము = జ్ఞాననేత్రము జూపించెడి మంత్ర ముపదేశించెడి కర్మను చేయుట ఇదే వడుగని పలుకంబడును. [2] మాయామాణవకుఁడు = మాయా

వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించి లోకంబు లకుం బ్రీతి పుట్టింపం బయినంబై లాభవచనంబులుం గైకొనుచుం దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 524

క. ప్రక్షీణదివిజవల్లభ రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం డాక్షణమున బలియింటికి భిక్షాగమనంబు సేసెఁ బేదలికముతోన్.

క. హరిహరి సిరి యురమునఁ గల
హరి [1]హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెన్
బరహితరతమతియుతు లగు
దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్. 526

క. సర్వప్రపంచ గురుభర
నిర్వాహకుఁ డగుటఁ జేసి నెఱిఁ జనుదేరన్
[2]ఖర్వుని[3]వ్రేఁగు సహింపక
నుర్వీస్థలిఁ గ్రుంగె మ్రొగ్గె నురగేంద్రుండున్. 527

వ. ఇట్లు సని చని. 528

క. [4]శర్మద [5]యమదండక్షత
వర్మద నతి కఠినముక్తి వనితా[6]చేతో
మర్మద నంబు నివారిత
[7]దుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 529

వ. దాటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు. 530

శా. [8]చండస్ఫూర్తి వటుండుఁ గాంచె బహుధా జల్పన్నిశాటంబు ను
ద్దండాహూతము నిభ్యబిభ్యదమృతాం ధస్సిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజనీకవాటము మహాహా ద్యద్ధూమసంఛన్న మా
ర్తాండస్యందన ఘోటముం బలిమఖాం తర్వేది శాలావాటమున్.

---

1 హరిహయుఁడు=ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱము గలవాఁడు ఇంద్రుండు. 2ఖర్వుఁడు = పొట్టివాఁడు. 3 వ్రేఁగు = బరువు. 4 శర్మద=సుఖమిచ్చునది. 5 యమ......ద = యముని దండము వలనిదెబ్బను తగులకుండఁజేయు కవచమిచ్చునది. 6 చేతోమర్మద= మనస్సునందలి లోతు విషయముం దెలుపునది. 7 దుర్మద=చెడ్డపొగరు. 8 శా॥ వామనుఁడు అన్నింట (బడాయి) డంబములు పలుకు రక్కసులను, తొందరతో రావించిన మునిరాజులు అమృతపానముచేసిన దేవతలు సిద్ధులకూడికను, ఏనుఁగు గుఱ్ఱపు టెక్కెములు గలవాకిండ్లను, హోమధూమముచేత కప్పంబడిన సూర్యరథపు గుఱ్ఱా

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియం జొచ్చు నయ్యవసరంబున. 532

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
దంభాకారత వచ్చెఁ గాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ
శుంభద్యోతనుఁ డీమనోజ్ఞతనుఁ డంచున్ [1]విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

క. గుజగుజలు వోవువారును
గజిబిజిఁ బడువారుఁ జాలఁ గలకలపడుచున్
గజిబిజి యైరి సభాస్థలిఁ
బ్రజలెల్లను బొట్టివడుగు పాపని రాకన్. 534

వ. ఆసమయంబున బలి సభామండపంబుఁ దఱియం జొచ్చి. 535

సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు
సమవు [2]నుద్గాతల చదువు వినుచు
మంత్రతంత్రార్థ సంబంధభావములు పే
ర్కొనెడి హోతలత్రోపుఁ గూడికొనుచు
హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల
వెలిఁగించు యాజక వితతిఁ గనుచు
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు
సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ

తే. బెట్టుగోరెడు వేడుక వట్టుపడుచు
నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు
గోరి చరియించె సభలోనఁ గొంతఁదడవు
పుట్టువెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 536

వ. మఱియును. 537

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱిఁ గుబురులకుఁ జనుచు హరిహరియనుచున్
మఱుఁగుచు నులుకుచు డిఱ్ఱడిఱ్ఱఁ
గురుమట్టపుఁబడుచు వడుగుఁ గొంత నటించెన్. 538

---

1 విస్మయభ్రాంతులు=ఆశ్చర్యముచేత భ్రమపడినవారు, 2 ఉద్గాత=నాలుగవ వేద

క. కొందఱతోఁ జర్చించును
గొందఱతో జటలు సెప్పు గోష్ఠిం [illegible]
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ గొందఱ నవ్వున్. 539

వ. మఱియు ననేకవిధంబుల నందఱకు సన్నిరూపులై వినోదించుచు.

క. వెడవెడ నడకలు నడచుచు
నెడనెడ నడుగిడఁగ నదరి యిల గ్రుంగంగా
బుడిబుడి నొడువులు నొడువుచుఁ
జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 541

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె.

మ. [1]ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతిగర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
వ్రతదానప్రవణానువర్తి సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దాన్. 543

వ. అని కుశ పవిత్రాక్షత సంయుతంబగు దక్షిణ హస్తంబు సాఁచి యిట్లనియె. 544

ఉ. [2]స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు హాసమాత్రని
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్. 545

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును జటిలుండును సదండఛత్రుం

---

1 తా॥ రక్కసుల రారాజు, ఇంద్రుఁడు మొదలైన దేవతల గర్వము నడంప జరిగిన వాఁడు, నశించిన లోభగుణము గలవాఁడు, చేసిన యజ్ఞము లన్నిటియందు నిచ్చు పనియందే తిరిగినవాఁడు, దేవకాంతల మనస్సును కలతపెట్టెడి వెన్నెలబోలు కీర్తి గలవాఁడు, దయాసత్యములతోఁగూడిన విధులచే నిండినవాఁడు ఈబలియేనా? యని యడిగెను.

2 తా॥ (వామనుఁడు) ముల్లోకములం దనయాజ్ఞచొప్పున నడపించువాఁడు, చిఱునవ్వుచేతనే చలింపజేసిన యింద్రుఁడు గలవాఁడు, ఇచ్చుట చేతనే హెచ్చుతగ్గుల నిర్ణయించువాఁడు, మునులచే పొగడందగిన యజ్ఞవిధానము గలవాఁడు, దేవతాస్త్రీల మంగళసూత్రాలు హరించిన వాఁడైన రక్కసుల రేనికి శుభమగు.

డునుఁ [1]గక్షాలంబిత భిక్షాపాత్రుండునుఁ గరకలితజలకమండలుం డును మనోహరవదనచంద్రమండలుండును మాయాచ్ఛాదననటుం డును నగు వటునింగని దినకరకిరణ విహతంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులుఁ గూర్చున్నయెడల లేచి సేమంబడిగి తియ్యనిమాటల నాదరించిరి బలియును నమస్కరించి తగినగద్దియ నునిచి పాదంబులుఁ దుడిచి తన ప్రాణవల్లభ పసిండి గిండియల నుదకంబులువోయ వడుగు కొమరునిచరణంబులుఁ గడిగి తడియొత్తి తత్సమయంబున. 546

ఆ. వటుని పాదశౌచ * వారి శిరంబునఁ
బరమభద్రమనుచు * బలివహించె
నేజలము గిరీశుఁ * [2]డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె * ధృతి శిరమున. 547

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 548

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం * వాసస్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమ * య్యెన్ వంశమున్ జన్మముం
గడుధన్యాత్ముఁడ నైతి నీమఖము యో * గ్యం బయ్యె నాకోరికల్
గడ తేఱెన్ సుహృతంబులయ్యె శిఖులుం * గల్యాణమిక్కాలమున్.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో * వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశి * ష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో * గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో * ధాత్రీసురేంద్రోత్తమా. 550

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని సంతోషించి యీశ్వరుం డిట్లనియె. 551

సీ. ఇది నాకు నెలవని * యేరీతిఁ బలుకుదు
నొక చోటనక యెందు * నుండ నేర్తు
నెవ్వనివాఁడ నం * చే మని నుడువుదు
నాయంతవాఁడ * నై నడవనేర్తు

1 కక్ష......త్రుండు = చంకను వ్రేలాడు బిచ్చపుపాత్ర గలవాఁడు. 2 ఇందుజూటుఁడు=చంద్రుఁడు జడముడియందుఁ గలవాఁడు.

నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ¹ముప్పోకల బోవనేర్తు
సదినేర్తు నిదినేర్తు నని వేల్పఁ జెప్పంగ
నేరుపు లన్నియు నీవ నేర్తు
తే. నారులుఁ గారు నా[illegible] నా[illegible] నీ సా[illegible]
నాంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పిన నా కేంటి
సుజనులందుఁ దఱచు పొచ్చి యుండు. 553

వ. అది యట్లుండ నిమ్ము.

సీ. జననాథ నీమాట సత్యంబు సత్కీర్తి
దంబు గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు
గాని మీకులమందుఁ గలుగ రొరులు
²రణభీరువులు ³వితరణభీరువులు లేరు
ప్రత్యర్థు లర్థులుఁ బ్రబ్బికొనిన
దానశౌండిమమునఁ దనుపుచు రక్షకులై
మీతాత లందఱు మేటిమగలు
ఆ. మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 554

వ. తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వవిజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుఁ డదివిని హరి పరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తనజయంబును బలంబును బరిహాసించి గద్దన నుద్దవిడి నద్దనుజ మర్దను మందిరంబునకుం జనియె నప్పుడు. 555

1 ముప్పోకలు=రజోగుణ, సత్వగుణ, తమోగుణ మార్గములు. 2 రణభీరువులు=యుద్ధమనిన జడియువారు, 3 వితరణభీరువులు = దానము చేసిన ధనము తరిగిపోవు

క. శూలాయుధహస్తుండై [1]కాలాకృతివచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణశీలత నిట్టని తలంచెఁ జిత్తములోనన్. 556

మ. ఎదురై పోర జయింప రా దితనిఁ గానీ కెందేనియుం బోవ భీ
ప్రదుఁడై ప్రాణులఁ గోలు మృత్యువుక్రియం బైవచ్చు నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె [2]నిశ్వాసరం
ధ్రదిశన్ దైత్యుహృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై. 557

వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబు మానక మిన్ను మన్ను నన్వేషించి త్రిదినంబు నరసి దిశలం బరికించి భూవివరంబులు వీక్షించి సముద్రంబులు వెదకి పురంబులు శోధించి వనంబులు విమర్శించి పాతాళంబు పరీక్షించి జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి తనలో నిట్లనియె. 558

క. పగవాఁడు మడియ నోపును
దెగఁ డేనియు నెదురుపడఁడె దేహధరులకుం
దెగినయెడఁ బగ యమీఁదనుఁ
బగఁగొనఁ దగ దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్. 559

వ. అతండు మీప్రపితామహుం డతనిగుణంబు లనేకంబులు గల వవి యట్లుండె నిమ్ము. 560

క. ఆతురభూసురగతిఁ [3]బురు
హూతాదులుఁ దన్ను వేఁడ నొగిఁ గొండనుచున్
మీతండ్రి యిచ్చె నాయువు
నేతన్మాత్రుండవె నీవు నీలోకమునన్. 561

క. ఏలితివి మూఁడుజగములుఁ
దోలితి వింద్రాదిసురులఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణములఁ
సోలితివి పిశాచరాక్షసుల వీక్షింపన్. 562

వ. అదియునుం గాక. 563

---

1. కాలాకృతి=యముని యాకారము. 2. నిశ్వాసరంధ్రము=గాలి విడుచు ఎడమ

క. రాజ్యంబు గలిగె నేనిం
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రతుకఁడేనిం
[1]త్యాజ్యంబులు వానిజన్మ ధన గేహంబుల్. 564

క. మున్నెన్నఁగారు వదాన్యుల
నెన్నఁడుఁ జూచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచు
న్నిన్ని దినంబులనుండియు
నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నింద్రము సేయన్. 565

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెం డడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కిఁ దీర బ్రహ్మ కూఁకటి ముట్టెద
దాన కుతుకసాంద్ర దానవేంద్ర. 566

వ. అనినఁ బరమయాచకునకుఁ బలిదాత యిట్లనియె. 567

ఆ. ఉన్నమాట లెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధ సమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచె మడిగితివో చెల్ల
దాత పెంపు సొంపుఁ దలఁపవలదె. 568

వ. అని మఱియు నిట్లనియె.

మ. వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసి బాలుండవు నేరవీ వడుగ నీభాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయంబడుగ నీకీయల్పంబు నీనేర్చునే. 570

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యిట్లనియె. 571

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడు గే నెక్కడ భూమి యెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితం బైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు[2]టది బ్రహ్మాండంబు నాపాలికిన్.

1 త్యాజ్యంబులు = విడువఁదగినవి. 2 అది బ్రహ్మాండంబు = ఆ మూఁడడుగులే

వ. అదియునుం గాక. 573

క. వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ ǂ బదివే లనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నయినఁ ǂ జక్కంబడునే. 574

శా. ఆశాపాశము దాఁగడుగ నిడుపులే ǂ దంతంబు రాజేంద్ర [1]వా
రాశిప్రావృతమేదినీవలయ సా ǂ మ్రాజ్యంబు సేకూడియుఁ
గాసిం బొందిరిఁగాక వైన్యగయ భూ ǂ కాంతాదులు న్నర్థకా
మాశ న్బాయఁగ నేర్చిరే మును నిజా ǂ శాంతంబులం జూచిరే.

సీ. సంతుష్టుఁ డీమూఁడు ǂ జగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడుఁ ǂ జరఁగుసుఖము
సంతోషిఁ గాకుంట ǂ సంసారహేతువు
సంతసంబున ముక్తి ǂ సతియుఁ దొరకుఁ
బూఁటపూఁటకు జగం ǂ బుల యదృచ్ఛాలాభ
తుష్టిని తేజంబు ǂ తోన పెరుఁగుఁ
బరితోషహీనతఁ ǂ బ్రభ సెడిపోవును
జలధార ననలంబు ǂ సమయునట్లు

ఆ. నీవు రాజవనుచు ǂ నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ ǂ దగినకొలఁది
యేను వేఁడికొనిన ǂ యీ పదత్రయమునుఁ
జాలదనక యిమ్ము ǂ చాలుఁ జాలు. 576

వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి [2]కరకలిత సలిలకలశుం డైన యవ్వితరణ గుణముఖరునిం గని [3]నిజ విచారయుక్త దనుజరాజ్య చక్రుండగు శుక్రుం డిట్లనియె. 577

సీ. దనుజేంద్ర యీతఁడు ǂ ధరణీసురుఁడుఁ గాఁడు
దేవకార్యంబు సా ǂ ధించుకొఱకు

---

1 వారాశి......సామ్రాజ్యంబు = సముద్రముచేఁ జుట్టఁబడిన భూచక్రమేలు వైభవము. 2కర......శుండు=చేతితోఁ జేరియున్న నీటిపాత్ర గలవాఁడు(బలిచక్రవర్తి) 3 నిజ......చక్రుండు=రాక్షసరాజ్యము పోవునను భీతులు గలవాఁడు (శుక్రుఁడు)

హరి విష్ణుఁ డవ్యయుం – డదితిగర్భంబునఁ
గశ్యప సూనుఁడై – కలిఁగెనకట
యెఱుఁగ కీతనికోర్కి – నిచ్చెద నంటివి
దైత్యసంతతి కుప – ద్రవము వచ్చు
నీలక్ష్మిఁ దేజంబు – నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా – వాసవునకు

ఆ. మొనసి జగము లెల్ల – మూఁడుపాదంబుల
నఖిలకాయుఁ డగుచు – నాక్రమించు
సర్వధనము విష్ణు – సంసర్జనము సేసి
బడుగుపగిది నెట్లు – బ్రదికెదీవు. 578

క. ఒకపదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి – యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై
వెక్కసమై యున్న నెందు – వెడలెదు చెపుమా. 579

సీ. ఇచ్చెద నని పల్కి – యీకున్న నరకంబు
ద్రోవ నీవును సమ – ర్థుఁడవుఁగావ
యేదానమున నాశ – మేతెంచు నదియును
దానంబుఁ గాదండ్రు – తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబుఁ – దపముఁగర్మంబును
దా విత్తవంతుఁడై – తలఁపవలయుఁ
దనయింటఁ గల సర్వ – ధనమును నైదుభా
గములుగా విభజించి – కామమునకు

ఆ. నర్థమునకు ధర్మ – యశముల కాశ్రిత
బృందములకు సమతఁ – బెట్టునట్టి
పురుషుఁ డిందు నందు – బూర్ణుఁడై మోదించుఁ
[1]దన్ను మానిచేతఁ – దగవుఁ గాదు. 580

---

1 తన్ను......గాదు=తనను వదలిన ధర్మము సలుపరాదు. ఇదియె సామెత.

వ. అదియునుం గాక యీయర్థంబునందు బహుభంగి [1] బహ్వృచగీ
తార్థంబుఁ గల దొక్కటి సావధానుండవై యాకర్ణింపుము. 581

సీ. అంగీకరించిన ♦ నఖిలంబుఁ బోవుచో
నన్నృతంబుఁగాదు లే ♦ దనిన నధిప
[2]యాత్మవృక్షముమూల ♦ మన్నృతంబు నిశ్చయ
మన్నృతమూలముఁగల్గ ♦ నాత్మ సెడదు
పుష్పఫలములాత్మ ♦ భూజంబునకుసత్య
మామాౕను బ[3]దుకమి ♦ నదియుఁజెడును
ఫలపుష్పములు లేక ♦ పససెడి వృక్షంబు
మూలంబుతో వృద్ధిఁ ♦ బొందుఁగాదె

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ ♦ జెందకుండ
నిచ్చు పురుషుండు సెడకుండ ♦ నిద్ధచరిత
కాక నంచితసత్యసం ♦ గతి నటంచు
నిజధనం బర్థి కిచ్చిన ♦ నీకు లేదు. 582

ఆ. సర్వ మయినచోట ♦ సర్వధనంబులు
నడుగ లేదటంచు ♦ నన్నృతమాడు
చెనఁటిపంద నేమి ♦ సెప్పఁ బ్రాణముతోడి
శవము వాఁడు వాని ♦ జన్మమేల. 583

వ. మఱియు నిందొక్క విశేషంబుఁ గలదు వివరించెద. 584

ఆ. వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
బ్రాణవిత్తమాన ♦ భంగమందుఁ
జకితగోకులాగ్ర ♦ జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము ♦ వొందఁ దధిప. 585

మ. కులముం రాజ్యముఁ దేజముం నిలుపుమీ ♦ కుబ్జుండు విశ్వంభరుం
డిడలతిం బోఁడు త్రివిక్రమస్ఫురణవాఁ ♦ డై నిండు బ్రహ్మాండమున్

---

1 బహ్వృచగీతార్థము = వివరించిన మాటలయందలి భావము. 2 ఆత్మవృక్షము మూలమన్నృతము=శరీరమను చెట్టునకు అబద్ధమే మొదలు. 3 అఱఁతి=కొంచెము.

గలఁడే మాన్ప నొకండు నాపలుకు । లాకర్ణింపుకర్ణంబులన్
వల దీదానము సీనముం బనుపుమా । ¹వర్ణిన్ వదాన్యోత్తమా. 586

వ. అని యిట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర
నిమీలితలోచనుం డయి యశస్వి యిట్లనియె. 587

సీ. నిజమాన తిచ్చితి । నీవు మహాత్మక
మహినిగృహస్థ ధ । ర్మంబు నిదియు
యర్థంబుఁ గామంబు । యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప । నిత్తుననియు
నర్థలోభంబున । నర్థిఁ బొమ్మనుటెట్లు
పలికి లేదనుకంటెఁ । బాప మెద్ది
యెట్టి దుష్కర్ముని । నేభరించెదఁ గాని
సత్యహీనుని మోవఁ । జాలననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి । బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక । చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ । బరఁగుకంటె
మానధనులకు భద్రంబు । మఱియుఁగలదె. 588

క. ధాత్రిని హలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ । జేకుఱుభంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూరునట్టి । భాగ్యముగలదే. 589

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే । గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటఁ గట్టికొని పో । వం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం । బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే । యిక్కాలమున్ భార్గవా.

క. ఉడుగనిక్రతువులఁ దపములఁ
బొడగనఁ జననట్టిపొడవు । పొడవునఁ గుఱుచై

1 వర్ణి = బ్రహ్మచారి.

యడిగెడి వఁట నను బోఁటికి
నిడ రాదె మహానుభావ ! యిష్టార్థంబుల్. 591

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై ! నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపైఁ గపోలతటిపై ! బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబుగ్రిందగుటమీఁ ! దై నాకరంబుట్ట మేల్
గాదే రాజ్యము గీజ్యముల్ సతతమే ! కాయంబు నాపాయమే. 592

మ. [1]నిరయంబైన నిబంధమైన ధరణీ ! నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజముల్ ! రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం ! డభ్యాగతుండైన నాఁ
డిరుఁగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ! ధీవర్య వేయేటికిన్. 593

ఆ. నోడి వినంతవట్టు ! నుసలక యిచ్చుచో
నేలకట్టు విష్ణుఁ ! డేటిమాట
గట్టెనేనిఁ దాన ! కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము ! విమలచరిత. 594

క. మేరువు దలక్రిందైనను వారావారంబు లింక ! బాటిన లోలో
ధారుణి రజమైపోయినఁ [2]దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్.

మత్తకోకిలము.

ఎన్నఁడుం బరువేఁడఁ బోఁడట ! యేకలుండఁట కన్నవా
రన్నదమ్ములు నైన లేరఁట ! యన్ని [3]విద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగుజ్జఁట ! చేతులొగ్గి వసింపనీ
చిన్నిపాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ ! జిత్తమొత్తుసత్తమా. 596

వ. అని యిట్లు [4]సత్యపదవీప్రమాణ తత్పరుండును వితరణకుతూహల సత్త్వరుండును విమలయశస్కుండును దృఢమనస్కుండును నియత సత్యసంధుండును నర్థిజన కమలబంధుండును నైన బలింజూచి శుక్రుండు గోపించి మదీయశాసనం బతిక్రమించితివి గావున శీఘ్ర

1 నిరయము=నరకము. 2 తారా + అధ్వము = చుక్కలదారి. 3 విద్యల మూల గోష్ఠి = (జ్ఞాన) ఉపనిషత్తుల మొదలెట్టిదాయని విచారణ చేయుట. 4 సత్య...... రుండు=నిజము పలుకుటే ప్రమాణముగా జేయుటయందు గోరిక గలవాఁడు.

కాలంబునఁ [1]పదభ్రష్టుం డవుఁ గమ్మని శాపం బిచ్చె బలియును గురుశాపతప్తుం డయ్యు నమృతమార్గంబున కభిముఖుం డగుచుండె నప్పుడు. 597

ఆ. బ్రదుక వచ్చుఁగాక బహుబంధనము లైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనము లైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు. 598

వ. అయ్యవసరంబున. 599

ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళగమన
వటుని కాళ్ళుఁ గడుగ వరహేమఘటమున
జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి. 600

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె. 601

క. రమ్మా [2]మాణవకోత్తమ
లెమ్మా నీవాంఛితంబు లే దనకిత్తుం
దెమ్మా యడుగుల నిటు రా
నిమ్మా కడుగంగ వలయు నేటికిఁ దడయన్. 602

వ. అనిన విని. 603

మ. [3]బలిదైత్యేంద్ర కరద్వయీకృతజల ప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమన స్సంప్రార్థిత శ్రీదముం
గలితానమ్రితమాలలాటపదవీ కస్తూరి కాశాతమున్
వలినామోదము రత్ననూపురితనానావేదముం బాదమున్. 604

1 పదభ్రష్టుఁడు = ఉన్నచోటునుండి తొలంగింపఁ బడినవాఁడు. 2 మాణవకోత్తమ = బ్రహ్మచారులలో శ్రేష్ఠుఁడా! 3 తా॥ తామర పువ్వులవంటి కన్నులుగల విష్ణువు యోగుల మనస్సులందు పొగడదగిన సంపద నిచ్చునట్టి, వంచిన లక్ష్మీముఖమందలి కస్తూరి చర్చగలట్టి, తామరపూవు వాసనగలిగినట్టి వేదము లను అందెల ధరించినట్టి పాదము బలిచక్రవర్తి రెండుచేతులచేఁ గడిగించుకొనుటకుం జాచెను.

క. [1]సుతలలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 605

వ. ఇట్లు ధరణీసుర దక్షిణచరణ ప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాది పరిగణనంబు సేసి. 606

శా. [2]విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి యంచుం [3]గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్.

వ. తత్కాలంబున. 608

ఆ. నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ
గలశరంధ్ర మాఁప గాను దెలిసి
హరియుఁ [4]గావ్యనేత్ర పుటఁ గుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 609

వ. అంత. 610

మ. [5]అమరారాతికరాశ్రితోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డెఁ ఖండితదివౌకస్స్వామి జిహ్మ స్తమున్

---

1 తా॥ రాక్షసరాజు స్వర్గమును సంపాదించినట్టి, యెల్లప్పుడు మేలుగూర్చు ఉపనిషత్తులచే అలంకరింపంబడినట్టి, పుట్టుకం దొలంగించునట్టి కాలు కడిగెను.

జ్ఞాపకము—ఆకాశమే విష్ణుపదము. దానినుండి శబ్దబ్రహ్మము గలిగినది. అదే ఉపనిషత్తులు పలుకు నర్థము. కాన విష్ణుపాదము దానిచే నలంకరింప బడినది.

2 విప్రాయ......దాస్యామి=వేదము జదివినవాఁడు, విశదమైన బ్రహ్మచర్యవ్రతము గలవాఁడు, సర్వవ్యాపకుఁడైనవాని రూపము వహించినవాఁడు, వేదప్రమాణవాక్యావళి నెఱింగినవాఁడు నైన వామనుని కొఱకు మూఁడడుగుల భూమి నిచ్చి 3 క్రియాక్షిప్రుఁడు=తొందరతో జేసిన పనిగలవాఁడు. 4 కావ్యుఁడు=శుక్రాచార్యులు.
5 తా॥ లక్ష్మీభర్తయైన విష్ణువు, ఇంద్రవిరోధిం గెలిచినట్టి, కమలచేత బెనచి పట్టుకొనబడినట్టి, లక్ష్మీదేవి స్తనము......శ్రీదేవి చనుకొనలయం దుంచబడినట్టి, హస్తమును, బలిచక్రవర్తి చేతినుండి జారిన నీళ్లు అక్షతల కొఱకు క్రిందఁ బట్టెను.

గమలాకర్షణ సుప్రశస్తము రమా ♦ కాంతాకుచోపాస్తమున్
విమల శ్రీకుచశాతచూచుకతటీ ♦ విన్యస్తమున్ హస్తమున్.

క. మునిజననియమాధారను
జనితాసుర యువతినేత్ర ♦ జలకణధారన్
దనుజేంద్రు నిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలివి ♦ వర్జితధారన్. 612

ఆ. కమలనాభు నెఱిఁగి ♦ కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట ♦ లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్రమనుచు ♦ నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁ డొరుఁడు ♦ మఱియుఁ గలఁడె. 613

క. బలిసేసిన దానమునకు
నలినాక్షుఁడు నిఖిలభూత ♦ నాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు
బళిబళి యని పొగడె భూత ♦ పంచక మనఘా. 614

క. క్షితిదానమిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు ♦ నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ ♦ సలుపుదు రెలమిన్. 615

వ. అట్లుగావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు గావున వసుంధరా దానంబిచ్చితి నుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 616

క. ఇదియేమి వేఁడి తని నీ
మది వగవక ధారవోయు ♦ మా సత్యము పెం
పొదవఁగఁ గోరినయర్థం
బిదియిచ్చుట ముజ్జగంబు ♦ లిచ్చుట మాకున్. 617

వ. అని పలికిన వటుని పలుకులకు హర్షనిర్భర చేతస్కుండై వైరోచనుండు. 618

ఆ. పుట్టి నేర్చుకొనెనో ♦ పుట్టక నేర్చెనో
యిట్టి బుద్ధులిట్టి ♦ పొట్టివడుగు
పొట్ట నున్న నెల్ల ♦ బూమెలు నని నవ్వ
నెలమి ధరణిదాన ♦ మిచ్చె నపుడు. 619

**వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట.**

ఆ. గ్రహమునీంద్ర సిద్ధ ♦ గంధర్వకిన్నర
యక్షపక్షిదేవ ♦ తాహిపతులు
పొగడి రతని పెంపుఁ ♦ బుష్పవర్షంబులు
గురిసె దేవతూర్య ♦ కోటి మొరసె. 620

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 621

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దా ♦ నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున క ♦ ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై ♦ నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్ర ♦ హ్మాండాంత సంవర్ధియై. 622

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛ ♦ త్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై ♦ సౌవర్ణ కేయూరమై
[1]ఛవిమత్కంకణమై కటిస్థలి నుదం ♦ చద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దాఁ ♦ బ్రహ్మాండమున్ నిండుచోన్.

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకం బగు విశ్వరూపంబు ధరియించిన భువియును నభంబును దివంబును దిశలును దిశాఛిద్రంబులును సముద్రంబులునుఁ జలదఖిలభూత నివహంబులుం దానయై యేకీభవించి క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై భువర్లోకంబు నతిక్రమించి సువర్లోకంబును దలకడచి మహర్లోకంబు దాటి జనోలోకంబునకు మీఁదై తపంబునకు [2]నుచ్ఛ్రితుండై సత్యలోకంబు కంటె నౌన్నత్యంబు వహించి యెడ లిఱములు సంధులు రంధ్రములు లేకుండ నిండి మహాదేహమహితుండై చరణతలంబున

1 ఛవి.....ణము=కాంతితోఁగూడిన హస్తకంకణము, 2 ఉచ్ఛ్రితుఁడు=పెరిగిన వాఁడు.

రసాతలంబునఁ బాదంబుల మహియును జంఘల మహీధ్రంబులును [1]జానువులఁ బతత్రిసముదయంబులును నూరువుల నింద్రసేన మరుద్గణంబులును వాసస్స్థలంబున సంధ్యయు[2]గుహ్యంబునఁ బ్రజాపతులును జఘనంబున దనుజులును నాభిని నభంబును నుదరంబున నుదధిసప్తకంబును నురంబునఁ దారకానికరంబును హృదయంబున ధర్మంబును నురోజంబుల ఋతుసత్యంబులును మనంబునఁ జంద్రుండును వక్షంబునఁ గమలహస్త యగులక్ష్మియుఁ గంఠంబున సామాదిసమస్త వేదంబులును భుజంబులఁ బురందరాది దేవతలునుఁ గర్ణంబులదిశలును శిరంబున నాకంబును శిరోజంబుల మేఘంబులును నాసాపుటంబున వాయువును నయనంబుల సూర్యుండును వదనంబున వహ్నియు వాణి నఖిలచ్ఛందస్సముదయంబును రసనంబున జలేశుండును భ్రూయుగళంబున విధినిషేధంబులును ఱెప్పల నహోరాత్రంబులును లలాటంబునఁ గోపంబును నధరంబున లోభంబును స్పర్శంబునఁ గామంబును రేతంబున జలంబును బృష్ఠంబున నధర్మంబును గ్రమణంబుల యజ్ఞంబులును ఛాయల మృత్యువును నగవులవలన ననేకమాయావిశేషంబులును రోమంబుల నోషధులును నాడీప్రదేశంబుల నదులును నఖంబుల శిలలును బుద్ధి నజుండును బ్రాణంబుల దేవర్షిగణంబులును గాత్రంబున జంగమస్థావరజంతు సంఘంబులును గలవాఁడయి జలధర నినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణ తూణీర విభ్రాజితుండును మకరకుండల కిరీట కేయూరహారకటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచరవాహినీ సందోహపరివృతుండును నమేయ తేజోవిరాజితుండునునై బ్రహ్మాండంబు దనమేని కప్పు తెఱంగున నుండ విజృంభించి. 624

---

1 జానువుల......సముదయంబు=మోకాళ్లయందు పక్షిసముదాయము, 2గుహ్యంబు=దాచదగిన మఱుగుచోటు.

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వే ఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁదిజగంబులెల్లఁ దాడి నొండొంటిన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం బెటిలి వేంగ్రిడంబై పగుల్ గాన రా
నొకఁడై [1]వాగ్దృగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్.

ఆ. [2]ఒకపదంబు క్రింద నుర్వ పద్మమునంటి
కొన్న పంకలవము కొమరుఁదాల్చె
నొకటిమీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటి నా
వెలసె మిన్ను నృప త్రివిక్రమమున. 626

వ. తత్సమయంబున. 627

ఆ. జగము లెల్లదాఁటి చనిన త్రివిక్రము
[3]చరణనఖరచంద్ర చంద్రికలను
బూనుఁగుపడియె సత్య మున బ్రహ్మతేజంబు
దివసకరునిరుచుల దివియవ్రాలె. 628

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ
గాఁపురంబులు సేయు ఘనులు రాజు
లామరీచ్యాదులు నా సనందాదులు
నా దివ్యయోగీంద్రు లచట నెపుడు
మూర్తిమంతంబులై మోఁయు పురాణ త
ర్కామ్నాయనియమేతి హాసధర్మ
సంహితాదులు [4]గురు జ్ఞానాగ్నినిర్దగ్ధ
కర్ములై మఱియును గలుగునట్టి

ఆ. వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తిఁ

1 వాక్+దృక్+అలభ్యుఁడు=పలుకులచేత చూపులచేత పొందుటకు వీలుకానివాఁడు
2 తా॥ ఒకపాదము భూమియనెడు పద్మమున నంటుకొనిన కొంచెము బురదవలెను, మఱొకటి ఆకాశమునం దొదిగి ఆపద్మమునందలి తేనెత్రాగుచున్న తుమ్మెదవలెను వామనుఁడు రెండుపాదములచే భూమ్యాకాశములఁ గప్పివేసెను, 3 చరణ......కలు =కాళ్లగోళ్లనెడు వెన్నెలలు, 4 గురు......కర్ములు = గురుని ఉపదేశమునఁ గలిగిన జ్ఞానమనెడు అగ్నిచేత మొదలంటుం దగులఁబెట్టిన కర్మలు గలవారు(సన్యాసులు)

దమమనంబులందుఁ దలఁచు నిధానంబుఁ
గంటిమనుచు నేఁడు మంటిమనుచు. 629

మ. తనపుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభి పంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదం బుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్. 630

వ. తత్సమయంబున. 631

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ
పుష్పదామంబులఁ బూజ సేసి
దివ్యగంధంబులుఁ దెచ్చి సమర్పించి
ధూపదీపములఁ దో డ్తోడ నిచ్చి
భూరిలాజాక్షతం బులుసల్లి ఫలములుఁ
గానిక లిచ్చి రా గములఁ బొగడి
శంఖాదిరవములు జయఘోషములుఁ జేసి
కరుణాంబునిధి త్రివి క్రమ యటంచు

ఆ. బ్రహ్మ మొదలు లోక పాలురుఁ గొనియాడి
రెల్లదిశల వనచ రేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని
వెలయఁజేసి విష్ణు విజయమనుచు. 632

క. అన్నిజగంబులఁ దానై
యున్నజగన్నాథుఁ జూడ నొగి భావింపం
గన్నందక మన మందక
సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

వ. అంత నయ్యైన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్నవామనునిం గని పదత్రయవ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూపతిరోహితుం డగు విష్ణుం డని యెఱుంగక మనదానవేంద్రుండు సత్యసంధుండు గావునమాటఁ దిరుగక యిచ్చె, నతనివలన నేరంబు లేదీకుబ్జుండ ప్రతిహత తేజః

ప్రభావంబున సజ్జకంటుగా నిజగంబులం పరిగ్రహించి 1పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచియున్నవాఁ డీపాలునిం దూఱి పాఱనీక నిర్జించుటఁగర్జంబసితర్జనంబులునుగర్జనఁబులునుఁ జేయుచు వజ్రాయుధాది మకుజేత లగు హేతి ప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కండ్రుకుం మిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి కసిమసంగి ముసరికొని దశదిశలఁ బ్రిసరించినఁ జూచి హరిపరిచరులు సునంద నంద జయ జయంతవిజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వతప్రముఖులగు దండనాధులయుత వేదండసముదండబలులుఁ దమతమ యూథంబుల నాయుధంబుల తోడం గూర్చుకొని దానవానీకంబులంఁ బరలోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనంబునకున్ బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రు శాపంబుఁ దలంచి దనుజవల్లభుం డిట్లనియె. 634

సీ. రాక్షసోత్తములార ॥ రండు పోరాడక
కాలంబు గాదిది ॥ కలహమునకు
సర్వభూతములకు ॥ సంపదాపదలకు
బ్రభువైన దైవంబుఁ ॥ బరిభవింప
మన మోపుదుమె తొల్లి ॥ మనకు రాజ్యంబును
సురలకు నాశంబు ॥ సొరిదినిచ్చి
విపరీతముగఁ జేయు ॥ వేల్పు నేమందము
మనపాలి భాగ్యంబు ॥ మహిమగాక

తే. వెఱచి పలుమాఱుఁ బాఱెడి ॥ విష్ణుభటులు
మిమ్ము నెగచుట దైవంబు ॥ మేరగాదె
మనకు నెప్పుడు దైవంబు ॥ మంచిదగును
నాఁడు గెలుతము పగవారి ॥ నేఁడు వలదు. 635

1 పర్జన్యాదులు=ఇంద్రుఁడు మొదలైనవారు.

వ. అదియునుం గాక. 636

క. బలుదుర్గంబులు సచివులు
బలములు మంత్రౌషధములు బహుశేముషియుం
గలిగియు సామోపాయం
బులఁ గాల మెఱింగి నృపుడు పోరుటయొప్పున్. 637

వ. అట్లు గావున రణంబున శత్రులకిప్పుడెక్కుడు మోహరించుట
కార్యంబుఁ గాదు మనకుం దగు కాలంబున జయింతము సలంగక
తొలంగుం డనిన దలంగి భాగవత భటపలాయితులై చిక్కి రక్క
సులు రసాతలంబునకుం జని, రంత హరి హృదయం బెఱింగి
తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల
నసుర వల్లభుని బంధించెనంత. 638

క. బాహులుఁ బదములుఁ గట్టిన
శ్రీహరి కృపగాక యేమి సేయుదునని సం
దేహింపక బలి నిలిచెను
హాహారవ మెసఁగె దశదిగంతములందున్. 639

క. సంపద సెడియును దైన్యము
గంపంబును లేక తొంటి కంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము
వంపనిసురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్. 640

సీ. దానవ త్రిపదభూతల మిత్తు నంటివి
ధరణిఁ జంద్రార్కు లెంతదాఁక నుండు
రంతభూమియు నొక్కయడుగయ్యె నాకును
స్వర్లోకమును నొక్క చరణమయ్యె
నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు
గడమపాదమునకుఁ గలదె భూమి
నిచ్చెద నన్నర్థి కీని దురాత్ముండు
నిరయంబు వొందుట నిజముగాదె

తే. కాన దుర్గతికినిఁ గొంత కాల మరుగు
కాక యిచ్చెదవేని వే గంబ నాకు
నిపుడు మూఁడవపదమున కిమ్ముఁ జూపు
బ్రాహ్మణాధీనములు వోవ బ్రహ్మవశమె. 641

వ. అని యిట్లు వామనుండు పలుక [1]సత్యభంగసందేహ విషదిగ్ధశల్యనికృత్తహృదయుం డయ్యును విషణ్ణుండుఁ గాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్ని ప్రోడవడుగున కిట్లనియె. 642

ఆ. సూనృతంబుఁ గాని సుడియదు నాజిహ్వ
బొంకఁ జాల నాకు బొంకు లేదు
నీ తృతీయపదము నిజము నా శిరమున
నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ. 643

ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును
బదవిహీనతకును బంధనమున
కర్థభంగమునకు నఖిల దుఃఖమునకు
వెఱవ దేవ బొంక వెఱచినట్లు. 644

వ. అదియునుం గాక. 645

సీ. తల్లిదండ్రులు నన్న దమ్ములు చెలికాండ్రు
గురువులు శిక్షింపఁ గొఱఁతవడునె
పిదప మేలగుఁ గాక పృథుమదాంధులకును
దానవులకు మాకుఁ దఱి యెఱింగి
[2]విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి
గురువులలో నాది గురువ వీవ
నీవు బంధించిన నిగ్రహమో లజ్జ
యో నష్టియో బాధ యో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు
లాదియోగీంద్రు లందెడు నట్టి కైంకి

1 సత్య.....హృదయుండు = నిజము చెడునని యనుమానవిషముతోఁ గూడిన బాణముచేఁ గ్రుమ్మఁబడిన మనస్సుగలవాఁడు, 2 విభ్రంశచక్షువు=విమర్శజ్ఞాననేత్రము.

నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి
(వైరభక్తులఁ గట్టిగా వలయుఁగాక)
యీశ నీయెడ దుర్లభ మేమికలదు. 646

మ. చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవ్యాగ్నులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను దృఢమే జీవంబునోఁ చెల్లరే
చలితంబౌట యెఱుంగ రీకపట సంసారంబు సత్యంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు [1]సత్యదానకరుణా ధర్మాది నిర్ముక్తుఁడై.

సీ. చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు
కాంతలు సంసార కారణములు
ధనము లస్థిరములు దను వతిచంచల
గార్హ్యార్థులన్యులు గడచుఁగాల
మాయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్ర
మని కాదె తమతండ్రి నతకరించి
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు
నీ పాదకమలంబు నియతిఁ జేరె

తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రతుకుఁ గలిగె
నైరులై కాని తొల్లి మా వారుఁగాన
రర్థివై వచ్చినీవు నన్నడుగు టెల్లఁ
బద్మలోచన నాపుణ్య ఫలముగాదె. 648

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 649

శా. ఆదైత్యేంద్రుఁడు పీనవక్షు నవపద్మాక్షుం బిశంగాంబరా
చ్ఛాదున్ నిర్మలసాధువాదు ఘనసంసారాదివిచ్ఛేదు సం
శ్రీదున్ భక్తిలతాతిరోహితహరి శ్రీపాదు [2]నిష్ఖేదుఁ బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్.

వ. ఇట్లు సమాగతుండైన తమతాతం గనుంగొని విరోచన నందనుండు
[3]వారుణపాశబద్ధుండుఁ గావునఁ దనకుం దగిన నమస్కారంబు

---

1 సత్య.....ర్ముక్తుడు=నిజము పల్కుట, ఒకరి కేదేని నిచ్చుట, దయఁజూపుట, విధిని నెరవేర్చుట లోనైనవానిని విడిచినవాఁడు. 2 నిఃఖేదు = దుఃఖములేనివాని 3 వారుణపాశబద్ధుఁడు = వరుణుని సంబంధమైన పాశములచేఁ గట్టఁబడినవాఁడు.

సేయ రామింఠ జేసి [1]సంకులాశ్రువిలోలలోచనుండై సిగ్గుపడి(నతశిర స్కుండై) నప్రమభావంబున మ్రొక్కు సెల్లించె, నంతఁ బ్రహ్లాదుఁడు మఖమండపంబున సునందాది పరికరసమేతుండై కూర్చున్న వామనదేవునిం గని యానందబాష్పజలంబులుఁ బులకాంకురంబులుఁ నెరయదండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 650

సీ. ఇతనికి మున్ను నీ ♦ వింద్రపదం బిచ్చి
నేఁడు త్రిప్పుటయును ♦ నెఱయ మేలు
మోహనాహంకృతి ♦ మూలంబు గర్వాంధ
తమసవికారంబు ♦ దాని మాన్చి
కరుణ రక్షించుటఁ ♦ గాక బంధించుటే
తత్త్వజ్ఞునకు మహేం ♦ ద్రత్వ మేల
నీపాదకమలంబు ♦ నియతిఁ గొల్చినదాని
బోలునే సురరాజ్య ♦ భోగపరత

తే. గర్వమే పారఁ గన్నులు ♦ గానరావు
చెవులు వినరావు చిత్తంబు ♦ సిక్కువడును
మఱచు నీసేవ లన్నియు ♦ మహిమ మాన్పి
మేలు సేసితి నీమేటి ♦ మేర సూపి. 651

వ. అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున. 652

మ. [2]అతతమత్తద్విపయానయై కుచనిరుంధచ్ఛోళ సంవ్యానయై
ధృత బాష్పాంబువితాన యై కరయుగా ♦ ధీనాలికస్థాన యై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే ♦ పద్మాపతే యంచుఁ ద
త్సతి వింధ్యావళి సేరవచ్చెఁ ద్విజగేహద్వారసీమన్ వామనున్. 653

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయైనిలువంబడి యిట్లనియె. 654

---

1 సంకు...చనుఁడు = కలిసిన వేడి కన్నీళ్ళతోఁగూడిన కన్నులు గలవాఁడు,
2 తా॥ బలిసిన యేనుఁగు గున్న నడకగలదియు, ఉలికిన గబ్బిగుబ్బలవలన సడ్డుకొన్న విడుచు గాలి గలదియు, వేడి కన్నీళ్ళు గలదియు, మొగమున మోడ్పు కేలుఁదోయి గలదియు, నైన వింధ్యావళి (బలిచక్రవర్తి భార్య) మృదువైన మనస్సుగల లక్ష్మీపతీ!

క. నీకుం గ్రీడార్థము లగు
లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజ వీవ లోకస్తుత్యా. 655

క. కావనఁడు సొమ్ము లేదీ
రావనఁడు జగత్త్రయైక రాజ్యము నిచ్చెన్
నాదయితుఁ గట్ట నేటికి
శ్రీదయితా చిత్తచోర శ్రితమందారా.

వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె. 657

సీ. భూతలోకేశ్వర భూతభావన దేవ
దేవ జగన్నాథ దేవవంద్య
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీకిచ్చె
దండయోగ్యుఁడు గాఁడు దానవసుతుఁడు
కరుణింప నర్హుండు కమలలోచన నీకు
విడిపింపు మీతని వెరపుదీర్చి
తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ
జేరి నీపదముల ర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడు లోకేశ పదము నొందు
నీవు ప్రత్యక్షముగవచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్యమంతయు నిచ్చినట్టి
బలికిఁ దగునయ్య దృఢపాశ బంధనంబు. 658

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 659

సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితిని వాని
యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు
దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁ డెల్లకాలంబు నఖిలయోనులయందుఁ
బుట్టుచుఁ దుర్గతిఁ బొందుఁ బిదప

తే. యేకవిధముల విపన్నుఁడై ఽ యెవ్వఁడుండు
వాఁడు నాకూర్చి రక్షింప ఽ వలయువాఁడు
[1] స్తంభలోభాభిమాన సం ఽ సార విభవ
మత్తుఁడై చెడనొల్లఁడు ఽ మత్పరుండు. 660

శా. బద్ధుండై గురుశాపతప్తుఁ డయితా ఽ బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవ ఽ క్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయుం ఽ సొంపేమియుం దప్పఁ డు
ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం ఽ బుణ్యుం డితం డల్పుఁడే.

ఆ. అసురనాథుఁ డనుచు ఽ ననఘుని మర్యాద
యేను జూతమనుచు ఽ నింతవలుక
నిజము వలికె నితఁడు ఽ నిర్మలాచారుండు
మేలుమేలు నాకు ఽ మెచ్చువచ్చు. 662

క. సావర్ణి మనువువేళను
దేవేంద్రుండగు నితండు ఽ దేవతలకు దు
ర్భావిత మగు నాఁచోటికి
రావించెద నంతమీఁద ఽ రక్షింతు దయన్. 663

క. వ్యాధులుఁ దప్పులు నొప్పులు
బాధలుఁ జెడి విశ్వకర్మ ఽ భావితదనుజా
రాధితసుతలాలయమున
నేధితవిభవమున నుండు ఽ నితఁ డందాఁకన్. 664

వ. అనిపలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె. 665

సీ. సేమంబు నీ కింద్ర ఽ సేన మహారాజ
వెలువకు మేలు నీ ఽ వితరణంబు
వేలుపు లందుండ ఽ వేడుక పడుదురు
దుఃఖంబు లిడుమలు ఽ దుర్మరణము
లాతురతలు నొప్పు ఽ లం దుండువారికి
నొందవు సుతల మం ఽ దుండు నీవు

1 స్తంభ...మత్తుడు=తిన్నగా నాటుకొన్న ఆశ అభిమానము నెడు సంసార సంపద

నీపంపు సేయని నిర్జరారాతుల
నాచక్ర మేతెంచి నఱకుచుండు

ఆ. లోకపాలకులకు లోను గావఁడ
నన్యు లెంతవార లచట నిన్ను
నెల్ల ప్రొద్దువచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు. 666

క. దానవ దైత్యులసంగతిఁ
బూనిన నీయసురభావ మును దోడ్తోన
ధ్యానమునఁ దలఁగి పోవును
మానుగ సుతలముననుండు మామా యాజ్ఞన్. 667

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని
నెయ్యంపుఁ బలుకుఁ జెఱకు రసంపు సోనలు వీనుల తెరువులం
జొచ్చి లోను బయలునిండి తెప్పలకప్పు దప్పం ద్రోచికొని కనుఁ
గవకొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం
గన్నీరు మున్నీరై పఱవ నురఃఫలకంబునం బులకంబులు కులకంబు
లయి తిలకంబు లొత్తఁ గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం
ద్రొక్కుడు వడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కనిమాటల రక్క
సుల ఱేఁడిట్లనియె. 668

ఉ. ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడని నీవు నేఁడు న
న్నన్నతుఁజేసి నాబ్రదుకు నోజయు నానతియిచ్చి కాచి తీ
మన్నన లీ వయారసము మాటల పెద్దఱికంబుఁ జాలవే
పన్నగతల్ప నిన్నెఱిఁగి పట్టిన నాపదఁ గల్గనేర్చునే. 669

వ. అని పలికి వారికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబుసేసి యిం
దుధరునకు వందనం బాచరించి బంధవిముక్తుండై తన వారలతోఁ
జేరికొని బలి సుతలంబునకుం జనియె, నంత హరికృపావశంబునం
గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గని సంతోషించి
ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె. 670

సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు
శర్వుఁ డీలక్ష్మియుఁ జాడఁ బొందఁ
డన్యుల కెక్కడి దసురులకును మాకు

దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి
పద్మజాదులు భవ త్పాదపద్మ
మకరంద సేవన మహిమ నైశ్వర్యంబు
లందిరికాక యే మల్పమతుల

తే. మధికదుర్బోధులము కుత్సి తాత్మకులము
నీ కృపాదృష్టి మార్గంబు నెలవు సేర
నేమి తపమాచరించితి మెన్నఁ గలమె
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ. 671

వ. అదియునుం గాక. 672

ఆ. సర్వగతుఁడవయ్యు సమదర్శనుఁడవయ్యు
నొకట విషమవృత్తి నుండు టరయ
నిచ్చ లేనివారి కీవు భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్ప తరువుమాడ్కి. 673

వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమపురుషుం డిట్లనియె.

తే. వత్స ప్రహ్లాద మేలు నీ వారు నీవు
సొరిది మనువునిఁ దోడ్కొని సుతలమునకుఁ
బయనమై పొమ్ము నే గదా పాణి నగుచుఁ జేరి
రక్షింప దురితంబు సెందద చట. 675

వ. అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి వలగొని [1]కరకమల పుట ఘటిత నిటలతటుండై వీడ్కొని బలిం దోడ్కొని సకలాసుర యూథంబునుం దాను నొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుం జనియె, నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె. 676

ఆ. ఏమిఁ గొఱంతవడియె నీతని జన్నంబు
విస్తరింపు కడమ విప్రవర్య
విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ
జనులు సూచినంత సమతఁ బొందు. 677

వ. అనిన శుక్రుం డిట్లనియె. 678

సీ. అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవ
యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞపురుష
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ
గడమేలఁ గల్గునే కర్మములకు
ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ
గొఱఁతలు నిన్నుఁ జేకొనిన మాను
నయినఁ గావింతు నీ యానతి భవదాజ్ఞ
మెలఁగుట జనులకు మేలుఁగాదె

తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు
ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ డసురేంద్రు జన్నంబు కడపటఁదీర్చె
మునులు విప్రులు సాహాయ్య మునఁ జరింప. 679

వ. ఇవ్విధంబున వామనుండయి హరి బలినడిగి మహిం బరిగ్రహించి తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసంగె నత్తరి దక్ష భృగుప్రముఖ ప్రజాపతులును భవుండును గుమారుండును దేవర్షి పితృగణంబులును రాజులును దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు వామనుండు వల్లభుండని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు వ్రతంబులకు స్వర్గాపవర్గంబులకు నుపేంద్రుండు ప్రధానుండని సంకల్పించె నా సమయంబున. 680

క. కమలజుఁడు లోకపాలురు
నమరేంద్రునిఁ గూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను
నమరం గొనిపోయి రంత నటమీఁద నృపా. 681

ఆ. బల్లిదంపుదోడు ప్రాపున నింద్రుని
కింద్రపదము సేరె నిట్లుగలిగెఁ
దనకు నాథుఁ డైన తమ్ముఁడుఁ గలిగినఁ

క. పాలడుగఁడు మేలడుగం
డేలఁడు భిక్షించి యన్న ♦ కిచ్చెఁ ద్రిజగముల్
1వేలుపులతల్లి కడపటి
చూలుం బోలంగఁ గలరె ♦ సొలయనితమ్ముల్. 683

ఆ. కడుపు 2బదరగాఁగ ♦ గొడుకులఁ గనుకంటె
దల్లి కొకఁడె చాలు ♦ బల్లిదుండు
త్రిదశగణముఁ గన్న ♦ యదితి గానుపుకీఱఁ
జిన్నిమేటివడుగుఁ ♦ గన్న యట్లు. 684

వ. ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె, నప్పుడు బ్రహ్మయు శర్వుండునుఁ గుమారుండును భృగుప్రముఖు లయిన మునులునుఁ బితృదేవతలును దక్షాదిప్రజాపతులును సిద్ధులును వైమానికులునుమఱియుం దక్కినవారలును బరమాద్భుతప్రకారుండైన విష్ణుని సుమహా కర్మంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ బ్రశంసించుచు నాడుచుం బాడుచుం దమతమనివాసంబులకుం జని రనిఁజెప్పి శుకుం డిట్లనియె.

తే. మనుజనాథత్రివిక్రము ♦ మహిమ కొలఁది
యెఱుఁగఁ దరిగింప లెక్కింప ♦ నెవ్వఁడోపుఁ
3గుంభినీ రేణుకణములు ♦ గుఱుతు వెట్టు
వాఁడు నేరఁడు తక్కిన ♦ వారి వశమె. 686

తే. అద్భుతవర్తనుఁ డగు హరి
సద్భావిత మైన విమల ♦ చరితము వినువాఁ
డుద్భటవిక్రముఁ డై తుది
నుద్భాసితలీలఁ బొందు ♦ నుత్తమగతులన్. 687

తే. తగిలి 4మానుషపైతృక ♦ దైవకర్మ
వేళలందుఁ ద్రివిక్రము ♦ విక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు ♦ రెవ్వరేనిఁ
బొందుదురు నిత్యసౌఖ్యంబు ♦ భూవరేంద్ర. 688

---

1 వేలుపుల...చూలు=దేవతల తల్లియైన అదితి కడగొట్టు కొడుకు (వామనుఁడు) 2 పదర=తమలపాకుల బరిణె, 3 కుంభి...ములు=మట్టి దుమ్ము రవ్వలు, 4 మానుష ...వేళలందు=మనుష్యులయొక్క పితృదేవతలయొక్క సంబంధములగు నిత్య, నైమి

మ. * జనులై నాకముఁ గోలుపోవ్వసురలం ✽ జంభారినిం బ్రోవఁగా
వడుగై భూమి బదత్రయం బిడుటకై ✽ వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్ర ✽ హ్మాండంబుఁ దా నిండుచుం
గడు మోదంబుననుండు వామనున కే ✽ కాలంబునన్ మ్రొక్కెదన్.

**మత్స్యావతార కథా ప్రారంభము.**

వ. అని యిట్లు శుకుండు రాజునకు వామనావతార చరితంబు సెప్పె
నని సూతుండు మునులకుం జెప్పిన విని వార లతని కిట్లనిరి. 690

సీ. విమలాత్మ విని మాకు ✽ వేడ్క యయ్యెడి మున్ను
హరిమత్స్యమైన వృ ✽ త్తాంత మెల్లఁ
గర్మబద్ధుని భంగి ✽ ఘనుఁ డీశ్వరుఁడు లోక
నిందితంబై తమో ✽ నిలయమైన
మీనరూపము నేల ✽ మేలని ధరియించె
నెక్కడ వర్తించె ✽ నేమి సేసె
నాద్యమై వెలయు న ✽ య్యవతారమునకు నె
య్యది కారణంబు గా ✽ ర్యాంశ మెట్లు

ఆ. నీవు దగుదు మాకు ✽ నిఖిలంబు నెఱిఁగింపఁ
దెలియఁ జెప్పవలయు ✽ దేవదేవు
చరిత మఖిలలోక ✽ సౌభాగ్యకరణంబు
గాదె విస్తరింపు ✽ క్రమముతోడ. 691

వ. అని మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె, మీర లడిగిన
యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు [1]బాద
రాయణి యిట్లనియె. 692

సీ. విభుఁ డీశ్వరుఁడు వేద ✽ విప్రగోసురసాధు
ధర్మార్థములఁ గావఁ ✽ దనువుఁ దాల్చి
గాలిచందంబున ✽ ఘనరూపములయందుఁ
దనురూపములయందుఁ ✽ దగిలియుండు
నెక్కువఁ దక్కువ ✽ యెన్నఁడు నొందక
నిర్గుణత్వంబున ✽ నెఱయు ఘనుఁడు

---

* పూర్వగ్రంథంబునుండి గైకొనంబడియె. [1]బాదరాయణి=బదరి=రేగుల యడవియం దుండినవాఁడు బాదరాయణుఁడు (వ్యాసులవారు) బాదరాయణుని కొడుకు బాదరా



మ త్స్యా వ తా ర ము

మ. ఉఱకుంభోనిధి రోసి వేదములకై యయ్యున్ దైన్యముం జూచి వేఁ
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే
న్మెఱయన్ దాడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్.

అ. పే. 136

గురుతయుఁ గొఱఁతయు ♦ గుణసంగతి వహించు
మనుజేశ చోద్యమే ♦ మత్స్యమగుట

తే. వినుము పోయిన కల్పాంత ♦ వేళఁ దొల్లి
ద్రవిళదేశపు రాజు స ♦ త్యవ్రతుండు
నీరుద్రావుచు హరిఁగూర్చి ♦ నిష్ఠతోడఁ
దపముఁ గావించె నొకయేటి ♦ తటమునందు. 693

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీ కాంతుండు కృతమాలికయను నేటిపొంత హరి సమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నారాజు దోసిట నొక్క మీనుపిల్ల దవిలివచ్చిన నులికిపడి మరలం దరంగిణీ జలంబునందు శకులశాబకంబు విడిచె నట్లు విడివడి నీటిలోనుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె.

మత్తకోకిలము.

పాటువచ్చిన [1]జ్ఞాతిఘాతులు ♦ [2]పాపజాతిఝషంబు లీ
యేటఁ గొండొక మీనుపిల్లల ♦ నేఱిపట్టి వధింప న
చ్చోట నుండక నీదుదోసిలి ♦ జొచ్చివచ్చిన నన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే కృప ♦ యింతలేక దయానిధీ. 695

ఆ. వలలుదారు నింక ♦ వచ్చి జాలరివేఁట
కాలు నేలు గలఁచి ♦ కారవెట్టి
మిడిసి పోవనీక ♦ మెడఁ బట్టుకొనియెద
రప్పు డెందుఁ జొత్తు ♦ ననఘచరిత. 696

క. భక్షించు నొండె ఝషములు
శిక్షింతురు ధూర్తులొండెఁ ♦ జెడకుండనను న్
రక్షింపు దీనవత్సల
[3]ప్రక్షీణులఁ గాచుకంటె ♦ భాగ్యము గలదే. 697

వ. అనిన విని కరుణాకరుండగు నవ్విభుండు మెల్లన య[4]య్యంభశ్చరడింభకంబునుఁ గమండలు జలంబునం బెట్టి తన [5]నెలవునకుం గొని

1 జ్ఞాతిఘాతులు=జాతి చేపలజంపు జాలరివాండ్రు, 2 పాపజాతి ఝషంబులు=హింసజేయు పెద్దచేపలు,, 3 ప్రక్షీణులు=మిక్కిలి చిక్కినవారు, 4 అంభ...డింభకంబు=నీటదిరుగు చేపపిల్ల, 5 నెలవు=ఉండుచోటు.

పోయె నదియు నొక్క-రాత్రంబునం [1]గుండికనిండి తనకునుండ
నిమ్ముసాలక రాజన్యున కిట్లనియె. 698

క. ఉండ నిదిఁ గొంచెమెంతయు
నొండొకటిం దెమ్ము భూవ ర | రోత్తమ యనుచున్
[2]గండకముఁ దెచ్చి విడిచెను
మండలపతి సలిలకలశ | మధ్యమున నస్పృహా. 699

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడుచేతుల నిడుపై
[3]యుదంచనంబునిండి పట్టుసాలక వేఱొండుఁ దెమ్మనవుడు నారాజు
పట్టి కరుణాగుణంబునకు నాటపట్టుఁ గావున గండకంబు
నొండొక్క- చిఱుతమడుఁగున నునిచె నదియు నాసరోవరజలంబు
నకు నగ్గలంబై తనకుఁ జెంచరింప నది గొంచెం బని పలికినం బుడమి
ఱేఁడు మంచివాఁ డగుటం జేసి యాకంచరంబు నుదంచితజలా
స్పదంబైన హ్రదంబునందు నిడియె నదియు నాసలిలాశయంబు
నకును నధికంబై పెరుఁగ నిమ్ము సాలదని చెప్పికొనిన నప్పుణ్యుం
డొప్పెడి నడవడిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును
మహార్ణవంబున విడిచె నదియును మకరాకరంబునంబడి రాజున
కిట్లనుఁ బెనుమొసళ్ళు మసరికొని కసిమసంగి మ్రింగెడి నింత
కాలంబు నడపి కడపట దిగవిడువకు వెడలఁ దిగువ్రుమని యెఱిం
గింప దెలిసి కడపట యన్నిటి తిరుగుడు ప్రోడకుం బుడమిఱేఁ
డిట్లనియె. 700

సీ. ఒకదినంబున శత | యోజన మాత్రము
విస్తరించెదు నీవు | వినము చూడ
మిటువంటి ఝషముల | నెన్నఁడు నెఱుఁగము
మీనజాతుల కిట్టి | మేను గలదె
యేమిటి కెవ్వఁడ | వీలీలఁ ద్రిప్పెదు
కరుణ నాపన్నులఁ | గావ వేఁడి

1 కుండిక=కుండ, 2 గండకము=చేప, 3 ఉదంచనము=పెద్దపాత్ర.

యంభశ్శరం బైన హరివి నే నెఱిఁగితి
నవ్యయ [1]నారాయ ణాభిధాన

తే. జననసంస్థితి సంహార చతురచిత్త
దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ
*నీదులీలావతారంబుఁ [2]నిఖిలభూత
భూతిహేతువు ప్రమొక్కెదఁ బురుషవర్య. 701

క. ఇతరులముఁ గాము [3]చిత్సం
గతులము మాపాల నీవుఁ గలిగితి భక్త
స్థితుఁడ వగు నిన్ను నెప్పుడు
నతి సేసినవాని కేల నాశముఁ గలుగన్. 702

క. [4]శ్రీ లలనాకుచఁ వేదికన్
కేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవుఁ దామసాకృతి
నేలా మత్స్యంబ వైతి వెఱఁగింపు హరీ. 703

వ. అని పలుకు సత్యవ్రత మహారాజునకు నయ్యుగంబుకడపటఁ బ్రళ
యవేళ సముద్రంబున నేకాంతజనప్రీతుండయి విహరింప నిచ్ఛిం
చి మీనరూపధరుండైన హరి యిట్లనియె. 704

సీ. ఇటమీఁద నీరాత్రి కేడవదినమునఁ
బద్మగర్భున కొక్క పగలునిండు
భూర్భువాదికజగం బులు మూఁడు విలయాబ్ధి
లోన మునుంగు నా లోనఁ బెద్ద
నావ నేతెఁగ వచ్చు నాపంపు పెంపున
దానిపై నోషధి తతులు బీజ
రాసులు నిడి పయో రాశిలో విహరింపఁ
గలవు సప్తర్షులుఁ గలసి తిరుఁగ

---

1 నారాయణ+అభిధాన=నీటియందు శుభస్థానముగనుండువాఁ డనెడు పేరుగల వాఁడ! 2 నిఖిలభూత భూతిహేతువు=అన్ని వస్తువులకు ఐశ్వర్యప్రదము, 3 చిత్+సంగతులము=నశించెడి మాయాప్రపంచమున జిక్కకొనినవారము, 3 శ్రీ లలనా... లోలుడవు=లక్ష్మీదేవి చనుమిట్టలపై తిరుగవలెననెడు కోరికతోఁ దిరిగి పొంటెడియుల్లాసమునందు ఆశగలవాఁడు. * పాఠాంతరము (నీదు మీనావతారంబు)

ఆ. మ్రోలఁ గానరాక ✽ ముంచు పెంజీఁకటి
మిడుకుచుండు మునుల ✽ మేని వెలుఁగుఁ
దోలఁకుచుండు జలధి ✽ దోధూయమానమై
నావ దేలుచుండు ✽ వరవరేణ్య. 705

వ. మఱియు నన్నావ మున్నీటికరళ్ళకు లోనుఁగాకుండ నిరుఁగెలంకుల వెనుక ముందట నేమఱకుండఁ [1]బెన్నెఱు లగునాగములఁ జడియుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నోడియుచు సంచరించెద నొక్కపెనుఁబాము చేరువ నాయనుమతిం బొడసూపెడు దానం జేసి సుడిగాడ్పులకతంబున. నావ వడిం దిరుగంబడకుండ, నాకొమ్ముతుదిం పదిలముచేసి నీకునుఁ దపసులకును నలజడి సెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలిరేయి వేగునంతకు మెలంగెద నది కారణంబుగా జలచరరూపంబుఁ గయికొంటి మఱియు నొకప్రయోజనంబుఁగలదు, నామహిమ పరబ్రహ్మంబని తెలియుము నిన్ను ననుగ్రహించితి నని సత్యవ్రతుండుసూడ హరి తిరోహితుం డయ్యె నయ్యవసరంబున. 706

ఆ. మత్స్యరూపి యైన ✽ మాధవునుడుగులఁ
దలఁచికొనుచు రాచ ✽ తపసియొక్క
దర్భశయ్యఁ దూర్పుఁ ✽ దలగడగాఁ బండి
కాచియుండె నాఁటి కాలమునకు. 707

వ. అంత గల్పాంతంబు డాసిన. 708

క. ఉల్లసితమేఘపంక్తులు
జల్లించి మహోగ్రవృష్టి ✽ జడిగొని కురియన్
వెల్లివిరిసి జలరాసులు
సెల్లెలి కట్టలను దాఁటి ✽ సీమల ముంచెన్. 709

వ. తదనంతరంబ. 710

తే. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర
[2]బ్రహ్మమనఁగ [3]నైమిత్తిక ✽ ప్రళయవేళ

---

1 పెన్నెఱులగు నాగములన్=పెద్దవెండ్రుకలైన నా మీసముల చేత, 2 బ్రహ్మము=బ్రహ్మసంబంధమైనది, 3 నైమిత్తి...వేళ=ఎప్పుడో వచ్చిన జననాశన కాలము.

నిక్కపై నిట్టతోలఁకు మున్నీటిలోనఁ
గ్రాలె భూతాళిజగముల కొలఁదు లెడలి. 711

వ. అంత నమ్మహారాత్రియందు. 712

మ. వెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించివి
పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుండేసృష్టియున్ మాని మే
నొఱఁగన్ ఱెప్పలుమూసి కేల్ దలగడైయుండంగ నిద్రించుచున్
గ్గుఱ్ఱుపెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా.

ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి
ముఖమ్మునందు వెడలె మొదలిశ్రుతులు
నపహరించె నొక హయగ్రీవుఁ డను దైత్య
భటుఁడు దొంగఁ దొడర బరులవశమె. 714

క. చదువులుఁ దనచేబడినం
జదువుచుఁ బెక్ బయల నుండ శంకించి వడిం
జదువులముడుకఁడు గూరుకఁ
[1]జదువుల తస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్. 715

వ. ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన
వానిజంప వలసియు బ్రమానుదీఁగెల విత్తనంబుల పొత్తరలు
పెన్నీట నాని చెడకుండ నునుపవలసియు నెల్లకార్యంబులకుం
గావలి యగునాపురుషోత్తముం డప్పను చేయు చొరుదలయందు.

క. కుఱుగఱులు వలుఁదమీసలు
చిఱుదోఁకయుఁ బసిఁడియొడలు సిరిగల పొడలుం
నెఱిమొగము నొకక్కొమ్మును
మిఱుమాపులుఁగలిగి యొక్క మీనం బయ్యెన్ 717

వ. ఇట్లు లక్షయోజనాయతం బయిన పాఠీనం బై విశ్వంభరుండు జలధి
సొచ్చి.

సీ. ఒకమాటు జలజంతు యూథంబుతోఁ గూడు 718
నొకమాటుఁ దరులకు నుఱికి వచ్చు

---

1 చదువుల తస్కరుఁడు=వేదములం దొంగిలించిన దొంగ. (హయగ్రీవుఁడు)

నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు
నొకమాటు లోపల నొదిఁగి యుండు
నొకమాటు వారాశి నొడలు ముంపఁ జూచు
నొకమాటు బ్రహ్మాండ మొరయఁ బలఁచు
నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు
నొకమాటు జలముల నుమిసి వైచుఁ

తే. గఱులు సారించు మీసాలుఁ గడలుకొలుపుఁ
బొడలు మెఱయించుఁ గన్నులఁ బొలప మార్చు
నొడలు జళిపించుఁ దళతళ లొలయు మీన
వేషి వెన్నిట[1]నిగమగవేష యగుచు. 719

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్తపరాధీనుం డగు హరిఁ దలంచుచు నుండ నారాయణప్రేరిత యై యొక్కనావ వచ్చినం గనుంగొని.

మ. చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని మౌనీంద్రసం
తతులన్ బెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
[illegible]ని సంఘంబులుఁ దాను నెక్కి వెఱతో నమ్మున్నీటిపైఁ దేలుచుం
[illegible] ముందట భర్తలోకవ్యాప్తవలంకర్మిణముఁ మీనమున్.

వ. కని జలచరేంద్రుని కొమ్మున నొక[2]పెనుఁబాపత్రాటన నావఁ గట్టి సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నా రాచపెద్ద మీనాకారుం డగు వేల్పుఁ జేరి యిట్లని పొగడం దొడంగె.

మ. తమలోఁ బుట్టు నవిద్య గప్పికొనుడుం దన్మూలసంసారవి
భ్రము లై కొందఱు దేలుచుం గలఁగుచుం బత్తెంటలన్ దైవయో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘను లై కైవల్యసంప్రాప్తు లై
ప్రమదం బొందుదు రట్టి నీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా.

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున కసన్మతిఁ దాగురుఁ డౌటసూర్యుఁడే

---

1 నిగమగవేషి = వేదముల వెదకువాఁడు, 2 పెనుపాపత్రాట = పెద్దపాము త్రాడు చేత.

కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ మాకు ను
ద్యన్నయమూర్తివై గురువ వైయల సద్గతి జాడఁ జూపవే. 724

క. ఇంగలముతోడి సంగతి బంగారము వన్నె గలుగు భంగిని ద్వత్సే
వాంగీకృతులయఘంబులు భంగంబులఁ బొందుము క్తిఁ బ్రాపించుహరీ.

క. హృదయేశ నీప్రసన్నత పదవేలవపాలిలేశ భాగముకతనం
బ్రిదశేంద్రత్వము గలదఁట తుదినిను మెప్పింప నేదిదొరకదు శ్రీశా.

క. పెఱవాఁడు గురుఁడటంచును
గొఱగానిపథంబు సూపఁ గుజనుం డగు నీ
నెఱత్రోవ నడవనేర్చిన
నఱమఱలేనట్టి పదము నంను దయాబ్ధీ. 727

మ. చెలివై చుట్టమవై మనస్స్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కులపంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్ల కే
పలు వెంటం బడి లోక మక్కట వృథా బద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా.

ఆ. నీరరాశిలోన నిజకర్మ బద్ధమై
యుచితనిద్రఁ బొంది యున్నలోక
మేమహాత్ముచేత నెప్పటి మేల్కా
నట్టి నీవు గురుఁడ వగుట మాకు.

క. ఆలింపుము విన్నప మిదె
వేలుపు గమిఱేని నిన్ను వేఁడికొ
నాలోని చిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా. 730

వ. అని యిట్లు సత్యవ్రతుండు వలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరిపురాణపురుషుం డగుటం జేసి [1]సాంఖ్యయోగక్రియా సహితయగు పురాణసంహిత నుపదేశించె, నమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుండయ్యె, నతం డిమ్మహాకల్పం

1 సాంఖ్యయోగము=జ్ఞానయోగము.

బున వివస్వతుండనంబరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుండను జన్మించి శ్రీహరి కృపావశంబున నేడవమనువయ్యె నంత సప్తార్ధంబున బెను రేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుండు తన్నిశాంత సమయంబున.

మ. ఉఱ కంభోనిధి రోసి వేదములకు౯ యయ్యుగ్ర దైన్యముం జూచి వేఁగఱు లల్లార్చి ముఖంబుసాఁచి బలువీఁకకం దోఁకసారించి వేసెన్నెఱియఱ్ఱ దౌడలు దీటి మీసలదర౯ మీనాకృతి౯ విష్ణుఁడక్కటటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావుఁ హయగ్రీవుని౯.

వ. అంతం బ్రళయావసాన సమయంబున. 723

సీ. ఎప్పుడు వేగునం చెదురు సూచుచునుండు
మునుల డెందంబులం ముదము నొందఁ
దెలివితోఁ బ్రక్కని ద్రించు భారతి లేచి
యోరపయ్యెదఁ జక్క నొత్తికొనఁగ
మలినమై పెను రేయి ప్రమక్కిన తేజంబుఁ
[illegible] దొంటిచందంబునఁ దొంగలింపఁ
[illegible] భాగధేయంబులుఁ
[illegible] గన్నుల కొలుకులఁ గానఁబడఁగ

తే. నవయవంబుల్ [illegible]ంచి యావులించి
నిదురఁ దెప్పిఱి మేల్కాంచి నీల్గి మలఁగి
[illegible] గనుఁగవ నునుముకొనుచు
ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు

వ. అయ్యవసరంబున.

ఆ. వాసవారిఁ జంపి వానిచేఁ బడియున్న
వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి
నిదుర మానియున్న నీరజాసనునకు
నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు.

1 నిశాంతము = తెలవారువేళ.

...హానాభుని కొలిచి
...ర్పణ మాచరించి సత్యవ్రతుండా
...లధిఁ బ్రదికి మనువయ్యెను
...త్రువిఁ గొలువకెందు సంపదఁ గలదే. 737

ఆ. జనులఘమందు దపసి సత్యవ్రతుండును
మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు
వినినవాఁడు బంధవిరహితుండు. 738

క. హరి జలచరావతారముఁ
బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్
నరుఁ డొందు వాని కోరుకలు
ధరణీశ్వర సిద్ధిఁబొందుఁ దథ్యము సుమ్మీ. 739

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందు వాణీశుమో
ముల వేదంబులుఁ గొన్న దైత్యుని మృతింబొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్ 
వ. అనిఁ జెప్పి. 741

క. రాజేంద్ర [1]దైత్యదానవ రాజమహాగహనదహన రాజస్తుత్యా
రాజావతంస మానిత [2]రాజధరార్చితగుణాఢ్య రాఘవరామా.

మాలిని. [3]దివిజరిపువిదారీ దేవలోకోపకారీ
భువనభరనివారీ పుణ్యరక్షానుసారీ
ప్రవిమల శుభమూర్తీ బంధుపోషప్రవర్తీ
ధవళబహుళకీర్తీ ధర్మనిత్యానువర్తీ. 743

---

1 దైత్య.....దహన = రక్కసులను పెద్దయడవిం దగులంబెట్టు అగ్నిహోత్రుఁడ ! 2 రాజ......ణాఢ్య! = చంద్రశేఖరుచేతం బూజింపఁబడిన గుణములకు నివాసమైనవాఁడ ! 3 దేవశత్రువులు నరికినట్టి, దేవతల కుపకారియైనట్టి, లోకశోషము దొలగించునట్టి, పుణ్యవంతుల ననుసరించునట్టి, తేటయై మేలైనరూపముగలట్టి, ననుసరించినవారి నేలినట్టి, తెల్లని కీర్తిగలట్టి విధిననుసరించునట్టివాఁడ !